కిందు మీఁదెరుఁగు
యిక్కడ నక్కడ నితని దాసులే
యేచి సుఖింతురు నిజసుఖము
కిక్కిరిసిన యజ్ఞానాంధకారులు
కిందును మీఁదును నెరఁగరు
[9–83

కిందుమీఁదెఱుఁగు
గిరికొన్న తమకాన కిందు మీఁదెఱుఁగక
మరచె మే నలమేలుమంగనాచారి
[4–65

కిందేడు మీఁదేడు
కోరి శ్రీవెంకటపతి కుక్షిలోనే లోకములు
ఆరయఁ గిందేడు మీఁదేడై వున్నవింతే
[8–14

కిచకొట్టు
పాళంబు చేఁబట్టి పౌండ్రక నాముఁ
గీళంబుకై వడిఁ గిచకొట్టజేసి
[అ. ప. క. 5156

కిట్టు
నెట్టన నీవు నన్నాడే నిందలెల్లాఁ దప్పదని
చుట్టి మనుగుటివాని చొచ్చి వెళ్ళేవా
నట్టనాడుమ నేనైనా ననల యలుగులను
కిట్టినా నిజము మించ గెలిచేఁగాని
[13–181

కట్టుఁడు కలువడాలు ఘనమైన కారణాలు
గట్టిగాఁ బిట్టుగోము సింగారించరే
కిట్టి రుక్మిణీదేవి గృష్ణుఁడు పెండ్లాడివచ్చె
పెట్టుఁ డిందరికి నేఁడు పెండ్లివిడేలు
[15–55

కిరుదు
యీనుమేమి పసిఁడేమి యెంచిచూచితే
మనసు దెలిసిన నిర్మలునికి
ఘనమేమి కిరుదేమి కలదెల్లా నీ
తనువుగఁ దెలిసిన తత్వజ్ఞానికి
[16-1-48

కివ్వ కివ్వ నవ్వు
ఎవ్వరు వెంకటపతి కెఱుగించ నారగించి
కివ్వకివ్వ నవ్వు నణఁకించీ జుండి
[5–159

కినము
కరితీపులవల్లను తమివుట్టె మీఁద మీఁద
కెరలిన వోట్లలో కినరులు వానెను
[14–72

కినరు
కొసలెల్లఁజెమరించి నున్నని చెక్కులజారె
కినరి యెవ్వతె యలిగెనో నీతోను
[17–401

కిమ్ము
కిమ్మురా నిన్నుఁ గాదనేమా
కిమ్ములా నిన్నుఁ గీర్తించేఁగాక
[15–128

కిమ్ముల వారాదెడిటి కీరితి నీదె కాక
యెమ్మె నెవ్వతె దెచ్చి నా నెగ్గువెంచేమా
[17–398

యెమ్మెకు నాతో నెంత నవ్వినా
కిమ్ముల నీతోఁ గినినేనా
[17–474

క్రిందట మీఁదట లాడు
కిలకిల నవ్వి నిన్ జెనకి
క్రిందట మీఁదట లాడుచున్నదీ
[శృం. వృ. ప. శ. 91

క్రియ
క్రియ దెలియక వేరేకెలనఁ బెండ్లాడితివి
నయగారి పతినెట్టు నమ్మవచ్చునయ్యా
[13–177

నయగారి వానికిఁగా నంటుతోడి సరసాలు
ప్రియునికిఁగ మంచి ప్రేమమెల్లాను
క్రియగలవానికిఁగా క్రిందిమీఁది విచారము
భయములేనివానికి పట్టినదే పంతము
[14–129

ప్రియములు చెప్పితివి పెనఁగితి విందాఁక
నయమాయ సరసాలు నవ్వు లంతేల
క్రియ నేనెఱుఁగుదు కెరవించ కిఁక నీవు
జయముచేకొంటినిదె చక్కని నీమాటలు
[14–277

క్రియఁగూడె శ్రీవెంకటగిరిపతి నే మెచ్చితి
ప్రియపడే విదె నీవు భేదమేమి గంటివే
[15–241

క్రియ గలుగు
నయమగు శ్రవణానందము వినినను
క్రియ గలిగిన నీ కీర్తనము
[7–135

క్రియగా
నియతము మాకిదె నీ పాదములె గతి
క్రియగా మమ్మేలి కింకలుడుపవే
[9–131

క్రియ చూపి
దయఁదలఁచుక నేనె తగిలి కూడితి విన్ను
క్రియచూపక నేనుండె గెంటించఁ గలవా
[15–221

క్రియావిరుద్ధము
ప్రియముమానిన యట్టి పెనఁగేలా మాది
క్రియావిరుద్ధపు కీర్తనలేలా
[7–180

## క్రీ

కీలితము
పాల జలనిధితేట బంగారులోపలి కళ
కీలితముగా నీ కెంగేలు వట్టెను
[13–3

కీలు
బయలీఁదించినదివో ప్రాణులను
హరిమాయ
క్రియ దెలుసుకొనేటి కీ లింతే కాని
[9–4

కీలుగంటు
బిలువాల మల్లార్చి పట్టకున్నాఁడు
వెలయఁగఁ గీలుగంట వేసుకున్నాఁడు
[8–148

కీలుబొమ్మ
పరమాత్మని నాత్మభావములో కీలుబొమ్మ
.... .... ....
అరిది పంపద లది అలమేల్మంగ
[14–84

కీలువదలు
కాలవిశేషమో లోకము గతియో
సన్మార్గంబుల
కీలువదలె సౌజన్యము క్రిందయిపోయినది
[5–63

కీలైనది
కీలైనది వైకుంఠాన మెరసిన రూపము
కీలైనదిదే శేషగిరిమీఁది రూపము
[7–198

కీర్తన కెక్కు
పేరగు జవరాలి పెనిమిటి పేరఁ
బేరఁ గీర్తనకెక్కె బెరసి వందవర
[వ క్ర. మం. 76

కీర్తికెక్కు
కీర్తికెక్కిన నిజాకృతి డాఁచి ధరణి
వర్తించుచున్న సంవర్తు చందమున
[వ. యో. వి. 2–451

## కె

కెంగేలు
పాలజలనిధి తేట బంగారులోపలి కళ
కీలితముగా నీ కెంగేలు వద్దెను
[13-3

కెలపు
తనివిమారిన తలఁపు తడవోరువని బులుపు
అనువెఱంగని కెలపు అడియాస యలపు
[4-20

కెల్లురేఁగు
కెల్లురేఁగి విక్కి హరికీర్తి భుజములవె
పల్లపు పాతాళానఁ బడరో దనుజులు
[6-79

కెల్లురేఁగె దేహమందే కిమ్ముల చుట్టరికాలు
బొల్లువోదెన్నఁడు భూమిపుట్టుగాఁబుట్టినది
[7-256

తెల్లని మేనితోడ దిండైన పిఱుఁదుతోడ
కెల్లురేఁగీఁ గరుణ నుగ్రీవ నారసింహము
[9-229

కెల్లురేఁగి వీధులనుఁ గేరిపుట్టు చెండులాడీ
బల్లిదుఁడు గదవమ్మ బాలకృష్ణుఁడు
[10-172

కెల్లురేఁగి యాడనో తా గిజిగిజిమె వచ్చీ
కల్లగదె చూడఁబోతే గదురుకొనీని
[17-248

కెచ్చురేగు
వచ్చి నీ గుణములకు పరిణామించుటగాక
కెచ్చురేఁగి బొమ్మల జంకించ వచ్చునా
[15-15

కెల్లొత్తు
క్రియ నిసుకపాతర కెల్లొత్తు నీ మాయ
జయమంది వెడలఁగ జనులకు వశమా
[9-58

కెళవుల దొక్కు
పరకాంతల భంగపరచుకొంటే మేలు
దొరకని కెళవులు దొక్కకుంటే మేలు
[9-158

## కే

కేఁగండ్లు (కేఁగన్నుకు బహువచనం)
కేరికేరి నవ్వేవు కేఁగండ్లఁజూచుకొంటూ
[17-379
[నిఘంటువులు క్రేఁగన్ను అని వ్రాపడితో మన్నరూపమే స్వీకరించాయి]

కేకినగ్లొట్టు
రాకేందుముఖులు సంభ్రమమున నిట్లు
కేకివగ్లొట్టుచు కేరి నవ్వుచును
[ఉ. క. 344

కేనము
అనలు నీకేమిటికి నంత నిజమరిపైతే
కేనాన నీవే బదికేవుగాగ
[17-323

కేపు
ఆపె నీకు మొక్కనీ ఆపెకు నీవైనా మొక్కు
కేపుగ మాకేటికి మొక్కించేవయ్యా
[15-183

కేరడము
బీరమాడవద్దు గాక పెనఁగ వద్దంటినా
కేరడాన నేఁటికో జంకించీఁ గాక
[15-238

కేలునఁ గేలు దెమలించు
ఇలఁ బొరలుచు నున్న యింతి భావించి
తెలిపి కేలునఁగేలు దెమలించుకొనుచు
[వ. యో. వి. 3-307

కేలెత్తి మొక్కు

వేలముద్దుటుంగరము వేడొకనిడి ప్రధాని
కేలెత్తి యిందరిచే మొక్కించుకొన్నట్టు
[9-160

కేళాకూళి

కొమ్మనినుఁగూడికేళాకూళిలోఁ గస్తూరిపీట
నిమ్మల నోలలాడి దెటువంటి వలపో
[4-2

కోరికలతము కేళాకూళిలో నే నడుఁగాను
ఆరసి తానీఁద వచ్చినాఁడ నేతను
[13-100

కై

కైకొలుపు

కాతాళించి వున్నవేళ కైకొలుపరాదు గాక
చేతల నీచెప్పినట్టు నేయఁడా తల్లి
[15-283

దగ్గరికాఁగలపని తనుఁదానె తోఁచీని
కగ్గినంచుమీఁద పతిఁ గైకొలుప పసమా
[17-397

కైదప్పు

చెఱఁగుమాసిన సుద్ది చెప్పఁజాలకుండేవు
మెఱఁగము కైదప్పు లెందు మోచుకో
[15-57

కైపగు

కడుపు నిండినంతనే కైపాయ రుచులెల్లా
బెడిదపు టాఁకలై తేఁ బ్రియమాయను
[9-252

కైపు

కోపముదీరిన మీఁద గూడేవు గాక
కైపున పీవుళ్ళెదె కల్లయనవయ్యా
[17-157

కోపమేఁటికి నీవు కొంగువట్టుకుండగాను
కైపువేటికి నీవు గలిగుండఁగా
[17-410

కైపుచేయు

యేపుగదేహమురోసి యింద్రలోకానవిడిచె
కైపునేసి రోయకనేఁ గాయము
మోచితిఁగాని
[7-242

కైపునేసి యిన్నిటానుగడచి శ్రీవెంకటేశు
నోపి శరణని మనే దొక్కటే నుండి
[10-108

కైమీరు

నాముపెక్కుటంతములు నాలిసేయనిఁక నేల
కైమీఁరి నందుకతనినిఁ గాఁగిలించుకొనవే
[15-237

కైయెత్తులు

ఆపదలు సంపదలు అందులోని మకరాలు
కాఁపురపు లంపటాలే కైయెత్తులు
[6-56

కైరవడి నాళము

కైరవడి నాళమునఁ గాంతపై నీవూదితేను
పూరక నీపైఁ దమ్మల ముమునె నాపె
[13-124

కైలాటము

నివ్వటిల్లఁగై లాటాలు నేఁబెట్టితిననేమిక
జవ్వని యాపెఱఁగదా చల్లని నీ గుణములు
[14-147

కైలాటాలు పెట్టు
బద్దుల నేరుపులెల్లా పచరించి నీ మోహము
పెద్దసేసి కైలాటాలు పెట్టకుందేవా
[16-2-41

కైవాలి పండు
కాయపు సుఖములు గంపల నున్నవి
పాయమే కైవాలి పండె నదే
[9-47

కైవాలు
లలియింత రేఁచకున్న లాగుల నీవయసెల్లా
పలచనై లోలోనె పండితాఁ గైవాలుగా
[15-167

పాయము నీకొక్కనికే చాయగా
మీఁ దెత్తితిని
యీయెదఁ గైవాలకుండను వెంకటేశ
మా యింటనే పాయకుండరా
[13-223

కైవీడియము
ఒకనేర్పుమైఁ బ్రసంగోచితోక్తులను
వికసింపఁజేసి కైవీడియం బొసఁగి
[వ. యో. వి. 5-102

కైవ్రాలు
నిగ్గుల శ్రీవెంకటేశ నీవు నన్ను నేలుకొని
దగ్గతినాలోనుండఁగా తలపూఁ గైవ్రాలదు
[6-4

## కొ

కొంకుగొసరు
కొంకు గొసరులేని మంచి
'కూటమలర విట్లఁ గూడి
వెంకటాద్రి విభుఁడు లేని వేడుకేఁటికే
[12-55

రంకెలు వేయుచు రాజులెదుట నీవు
కొంకు గొసరులేని కోడెల
[12-312

కొంకు గొఁసరులు
వంకము వంకము పైకొని రాకురో
కొంకుఁ గొసరుల కూళలము
[5-144

కొంకుదీర్చు
గోవిందుఁడు గలఁడుగా
కొంకుదీర్చి ననుగావ
కావరపు భవములు గదిమినాను
[9-128

కొంకుదేరు
బత్తితోఁగూడితిఁ దనపచ్చడముమునుఁగిడి
కొత్త యింత సేయక తానే కొంకు దేరుపచే
[13-165

కొత్తపెండ్లి కూతురు కొంకుదేరీఁ దేరదు
చిత్తగించి నీవైనా చేయి వట్టవయ్యా
[17-178

కొంకువాయు
కొంకువాయఁ గాఁగిలించి
కూరిమి నవ్వు నవ్వి
యింకఁ జెమరించితివి యిఁక నేఁటిదే
[17-79

కొంగిచ్చు
కలిగినది యొక్కటే కమలావతి నేవ
తెలువకొంగిచ్చెను దిబ్బెము దొడికేను
[5-267

కొంగుజారు
కొంగుజారినంతలోనేకూలెను త్రిపురములు
కంగి గమనించితేనే కలదోషములుమానె
[6-150

కొంగు పట్టి తీయు
కొంగుపట్టి తీసితేనె గొబ్బున లోనౌదువు
[17-175

కొంగుపైఁడి
చేరి కొల్చినవారికిఁ జేపట్టుఁ గుంచమవు
కోరి నుతించిన వారి కొంగు పైఁడివి
[6-173

కొంచిన వారల కొంగుపైఁడి
ములిగిన వారికి మొనవాఁడి
[7-197

తేరి శ్రీవెంకటపతి దేవుఁడై నందుకు గురి
కోరినవారి వరాలే కొంగుపైఁడిగగాదా
[7-233

కొంగుపైఁడి యగు గురుమంత్రంబులు
సంగడి వైష్ణవ సంభాషలు
[8-247

కొలచిన వారల కొంగుపైఁ డితఁడు
బలిమిఁ దారక బ్రహ్మమీతఁడు
[9-130

తోపుల మోవియ్యావే తెలుసుకోలే నీవు
తోపులఁదరి తోపుల కొంగుపైఁడై వున్నది
[13-208

సరసపు సముద్రము సతమైన కొంగుపైడి
అంది సంపదలది అలమేల్ మంగ
[14-84

కొంగు పసిండి
ధనధాన్య సంగతి తంగేటి జున్ను
గొనకైన ప్రాయంబు కొంగు పసిండి
[వ. యో. వి. 3-713

కొంగు పసిఁడి
తెమ్మలుగా మోవి తెనె లొసఁగుదువు
కొమ్మలపాలిటి కొంగు పసిఁడి
[18-86

కొంగు బంగరువు
కోరిన కోర్కెయు కొంగు బంగరువు
సారె విష్ణుదాస్యము లోకులకు
[5-264

కొంగు బంగారము
ఇంగితంబుగ వెంకటేశుఁ గూడిన పొందు
కొంగు బంగారమై కోరికలు మీఱె
[4-100

కొంగు బంగారు
అఁగమయిన మొలపీతాంబరంబున
కొంగు బంగారై కూడె నితఁడు
[11-2-7

కొంగు భత్యము
ప్రేమపు నీ యధరకు పెట్టరాని జీతము
కోమలి నీ తమ్ములమే కొంగు భత్యము
[12-205

కొంగు మాటువాఁడు
యెక్కడి దొరనంటాన్ నేన్నెవె
శ్రీవెంకటేశుఁడు
మక్కువఁ బయ్యెద కొంగుమాటువాఁడుమ
[17-419

కొంగు రొక్కము
కొలది పుణ్యపాపాలే
కొంగు రొక్కములు వెట్టి
వెలదెంచి బేరమాడ వేగరమే రారో
[8-170

కొంగుల పసిఁడి
కారూమితఁడే కలిగిన దైవము
కోరినవారల కొంగుల పసిఁడి
[10-261

కొంగులుపట్టి కొసరు
చెంగట లేత నవ్వులు సీసపాలవంటివి
కొంగులు పట్టుచు నీవు కొసరేటి వేళ
[7-58

కొంచని మూర్ఖుఁడు
అంచన నాస్తికునకు నాచారమే లేదు
కొంచని మూర్ఖుఁడ నాకు గుణమే లేదు
[8-121

కొంచపడు
కోరివోకరినడగి కొంచపడుకుంటె మేలు
సారెసారె జీవులను చంపకుంటె మేలు
[9–158

కొంచపు భోగము
యెంచఁగ నీ కుక్షిలోన నెత్తినయీజన్మము
కొంచెపు భోగము వలన గురిసేయవలెనా
[8–55

కొంచెము చేయు
పెంచినఁ బెరుగును పెను యింద్రియములు
కొంచెము సేసినఁ గుందును
[10–12

కొంచించు
వాక్కొక్కవేళ తలిదండ్రులైన మీర
లాత్మభోగంబు లొసంగును
బాహ్యాభ్యంతరంబులం గానకుండగా
కొంచించక సిగ్గు విడిచి
మలమూత్రంబులు విసర్జించితి
[వై. వ. మా. గ. 17

మంచముమీఁదికిదీసి మన్నించి అంతలోనే
కొంచించి నిద్రవోఁ బోతే కొలదాఁకదా
[14–33

కొంచి కొంచి యుండు
మంచితనమే వలె మాటలాడే యప్పుడెల్లా
కొంచికొంచి యుండవలె కోపపువేళ
[8–158

కొంచిన
కంచుమాయఁ బొరలఁగాఁ గాచితె
శ్రీ వెంకటేశ
కొంచినయిన్నాళ్ల నాగుణా మేఁటిగుణము
[7–194

కొంచి యాడు
యంకి నీవు వచ్చావంటె నిందాక
నెదురు చూచె
అంతయు నీతోఁ గొంచి యాడఁజాలదు
[17–532

కొంచు
యెంచి విభీషణు కిటు లంక యొసగి
కొంచని ప్రతాప కోదండరామా
[8–184

కొంచెపడు
గాటమైన సంపదల కడలేని పుణ్యుల
కోటికిఁ బడగెత్తక కొంచెపడనా
[5–202

వుమ్మడి నీ విందుకెల్లా నూరకున్నఁ
గన మిమ్ము
నమ్మమన్న వేదాలయానతి కొంచెపడదా
[8–191

కొంట [=కొనుచు]
కొలదివేనిసొమ్ములు కొంటవచ్చె నీకునిట్టె
[17–357

కొండగద్దె
కొండగద్దెమీదివాఁడు గొప్పకిరీటమువాఁడు
దిండుపైఁడి చీర కేళ తెక్కులవాఁడు
[7–274

కొండ గొడుగు
కొసరివేలనేయెడ కొండగొడగెత్తుచేడ
వసమా నిన్నుఁ బొగడ వరజగన్నాథా
[7–196

కొండ గొను
కొండగొన్న సుఖమెల్లఁ
గొల్లలాడుదువు గాక
బొండుమల్లెపానుపుపైఁ బొరలగ నేఁటికే
[4–28

కొండచరిఁ బొలయోర
యెండదాఁకితివి కడునిచ్చల రచ్చలు సేసి
కొండచరిఁ బొలయోరఁ గూరుచుంటివో
[4–40

కొండల నునుపులు
కొండల నునుపులు కొనకొన మమతలు
అండలకేగిన నదవదలు
[5–24

కొండలై కొల్లలై కొలఁదికి మీఱు
వెండియు శ్రీరంగ విభునిపైఁ బ్రేమ
కొండలై కొల్లలై కొలఁదికి మీఱు
[వ. యో. వి. 5–1206

కొండలై కొల్లలై కొలఁదికి మీఱు
వెండియు శ్రీరంగ విభునిపైఁ బ్రేమ
కొండలై కొల్లలై కొలఁదికి మీఱు
[వ. యో. వి. 5–1206

**కొండాటము**
వసుదేవుఁ డల్లవాఁడే వరుస దేవకి యదే
కొసరే బ్రహ్మాదుల కొండాట మదే
[10–1

**కొండించు (?)**
నరహరి యచ్యుత వో నారాయణ
గురుఁడు నిన్నుఁ గొండించెఁ (?) గోరి నే వింటి
[9–200

**కొండుక**
రెండుచేతుల యిద్దరికిఁ గాఁగిలిచ్చి యిచ్చి
నొండుక జమళి పెండ్లికొడుకవు నైతివి
[13–183

**కొండె గోడితనము**
ఉండనీరా యీపాటి వూరకే నన్ను
కొండెగోడితనాలకుఁ గోపమెల్లా హెచ్చును
[13–59

**కొంతము**
వంతపు నీ మాటలు భావించి తెలియబోతే
కొంతములై నాటుఁగాక కొరతయ్యీనా
[

**కొంపవెళ్లు**
తేకువైన హరిభక్తి తెరువు గానని వాని
వేకపుసిరులు కొంపవెళ్ళుఁబో లోలోనె
[5–143

**కొచ్చి**
కోపమెల్ల గలిగిన కొచ్చి శాంతమిచ్చుటకు
చేపట్టి కలవుగా నా చిత్తములో నీవు
[7–196

**కొచ్చి కొచ్చి**
నచ్చిన సిరులు నాలుక తుదలు
కొచ్చి కొచ్చవో గోవిందు
[5–8

చెచ్చెరవీనుల నాలించేది సురల నుతులు
కొచ్చికొచ్చి తోఁకఁ జుట్టుకొన్నది నింగి
[8–232

చచ్చి చచ్చి పుట్టి పుట్టి జారవద్ద కర్మము
కొచ్చి కొచ్చి నేసి నేసి గోరపడేఁగాక
[9–147

కొచ్చి కొచ్చి యొక కొండంత కనకము
వెచ్చపుఁ బోకకు వెల యిడినట్లు
[9–285

**కొచ్చి కొచ్చి తిట్టు**
యిచ్చకపు పతివి నీ వేమన్నా నితవే నాకు
కొచ్చి కొచ్చి తిట్టినాను కోపమున్నదా
[17–213

**కొచ్చి కొచ్చి రుచిగొను**
యెచ్చునాలుకఁదపు మింగకెట్టుమానవచ్చు
కొచ్చికొచ్చి సారె రుచిగొనుటగాక
[11–79

**కొచ్చిన**
కొచ్చినశ్రీవెంకటేశుకొలువుడు బంటనింతే
వచ్చి యింద్రియాలకెల్లాఁ బంపు నేసెను
[7–193

**కొచ్చు**
కొచ్చిన గోరయవు కోపములు
గచ్చుల గుణములు గలవాళ్ల
[11–48

యిచ్చకములే నేసి యింతి నిన్నుఁజెనకఁగా
నొచ్చుకు మీ మేనంటా గుట్టు వేసేవు
[14–127

యింగిత మెరిఁగి నిన్ను యింటికిఁ
బిలిచేఁ గాన
కొంగువట్టి తోసి యంత కొచ్చేదాననా
[14-167

కొట్టఁగొన
కొట్టఁగొనకు మతిగోరి పాతే
జట్టిగ హరికథ చవి గలుగు
[9-21

కొట్టఁ గొన కెక్కు
కొట్టఁగొన కెక్కలేదు కోరిమొదలనులేదు
నట్టనడుమ నున్నది నా బ్రతుకు
[8-110

కొట్ట నూకించు
కుడిచేత దనుజులఁ గొట్ట నూకించినాఁడు
ఎడమచేఁ బండ్ల గొల పిడికిలించె
[11-198

కొట్టిన పిండి
కూడిన వారికి రతి కొట్టిన పిండి వంటిది
కూడని వారికి కలగూర వంటిది
[13-204

కొట్టువడు
కోపపు శాంతము(?)చేతఁ గొట్టువడ్డప్రాణికి
తాపపుకర్మము వెట్టి తప్పించుకో వచ్చునా
[10-88

కొట్నాలు దంచు
కూరిమి విషయముల కొట్నాలు దంచేము
చేరి నీవు చెప్పినట్టె సేసేము
[9-198

కొడితెఁడు బయలు
కొడితెఁడు బయలిలో గోవిందుని నెలవఁట
చిదిముడితో నిట్టే చేరి పట్టరో
[11-180

కొడిమెలు కట్టు
కూడీఁ గూడక తొల్లె కొడిమేలే కట్టేవు
వాడలో నుండఁ బాసెఁగా వన్నె మగవాడికి
[17-324

కొడిమెలు గట్టుకొను
పొడమి కాంకలకుఁగా పురుషుఁడు
బెడ్డఁ గన్ను
కొడిమెలు గట్టుకొనె గోవిందరాజా
[13-195

కొడిమె లెంచు
అడుగఁబోతే సుద్దులు అంతా మేలే కదటే
కొడిమె లెంచేనంటేఁ గొంకీఁ దాను
[14-197

కొడిసాగు
ఉడుగని వెలుపటి వుద్యోగము వలె
కొడి సాగెడి మితి కోరికలు
[11-78

కొతికి
పతిబెండ్లాడివయాలుపక్కనుండినిద్రించితే
కొతికి కాలానుభాగి గొనవచ్చునా
[6-214

కొత్త పెండ్లికూఁతురు
సారెకు నవ్వులేల పచ్చడములో
నున్న యాపె
కూరిమి నీ కొత్త పెండ్లి కూఁతురుగాదా
[15-284

చిత్తములో చింతలేలె సిగ్గులు వడఁగ నేలె
కొత్తపెండ్లి కూఁతురవా కొమ్మ నీవు
[15-291

కొత్తలగు
హత్తిదేవతలు నిన్ను నందరు
బూజించఁగాను
కొత్తలాయ నీ బ్రదుకు గోవిందరాజా
[7-130

కొత్తలు
అప్పుడు వేంకటరాయఁడడ్డపాపఁ డరకాల
కుప్పవడఁ దన్నె నిట్టి కొత్తలెందుఁ గలవా
[4-60

కొత్తైన గమనము
చిత్తజాతుని మీద చేయుఁ జెలియ మీఁద
కొత్తైన గమనంబు కొన వేళ్ళమీద
[4-133

కొద
పలుకుల కొదలుతో పయ్యెద వదలుతోడ
చెలి నీపై వలపులు చిందఁజొచ్చెను
[15-288

కొదవీరు
తదియ్య గురుప్రసాదపు పురోడాశ మిచ్చి
కొదవీర ద్వయమను కుండలంబులు పెట్టి
[6-148

కొదలు
యెదుట నామోము చూచి యంటి
కిచ్చె దాఁగాను
కొదలు గుణఁగుల నా కోప మింకానా
[15-123

కొద్దిమాలిన కర్మము
కొద్దిమాలిన కర్మము కొంత మాకు
గడియించి
పిన్న నిన్ను గాని వాని (?) వలె దాఁగవలెనా
[9-25

కొద్దిమాలు
కొద్ది మాలినట్టి తనఘోరము విచారించఁడు
సుద్దులైన హరిభక్తి సోదించినా
[8-135

కొద్దిమీరు
అనుక శ్రీవెంకటేశు బంపై వరమిచ్చి
కొద్దిమీరం సంతోసాన గుప్పె
హనుమంతుఁడు
[10-272

కొమ్మలు
కొమ్మలతో మూరుకుమూరొకరొకరుంగరాలు
కొమ్మలై వున్నవి మీఁద కొనవేళ్ళనివినో
[18-119

కొనకుఁ గొన
కొనకుఁ గొన యదే కోరెడి దదియే
తను దా రక్షించుఁ దలఁచినను
[9-188

కొనకెక్కఁబోయి కొంచెపడు
తనుఁ దానే చెరె హరి దధి విభాండకునకు
కొనకెక్కఁబోయి నివి కొంచెపడెఁ దొల్లి
[6-99

కొనకెక్కు
ఘనుఁడ తిరువేంకటపతి యని కని
కొనకెక్కుట లేఁకువగాకా
[5-163

గోవిందుఁడు మన్నించితేఁ గొంచెము
దొడ్డున్నదా
కోవరపునిరలంది కొనకెక్కుఁగాక
[9-134

గోవింద దాసులమై కొనకెక్కుడుముగాక
వేవేలు విధులనమ్మి వెతఁబడ గలమా
[9-260

పొందుగ నచ్యుతుఁ బూజించు పూజలు
కిందటఁ గొనకెక్కడి నిచ్చెనలు
[9-275

కొండవంటిదిసుమీ కొనకెక్కు నా మనసు
వుండుఁ గామాదులను వురు మృగములు
[10-200

కూడఁ గూడ నానాఁటఁ గొనకొక్కెఁ
గోరికలు
పీడని బంధము లన్ని విడిచినా
[10-219

యెనసిన శ్రీవెంకటేశుఁడె యంతా
కొనకెక్కిన నిజ కోవిదునికిని
[11-111

సిబ్బితి పడఁగనేల చింతలఁ బొరలనేల
గొబ్బున మొదలె పీరు కొనకెక్కఁదా
[11-153

కొనకొన మమతలు
కొంపల నునుపుల కొనకొన మమతలు
అందల కేఁగిన నదవదలు
[5-24

కొనచింత
కుంగేటి భోగములకుఁ గొనచింత
వుంగిటఁ గలిగె మాకు నోహో యీ చింత
[10-48

కొన దాఁకు
కచ్చిన నిట్టూర్పుల కొనదాఁకే వునికి
ఒచ్చిన మాటల ధ్వని దాఁకేటి వునికి
[10-25

కొన దేవుఁడు
మేకొవకముగ వటపత్రమున యీఁదెటి నీకంటే
దీకొని పలికిన కాలంబుల కొనదేవుఁడు మఱి వేఁడ
[10-104

కొనదైవము
యెనసియులెల్లా నెఱిగియు మఱఁగియు
కొనదైవము నేలో కొలువము మనము
[9-159

కొన నాలిక
అరిచితే మూరఁడెక్కినదే నామకీర్తనము
కొరిమి శ్రీ వేంకటేశ కొన నాలికకును
[8-248

కొన నాలికలు
మునుకొని వేదముల ముడిగిన మంత్రము
కొన నాలికలలోఁ గుదురై నిలిచె
[8-10

కొన నాలికె
నతి నీతో విన్నవించె జవ్వనపు గతమెల్ల
నతమై కొననాలికెఁ జదివితివి
[14-19

కొన నాలుక
మునుకొన్న గామముహై ముందర నుండే వాఁడు
కొననాలుక మీఁదటి గోవిందుఁడే వీఁడో
[10-11

కొననాలుకే హరిగుణము తనుదోఁగవో
మనసా అతని దివ్యమహి మెంచవో
[10-14

కొనబు
కొనబు శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
మనసిచ్చి నేఁగాఁగా మన్నించితిఁ గాకా
[17-542
[ఈ పదాన్ని గొనబు అని వర్గతృతీయం తోనే నిఘంటువులు స్వీకరించాయి]

కొన మొదలు
వనిచి యందుకును నారాయణుఁడై
కొనమొదలై తా గురి యైనాఁడు
[7-270

కొనమొదలైనవాఁడు గురి దానైనవాఁడు
వునికి మనికినేయ కూరకుందేను
[6-119

కొన మొదలేదో గుఱిగాన రొరులు
మునుకొన సంసార మోహాంధమందు
[6-118

ననిచి యీ రెంటికిని నారాయణుఁడే కర్త
కొనమొద లాతనిదే కొనరు మాకేల
[8-91

కొన మొదలు నడుము
వెనకను కృష్ణుడే లెనముం దచ్యుతుఁ డే
కొనమొదలు నడుము గోవిందుఁడే
[7-229

కొన మొద లెఱుఁగు
తలచి యెవ్వరినేఁ దగుఁదగ దనలేను
కొలది జీవుఁడ నింతే కొనమొద లెఱఁగ
[9-248

కొన మొద లేర్పడు
ఘనుడగు శ్రీవేంకటపతి గావఁగ
కొన మొద లేర్పడె కొంకే లేదు
[5–317

కొన యగు
గొనకొన్నయర్థము గోరిన యటువలె
కొనయగు మోక్షము గోరదు
[8–213

కొనలు సాగు
కోరిక లూరక కొనలు సాగఁగా
బారలు చాఁచీఁ బ్రపంచము
[8–118

కొనుదుంచు
పుట జయమాయ నిట్టే పుణ్యపాపము
లందులో
కుటిలపుఁ గోరికల కొనదుంచుట
[5–277

కొన్న కోలు
మన్ననలు దనవంక మరియింతకంటెనేవి
కొన్నకోలై యిఁకనేమి
గొంగువట్టీ నన్నును
[17–546

కొన్నది కోలు
కన్నులఁ జూచేవు మాతో
కందువ మాడలాడేవు
కొన్నది కోలు నీ కిక గోవిందరాజా
[15–174

కొన్నది కోలై కోరు
ఇన్ని కోరికలు యిదియే తనకని
కొన్నది కోలై కోరుట గాకా
[5–193

కొన్నదే కోలు
నన్ను నిటె శ్రీవెంకటనాథుడ కూడితివి
కొన్నదేకోలిఁక నీకుఁ గోనచెన్నరాయడా
[16–19

కొన్నెసి విలుచు (?)
కన్నతండ్రి బాలునిఁ జంకబెట్టి దించితేను
కొన్నెసివిలుచు ముద్దు గునిసినట్లు (?)
[7–221

కొప్పు వట్టి తీయు
చెప్పవద్దు నీసుద్దులు చెంగట నేనుండఁగానె
కొప్పువట్టి తీయవా ఆ కొమ్మన నీ విపుడు
[13–123

కొయ్యకాఁడు
మచ్చిక నేమాడెటి మాటలు వేలుచుకొని
కుచ్చితాలు సేసితిగా కొయ్యకాఁడా
[17–589

అంకుల చేతులువట్టి యానలేల పెట్టీని
సంకెలేని కొయ్యకాఁడు జాజరకాఁడు
[13–134

కొయ్యగాఁడు
కోరి నేరా లెంచనేలే కొయ్యగాండ్లతోడ
[17–458

కొయ్యతనము
కొయ్యతనా లెల్లనాడి కొంగువట్టి తీసితేను
యియ్యకొంటిఁ బనులకు నేమో కాని
[15–147

ద్రవ్యముల తొమ్మిదైన వనితమానితెనని
కొయ్యతనమున బాస గొనక నిన్నొల్లను
[4–168

కొయ్యతనమునని ట్టెకోనేటిరామునిఁగూడి
వుయ్యాల మంచముమీద నో యమ్మా
[12–327

కొరమాలు
విరసపు బాపముల వినికిచే వీనులెల్లా
గొరమాలె మాకు నేఁటి కులాచారములు
[6–61

కొఱకొఱ మాటలు
గురునాయకుని కొఱకొఱ మాటలకును
ఘూరి మేనబావను నాత్మఁ గైకొనక
[అ. మ. క. 6449

కొఱకొఱ సేయు
కొఱ కొఱతల సేయ
ననుకూలపు భార్యకు వెంకటేశ్వరా
[శృం. వృ. ప. శ. 55

కొఱమాలు
నెఱయువిభవములెల్ల విజములాయందరికి
కొఱమాలినట్టి తమ గుణము గాక
[5–151

కొలకొలమను
నిలువుఁదాళలో నిడుఁగూతలతో
కొలకొలమని గోవిందుడు
[8–142

కొలగట్టు
మలసె నిన్నుఁ దలచ మనసిచ్చితివిగాక
కొలగట్టి విషయాలఁ గోరుమంటివా
[16–40

కొలిచిన వారి పాలి కొల్లలు
కొలచిన వారి పాలి కొల్ల లివివో
యిలనిట్టి దైవమవు యిఁక వేరే కలరా
[9–193

కొలచి పోయు
అంచల సూర్యచంద్రులనే వడెకుడు కల
ముంచి కొలచి పోసేని మునుకొని కాలము
[6–172

కొలదాఁకు
మంచముమీఁదికిఁదీపిమన్నించిఅంతలోనే
కొంచించి నిద్రవోఁబోతే కొలదాఁకదా
[14–33

కొలఁది
మెచ్చితేనే మేకులు మీరితేనే మాకులు
యిచ్చకొలఁది వడతు వేమందురా
[15–215

కొలఁది జీవుఁడు
తలఁచి యెవ్వరినేఁ దగుఁదగ దనలేదు
కొలఁది జీవుఁడు నింతె కొస మొదలెఱుగ
[9–248

కొలఁది పాటు
ఎన్నఁ డిక యేది గొలఁదిపాటు
వున్నతపు మాయలకే వొడిగట్ట వలసె
[9–151

కొలది పెట్టు
పలుమారు నీ గుణాలు పైకొని నుతింతురు
కొలఁది వెట్టుచు మీ గుఱుతు లెంచలేరు
[7–53

కొలఁదిఁబడు
దంటలైనా చేతఁ దలపించుకొనఁగ దొల
కొంట వింక నిది నీకు కొలఁదిఁబడునా
[4–38

కొలఁదిమీఱు
చెలి చక్కనిదిగాదో చిత్తమేమి రాదో
కొలఁదిమీఱిన నీపై కూరిమి లేదో
[4–119

కొలఁది వెట్టు
లలిత లావణ్య లీలావిగ్రహము గాన
కొలఁదివెట్టఁగారాని గోళ్ల నిడుపాయ
[11–3–39

కలిగితేజకక్కదనము కొలఁది వెట్టఁగరాదు
లలిఁ దానెంత మీరినా చలములేదు నాకు
[18–246

కొమ్మసింగారములవి కొలఁదివెట్టఁగరవు
వమ్మిన యీనొబగులు భావించరే చెలులు
[18–513

కొలదిమీఱు
కొలది మీఱిన యూర్పు
కుచయుగములకు వేఁగు
బలువు కుచములు నాభిపయి కల్ల వేఁగు
[4–150

కొలదీర్చు
అట్టెపూతనఁజంపి ఆఁడుఁగొలదీర్చినాఁడు
గట్టిగాఁ గృష్ణుఁడు లోకమువారికెల్లను
[6–57

బలురావణుఁ జంపి బావన కొలదీర్చినాడు
యిలమీదఁ గలిగిన ఋషులకెల్లా
[6-57

కొలదిమీరినయట్టి కోఁతి కొల దీర్చినాఁడు
అల తన దాసులైన అమరులకు
[6–57

వొల(లి)సి పురాలు చొచ్చి
వూరఁ గొల దీర్చినాఁడు
అల తన దాసులైన అమరులకు
[6–57

వట్టకాళింగునిఁదోలి పాముకొలదీర్చినాఁడు
బట్టబాయిటనే రేపల్లెవారికి
[6–57

కొలపట్టు
మగనిపై బత్తెనేసి మంచిలోకాలెక్కేరట
తగుదండ కొలవట్టి తత్వగతి గనేరట
[7–30

కొలిచినవారిపాలికొల్లలు
కొలిచిన వారి పాలి కొల్ల లివివో
యిలనెట్టి దైవమవు యిఁక వేరే కలరా
[9–193

కొలుదాసి
పొరుగు సతులుండితే పొరచివేడుకకాఁగా
దొరకొలుదాసికిఁ బొరిదులుబాఁతే
[14–198

కొలువు
తప్పక చూచినగాక్ని దగ్గరివాఁ గొలువదు
[13–39

కొలువఁబెట్టి
తొలుత రాముని గాంచి తోడనే సుగ్రీవుని
కొలువఁబెట్టి యాతని కొమ్మ నిప్పించి
[10–141

కొలువు చావడి
కడువిరహినై నిన్నుఁ గన్నులఁ
జూచేమంచేను
వాడ తేరి కొలువు చావడి ముందువు
[13–22

కొలువు చిత్తరువు
కొంతవడిఁదనపేరుకోరినాలుకఁదలఁతునే
కొంతవడిఁదనసుద్దులు కొమ్మలచేపిందునే
కొంతవడితానున్న కొలువుచిత్తరువుచూతు
కొంత యీరీతిఁ బొద్దు గడుపుదునె నేను
[15–78

కొలువుడు బంటు
కొచ్చిన శ్రీ వేంకటేశు కొలువుడు
బంటు నింతే
పచ్చియింద్రియాలకెల్లాఁ బంపునేసెను
[7–193

కొలువుఁడు వలయు
కొలువుఁడు వలసితే గొలువక మానుఁడు
తెలియ నతఁడే సుండి దేవదేవోత్తముఁడు
[10–183

కొలువు పతిమలు
కొలువు పతిమలెల్లా గోడ చేరుపులేకాక
కలయిక రతులకు కారణమేమి
[14–212

కొలువు నిబువు
వెలయు రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీవెంకటనాధు గానఁగరాదా
వలెనని యిందరికి వరాలిచ్చే దేవుఁడేమి
కొలువు నిలువుపాటి గుణమియ్యనోపఁడా
[16–42

కొల్లఁబోవు
తోరమైన ఆసలుబ్బి తోవ గానిపించదాయ
కోరి రాకపోకచేత కొల్లఁబోయఁ గాలము
[5–128

అక్కడనాపాట్లువడి యిక్కడనపాటువడి
కుక్కనోట కళసమై కొల్లఁబోయ బదుకు
[11–3–24

కొల్లలిచ్చు
యీరీతి శ్రీవేంకటాద్రి నిద్దరునునేకరూపై
కోరి వారి విరాలు కొల్లలిచ్చేరదివో
[8–178

కొల్లలుదొరకు
గోవిందాది నామోచ్చారణ
కొల్లలు దొరకెను మన కిపుడు
ఆవల నీవల నోరఁ గుమ్మలుగ
నాడుద మీతనిఁ బాడుదము
[9–43

కొల్లలొసగు
చేరినేఁడునిలుచుండి శ్రీవేంకటాద్రిమీఁదఁ
గోరిన వరములెల్లా కొల్ల లొసఁగితివి
[8–94

కొల్బు నించుకొను
యెవ్వరు బుద్ధి చెప్పిరి యిలపైఁజీమలకెల్లా
నెవ్వగఁ బుట్టల గొల్బు నించు కొమ్మని
[6–45

కొల్లున నవ్వు
పాడిగాఁగానట్టే పక్కన శ్రీవెంకటేశుఁ
గూడితి వింతటిలోనే కొల్లున నవ్వేవు
[13–24

గుబ్బలురమున నూఁది కొల్లుననునవ్వునవ్వి
అబ్బురము నేసినది ఆనవాలు
[13–203

## కో

కోఁడు
కోఁడినన్నులోను నేనుకొని నీయిచ్చఁదిరిగి
ఆఁడుజాతికిదే చాలు అంటెనా కోరుతారా
[14–246

కోటకొమ్మ
నీటున వయ్యాళివోయి నీవురాగా నదెచెలి
కోటకొమ్మ నొరగూడి గొబ్బునఁ జూచీ
[15–277

కోటానఁగోటి
యీటులేని శ్రీవెంకటేశుఁడేఁగీ నల్లవాఁడె
కోటానఁగోటి దాసుల కోరిక లీడేర్చెను
[8–274

వీరఘోరతపముల వెలయ బాణాసురుఁడు
కోరిచే కొన్నవరాలు కోటానఁగోటి
[9–75

కోటానఁగోటివరాలు
వాటపు సింగారముతో వాకిట వచ్చి నిలిచీ
కోటానఁగోటివరాలు కొమ్మనియిచ్చుచును
[8–122

కోటానగోట్లు
ఆరటుఁబట్టెఁడు అన్నమువాఁడను
కోరినకోర్కులు కోటానగోట్లు
[9–40

మఱి నానుద్దులు యెంచఁగ నెంచఁగ
మంచము కిందె నూయి
గుఱి నీ కథలవి వినఁబోతే
కొండలుఁ గోటానగోట్లు
[9–84

కోటికిఁ బడగెత్తు
చేటుఱుంగని కూన చెలిచిత్తమే కదా
కోటికినిఁ బడగెత్తెఁ గోరికలను
[4–135

కోటిచేయు
నీటిలోన నొకబుగ్గ నిమిషములోనఁ బుట్టి
కోటిసేసినట్లుండఁ గొంత వడ్డి
[7–126

కోటిసుద్దులు
పాటించి నమ్మినవారి భాగ్యము గాదా
కోటిసుద్దులేల యిదే కోరి చేకొనేది
[8–82

కోచేరువైచు
మీఁటైన యెద్దుల మెడ కాడిమీఁద
గోచేరువైచి నెక్కొని రొప్పికొనుచు
[వ. యో. వి. 7–744

కోట్లకొలఁది
సిసు వితనికి మొక్కి చేసేము జాగరలు
కొసరరో వరములు కోట్లకొలఁదులు
[10–27

కోడు
వాడికె నొండొరులము వలచిన వలపులే
కోడి యెరుకలుసేసి కొనవచ్చేరు
[14–14

కోతవేఁత
బూతాల పొంగటికే పొడమిన పంటలెల్లా
కోతవేఁత చూచుకొని కోరుకొటారు (?)
[9–175

కోన [గ్రామనామం]
వీడెమిచ్చిఁ గోన తిరువెంగళేశుఁడై వచ్చి
కూడెను శ్రీవెంకటాద్రి కొండమీఁదఁ
జూడవే
[14–142

లోనై నీకు నుండఁగా లోనింటికిఁ బిలిచేవా
కోనల నిందుకు నియ్యకొనగలనా
[14–220

నానాటికి నీ గుణాలు నానించి కడిగేనంటే
కోనల ముంజేయి వట్టి గోరనెత్తేవు
[14–221

కోనాడు
కోటులైనవేదములుకోనాడినిన్నందులోన
నోటి విన్నపము లొక్క నువ్వుగింజంతె
[8–42

కోపు
కోపినఁ దొలగవు కోరికలు
గానిలి చిత్తము గలిగి నన్నాళ్లు
[11–48

కోపుల నుడుగు
చేపట్టి నామాంకితవు సిద్ధరసము గలిగి
కోపుల నుడిగి పనిగొనరేలో జీవులు
[8–279

కోమటిండ్ల పొరుగు
ముద్దుముద్దుసేసినిన్ను మోదఁబెంచె మీతల్లి
పొద్దువొద్దుఁగోమటిండ్ల పొరుగాయబదుకు
[15–73

కోమటి మేనరికము
వొలిసీ నొల్లనివాఁడ వూరకే ఆసియ్యనేల
పొలసి అప్పుడే నన్నుఁ బొమ్మనరాదా
కలికి నేఁగొసరఁగఁ గోమటి మేనరికమా
నెలపై సుఖాన నుండు నీ వొక్కఁడవే
[17–305

కోయని కట్లు
కోరిన కోర్కులు కోయనికట్లు
తీరవు నీ వవి తెంచకా
[17–241

కోలు
యేల కొనేఁ డీ దేహి
ఆలరి భోగములడిగీఁ గాక
చాలించఁగఁ జాలఁడు
కోలుముందు హరిఁ గొలువఁగరాదా
[16–1–10

కోలుపడు
ఇందరి బుద్ధులు యీశ్వరేచ్ఛకు సరిరావు
గొందినున్న మానుషము కోలుపడెంతైనా
[6–94

కోలు ముందగు
కోలుముందై తండ్రిగల కొడుకు
కేది తొడుగు
యీ లీల హరిదాసుని కెక్కటి కోరికలు
[7–3

కోలుముందై బ్రహ్మయజ్ఞ కుండము
లాహుతి గొని
వోలినుండే అది నీకు హోమము
[10–46

నాలిసేసిపానుపుపైన నవ్వులునవ్వేవునీవు
కోలుముందైన మీఁద గొంత నేఁటికే
[14–100

**కోలుముందు**

బాలుఁడు వృద్ధనియెటి వరిభాష లన్నియును
మాలమూలలను దేహమునకె కాక
యీ లో నెంచి చూచితే నెన్నటివాఁడు
కోలుముందై పెరిగీను కొంచె మయ్యీనో
[16-1-26

మేలిమిత్తమ్మెదలాలమెలుఁత వోరువలేదు
కోలుముందై కూసిన మీ కులమునాన
[16-2-43

శ్రీలలనాధిప శ్రీవెంకటేశ్వర
కోలుముందు నిను గొలిచితిమయ్యా
[9-241

**కోవరము**

చేవదేర బుజ్జగించి చెక్కులునొక్కిన నేఁటి
కోవరపు నీ చెనకులు నిజమాయెను
[17-67

కోవరమై వెంటవెంటఁ గొలిచిన బంట్లకు
తావులఁ గొంతవడైనా దప్పి దీర్చవలదా
[5-237

## గ

**గంటువేఁటరి గూఁడు**

వెడవిల్తుడను గంట వేఁటరిగూటు
నిడిన దివియపోలె నినుఁ ద స్తమించె
[అ. మ. క. 2226

**గంటువేయు**

గంటువేసి పోఁకముడిగట్టిగాఁ గట్టినయట్టు
వొంటిగాకుండా నాతని వొడిఁగట్ట నేరవా
[14-97

**గంటు గిందుగాఁ బొరలు**

గంటుగిందుగాఁ బొరలే కాఁపురమా
తంటమి శ్రీపతి కృప కాఁపురమా
[6-34

**గండము దాఁకు**

పోరి గుంభకర్ణునికి పుట్టినదినము వచ్చె
మరలి గండము దాఁకె మండోదరికి
[11-225

**గండికాఁడు**

అండనే నాయందు లోకులందు నుండు టరుదా
గండికాఁడై తన మాయ గాననీఁడు గాక
[9-283

కొండల శ్రీవెంకటేశ కూడితిరిద్దరు నేఁడు
గండికాఁడ యిఁకనేలకదానేవు మాటలు
[13-244

యిన్నిటా శ్రీవెంకటేశ యిట్టె నన్ను గూడితివి
వన్నిన గండికాఁడవు భళిరా మెచ్చితిని
[17-41

**గండి గడచు**

కమలాక్షుఁ డితఁడు గలుగఁగఁగదాదేవతలు
గమిగూడి రిందరును గండిగడచి
[11-3-50

**గంత బొంత**

యింతవానికి నీకు నిటు సూదిఁ బూని
గంతబొంతయుఁ గూర్పఁ గారణంబేమి
[వ. యో. వి. 2-698

గక్కన సిద్ధులకైనా గంతయు బొంతయే కాని
చిక్కి వరుసము గలిగి సెలవులేదు
[6-89

**గంధాక్షతలు**

పొత్తుల విందులు దెచ్చి బువ్వమున నిడరే
హత్తి గంధాక్షతలీరె అందరునేఁడు
[15-55

**గంపఁగమ్మి**

వెన్న చేతఁ బట్టుకొని వేఁడనేలే నేతికి
తన్ను చూపుల నతని గంపఁగమ్మె నేరవా
[41-97

వలపేమి గంపఁ గమ్మనుచు నాయందైన
[16-2-90

ఆకెచే మొక్కించేవంటా ఆట్టిసిగ్గువడమటా
కాకుసేసి నిన్ను గంపఁ గమ్మవచ్చునా
[17-411

చంపవచ్చిన కర్మ సంగ్రహించగుబుద్ధి
గంపగమ్మక తన్ను గాచీనా
[5-129

గంపమోపు కోరికలు
లంపటమే సహజము లలిదేహధారులకు
గంపమోపు కోరికల కలకాలము
[8-32

గంపయెత్తు
అలపోశనెందైన ఆసమానలేవు
కలగన్నచోటికెల్ల గంపయెత్తేవా
[16-1-14

గంపల కొలఁది
దేవునిఁ బూజించితిమి తేరో నై వేద్యాలు
కైవసమై కృష్ణునికి గంపలకొలఁదులు
[10-27

గంపల నుండు
కాయపు సుఖములు గంపల వున్నవి
పాయమేకై వాలి పండెనదే
[9-47

గంపెఁడేసి మాటలల్లు
మటినల్లెఁడు నాలికె మాటలు గంపెఁడేసి
యెఱుక గొంచె మజ్ఞాన పెంచఁగరాదు
[7-115

గక్కదులు
కాంతుడ నే నెంతాడినా గక్కదలవు నీవు
[14-175

గక్కన
గక్కనఁ గాఁగిలించితే కన్నులదేవించితివి
పక్కన నా రతులకు భ్రమసితివి
[17-2

గగనము మోయు
తగుమునులు ఋషులు తపములు సేయఁగ
గగనము మోచియుఁ గర్మము దెగదా
[9-26

గగ్గులకాడు
మురవైరి పంపులవె ముందరి సేవలవె
పరచిగగ్గులకాడై పారరో దానవులు
[6-79

వీర నారసింహునకు వెరపులు గలవా
దూరాన గగ్గులకాడై తొలఁగుఁ గాక
[8-1

గచ్చు
యిచ్చకము లాడేవు యిట్టె కాఁగిలించేవు
గచ్చుల నలమేల్మంగఁ గానా నేను
[15-25

రచ్చలబెట్టక యిట్టె రావయ్యా
గచ్చులమాని యిన్నిఁ గనుకోవయ్యా
[17-151

గచ్చులాడు
గచ్చులాడు పెకాక కలికి పాలిండ్లు
బచ్చన సకినల పరిపాటులన్ని
[అ. మ. క. 2525

గచ్చువంటి యిహము గనివంటి పరము
గచ్చువంటి యిహమింతే గనివంటి
పరమింతే
ముచ్చటి కిందుకుఁ దుదమొదలున్నదా
[11-158

గజ భజించు
గజభజింపుచు వచ్చి కాచుక మతించేటి
ద్విజముని సంఘముల దేవసింహమా
[7-129

గజరు
నిజమాడితేఁ గనక నీవే నా దేవతవు
గజరు నీ చేతలకుఁ గలఁగీనా చిత్తము
[17-278

గజరు జేఁతలు
భజనమెరయ నన్నుఁ బచ్చి సేసేవు ఇంత
గజరుఁజేతల కోపఁగలనా యిఁకను
[12-242

గజబెజలు
త్రిజగాన నాతనిఁ జేరిన దాసు లిదె వీరు
గజబెజలిఁక నుడుగరో రాక్షసులు
[7-253

గజస్నానములు
హరిఁగొలువని కొలువులు మఱి
యడవిగాసిన వెన్నెలలు
గరిమల నచ్యుతు వినని కథలు
భువి గజస్నానములు
[7-1

గజిబిజి సేయు
నిజమే యాడుదురుగాక నీకేల యీ వెరపు
గజిబిజిసేసి నిన్ను గాసిఁబెట్టేనా
[17-464

గట్టగు
శ్రీవెంకటేశ్వరు నాకుఁజేరి వొప్పగించితివి
కావించి నీవాడే నింద గట్టాయలేదే
[17-353

గట్టువాయ
కాకుసేసినన్ను వీఁడెంత గట్టువాయయనక
శ్రీకాంతానీవింతటనుందువుచిత్తగించివినవే
[7-61

గట్టువాయతనము
శ్రీకాంతుఁడప్రత్యక్షమై శ్రీవెంకటాద్రియిదె
కైకొంటి నీకృపనెంత గట్టువాయతనమో
[6-187

గట్టువాయతనమునఁ గదిసి నన్ను
వట్టేవు నీ చుట్టమనో పక్కమనో
[16-2-100

ఎంత గట్టువాయత మిదేమే వీఁడు
అంతకంత కేమన్నానవమీఁదే వీఁడు
[17-182

గట్టువాయి
కాంతుండవో గట్టువాయి జాణతనమో యిట్టె
మంతుకెక్కించే నా మీఁది మన్ననోయి
[14-175

గడకుఁ గట్టిన పాత
గడకుఁ గట్టినపాత గతిదోఁచె మనసు
అడుసులోవలి కంబమై తోఁచె మనసు
[11-3-125

గడగడ నదురు
ముదివడు బొమ్మలు ముంచిన పూర్వులు
గడగడ నదిరేటి కటములును
[10-32

గడపల
ఈ భవమునకుఁ జూడనేది గడపల తనదు
ప్రాభవం బెడలించి బాధఁబెట్టించె
[5-127

గడ్డబడు
గడ్డబడి యీఁత కాండ్లేటిగాని
వొడ్డునడుమ నీఁదనోప రెవ్వరును
[5-133

గడ్డము వట్టి వేఁడుకొను
గక్కన నాతనిగని గడ్డమువట్టి వేఁడుక
చెక్కు నొక్కినపుడుగా చింతలెల్లబాసును
[17-598

గడ్డాయము
చెనకి గడ్డాయముగాఁ జేసిన బావలెల్ల
అనువుగా నడపఁగ నల్లాడఁబడెనా
[16-2-63

గడి చీటి
బడలికె వాపవు పరమేదో చూపవు
గడిచీటియును నీవు కలియుగమా
[11-3-52

గడి చీటిచ్చు
కర్మకోట్లకు గడి చీటిచ్చెను
నిర్మలమతులకు నేఁ డిపుడే
[11-2-43

**గడి దాటు**
వొడిగట్టుకొనిన వుభయకర్మములు
గడి దాటినపుడె కైవల్యము
[9-287

**గడి దొంగ**
దొంగను నాతోడి దొంగలు మీరు
దొంగిలుడని గుడిదొంగయై శౌరి
[అ. మ. క. 767

**గడియ**
కందువ రతికేళికి గడియనేఁ బెట్టితేను
[14-230

**గడియించు**
యేమేమి సేసి వచ్చినా యింటికి వచ్చేసితివి
కామించి కన్నులజూచె కాంత నీ మోము
గామిడి చెలువెంతేసి గడియించి చెప్పినాను
ఆముకొనవలచి నీ కలుగునాతకె
[14-56

**గడిరాజు బదుకు**
గడిరాజు బదుకాయ కడలేని మనసు
నడివీది పెసరాయ నయమైన మనసు
[11-3-125

**గడిపోతు**
ల్లంగటిగించి వత్తెద నిబన్యె
గడివోతది వెంకటేశ్వరా
[శృం. వృ. వ. క. 35

**గడుసుఁదనము**
కడలేని మగవాని కాతరము జాడిట్టిదే
గడుసుఁదనా నింతెఁగాకు నేయఁజూచును
[14-173

**గడెవెట్టు**
ఏలమ్మమ్మ రట్టు సేసే వింతటిలోనే పెను
వేలనే గడివెట్టితి వెళ్ళనియ్య నిన్ను
[13-30

**గతుగతుకు**
యీవల వానగురిసి యేరెంత బంటివారినా
కావరపు జీవునకు గతుగతుకే
[6-33

**గతచను**
గత చన్నవేదాలు కమలజునకు విచ్చి
అతవి కరుణచేత నన్నియుఁ గని
[5-104

**గతిమాలు**
ఈ మేను తిరువేంకటేశుఁ జేరకపోయి
కామాంధుఁడై మిగుల గతిమాలఁ బ్రాణి
[5-101

**గదరుకొను**
కెల్లురేఁగియాడనో తా గిజగిజయై వచ్చి
కల్లగడె చూడఁబోతె గదరు కొనీని
[17-248

**గద్దరి**
పొలించి ముగ్ధవుగాఁగ పొదిగీఁగా కాతఁడు
అలరిగద్దరివై తే నాయాలు సోకించదా
[14-100

**గద్దరీఁడు**
వద్దురా మరఁగు నాతో వనిత నెందుదాచితి
గద్దరీఁడ నాలోనిఁ కెల్లఁ బాపరా
[17-217

**గద్దెపేఁట**
కొలనిచెంగటి పువ్వు గొమ్మ చందమునఁ
గొలని చక్కటిఁ బాదుకొని గద్దెపేఁట
[అ. మ. క. 546

**గనమగు**
వెగ్గళించెఁ బులకలు వేడుకలు గనమాయ
[13-253

**గనము**
సొంపుల నీ యిచ్చకాలు చుక్కలకంటె
గనము
[15-89

1. విన్నవించే నేఁటికి విచారము వేఁటికి
విన్నటినుండియు నాన నీకంటె గనము
2. తగ్గని మోహము నీ చిత్తముకంటె
గనము
3. చిత్తిణి కోరికల నీ జిగికంటె గనము
4. మితిమీరెయందు నీమేలుకంటెగనము
[15-250

గర్వితనము
గర్వితనములుగాదు కాఁగిలించివట్టి నిన్ను
తబ్బిబ్బు గాకుండ రతిఁ దానిపేనంటా
[14-111

గర్వియగు
పుబ్బి సముద్రమువలె నున్న
నీ ప్రకృతియందు
గబ్బినై యీఁదుచున్నాఁడఁ గలఁగకుమీ
[8-231

గరగరతలు
గరగరత లన్నియును కలసినందాఁకా
విరసంబు లన్నియును వినుగునందాఁకా
[5-152

గరగరిక
సరిలేని తమకాన జలకేళి సేసేవు
అరి శ్రీ వెంకటేశుఁ డంటీనంటా
గరగరికల నిన్నుఁ గలసె నాతఁడిట్టె
అరయఁగ నంటుముట్టు లవి దీరెఁగదవే
[15-57

నెరవుగ శ్రీవిష్ణుభక్తి నిలుకడైన మరికదా
గరగరికలానె శ్రీవెంకటనాథునిఁ జేరుటా
[16-1-4

గరడిలో చెట్లు
తలచకున్నా భోగాలు తనువుతోఁ బెనఁగీని
చెలరేఁగి గరడిలో జెట్లువలె
[7-97

గరిడి
చిగురుమోవి మాటలచే కత్తులసంతల
దగిలి నీపై నాపె దండవెట్టీని
నగుతాశ్రీవెంకటేశ వంటున నీవుగూడితివి
అగవడి నీ గరిడి నన్నిటా మించినది
[14-149

గరిమె
గరిమెలఁ బాణిగ్రహణము సేసిన
సిరుల చెలులఁ గలసేనంటే
[11-19

గరివడు
తెలిసియుఁ దెలియును తెగదీచిక్కేమిటాను
కలకాలమిందుననే గరివడె బ్రదుకు
[9-109

తంచపు భోగపుగాఁత గరివడీ నీ యాత్మ
యెంచి విజ్ఞానమెన్నఁ డెరిగీనో యాత్మ
[11-151

తిరువేంకటాద్రిపై దేవునిఁ గొలువక
గరివడే (?) భవమెల్ల కర్మశేషం
[11-3-47

మూలనున్న నిట్టూర్పుముంగిటనేలవేసేవే
గాలిగొట్టై యధరము గరివడీని
[13-44

కన్నుల నీచూపులకే గరివడఁ బులకించె
[14-192

చేకొనివాడవా శ్రీవెంకటేశుఁడవు
కాకుసేయఁబోతేను గరివడును
[14-280

గరివి
ముంపునేగరివినైనా మొదల వినయివాఁడు
పెంపునఁ దానెవచ్చి బిల్వరే వాని
[17-88

గరిశించు
ఏమిసేసేరో తాము యిద్దరము నేకము
కామించి తామెంత నన్ను గరిశించేరు
[14-14

గరిసించు
ఏఁటికింకా నీ విభునేల దూరేవే
గాఁటపు మదమునను గరిసించ నేఁటికే
[13-172

కన్నుల జంకెనలతో గరిసించి యడిగేవు
అన్నివాట్లకు గురియాపోనీవూ
[16-2-78

ఇంత యెరఁగని యట్టి యెడ్డనా నేను
కాంతుఁడ నీవంతేసి గరిసించ నేఁటికి
[17-452

గరుడపచ్చఁ బూస
కాంతులమూఁడులోకాలగరుడపచ్చఁబూస
చెంతల మాలో నున్న చిన్నికృష్ణుఁడు
[9-288

గరుపారు
మందలించియాడేడ మదుగులుచొచ్చితివో
యిందునీమైగరుపారె నిటువలె గలదా
[17-332

గరుపాఱు
అరిదండధరుని పాదాంబుజాతములఁ
గరిమర్ధివ్రాలిమై గరుపాఱ నిలిచి
[వ. యో. వి. 7-1264

గటివంకబొమలు
గటివంక బొమలు నిక్కంగ సంపంగి
నెఱితావి నెరయంగ నిట్టూర్పు లిడుచు
[వ. యో. వి. 2-191

గలితిరి
ఇంచుకంతా నెరఁగరు యేఁటిదేమీరు
మంచివారు గలితిరి మానరుగా చెలులు
[17-211

గలితేను
పదిలమై వేంకటపతి భక్తి గలితేను
తుదిపదంబునకెల్లఁ దొడ్డ వవునపుడే
[5-20

గల్లా (=గలిగిననూ)
తగుమాటవేమిగల్లా దవ్వులఁజెప్పదుగాని
అగడయ్యా నీవు నన్ను నన్ను నంత
దగ్గరకురా
[15-130

గత్తే (ఉంటే)
సుద్దుల నీకు లోనయ్యా చుట్టముగ
జేసుకో యిఁక
తిద్దుకొనేవారు గత్తే తెరీఁ దగవులు
[14-223

గవుక పుచ్చుకొను
బంతిఁగట్టి నురిపేటి వసురము లెడనెడఁ
బొంతనొక్కొక్క గవుక పుచ్చుకొన్నట్టు
[10-201

గ్రహబలిమి
కనుఁగొను నీ విగ్రహమే గ్రహ
బలిమిదే నాకు
విను నీ దాసుల సేవే వెనుబలిమిదే నాకు
[6-109

## గా

గాఁటము
గాఁటాన నన్నుఁ జూచేల కడుఁ దలవంచేవు
[15-264

గాఁడిపారు
అక్కడనవ్వినవ్వు ఆయమెల్లగాఁడిపారి
చొక్కుచు నిన్నుఁ దప్పక చూడ దిదీ
[17-33

గాటాన దొరనను
నీటునలోకములెల్లా నీవేయేలుచుండఁగాను
గాటాన దొరనంటా గర్వింతు నేను
[7-70

గాడపు టిల్లు
ఆడియు నాడని అరమాటలె నీ
కాడనె చిరునగపై వెడలె
గాడపు టింటికి కట్టల కట్టిన
వేడుక నలుగుల వెళ్ళినయట్లూ
[15-29

గాడికట్టు కూటము
జూదనింతులకు మోవి చవులేల చూపేనే
గాడిఁగట్టు కూటముల కతలకాఁడు
[13-149

**గాడిని కట్టు**
కాలమెల్లావిషయాల గాడినె కట్టుండఁగాను
ఆలించి నీ సేవ నేసే దది యెన్నఁడయ్యా
[16–1–36

**గాదిలి**
పాదమున నేనిట్టే బయలు చిమ్మిన నీవు
వాదుకు వచ్చేవేమో వనితా
యీ దెసనించి చూచితె నిటువంటిబయలెనా
గాదిలి నడుమవుత కానవా నీవు
[15–43

**గాదెఁబోయు**
మనసు చీఁకట్ల నీ మదనతాపపు జింత
కనుఁగవలెపో గాదెఁ బోసేని
[12–280

**గాదెఁబోసిన కొలుచు**
గాదెఁబోసిన కొలుచు కర్మసంసారంబు
వేదువిడువని కూడు వెడమాయ బదుకు
[11–3–116

**గాదెఁ బోసుకొను**
షోవల నాలోని భక్తిచూచిన్ చే నంటివా
కావలసి నీవెంత గాదెఁ బోసుకొంటివో
[16–1–34

కన్నునన్నలు నాకేఁ గాదెఁబోసుకుండితివా
వన్ని పైఁడియము లిన్నీఁ బారవేసేవా
[17–499

**గాదెల కొలుచు**
గాదెల కొలుచువో నీ గాథలు
ఆదెస పీదెన నేమంత కోపఁగలమా
[15–116

**గాదెల కొల్చు**
అమృతమథనుమహిమదెమాగాదెలకొల్చు
విమతదైత్యారి యావేశమే భయహరము
[10–51

**గాబువలె పెరుగు**
ఏబలిమినమ్మి వెరపెరఁగరు దేహులాల
గాబువలెఁ బెరిగేరు కాలము మీచుట్టమా
[10–28

**గామిడి**
గోమునహేయపు గుండకూడు నించితినట
గామిడినే గారే తిత్తిఁగానోపనా
[5–111

యిక్కవకుఁ జేయిచాఁచీ నేడనెనా
దొంది చాచీ
యెక్కుడుగామిడిగాదె యీ బాలకృష్ణుడు
[17–141

ఆముకొని యింతవేసి ఆసలకుఁబెనఁగితే
గామిడి యెవ్వతెయైనా గలిగీలేదే
[17–202
[ఉభయలింగానికి ఉదాహరణ]

**గామిడితను**
కోమలపు చేయిచాఁచీ కొత్తపెండ్లికొడుకు
గామిడితనాల నన్నుఁ గాశలువేచీని
[17–162

**గామిడితనము**
నీ మనసాపె యెరుఁగు నిక్కముగాను
గామిడితనానఁగాని కలుగదు వలపు
[14–52

**గామిడి తొండ**
నిడుసాగిలఁగ నెట్లు నెట్లు వడంగ
మెడవట్టి ద్రొబ్బి గామిటి తొండయనుచు
[ప. యో. వి. 4–818

**గామిడి మాయ**
గామిడిమాయే కర్త యిందుకును
సోమరి మమ్మంటఁ జోచేది
[10–254

**గాముల మోఁచిన గంప**
పాము చెలిమి రంపపు సంసారము
గాముల మోఁచిన గంప యిది
[5–122

గాముల యిల్లు
గాముల యింటనే కాఁప నయితినట
పాముపుట్టనుండియైన బతుకలేనా
[5-111

గాములిల్లు
గాములిల్లు పుట్టమీఁది కప్పతోలు పైకొప్పు
నేమాయెఱుఁగము నిపుణులాల
[5-102

గాముల గాచుకయుండు
గాములు గాచుకయుండే గాలితెరువు
యేమిటా నెక్కడవుత నెఱుఁగని తెరువు
[5-147

గాములువారు
గాములు వారెడిపొద్దు కావలికాండ్లాల
జాముజాము దిరుగరో జాలో జాలి
[10-166

గాయగండివాఁడు
సేయరాని చేఁతలెల్లాఁ జేసితి నేను నీ
గా (కా?) య గంటివాఁడ నేను
గతి చూపవయ్యా
[9-22

గాయగంట్లు
చిత్తమెక్కడనో పెట్టి చేరినాతో మాయలకు
బత్తిగల వానివలె వలికే విదే
హత్తిగాయగంట్లెకాని అంతేసికారరు
యిత్తల నెట్టు వూఁకొందు నిట్టినవ్వేఁగాన
[17-358

గారబము
కోరి యాపె నన్ను నిట్టె కూడి కెంగేలు
పట్టఁగా
గారబానఁ గంకణము కట్టేవు నీవూ
[18-508

గాలికి ఓరుచు
తప్పక చూడఁగవచ్చు తలవంచు కానవచ్చు
అప్పుడు గాలికోరి చేరరుదుగాని
[15-240
[దెబ్బకు తట్టుకొను అనే అర్థం. 'గాలి గొను' అనే రూపానికే సూ. ని. లో ప్రయోగం ఉంది]

గాలిగొట్టు
మోలనున్న నిట్టూర్పు ముంగిటనేలవేసేవే
గాలిగొట్టై యధరముగ గడివడేని
[13-44

గాలిచాప
కడుఁజంచలములనే గాలి చాప లెత్తినాఁడ
వెడమాయపు సరకు వెలకియ్యరో
[9-35

గాలి దాగువాఁడు
పాలవారియింటి పిన్నపాపఁడై తిరిగినాఁడు
గాలిదాగువానిమీఁదఁ గాలుసాఁచినాఁడు
[4-156

గాలినె పోవు
బాలనాఁటి పుట్టుగిది భ్రమయో నిజమో
గాలినెకాలముఁబోయ కతలాయను
[11-112

గాలినే పోవు
గాలినేపోయెఁ గలకాలము
తాలిమికి గొంతయుఁ బ్రొద్దులేదు
[5-14

గాలిఁ బుచ్చు
కాకరిమతములెల్ల గాలిఁ బుచ్చి పరమిచ్చె
పైకొనఁగఁ గరుణించె భాష్యకారులు
[5-104

గాలిఁబోవు
ఘన మోహపాశముల గాలిఁబొయ్యేడి నాకు
కొనల నీపాదచెంత కొమ్మయే దిక్కు
[6-146

గాలిఁబోయే మాటలు లోకములోని
సుద్దులెల్లా
గాలిఁబో వెన్నఁడును శ్రీకాంతు నుతులు
[7-8

ఈతఁడు నరకువడఁ డీతఁ డగ్నిఁ గాలఁడు
యీతఁడు నీట మునుఁగఁ డీతఁడు
గాలిబోఁడు
[7-185

ఇట్టి ప్రతాపము గల యీతని దాసులనెల్ల
కట్టు నా కర్మములెల్ల గాలిఁబోవుఁగాక
[8-1

కేవలుఁ డచ్యుతునొద్దఁ గీడు చూవఁగలవా
కావరమై తాఁదానె గాలిఁబోవుఁగాక
[8-1

కోరియీశ్రీవెంక టేశుఁగొలిచితిమిదివో
కారుకొన్న వగలెల్ల గాలిఁ బోవుఁగాక
[8-1

అలకించియహంబ్రహ్మమనెడిబుద్ధులచేత
గాలిఁబోయ భక్తి యల్లకాలమందే
[8-68

నాలుకనుమించి హరినామమొక టుండగా
గాలిఁబోయెటి పూర గాథలేల
[8-187

తాలిమిలో హరిదలచక యెఱుకెల్ల
గాలిఁబోవుట పూర్వ కర్మశేషం
[11-3-47

వెలయఁగఁ గోప మొక వీసమంతఁ
దోఁచినాను
కలిగిన ముదమెల్లా గాలిఁబోయీని
[12-34

గాలి ముడియఁగఁగట్టి కలుగుడి కట్టు
గాలి ముడియగఁగట్టి కలుగుదిగట్టు యోగి
నాలిమింటి విత్తువెట్టి నగు నొక యోగి
[6-125

గాలిమూఁట
వుడివోనిపరిమళము లోకనిమిషమాత్రమే
బెడిదంపు భ్రమతోడి పెనుగాలిమూఁట
[5-311

గాలిమూఁటఁ జిక్కితిమి కన్నచోటే
తొక్కితిమి
ఆలించి యేమిటి వారమయ్యేమో కాని
[9-243

గాలి యూవటించుకొను
గాలి యూవటించుకొని కాలము కడపేను
వోలిఁ బుణ్యపాపమందు వోహో నేను
[7-279

గావువట్టు
ఏవంకఁజూచినా యిట్లనే ధర్మంబు
గావు వట్టితివిగా కలికాలమా
[11-2-77

గాసిచేయు
ఏలమమ్ముగాసి సేసేరింకా మీరు
కాలముతో నిలిచెను కైవల్యపదవి
[6-145

గాసిఁబడు
ఉన్నతోన్నత బుద్ధి నొనగూర్పకది దేహి
కన్నచోటికిఁ బఱపి గాసిఁబడెఁ బ్రాణి
[5-101

యీసుల నొఁకటి (లిః) విషమేమైనాఁ
దినిపించె
గాసిఁబడె జీవుఁడిదె కన్నవారిచేతను
[8-64

వాసుల సంసారమున వలఁబెద్దీ నీమాయ
గాసిఁబడి యిఁకనెట్టు గడచే నీ మాయ
[10-67

గాసిఁబెట్టు
కటాకటా దేహంబు గాసిఁబెట్టఁగ వలసె
నిటువంటి దేసలచే నిట్లుండవలసె
[5-120

ఆశాబద్ధుఁడవై యలసి నిన్నుఁ గడు
గాసిఁబెట్టిన వాఁడఁగాను
[5-117

వేసరితిమెట్ల నీవెంటఁ దిరిగి
గాసిఁబెట్టక మమ్ముఁ గావరాదా
[5-134

అనకమై వైరాగ్యమంట దలవాటులేక
కానఁబడు కర్మములు గాసిఁబెట్టఁగాను
[10–257

గాసిఁబెట్టకునన్ను యేకతములు మానునాతో
నీసటలకింతేసికల్లా నే వోపెనా
[18–39

# గి

గింజియాడు
జయకామఁ దలుగులు జళిపించిమ్ము
క్రియఁ గరచరణములే గింజి యాడుచును
[అ. మ. క. 659

గిజిగిజియగు
కెల్లురేఁగి యాడనోలే గిజిగిజిగిమై వచ్చి
కల్లగదె చూడఁబోతే గదరుకొనీని
[17–248

గిజ్జడియగు
చెదరిన మెదదు గిజ్జడియైన తొడలు
చిడిసిన కాయము సిందువందైన
[ఉ. క. 1727

గిజ్జడిగొను
చుక్కలు మోవిఁ బొడమె
చూపులఁ గెంపుదడమె
కిక్కిరించిన కళలు గిజ్జడిగొనె
[18–389

గిడివిళ్ళు
కిన్నెర మంటఁగాను గిడివిళ్ల వాయింతురా
వన్నె నీవు సుతిగూడి పాడుట గాక
[18–416

గిరవు
పొరిఁగన్నీటివఅదఁ బోకవచ్చెఁగాకాచూపు
గిరవై చింతలమునిఁగిన వేళను
[15–52

గిలిగించు
కాయము గిలిగించఁగ గక్కున
నవ్వులు వుట్టె
[14–159

నవ్వుతా నే నుండఁగానె నంట నగిలించేవు
అవ్వల నీకింకా నెంత ఆసోదమోయి
[15–225

గిలుకొట్టు
నెలకొన్న నేతులును నితరంపుచక్కెరలు
గిలుకొట్టుచును నారగించవయ్యా
[5–80

వెలయ నీ విఱిచిన విల్లువంటిదిగాదు
విలసిల్లు నా బొమ్మల విండ్లుగాని
చెలఁగి తపసుచేసే చిత్రకూట గిరికాచు
గిలుకొట్టు నాకు చాగిరిలు కాని
[13–119

# గు

గుంగిలి
గుంగిలినరసాలకు కొంతైనా మరఁగువద్దా
సంగతిగాదని నీతో సన్ననేసే నదివూ
[14–102

గుంజిళ్ళు బెట్టి
కోలగగెరఁ వ్రాసి గుంజిళ్ళఁబెట్టి
పైల్వావు దొరుగంగ బడిపెట్టు పెట్టి
[అ. చ. 115

గుండు గూలి విరుగు
కొండవంటి రథమదె కొనపైఁడికుండలవే
గుండుగూలివిరుగరో గొబ్బునదై తేయులు
[7–253

గుండె దిగులు
ఒఱపైన జడవిరహాల వెన్నుతరటు
కొఱనవ్వు వర భుజంగుల గుండెదిగులు
[వ. యో. వి. 4–196

గుండె రాయి వేసుకొను
వండవండనట్లాయె వలచిన వలపెల్ల
గుండెరాయికొంచెఁ గొసర నేమున్నది
[14–50

గుండెలు గోసిపెట్టు
(మారుచేఁ?)తులియవద్దు మారుగాళ్లి యవద్దు
బీర(రాఁ?)న గుండెలు గోసి పెట్టవద్దు
[11–2–62

గుండెలోని అమ్మ
తలి నీ మనసును దలఁచినట్లుండు
గుటిగానదివో నాకు గుండెలో అమ్మ
[17–247

గుంతదోషము
బూ(పూ?)తకి జంపిన వాఁడే
బూతకి వాకటు రక్ష
పాతాళానఁగూర్మమైన పతిగుంత దోషరక్ష
[10–54

గుంతఁబడు
అంతా నొక్కటియనే అధర్మవిధులచేత
గుంతఁబడెఁ బుణ్యమెల్లా గొల్లఁబోయి
[8–68

గుంతలగు
బంతినేమీరిద్దరును పాదుగాఁ గూచుండేరు
గుంతలయ్యీఁ బరపెల్లాఁ గూడేటిపొద్దు
[14–176

గుంపించు
కోరిక కోరిక నీవు గుంపించి వేసేదేమి
[14–235

గుంపెన
అంవక అంపిన అంగన కానికె
ముంపు కంచములు మొనమూపే
గంపెనతో నిఁక కూరిమి గొసరము
పెంపు విరహమె పెనగొసఁ గాని
[17–100

కోపము మానుము గుంపెన లుడుగుము
తీపుల పెప్పెఁ దెగఁ దకఁడు
[17–456

గుంపెనలాడు
ఊరకుండవుగా ఓసి మాయ నిన్నుఁ
చేరఁబిలువము గుంపెన లాడేవు
[11–3–41

గుక్కిళ్లు కొలుచు
మనసునఁ దాగేపాలు మరి లెక్క పెట్టనేల
గొనకొని గుక్కిళ్లు కొలవనేల
[18–287

గుక్కిళ్లు మింగించు
వొక్కటేపదార్థము వూరివారెల్లాఁ జూచిరే
గుక్కిళ్లు మింగించి యాన కొలుపుచుండ
[7–119

గుక్కిళ్లు మింగు
కోరి మోవితేనెలంటే గుక్కిళ్లు మింగనేల
[15–104

వొక్కటెపైక తీపై వుండెటి విభునిఁజూచి
గుక్కిళ్లమింగే దాని గుణమేఁటి గుణమే
[17–297

గుక్కుమిక్కను
దొక్కలు చెరబారి డుక్కలు దూరి
గుక్కు మిక్కనుచు దగ్గుతి కల్వడగ
[ఉ. క. 939

గుగ్గిలి పదను
భగ్గుభగిల్లని పరమామృతము
గుగ్గిలిపదనుగఁ గురియఁగను
[12–57

గుగ్గిల పదునుగానిచ్చు
ఉలివచ్చియై యుండనొక యింతయూరి
వలకెక్కి గుగ్గిల పదునుగానిచ్చి
[వ. యో. వి. 4–78

గుగురు
గుగురుఁజిగురునకు కుత్తికె కోవిలఁజూపు
పొగరు చంద్రపు మోము
పున్నమ మారుతుఁ జూపు
[15–82

**గుజ్జనఁ గూడు**
గుజ్జనఁగూడు వండెనె కోమలి నేఁడు
గొజ్జువెన్నెల బాయిటఁ గొమ్మలుఁ దాను
[సు. శ.

**గుజ్జన గూళ్లు**
వరుస గుజ్జనగూళ్లు వండుదమనుచు
నరవిరి దాసనం బనలంబుగాఁగ
[ప. యో. వి. 5–603

కొమ్మలతోఁగూడ గుజ్జనగూళ్లు
ఆ మగువ వడ్డించ హర్షించ దొకొ్క
[సు. శ. 734

**గుట్టుచెడు**
బెట్టిమాఁటలాడి నీవు విరిదూరిఁగాను
గుట్టుచెడ నెవ్వతై నాఁ గోపించకుండునా
[16–2–77

**గుట్టువాఁడు**
గుట్టువాఁడవంటూఁ గొసరితి
యిట్టినోవం చేది యెఱఁగముగ
[15–13

**గుట్టుసేసుకొను**
యిప్పుడే శ్రీ వెంకటేశ యేలితి నన్ను నీ
కొప్పు ముడవఁగా నెట్టో గుట్టు
సేసుకోవయ్యా
[18–258

**గుడికొను**
గుడికొనియితరపు గోమయ మేశుద్ధిమాయ
అదరి మానుష ధర్మ మతి హేయమాయ
[10–81

తొడఁగి పొగడించను దూషించ
ముఖ్యు లెవ్వరా
గుడిగొన్న తనలోని గుణాలే కాక
[6–174

**గుడిగొను**
కడుపులో లోకములు కడుజయ పెట్టగాను
గుడిగొనె వీ బ్రదుకు గోవిందరాజే
[7–130

పొడమిన జగములు పుట్టెడి జగములు
గుడిగొనె మీ రోమకూపముల
[8–116

వుదుపైనయింద్రియాలనొడిసివంచుకొనుట
గుడిగొన్న తనలో కోరెకె లుడుగుట
[8–212

గుడిగొన రాకాసాలుఁ గొట్టినది వలకేలు
పొడసూపీఁ గలశాపుర హనుమంతుఁడు
[11–211

అడవిలోనిసింహమును అట్టిచేఁతబట్టితేను
గుడిగొన నాయకునిఁ గొసరానేవే
[13–172

కడఁగిన శ్రీ వేంకట విభుఁడా నీ
గుడికొను కౌఁగిటఁ గూడితిని
[18–57

**గుడిచుట్టి వానిచొచ్చుట**
నెట్టననీవు నన్నాడే నిందలెల్లాఁ దప్పదని
చుట్టి మరఁ గుడి వాని చొచ్చి వెళ్ళేవా
[13–181

**గుడివడు**
ఎడపక మరుఁడు సౌమేఘపుల్వఅప
గుడివడు శిత ఖడ్గ కోదండమనఁగ
[అ. మ. శ. 2233

**గుడుసువడు**
ఎడమపురివెట్టె వరహిత వివేకములోన
గుడుసువడెఁ జదువు మెరుఁగులు
వారెఁ జలము
[11–3–103

**గుణమంతుడు**
ఎట్టుసేసిన నాతని నేమీ ననకురమ్మ
గుట్టుసేసుకుండితేను గుణమంతు డౌనె
[17–89

**గుత్త**
యిట్టె సేసవెట్టి నీవు యేమరేవా నీ వసులు
బిట్టగుత్తపైన వారు ఫల మందకుందురా
[14–184

గుదిగుచ్చు
విదుర కమ్ములతోడ నిన్ను గొంత
చూడఁగాను
గుదిగుచ్చి కుమ్మరించే కోపమనేవు
[14–108

గుదిగొను
అదివో చూడరో అందరు మొక్కరో
గుదిగొనె బ్రహ్మము కోనేటిదరిని
[7–264

కదిసిన రుద్రుని గర్వమడఁచితివి
గుదిగొని దివిజులు కొలుచుట యెట్టు
[8–236

గుదిగొను కనరుల కులగిరులూఁటాడ
వుదయించె నదివొ వుగ్రసింహము
[8–239

పదివేల శిరసుల బలు నరసింహము
గుదిగొన్న చేతుల గురుతై నది
[11–13

అదెచూడరయ్యా పెద్ద హనుమంతుని
గుదిగొనె దేవతలు గొనియాడేరయ్యా
[11–214

గుదిగొను హరిభక్తుల కోట్లలో
వెదకు నొకఁడు శ్రీ వేంకటపతి
[11–2–3

గుదిగ్రుచ్చు
గుదిగ్రుచ్చినట్లు తగులై
వదము తుదిన్ మఱియు
మఱియుఁ బల్లవియలరున్
[సం. ల. 30

గుద్దిరము
యిద్దరమె కతమాడె యీవేళ మనవద్ద
గుద్దిరాన నాపె విచ్చి కూచున్నది
[15–4

కడవారు వచ్చేది కానవు గాక
గొడవల మమ్ముఁజూచి గుద్దిరము వేఁటికే
[17–297

గుబ్బతిల్లె తమలోని గుద్దిరా లింతేకాక
గొబ్బున నీడకు వచ్చి కొంగువట్టగలదా
[17–402

గుదులు గుచ్చు
కొరవించి వలపుగుదులు గుచ్చినవాఁడవై
వరమున నిహమునఁ బాయవు నీ విపుడు
[14–38

గునియు
గునియుచుఁ దను నెత్తుకొమ్మని తల్లిపై
నెనయఁ జాఁచిన చేతు లివియపో
[5–108

గునిసి యాడు
గోవింద హరిగోవింద గునిసి
యాడుదం బిటురారో
అవటించి మనమెట్టు గడచెదము
ఆశ్చరియం బిది హరిమాయ
[8–109

గునుకుచు పారు
గోవిందుడు దాడివచ్చె గునుకుచుఁ బారరో
కావుమని మెడలఁ బాగలు వేయరో
[7–11

గుప్పన నూఁదు
కేలి దండములు వాకిలి నడ్డగించి
నేల గుప్పన నూఁది నిలు నిలుండనుచు
[వ. యో. వి. 3–905

గుబ్బతిల్లు
గుబ్బతిల్లె తమలోని గుద్దిరా లింతేకాక
గొబ్బున నీడకు వచ్చి కొంగు వట్టగలదా
[17–402

గుమ్మలాడు
గోవులచన్నులనోర గుమ్మలాడిన నీమోవి
యీవల మాకియ్యఁగాను యెంగిలనేమా
[13–92

గుమిగట్టు
గుట్టువేఁచెమదనుఁడుగుమిగట్టెఁ గోరికలు
[14–122

గుమితము
చెమటలుగార సిరిసింగ నవతియాడ
గుమితానవీఁడెయమ్మా గోపాలకృష్ణుఁడు
[10–172

గుమితనింతసేసి కూడుదువు నన్ను నని
అమరఁ గలలుగని వల్లనాడె
[15–194

గుమీతానరేపుమాపుఁ గోసి రాపించఁగనేల
నముకాన దాని నన్ను జగడించ విడువరా
[17–227

గురుగు
గోమున సేవంతిపువ్వు గురుగుల లోపల
యేమరకపూఁదేనె నెసరువెట్టి...
[16–2–101
[సూ. ని. లో భక్ష్యవిశేషము అనే అర్థం ఇచ్చారు. (ప్రమాణం, ప్రబంధ - 112) అయితే బ్రౌను చెప్పిన 'చిన్నగిన్నె' అనే అర్థాన్ని విస్మరించారు. ఇప్పుడీ ఆరోపం ఆ అర్థాన్ని చెప్తుంది]

గురుతుపెట్టు
కొంకక ఆడినమాట గురుతుపెట్టఁగలేము
లంకె వేదవాక్యము దలఁచఁగలమా
[9–260

గురుమ
వొంటి నే నుండగాను వొడివట్టి పెనఁగేవు
కంటిఁగంటి గురుమ కతలేల
[15–231

గురు వూళిగకాఁడు
జపితఁగాను శాస్త్రిగాను
వుపదేశపు గురువూళిగకాఁడ
[10–212

గుటిసేసుకొను
నీటున శ్రీవెంకటేశ నీ వేలితి వింతలోన
కూటపు రతులు నీకు గుటి సేసుకున్నది
[18–286

గులిమి కొలుచు
గులిమికొలుచుదీరఁ గుదువనియ్యక కొత్త
కొలుచు మీఁద మీఁదఁ గొలవఁగా
[5–110

గుల్నా చేయు (?)
మించు మురిపాలె కావా
మిగులం జొక్కించేవి
కొంచని బీరాలె కావా గుల్నా సేసేవి
[3–132

## గూ

గూఁటఁ బడి వెడలు
ఏఁటివిజ్ఞాన మేఁటి చదువు
గూఁటఁబడి వెడలుగతి గురుతు గనలేదు
[11–3–11

గూఁటఁబడు
గూఁటఁబడే పదవులు గోరేటిజీవుఁడు
కూటువైన నిజముక్తి గోరది (డి?) ది
యేఁటికే
[10–204

గూఁటవేయు
కోరియంతలోగురుఁడు గూఁటవేసె మనసు
ఓరుపుతో నీపాలి కొప్పగించె మనసు
[11–40

గూళెము
కోలచేఁ బనులగాచె గోవిందుఁడు
కూలగుమ్మెఁ గంసుని గోవిందుఁడు
గోలమై వేఁగొండెత్తె గోవిందుఁడు
గూళెపు నతులదెచ్చె గోవిందుఁడు
[15–257

## గె

గెంటు

నంటుమీఱి సెలవుల నవ్వువేల వుమినేవే
గెంటువేని కన్నులను కెంపువ్వే?
[13-44

గెంటులేని ఆచారము

అరుదుగగెంటులేని ఆచారదంతుఁడఁగాను
హరి నీకరుణ నాపై నంటుపెట్లయ్యా
[8-181

## గొ

గొంజెగోడుగు

వింజామరలును విసనకఱ్ఱలును
గొంజెగొడుగులే కొండెల్లా
[11-3-53

గొంట

గొంటపై శ్రీవెంకటేశ కూడితివినన్నునిట్టె
దంటతనమాన నవి తలచుకో నీవు
[17-11

గొంటరి

ఇంటికి రావివాఁడవు యేడనైనా నవ్వనేల
వెంటనే మాతో తగ్గులు విడువరాదు
గొంటరై యిందుకు నాపె
కోపగించినాఁ గోపించీ
[13-45

గొంటరియాపె దానె చిగురువంటి నీమోవి
అంటె యింతసేసె నెంత అగ్గలికాని
[16-2-86

అంటిముట్టె యిందుకెల్ల నాతఁడు
కాఁగానె కాక
గొంటరి చెలులకైనఁ గోపమురాదా
[17-236

గొంది

ఇందరి బుద్దులు యీశ్వరేచ్ఛకు సరిరావు
గొందినున్న మానుషము కోలుపడెంతైనా
[6-94

అందుకే వేగిరమయ్యి నప్పటినుండి
గొందికిట్టే రాఁడు సుమ్మీ కొంకు
విడిపింతును
[13-6

గొందిఁ జిక్కు

గొందిఁ జిక్కె నరకాలు కోపముఁ
బాపముఁ బాసె
యిందునందు శ్రీ వెంకటేశుఁడే మిగిలెను
[10-221

గొందిఁదోయు

కుందని శ్రీ వెంకటాద్రి గోవిందుఁడు
గొందిఁదోసె నసురుల గోవిందుఁడు
[15-257

గొంది నిముడుకొను

సందడించి తమవంటి శరణాగతులుఁదాము
గొంది నిముడుకొందురు గురుకృపజనులు
[9-70

గొందినున్న స్వర్గము

గొందినున్న స్వర్గముగోరి పుణ్యము
సేయును
యెందో తనవ్రాఁత ఫల మెరఁగడు
[8-206

గొందులుఁ దరిబడె

గొందులుఁ దరిబడె శాంతము
కొంచెంబాయె వివేకము
మందుకు వెదకినఁ గానము
మంచితనంపుఁ బనులు
[5-63

గొందులు సందులు

దురిత విధులు గొందుల సందులఁ బడి
ధరలోపల నెందరు చనరిట్లా
[5-163

గొట్లు
తలపోయ నీతుమ్మెదలు గూడగొట్లు
మలయమారుతము ద్రిమ్మరి దిప్పకొయ
[వ. యో. వి. 5-1387

గొడవకూటమి
యెడయక తిరువెంకటేశ మాపై వెరపు
గొడవకూటమి నిన్నుఁగూడిన మైమరపు
[12-149

గొడవలు వెట్టుకొను
గుఱియైనవారు నీతో గొడవలువెట్టుకొంటే
అఱిముఱి నేనేల అడ్డము వచ్చితినో
[17-568

గొడసేటి జిహ్వ
ఘనమగు కోరలు కరాళవదనము
చెనకుచు గొడసేటి జిహ్వ యను
[6-113

గొడ్డుఁ బుల్లితీగె
కొల్లలాడే బాగులు గొడ్డుఁ బుల్లితీగెల
నొల్లనొల్ల మివిడె లంగిటయ్యా మాకును
[17-344

గొడ్డువోవు
వెడ్డువెట్టికూడెనిదె వెంకటేశుఁడింతులను
గొడ్డువోని వరముల గోవిందరాజు
[12-141

గొడ్డేరు
అడ్డగించుకొంటివి నా కప్పులవాఁడ
వావ్వెరి
గొడ్డేరు నీ కొద్దిగాదు కోవము నాకు
[17-237

గొడ్డేరు తెచ్చు
బొడ్డునఁ బుట్టిన పూఁవనితే నిన్ను
గొడ్డేరు తెస్తినే కోడల
[12-312

గొరబగు
తిరమై శ్రీవెంకటాద్రి తిరుపతి లోపలను
గొరబాయ నీ బ్రదుకు గోవిందరాజే
[7-130

గొరబు
సరిఁగానుకిచ్చె కాపె సారెకుఁ జూడఁగాను
గొరబుగ నను నేల కొంగువట్టేవయ్యా
[13-161

తరవాతి చేతలెల్ల దక్కె నీకు నిందరిలో
గొరబై శ్రీ వెంకటాద్రి గోవిందరాజా
[15-174

గొరబుసేయు
చదురుల దొరవట జవ్వనినేట
అదనెఱఁగక నిను నలముదునా
కదిమి కొసరితివి గర్వినై తినని
గుదిగొని కామిని గొరబుసేతునా
[15-239

గొరిశరాయడి
ఆతురాన గొరిశరాయడికి నోపఁగలేరు
చేతిగోరు మీటితేనే భిన్నభిన్న మవుదురు
[8-186

గొరుపు
చిప్పివె నిట్టూరుపులు సిగ్గులివెగొరుపులు
యిప్పుడిట్టె యీ సతి నేమిసేసితో
[15-137

గొల్లదోమటి
కోయఁదోయఁదల్లి వెన్నతోఁ
బెట్టె ముచ్చిములు
పోయఁబోయ గొల్లదోమటాయఁ
బోమా పెరుగు
[15-73

గబ్బినై యదలించిన కన్నుల
మొక్కుచు నన్ను
గొబ్బునఁ గాఁగిలించేవు గొల్లదోమటా
[16-2-38

కమ్మియాపెపైకొరగి కమ్మటినన్నేలపట్టి
కమ్మి చిందులాడనేమి గొల్లదోమటే
[17-505

గొల్లలెక్కలు
చిల్లర చెమటలతోడ చిక్కిన
పూర్వులతోడ
గొల్లలెక్కలాడేవు కోపమేఁటికే
[15–117

గొల్లు
గొల్లెతలనంటి యంటి గొల్లు మేన
నిండె నిదే
వెల్లవిరాయఁబనులు విఠ్ఠలేశా
[17–427

## గో

గోడ కడుగు
అడకేల పిలిచేవే అప్పటి నన్ను
గోడ గడుగఁగనేల గొబ్బున రాగదవే
[17–475

గోడ గురుతు
విప్పుచుఁ జెదవులను వినయముచూపిరావే
అప్పటి గోడగురుతు నటు వ్రాసి రావే
[13–215

గోడచిత్తరువు
ఇంతవాఁడు చెనకీ నెక్కడ చూచేవే నీవు
యింతలో గోడ చిత్తరు వేమి వ్రాసేవే
[15–178

గోడనేరు
దండువెళ్ళే మదనుని దాడికి సతుల చన్ను
గొండలెక్కి సారెసారె గోడనేరయ్యె
[5–137

గోడపై సున్నము
నీడలోపల యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొదలేని యెఱుక
[11–3–38

గోడమఱఁగు
గోడమఱఁగువంటిదిగుట్టుతోడిసంసారము
వీడని కట్టువంటిది వేడుక యాస
[6–211

గోడమీఁది సున్నము
చెలువపు వినయాలు చేమకూర శైత్యాలు
కొలఁదిలేని నమపు గోడమీఁది సున్నము
[7–34

గోడలేని చిత్తరువు
జోడుగూడి నీవు నేను నాడుకొన్న
మాటలెల్లా
గోడలేని చిత్తరువులై వెంకటేశ
యాడా నా మతి బాయవురా
[13–223

గోడలేని పెనుచిత్రములు
వావిరిఁగేశవునొల్లని బదుకులు
వర తగలపు చింతపండు
గోవిందుని కటుమొక్కని మొక్కలు
గోడలేని పెను చిత్రములు
[7–1

గోడాడు
తలపోఁత ప్రాఁతె తలఁపులకుఁ దమ
కొలఁదెఱుంగ నియతి గోడాడఁగా
[5–41

గోదిలు
ఆదరించేవారితోడ నంటి పొందవలెఁగాక
గోదివేటి మగవాని కొంగువట్టవచ్చునా
[17–274

గోదు
అదిగొనిపై నొరగేవు అట్టట్టే పోతేఁ
బట్టేవు
సాదులతోనే యింత బలమా నీకు
గోదిలి సాదించేవు గొనుగొన్నవానివలె
యీదెస నీ గాతికని యింత కోపఁగలవా
[17–223

గోవాళ్లు
కాళింగుని మదమణచి దవ్వుగా
కడగడలకు బోఁజోపితివి
గోలపై యజ్ఞఫలము లిచ్చితివి
గోవాళ్లు సేసేటి పను లివియా
[8–277

గోరంటు
గగనాననుండి వచ్చే గంగాజలములైన
వాగినా గోరంటితేనే యోగ్యముగావు
[6–80

గోర
సారెకుఁబెరుగుల చెడెలూ నేఁడు మొదలు
గోరమై కోలలఁ బగులమొత్తుఁడు
[5–57

గోరఁజిమ్ము
చేపట్టఁగ గోరఁజిమ్మిన యందుకు
మోపుచు శిరసున మొక్కవె యిపుడు
[17–456

గోరనూఁదు
సుదతి తనతోనవ్వె సురటిమాటిడుకొంటి
గుదిగొని నన్నునేల గోర నూఁదినే
[18–371

గోరపడు
గోరపడి గడించేవి కోట్లకొలఁదుల
తారితూరి నోటికిఁ దగ్గంత గాదు
[9–249

గోరసేయు
పోరిపోరి నేఁజెప్పిన బుద్ధులెల్లా నీవాపె
జేరఁబోయి కానికగాఁ జెప్పకుండేవా
గోరసేసి నడుమను గోళ్లురాచి నీ వలపు
పేరడిగా జగడాలు పెంచకుండేవా
[16–2–41

చుట్టమయ్యె మటి నీవు సూడు బంటవో
గుట్టుతోడ నుండఁగానే గోరసేతురా
వలపుదబ్బాల వేసేవారు గలరా
కులమువాండ్ల నింత గోరసేయవలెనా
[17–447

గోరివాఁత
కోరికలు సమకూరె వాఁత మానవమ్మా
గారవించె నాతఁడు నీ కైవసమాయ
[17–113

గోరూఁదు
అన్నిరతులకులోనై అట్టే చొక్కించఁగాను
చన్నులేల గోరూఁదేవు సారెకు నన్ను
[14–183

గోరొత్తు
జోడుగాఁజెలియిచ్చిన సొమ్ములవలెనున్నవి
కూడినవేళ నీ మేని గోరొత్తులు
[13–164

గోరొత్తులు
విందులమోవుల యీవులు
వీఁపున నానిన కుచములు
పొందుల కొన గోరొత్తులు
పొలతికి నీ కమరె
[13–131

గోను
గొల్లవారిమాటలు గోనుఁ బువ్వవాటులు
[17–344

గోస
యీసరిశ్రీవెంకటేశుఁడిందఁగూడినమీదట
గోస నాస సేయఁబోతే కోపమేవే నీకు
[17–313

గోలతీరు
ఈతనిఁగొలిచితేనే యిన్నిగోలలునుఁ దీరు
చేతనంబెట్టు పుణ్యాలు చేరువనే కలుగు
[6–57

## ఘు

ఘటన నెదురుకొను
కటకట నన్నుఁగూడే దయ నీకు లేకుండితే
ఘటన నెదురుకొని కాఁగిలింతువా
[17-563

ఘడన గడించు
కాయము మోచితి ఘడన గడించితి
చేయారఁ బుణ్యము సేసితినా
[8-156

## ఘూ

ఘాతమాను
ఆతఁడే శ్రీవెంకటేశుం డటు మాకు మీకుఁ గర్త
ఘాతమాని యిఁక మాకు కడు గుణమియ్యరో
[9-35

## చ

చంకగుదియ
చంకగుదియ యిదే శరణార్తి నే నిదె
తెంకి నా భావము దేవుఁడే యెరుఁగు
[9-100

చంకచరిది
తిరిచి మీరిప్పుడు తెచ్చిన చంక
చరిదిలో నింత ప్రసాదింపవలయు
[వ. యో. వి. 7-316

చంకదుద్దు
పాకిరి చంకదుద్దు శరణార్తి రెండునేల
మేకొని యీమాటవింటెమెత్తురా నిన్నును
[10-203

చంగనదాఁటు
వీరధి చంగనదాఁటి నెట్టన లంక చొచ్చి
శ్రీరాము నుంగరము సీతకిచ్చి
[9-214

చంచలపడు
చంచలపడఁగవద్దు సారెసారెఁ గోరవద్దు
పొంచుకున్న దైవమే బుద్ధులు నేర్పీని
[9-47

చంచు
మంచితనములకే మగలు లోనౌదురు
వంచన చేతలకే వలతురు
చంచులఁ బాడినందుకే సతమై కరుగుదురు
అంచల నింతుల కివి అందములే చెలియా
[13-105

పొంచి వేరొక్కతె నిన్ను బొమ్మల జంకించితే
చంచులమోవిచూపి సన్నచేసేవు
[13-117

చంచుల శ్రీవెంకటేశ నన్నేరిఁగిఁకూడితివి
మించిన నీ నేరుపులు మేలయ్యా నేఁడు
[17-205

చంచు మీరు
ఇంచుకంతసిన్నది నాకెదు మాటాడెనిదే
మించి నీ నవ్విన మందె మేళమయ
వించి వొక్కవూరనె నేలెనో ఆసెలేదో
చంచుమీరియింతేసి రచ్చలకునెక్కుదుమా
[17-496

చంచుల మెరయు
యెంచఁగలోకములెల్లాయెడనెడసందులుగా
చంచులమెరసినాఁడిచ్చట హనుమంతుఁడు
[6-218

చంజుఱేఁగు
వన్నెమేనుఁ జంజుఱేఁగె వాడుమోవి గడుమాఁగె
ఇన్నాళవలెఁగాదు యేమిసేసితివో
[15-137

చండ
చంపాదివిని చండకు నోపక నేను
చెలరేఁగి కాపురము సేసితినో యమ్మా
[17-322

చండిచేయు
దండనుండెఁ గైకోడు దవ్వులనుండేఁ
బైకొను
చండిసేసేది అతని సాజమే కాదా
[17-6

చండిదీరు
అండనె శ్రీవెంకటేశఁడె గోవిందరాజపై
చండిదీర సిరికి భూసతికి నీవు
రెండుచేతుల యిద్దరికిఁ గాగెలిచ్చి యిచ్చి
కొండుక జమళి పెండ్లికొడుకవునైతివి
[13-183

చండిపడు
సారెకుఁ దమయన్నతో చండిపడిపెనగఁగ
కోరి సుగ్రీవు వహించుకొన్నదే గురుతు
[7-82

గుట్టుగానీకింతగలదోగుణము చండిపడెనో
[14-175

నిండిన నా పాదములు నీటిలోని తాఁబేళ్లు
చండిపడ నీవు నన్ను సారెఁ జెనకకురా
[15-130

చండిపెట్టు
చండిపెట్టిమాకై తేస్వతంత్రమించుకాలేదు
నిండిన మాచేఁతలెల్లా నీకే సెలవయ్యా
[8-11

దుండగాననాపెచేతఁ దుటారములాడించేవు
అండకు రావద్దంటే నేనట్టే మాననా
చండిపెట్టి యాఁటవాని జవ్వనముగాకుసేసి
కండగట్టుకొంటేఁ జాలుకాదనేనా నేను
[17-227

చండిపెట్టి మగవానిసాదించి వలపుమంటూ
బండుసేసే యాఁటదాని బదుకేఁటి బదుకే
[17-297

పండఁబడి మోవి తేనె పానకము చవిచూపి
చండిపెట్టి చన్నులతో సాము సేయించీని
[18-126

చండివెట్టు
తండోపతండములై తలమోపులు పనులు
చండివెట్టి పనిగొను సంసారము
[8-111

చండిసేయు
చలముసాదించనీ చండిసేసి పెనఁగనే
నెలకొని కౌఁగిటిలో నించేఁగాని
[18-241

చందనకాపు
చందనక (కాః)పులు నీకు పరిగట్టగంపె
నమ్మ
[13-55

చందమామ గుటుకలు
అందియు నందనియాసల నిటువంటి
చందమామ గుటకలు సతము లవునా
యమ్మ
[4-54

సతులతో నవ్వులు చందమామ గుటుకలు
మతి తలపోఁత లెండమావుల నీళ్లు
[7-34

కందువమాటలనే కంకణాలు గట్టికట్టి
సందడిఁ బెండ్లాడేవు చతురుఁడవు
చందమామగుటుకల సారె నవ్వివావులెల్లా
అందలానఁబెట్టుకొంటె నంతవాడవౌదువు
[14-148

వందములే కళచాయ బయలీఁత
సుద్దులాయ
చందమామ గుటుకల చాలదటరే
[17-493

చందాలు చేయు
యిందరి శ్రీ వెంకటేశ యిట నన్నూఁ
గూడితివి
చందాలుసేయకువయ్య చావులేలచూపేవు
[14-224

చందురుల నించు
జక్కవకు చాలమీద చందురులనించెనంట
బొక్కచుఁ జెలులకేల చూపేవే నీవు
[13-214

చంద్రగాలి
కామిని కెమ్మోవి కాంతి కట్టుకొనే
చంద్రగాలి
[13-168

చక్కజాడ
యెక్కువతక్కువలేదు యెఱు
కెఱఁగమిలేదు
చక్కజాడలో నీకు శరణంటేఁగాని
[6-86

చక్కఁజాయకు వచ్చు
తక్కరీఁడవుకాదువు తగవరివినౌదువు
చక్కఁజాయకురా నేను జాణఁ
జుమ్మీ విభుఁడు
[17-591

చక్కటిసేయు
చక్కటిసేయఁగనేల చవులు చెప్పఁగనేల
గక్కన నాతఁడు నిన్నుఁ గాఁగిలించేను
[17-537

చక్కటులు
చక్కటులు నీవాటితేను సారెకువినేఁగాని
అక్కరతో మారుమాట లడుగకు వయ్యా
[14-272

చక్కటులు చెప్పు
చాలువేరే మీరేల చక్కటులు చెప్పేరే
[16-2-72

చక్కటులు దిద్దు
తడవకు నీవు మమ్ము నినుఁ
దప్పులు సారెకుఁ బట్టనేలనే
నడపడి యెప్పుడుం గలది నాకిఁకఁ
జక్కటులేల దిద్ద
[శృం. వృ. వ. మ. 77

చక్కట్లు చెప్పు
ఒక్కరికొకరు లోనై వుండుటగాక
చక్కట్లు చెప్పఁబోతే సమ్మతౌనా సుద్దులు
[15-158

చక్కదొబ్బు
చనుఁ గొంగు జారెనంటాఁ
జక్కదొబ్బ వచ్చేవు
చనువున నన్నిటాను జాణవా నీవు
చెనకి కాఁగిలించితి శ్రీ వెంకటేశ నీవు
ననిచి నీ పచ్చడము నాకుఁ గప్పరాదా
[17-158

చక్కఁబట్టు
కేవలమైన నీ మాయ గెలువనే రాదట
భావించి మనసుఁ జక్కఁబట్టరాదట
[7-28

చక్కాడు
వాఁడి వాఁడి కోరలతో వడి నసురఁ జక్కాడి
తోఁడేటి మీసాలతోడి దేవసింహము
[8-153

చలమున హిరణ్యుఁ జక్కాడి యిటు ఘా
వలయము నిలిపిన వరాహమా
[8-184

చక్కురము
జక్కవ చన్నులనీడ సరినీయుదునంటెనో
నిక్కి నీచేతులు నంకుఁ జక్కరాలై
వున్నవి
[13-218

చక్కెరబొమ్మ
చక్కెరబొమ్మవంటిది చవిగొంటేనీవలవు
యెక్కడఁ జిక్కించుకొన్నా నింత
దీపై వుండును
[4-188

చక్కెర కవణాల సాంబ్రాణితేజి
చక్కనిగుమ్మ వాసనల పూరెమ్మ
చక్కెర కవణాల సాంబ్రాణి తేజి
[వ. యో. వి. 3-1827

చచ్చన మాటలు
సటలు చూపకుము చచ్చాన మాటలేల
మటుమాయలాడ మున్మాటికి నీవు
[ప. యో. వి. 4–959

చనవున నొక కొన్ని చచ్చనమాట
లని సరసములాడినంత లోపలనె
[ప. యో. వి. 4–1001

చచ్చిపుట్టే పొద్దు
ధరలో మనుజులింతే తామే దయివమనేరు
పొరిఁదాము చచ్చిపుట్టే పొద్దెరఁగరు
[8–40

చట్టుపడు
చట్టుపడఁదోలె నాఁడు సముద్రాలపైఁదేరు
ఘట్టుగాఁ దోలెను పౌండ్రకునిపై నదేతేరు
[6–110

చట్టెడు
వొట్టుక యీదును వుభయ కర్మముల
చట్టెడు సంసార సాగరములను
[6–118

చతురుఁదనము
వదరి సంసారమనే బహురూపమే కాని
చతురుఁదనాన నందు సమర్థుండఁగాను
[7–21

చద్ది
మాటలమూటలు చద్ది మనసులో చిలుపాలు
యేఁటిసేసి విందువెట్టే నింతి నీకును
[14–166

[పులిహోరకు చద్ది అనడం విశాఖజిల్లాలో వరిపాటి]

వొద్దికై నీవటువలెవొనగూడివూడుదుగాక
చద్దికివేఁడికి వెదజల్లులాయ వలపు
[15–39

[ఒక్క బ్రౌణ్యంబులోనే చల్దికి రూపాంతరంగా దీనిని గ్రహించారు. ఈ ఆరోపం వల్ల శీతలాన్నం అనే అర్థంలోనే కాక చలువదనానికి ఈ మాట వాడుతారని భావించవచ్చు]

చద్ది కర్మములు
నిద్దిరించువానిచేతి నిమ్మపంటివలెనే
చద్దికర్మములు తానే జారితే జారె
[5–256

చద్దికి వండిన వంటలు
అద్దములోపలినీడలు అందరిదేహరూపులు
చద్దికి వండిన వంటలు జంటఁగర్మములు
[6–133

చద్దికి వేఁడికి
చద్దికి వేఁడికి మంచిచక్కని సతులమోవి
వొద్దువొద్దు కారగించే భోగి యీతఁడు
[12–5

చద్దికి వేఁడికి నీవు జాణతనా లెన్నాడినా
వద్దనేమా వూరకుండేవార మింతేకాక
[18–368

చద్దికి వేఁడికి వచ్చు
అద్దివో శ్రీ తిరువెంకటాద్రీశుఁ డితఁడని
చద్దికి వేఁడికి వచ్చి సనకాదులు
[11–3–99

చద్దికూళ్ళ పొద్దు
చాలునిక నిద్దురలు చద్దికూళ్ళపొద్దు
వేళాయ నా తండ్రి వేగలేదే
[9–254

చద్దిమూట
వొద్దనే పెక్కుగాలముపూనినపురాకృతము
చద్దిమూఁటై యనుభవించఁగ జేసే మానదు
[8–216

చద్దివేఁడి
ఇద్దరుఁ గదిసి కొంక నిఁక నేఁటికే
చద్దివేఁడి సరసాలు సవిచూడరాదా
[14–125

చద్దివేఁడివలపులు
చద్దివేఁడివలపుల నందడి నున్నాఁడేమో
బుద్ధిగా సన్నల నింపు పుట్టించరే
[18–120

చద్దిసంసారము
చద్ది సంసారమున సరుస సుఖ దుఃఖములు
యెద్దు యెనుపోతునై యేకంబుగాదు
[5-311

చదురంగము
చవికె లోపలనుండి చదురంగ మాడుతాను
వువిద కిచ్చితివి నీ వుంగరము
[13-112

చదురాలు
సరసుఁడవు నీవైతే చదురాలు నీకాపె
అరుదాయె నన్నిటాను అమరు నిద్దరికె
[17-128

చదురుఁడు
అదన శ్రీవెంకటేశ అట్టె నన్ను గూడితివి
చదురుఁడ వన్నిటిని జాణవు నీ వనరా
[15-224

చదురుఁదనము
సరికి బేసికి మీ చదురుఁదనాలు మించె
[13-109

చదురులాడు
చదురులాడియాతఁడు సారెకు నేరుతునంటా
వదరుఁదనములనె వాదించెవే [14-260

చదువక తర్కించు
వేదార్థము దప్పఁ దెలిసిన
విద్వాంసుని వంటిది
పాదుగఁ జదువక తర్కించఁబోవు
పాండిత్యము వంటిది
[7-86

చదువుమీఁది చదువు
చదివెఁబో ప్రాణి సకలము-యీ
చదువుమీఁది చదువు చదువు డాయఁ గాని
[11-3-127

చద్దులగు
వద్దేలే కోపము వలదని తాపము
సుద్దులు విన్నందుకె సూడు వట్టేవా
చద్దులాయను వొట్లు చలము సాధించనేల
గద్దించినందు కతవిఁ గాఁగిలించుకొనవే
[15-237

చనరము
చనరపు సరసాలు చాలు మూల నడవఁగ
గుదిగొన్న నగవు లగ్గువలాయను
[14-276

చనవరి
చనవరి యింద్రుని స్వర్గము చేకొనె
యెనగొని హిరణ్యుం డిది వో దేవా
[10-36

చనవరి బొడుక
సరిఁ గర్మములకెల్ల చనువరి బొడఁకను
పొరలే జన్మముల యప్పుల వాఁడను
[7-246

చనవి
యెనసితిమి శ్రీవెంకటేశ నేనిన్నుమెచ్చితి
చనవి మనవి నాకె సతము నేసేవు
[15-270

చనవి మనవి
మనసిచ్చి నీవే నన్ను మన్నించుకొంటేనే
చనవి మనవి నీకే శరణు చొచ్చితిమి
[11-43

చనవు చెల్లించు
చూచినవారెల్ల నన్నే సొరిది నుప్పతింతురు
మా చనవు చెల్లించి మన్నించరాదా
[18-19

చనవు మనవులు
చనవు మనవులకు జగమెల్లా నిదె
కొనకు మొదలికిని గురి నేను
[6-99

చనవులిచ్చు
కనలి తాటకిఁజంపి కౌశికు జన్నముగాచి
చనవులిచ్చిన రామచంద్ర నరేంద్ర
[9-216

చనవుఁ సలిగె
చనవిచ్చె నాతఁడు సలిగె గలదె నీకు
[17-10

చనవులెల్ల నెరపి సలిగెల బొరలుచు
ననుపు నీకొపెనేసీ నా యెదుటనే
[17-11

చన్నమన్నవారు
యెన్నఁగ సంసార ధర్మ మిదివో
మోక్షము చూప
చిన్నమన్నవారికెల్లా సాధనముగాదు
[8-205

చప చప
కపురంబు చపచపఁగానాడిమంచు
రవణంబు విడియించు రమణఁ జెన్నొందు
[ప. యో. వి. 4-865

చపచపంగాఁజేయు
సరసను శోభిల్లు చైత్రరథంబు
గరిమలు చపచపంగాజేయు రమణ
[ప. యో. వి. 2-20

చప్పఁజేయు
కూరిమి గలపతిని కొసరఁగ బోదురా
సారమైన వలపెల్లాఁ జప్పఁజేతురా
[18-443

చప్పచారు సేయు
కోరినను వేడుకుంటా గుట్టుతో నున్న చెలి
జేరదీయవద్దు గాని చెక్కునొక్కవచ్చును
వూరకై నవట్టితేనెలూరుమాటలాడి చప్ప
చారు సేయవద్దుగాని చవిగొనవచ్చును
[13-142

చలుకు చేయు
ఎగసిన గరుడుని ఏపున ధాయని
జిగిదొలఁక చలుకు చేసినను
[11—3-26

చమరు
జవ్వాది శిరసునిండఁ జమరుకొ యిట్టె
పవ్వళించేవిదె నా పక్క నీవు
[4-15

అల్లవిగో తనమేన నప్పటి పెంజెమటలు
మల్లాడి నామేనఁ జమరవచ్చీని
[13-48

చమురు దీసిన దివ్వె
జమునోరితో బ్రదుకు సంసారము చూడ
చమురుదీసిన దివ్వెసంసారము
[11-3-70

చయ్యాటము
నెయ్యమెఱింగిచెలియ నీవెపో యతనితో
చెయ్యాటములనే పగచాటేవు
[4-82

అయ్యో దయవలదా ఆఁటదానికి
చయ్యాట మాడినాను సంగతి గావలదా
[16-2-86

చయ్యాట (లు)
చయ్యాట లిన్నియు మాని చవిసేసుక
పొదిగి
యెయ్యెడనున్నదో తాను యెవ్వతో యీపె
[17-77

చరిసేయు
పంచభూతము లనెడి పలువన్నె నూలు
చంచలపు గంజివోసి చరిసేసి
[5-178

చరుము
కన్నుల కాఁకలుదీర కప్పురము చరమవే
[14-234

చఱిగొను
చఱిదొనె ననఁ జలమగుము
చ్చిఱుటయు ముచ్చటయు
చెఱగు చీఱుట యనవా
[రేఫ. ఱ. 75

చఱులు
చఱులఁబొరలి యాచార ధర్మములు
మఱచినదే తన మలిన మది
[5-166

చలపట్టు
చలపట్టితేఁ జాలు సర్గమేమి బాఁతా
చలివేఁడి నాలికపై సత్యములోనున్నాఁడు
[6-7

వలపు వెఱపెఱుఁగనా వాఁడిమొనలకునైన
బలిమి దూరించఁ జలపట్టుఁగాక
[6-11

యెలమి శ్రీవెంకటేశ యేలితివి నన్నునిట్టె
చలపట్టి నాకు నీ శరణమె చాలు
[6-131

తలఁ జలపట్టితిని తప్పని భక్తియందు
వెఱవక నిన్నొల్లని విధుల నిందించితి
[6-215

వలయ శాసనాలు వడి నాల్గువేదములు
చలపట్టి జాణలు చదువుకోరో
[7-259

వేగిరించి పెరరేఁచి వేసరించీఁ బనులు
సాగి ముందరఁ బొలసి చలపట్టె సిరులు
[9-158

చలపట్టుకొను
వంతాన రానని చలపటుకొని వుండఁగాను
యెంత దడపైనఁ బోరనేలే మాకు
[17-479

చలపదము
ముక్తికిశ్రీవెంకటేశ మూలమునీపాదములు
సక్తులయి నమ్మటగాక చలపదమేఁటికే
[5-322

చలపాదము
చదివితి ననియెడి చలపాద మింతేకాని
అదననందులోని అర్థమెఱఁగ
[7-21

చలపాదితనము
సొలసిసొలసి వోరచూపులఁ జూచే వదేమే
చలపాదితనమింత సతులకుఁ జెల్లునా
[17-340

చలమరి
యెలమి శ్రీవెంకటేశ యెరవుల వనితలు
చాలమరివని నిన్ను సాదింతురు గాని
[14-160

నవ్వుతా నే దిటితేను నయమిచ్చినా
జవ్వనము చల్లజంపు చలమరివాఁడు
[17-235

చలమరి యంటీఁగదే చల్లజంపంటీఁగదే
అలపుసొలపె ఘనమంటీగదే
[17-266

మలయక నిద్రించునప్పుడు
మత్తుఁడై యున్నప్పుడు
చలమరి జీవునితొడుత సమ్మతమే లేదు
[9-68

పలుయోనులలోపలుమా(మ?) రుఁబొడిమిన
చలమరి నా తోలు జన్మంబులును
[16-19

చలముకొను
పిలువని పేరటము ప్రియునివద్దకు వచ్చి
చలము కొనేటిదాని చలమేఁటి చంచలమే
[7-297

చలమో ఫలమో
పలుమారు వాదమేల పంతమేమి వచ్చె
నీ(మీ?)కు
చలమో ఫలమో సాధించుకోరయ్య
[8-134

చలాలఁబోవు
యీ నిజ మిక్కడివారు యిన్నియుఁ
దెలిసుండియు
మానకచలాలఁ బోయి మాయలఁబొందేరు
[9-94

చలిగొను
పులకలమేనితోఁ బొరలేను కడుఁ
జలిగొని చల్లకు జాజర
[12-331

చలిఁబడు
సంతులేని సతి యింటిచాయ తెరువు
యింతలోనె చలిఁబడి యెండఁదాకే తెరువు
[5-147

చలిమందులు
నీరువట్టుగొని యిట్టె నెయ్యోనాఁ
దెమ్మననేల
నీవు రానప్పటి చలిమందులేలా
[15-69

చలిమి
వెలయించెనితఁడేకా వేదపురహస్యములు
చలిమి నితఁడే చూపె శరణాగతి
[7-138

చలిమి శ్రీ వెంకటేశు శరణాగతితోడ
బలిమి మించిన బ్రహ్మపట్టము సరియా
[7-171

చలిమి బలిమి
తిలకించి నీచేతకు తిట్టకేల మానును
చలిమి బలిమిగల జవరాలు
[17-19

తక్కి చలిమిబలిమి తనకింత గలిగితేను
చిక్కించుక నిన్నేమైనా జేయఁగవలె బో
[17-31

చలి యెండ గాలిచాటు
యిందుమైఁ గప్పిన యెలమించుసోగ
కందువఁ జలి యెండ గాలి చాటుగను
[ప. యో. వి. 3-275

చలివందిరి నీడ
కొలువుకాంతలనెల్లా కొంకక శ్రీవెంకటేశ
వలపుల నీమేను చలివందిరి నీడాయ
కలగొన నీ వురాన గాఁగిలించేవు
[13-185

చలివాపు
వూరకె మాయింట నాతఁడున్నాఁడంటూ
నాడేవు
సారెకు నీవిక మరి సాదించే దేమే
యీరీతి మాచలివాపి యింత అట్టు సేసితివి
తీరెఁబన్నులన్నియును తెగనాడే బదవే
[17-353

చెలియరో యీతఁడిన్ని చింతలవాఁడే
చలివాపి తన మోవి చవులెల్లఁ జూపెనే
[18-92

చలివాయు
చలివాసె భవములు సడిదీరెఁ గర్మములు
యెలమినీమహిములుయేమిచెప్పే మింకను
[7-23

వెలయ నన్నిఁజదివి వివేక మొల్లనివాఁడ
చలివాసి నీభక్తి చవిగానేనా
[8-108

చలి వేఁడిఁబొరలు
చలివేఁడిఁ బొరలకే సర్వేశు పాదాల కింద
తలకొన్న తన్నుఁదానే తలఁచఁగవలెను
[6-198

చలివేఁడి నాలిక
చలపట్టితేఁజాలు సరమేమి బాఁతా
చలివేఁడి నాలికపై సత్యములో నున్నాఁడు
[6-6

చలువకు వేఁడికి సరికి సరి
చలువకు వేఁడికి సరికి సరి
కలదిఁక హరి నీ కరుణే మాకు
[10-213

చలువలోపలి వేఁడి
చలువలోపలి వేఁడి సంసారము చూడ
జలపూత బంగారు సంసారము
[11-3-70

చల్లబాడె
చల్లబాడె అంటుకొని జాణతన లాడేని
పల్లరపు గద్దరీఁడు బయకాఁడు
[13-134

చల్లజంపు
చలమరియంటిఁగదే చల్లజంపంటిఁగదవే
అలపునొలపె ఘనమంటిగదవె
[17-266

చల్లతోడి బోనము

చిలరైన మాయింటఁ జేసిన పాటారగించు
చల్లతోడి బోనమైన చాలుఁజాల దనకా
[6–60

చల్లదుబ్బ

చల్లదుబ్బదుచ్చెదు సాదించితే వలపులు
[13–209

[హంసవింశతిలో(2–75)దుబ్బను పేర్కొనే టప్పుడు చలదుబ్బ అని చెప్పడం గమనించాలి.]

చల్లుఁజూపులు

వల్లెవాట్లతోడ వడిఁ బెద్దకన్నుల
చల్లుఁజూపుల బోయ జవరాలు
[4–118

చల్లుఁ జూపుల జవరాండ్లు రే
వల్లె బాలునిఁ బాడేరు
[12–245

చల్లులాడుకొను

భవనాశిలోవి నీరు పైఁజల్లులాడుకొంటాను
నవకపు సిరులను నవ్వుకొంటాను
[11–216

చల్లువెద

సరులెల్లఁ జిక్కువడి చల్లు వెదలైన విపే
సిరుల నన్నింతా చేయముట్టెను
[17–401

చల్లువెదలాడు

పేటలుఁ బేటలు పెనుఁగు
గూటములుగా దెచ్చి
చాటులైన వరములు చల్లు వెదలాడుచు
[11–2–69

చవిగను

చవిగంటే విడువఁడు సారెసారెనే పనులు
యివల నీతని పొందు వెట్టునేసేదో
[13–87

చవిదేనె

మతిలో చీఁకటిమాన్ప మాణిక్య దీపమవై
సతమై నాలికెపైకి చవిదేనెవై
[9–92

చవుక

పెక్కుమాటలాడితేను ప్రియమెల్లాఁ
జవుకీను
[13–31

కొంగువట్టేవేల నీవు కొనవేట నేఁబట్టగా
జంగిలి సతులకెల్లా చవుకాయ వలపు
[14–237

చవులుగొను

భ్రమఁబడి మాయపుఁ బడతుల తమ్ములు
నమలి చవులుగొనె నా జిహ్వ
[5–56

## చా

చాకి మఱుఁగుల జాడ

చాకిమఱుఁగులజాడ చంచలపు సంపదలు
చేకొనిననేమి యివి చెదిరినను నేమి
[11–3–116

చాటిచెప్పు

అప్పుడే వీఁడు దొంగని యేను జాటి
చెప్పిన నామాటఁ జెవిఁబెట్టవైతి
[వ. యో. వి. 4–1393

చాటువ

ఆటలుఁ బాటలునవె అచ్చర లేమలు వారె
చాటువ నలమేల్మంగ సంగది నదె
[8–274

యీటున నాతఁడుఁ దాను యేక
బత్తిమై వుండితే
చాటువకెక్కిన జన్మసాఫల్యము గాదా
[13–147

మాటుననుండివచ్చి మనవద్ద నిలిచిరి
చాటువ సురటులు విసరు చందమే
[17-374

చాటువకెక్కు
మాటలాడవచ్చుఁగాని మనసులు పట్టరాదు
చాటువ కెక్కినయట్టి సతులఁగంటే
[7-240

చాటువ మెరయు
కోటిసూర్య లోక కూటువగూడుక
చాటున మెరసేటి చక్రము
[7-281

చాడిచెప్పు
చనవున నీ ముఖచందురుని వంక నీ
చనుజక్కవలె పో చాడిచెప్పెని
[12-280

చాడిముచ్చు
మాయకువే చల్ల చాడిముచ్చు గొల్లెలేవోరి
పోయవోపోవో మా చల్లపులు నేల నీకును
[4-113

చాడెలు
సారెకుఁజెరుగుల చాడెలూ నేఁడుమొదలూ
గోరమై కోలలఁ బగులమొత్తేఁడు
[5-57

చాతపడు
సకలవేదాధ్యయ శాస్త్రపాఠంబు లివి
శౌరి సంకీర్తనం బిదియె నాకు
సకల కర్మానుష్ఠానముల యితని
కిచ్చుటఁ జాతుపడి కైంకర్య మిదియే
[6-132

చాపకింది నీరు
పాపముఁబుణ్యము పైపైఁ గూడుకొని
చాపకింది నీరు సంసారము
[8-105

వోపనన్నుఁబోనీదు పూరకైనఁ బనిగొను
చాపకింది నీరు వలె సంసారము
[8-111

చాపకూడు
బూటకపుసురలతో బున్నముగపుర్వరమున
కూటువుగాఁ జాపకూడు గుడిచినవాఁడు
[4-43

చాపలము
యేపున నీయంత నీవు యింతి
విచారించకున్నా
ఆపెమాట వినవద్దా అయ్యో నీవు
చాపలాన నీకంటె సతతికి దయవుట్టె
పాప పుణ్యములు నీవు భావించకో
వలదా
[14-65

చాపలెత్తు
కదలేని నిట్టూర్పు గాలి విసరఁగాను
జడియుఁ గోరికలనే చాపలెత్తి
[9-99

చాయకాఁడు
ఆయములు సోఁక మాటలాడి యంత
కొసరిన
చాయకాఁడవె కాక సమ్మతించేవా
[17-45

చాయకు తెచ్చు
మాయలవాఁడ వన్నిటను మాటలు
నేర్తువు చేఁత విన్నియుం
జాయకుఁ దెచ్చి చెప్పెదవు
జాణతనంబిది మేలు వింటినే
[శృం. వృ. ప. శ. 76

చాయకు దెచ్చు
మాయామయములివి మాయకునీవేలికవు
చాయకుదెచ్చేనంటె స్వతంత్రుఁడనయ్యేనా
[5-208

చాయకు దెచ్చుకొను
రాయడించెచోటుగాదు రతికెక్కినపుడైనా
చాయకుఁదెచ్చుకోమాట చవులైనయపుడు
[14-93

**చాయకు వచ్చు**
కాయమునాదే ఆట కర్తను నే నటనా
చాయకవి రావు నన్నే జరసేఁగాని
[10-58

సరసపు వాఁడతఁడు చాయకు వత్తువు నీవు
[14-143

**చాయగు**
యేయెడ శ్రీవెంకటేశ యింతనీదాసులకైతే
చాయై చెప్పినట్టు వేసు సకలబంధములు
[9-72

**చాయచూపు**
సత్తగు శాస్త్రము చాయ చూపినా
కొత్తగ నేనిఁక గుణి నయ్యేనా
[10-60

**చాయచేసుకొనివుండు**
చాయసేసుకొని వుండి స్వామి
ద్రోహిఁ జెప్పనట్టి
తోయపుచేటెని మంచితోవనే పెట్టితివి (?)
[8-94

**చాయదప్పు**
మాయగొంత నిజమార్గమునుఁగొంత
చాయదప్పు దిదే సంసారము
[8-105

**చాయపాటు పొందు**
చాయపాటు పొందులకు సమ్మతించ
రాదు గాని
సేయించు కొంటేఁ బనులు సేయవచ్చును
[18-288

**చాయపాట్లు**
ఆయాలుసోఁకిన మాటలివియే యికవుగాక
చాయపాటైన వెల్లా ఛవివుట్టినా
[14-115

**చాయమేను**
వేయిపడిగలతోడ వెలసిన శేషుఁడు
చాయమేని తళుకు వజ్రాల శేషుఁడు
[9-76

**చాయల పంట**
సందెకాడఁబుట్టినట్టి చాయలపంట యెంత
చందమాయఁజూడరమ్మ చందమామపంట
[11-47

**చాయల మాటలు**
యీయెడ నేఁ ఒట్టుతో నీ యెదుటనె
నిలుచున్న
చాయలమాట లనక చాల నీవు నమ్మేవా
[4-107

**చాయల మేను**
సంకుఁజక్రములతోడ చాయలమేనితోడ
సంకెదేర్చే యభయ హస్తముతోడ
[10-163

**చాయలు దేరు**
తోయధిమీఁద నటుతొఁడిగిన బాణము
చాయలు దేరుచున్నది చనరో దైతేయులు
[10-283

చేయమ్మునెకవారు చెప్పులు రాగి
చాయలుదేరు నచ్చపు నీలిదట్టి
[ప. యో. వి. 6-766

**చాయలు మరచు**
పాయక యిందే పసుపడి పసుపడి
చాయలు మరచిరి జంతువులు
[8-118

**చాయవాటు**
చాయవాట్లుగా నెట్టు సరసము లాడినాను
చేయిచాఁచి పెనఁగక చెమరించునా
[18-131

చాయవాటుగఁ జేయఁ జరిగి వచ్చితిమి
పోయినవే కావె భువినిఁ బ్రాణములు
[అ. మ. క. 5179

**చాయ సేసుకొను**
చాయసేసుకొని నీతో సరిసవ్వే దెఱఁగవు
నీయంతనే వచ్చి నిజము నెరిపేవు
[17-541

చారువాకాలు
జాతులకు నీవాడెటి చారువాకా లింతే కాక
ఆతల నిన్నుఁ గొసర నంత పొందులా
[17-503

చాలు
ఆఁడుజాతెల్లా నొక్కటె అందరికి
నొక్క చాలే
[14-128

చాలుకొను
తొలియాడఁ దిరుతేరు దుష్టులెల్లనణఁగఁగ
చాలుకొని శిష్టులెల్ల జయవెట్టఁగ
[10-178

ఏల వేగిరింపించేరే యేమిరేవో చెలులాల
చాలుకొన్న నాయకుని చరితలు చూడకా
[17-507

చాలుగట్టు
మదిఁ గొంకులేక యేమటి చాలుగట్టి
యదె చేరవచ్చుచున్నది మహాసేన
[వ. యో. వి. 7-69

చాలు మానిసి
యేలికయై మన్నించు నిష్టుఁడై బుద్ధిచెప్పు
చాలు మానిసియై యంచలఁ దిరుగు
[7-183

చాలుమూల
చనరపు సరసాలు చాలుమూల నడవఁగా
గుదిగొన్న నగవు లగ్గువలాయను
[14-276

['చాలుమూలవుభయ నానా దేశాలపెక్కుంద్రు'
అనే మాట శాసనాలలో కనబడుతుంది.
శాసనశబ్దకోశం పుట. 106]

చావడి
కడువిరహినై నిన్ను గన్నులఁ
జూచేమంటేను
వడదేరి కొలువు చావడి నుందువు
[13-22

చావులతోడి సద్ద
తొలుత నాకుఁ జావులతోడి సద్ద వద్దు వద్దు
బలువైన యచ్యుతుని బంట్లము గాన
[9-197

## చి

చింక చూపులు
వంకరగోళ్ళ వైపులు వెదకే వదకీ
చింకచూపులను శ్రీ నరసింహము
[9-278

చించరాని బుద్ధి
పెంచి యజ్ఞానతమము పెద్దల నెరఁగనీదు
చించరాని నాబుద్ధి చీఁకటిపాలాయ
[8-30

చించి చెండాడు
చెక్కులవారగోళ్ళఁ జించి చెండాడినయట్టి
వెక్కసుఁడు వీఁడివో వీర నారసింహుఁడు
[10-162

చించుక
చించుకమిన్నులఁబారే చింకలనుబండిగట్టి
వంచుకొనే మన్ననవి వసమయ్యీన
[5-119

చించుబొట్టలు
చించుబొట్టలు ఖడ్గశిఖిచేత మిగుల
నొంచు దానవుల మేనులు గదాహతిని
[ఉ. క. 1298

చించె
యితఁడా తాటకిఁ జించె యీ పిన్నవాఁడా
ఆతల సుబాహుఁగొట్టి యజ్ఞముఁగాచె
[5-299

చింతకాయ కజ్జము
పడఁతుల వేడుకలు వచ్చి వడఁగండ్ల గుల్ల
కడమోవితీపు చింతకాయ కజ్జము
[7-34

చింతకాయ కజ్జాయము
చింతకాయ కజ్జాయము చేరి
యినుమంత వుంటె
అంతటనే నోరూరు నందరికిని [9-4

చింతలు రేఁచు
చింతలురేఁచకు మమ్ము చిత్తమా నీవు
పంతముతో మముఁ గూడి బతుకుమీ నీవు
[8-63

చింతలు సిలుగులు
అంఁయుఁ జూచిన హరిసంకల్పమే
చింతలు సిలుగులు జీవులవి
[8-126

చింతాయకుఁడు
చింతాయకుఁ డగు (r) హరి
చిత్తములో నుండఁగాను
వింత వింత విచారాల వెట్టి మాకేలా
[8-190

శ్రీ వెంకటేశుఁడు నీవే చింతాయకుఁడవు
కావించేటి నీ వుద్యోగము లేమిటాఁతి
[9-98

శ్రీరమణుఁడే చింతాయకుఁడని
వూరక వుండుట వొక సుఖము
[9-256

చింతారతి
చెదరవియలపై చింతారతియై
హృదయమురేఁచీ నేమిసేతురా
[4-138

చిందరకొట్టు
కడిఁది చిందరకొట్టి కడిమి క్రొళ్లతికి
నడి రంకెలిడుచుఁ గ్రేవలి నాకికొనుచు
[అ. మ. శ. 3023

చిందర వందర
ఇందిరానాథుఁడవు యిందరికి నేలికవు
చిందరవందరలైన చింతలు మరేలా
[10-209

చిందరవందరలైన జీడివంటిది వలపు
యిందులోనె కొనవచ్చె నేమిసేతుర
[14-163

చిందులేక కొలుచు
కందువెఱిఁగి వేంకటగిరి రమణుని
చిందులేక కొలచిన దిహపరము
[11-3-20

చిందువందగు
నిరులకొరకుఁగాఁ జించువందయ్యా బ్రాణి
పురుపైపుట్టినపుడే బుద్ధులెందువోయనో
[9-139

చెదరిన మెదడు గిజ్జడియైన తొడలు
చిడిసిన కాయము ల్చిందువందైన
[ఉ. శ. 1727

చిందువందు
యెదవదకుండ నీరెత్తనా నీట
వడిమడమలు చిందువందుగాకుండ
[వ. యో. వి. 4-542

చిందువందు చిత్తము
బొందిలోన నొకటియు భూమిలోన
నొకటియు
చిందువందు చిత్తమె తేచేరునావై కుంతము
[10-196

చిందువందురు
పెట్టిన కస్తూరిబొట్టు బెరసి నీకురులతో
నట్టునిట్టుం జిందువందురై యుండంగా
[4-142

చిందువందులగు
చిందువందులైనవి జిగిగొని తురుము
పొందులొకరికి పొసఁగెనో తోలుత్తే
[18-489

చిందువందులు
సందడించి పెనగఁగా చనవులు మితిమీరె
చిందువందులైనట్టి సిగ్గువెడజారెను
[14-72

సింగారపు నీమేని చిందువందులెల్లఁజూచి
యింగితానఁ బులకించె నిందుకుఁ గానె
[15-223

చిందునేయు
అందు నున్నందుల కావగింజంత
చిందునేసిన నోరసేసిననైన
[వ. యో. వి. 7–1080

చిక్కిన పేరులు
మరుతండ్రిఁ జూచిన మంచి కన్నులను
మరొకరిఁ జూచిన నింపౌనా
సిరవరునామము నొడిగిన నోరను
చిక్కినసేరులు యితవౌనా
[7–79

చిక్కినవి (=తక్కినవి)
వుప్పరిగలోన నుండి వువిద నిన్నురమ్మని
చెప్పిరమ్మన్నది యింతే చిక్కినవెరగము
[17–293

చిక్కుపడ్డ పని
చిక్కువడ్డ పనికిఁ జేసినదే చేఁత
లెక్కలేని యుప్పునకు లేమి కలిమి
[6–63

చిక్కుపెట్టు
తలఁపును నొకచే తత్వములే వేరు వేరు
చెలరేఁగి విష్ణుమాయ చిక్కువెట్టీ నిదివో
[9–261

చిగురుఁగండె
కులధనములతోఁ జిగురుచుండె నీ మాయ
నిలువు నివురగాయ(?) నీ మాయ
[9–58

వినవా యీదేహము విరసపుహేయమౌట
వినినా జిగురుగండెఁ విడిపించరాదు
[9–73

చిగురుఁ గర్మాలు
చిగురుఁగర్మాలు తమ సీమవాఁడ ననేరు
వగఁదల్లిదండ్రి తమవాఁ డనేరు
[9–41

చిగురుఁగొమ్మును చాగ
అగవడి యెవ్వరైనా నారి చింతించేమంచే
చిగురుఁగొమ్మునుఁ చాఁగై చిమ్మి
రేఁగఁజొచ్చును
[చూ. 'అచటఁ బుట్టిన చిగురుఁ గొమ్మైనఁ
చేవ' మనుచరిత్ర. [1–50

చిగురుఁ జేగై వుండు
తగ(శ్రీవెంకటేశుఁడాతానేవచ్చినన్నుఁగూడె
చిగురుఁజేగై వుండు చిమ్మి రేఁచినామా
[18–267

చిగురుఁ జేవయగు
చిగురుఁ జేవయగు శ్రీ వెంకటేశుఁడు
అగు వరము లొసఁగు నటుగాన
[11–38

చిగురులెక్కి చేఁగదేరు
ఇంతే యింతే యింకా నెంత చూచినా
చింతలఁ జిగురులెక్కి చేఁగదేరినట్లు
[10–80

చిగురులోన చేఁగ
భావించరే చెలులాల పరమాత్ముని
చేవదేరి చిగురులో చేఁగయై యుండెను
[8–165

చిగురెంత
చిగురెంత చేగెంత శ్రీపతి యిందులో నీ
పగటు దెలియువాఁడే పరతత్వవేది
[11–68

చిగులు
నగనేలె యాతఁడు నీనటనకుఁ దగినట్టు
చిగులుతా సారెసారెఁ జెప్పినట్టు నేయఁగా
[17–329

చిచ్చుఁ గొఱవి
బలుముల వగదాయ వగటుల వచ్చ
చెలువంబునకు గొంగ జిగి చిచ్చుఁగొఱవి
[వ. యో. వి. 2–1038

చిచ్చుమీఁద గాలిచల్లు
ఒడలి తాపము మీఁదనుసురనీని
కడలేని చిచ్చుమీఁన గాలిచల్లీఁ దరుణి
[4–163

చిచ్చుటికించు
[........నేవ
ట్లురక వగవారి నటు చి
చ్చుటికింతు ననంగ
బాలయును మేలు కృష్ణా
[రేఫ. ఱ. 61

చిచ్చువంటి వెన్నెల
అచ్చపు దీమసమందరి కెక్కడి
దయ్య తుమ్మెదరో
చిచ్చువంటి వెన్నెల చెలిమి
సేయకువయ్య తుమ్మెదరో
[4–32

చిటికె తీయు
తవిలి యొకతెపై పాదము నీవుచాఁచగాను
తివిరి వేళ్ల చిటికె దియ్యవచ్చీ నీకును
[13–174

చిటిపొటి
చిటిపొటి రతులను శ్రీ వెంకటేశ్వర
యెటువలె నొకటయి యెనసితివో
[5–188

చిటిపొటి యలుకలు
మటమాయములఁ దనమగువ వసిఁడినీరు
చిటిపొటి యలుకలఁ జిలికించంగా
[5-178

చిటిమిటి కోపము
చిటిమిటి కోపాన చెలియ సుభద్ర
[సుభ. క. 778

చిట్టంటు
అంటువాయఁ జెమట నీరాడవా నీవు చి
ట్టంటు నీ చేఁతల నా మైనంటవలదా
[15–48

చిట్టంటు చేఁతలు
జట్టిగొనెర విన్ను జవరాలు
చిట్టంటు చేఁతల జెలఁగితి వపుడు
[12–325

చిట్టంటు చేతను
చిట్టంటుచేఁతల సేదలు దీర్చి
చదరిన యలుకల చిక్కెల్లఁ దీర్చి
[శృం. మం. 244

చిట్టంట్లు
పుట్టినదే నగ్నత్వము బూతో బండో
యెరఁగము
చిట్టంట్ల వాచవులగు జీవుల గ్రమింగెదము
[9–51

చిట్టకము
ఎట్టకేల కిదేలరా యెన్నఁడు లేనలవాటు
చిట్టకాల కిన్నాళ్ళిట్టె సేయవత్తురా
[16–2–1

గట్టిగా నీవాసతి కౌఁగిట నుండఁగా జూచి
చిట్టికానకుఁ బాదానఁ జిమ్మితిఁ గాకా
[17–472

మట్టులేక లుగనేల, మరి వెదకఁగనేల
చిట్టకముదీర బుద్ధిచెప్పరె యీతనికి
[15–159

వెట్టదీరఁగ సురటి విసిరితి నాతోని
చిట్టకాన కింక నేమిసేయు మనేరే
[17–314

చిట్టి
ఇంక బాఁతిపడేవాని నేల మాకుఁ
దక్కరించ
చెంతసిదే వెన్న చిట్టిఁ జిట్టిఁదేసి వలపు
[13–180

చిట్లుగను
చేరి వుప్పమ్మేవాఁడు చిట్లు వేఁగనఁడట
వూరకే శ్రీవెంకటేశ వోపికతోడ
[6–39

చిట్టెలు గటు
కటుకెక్కించి చిట్టెలుగట్టిలోముణిఁగి
కుటుచలై వంకర కొంకరకవోక
[వ. యో. వి. 2–338

చిడిసి మల్లెపట్టు
బడి విభీషణునిఁ జేపట్టితే రక్కసు లెల్లా
చిడిసి మల్లెవట్టిరి శ్రీ వేంకటరామ
[10–281

చిడిముడి
మిడిసి లోకములెల్ల మెప్పించ నడచుఁగాని
చిడిముడి హరి మెప్పించే నసలేఁడు
[9–271

చిడిముడి మొగమడఁచినఁ గానరాక
కడుఘోరమగు నంధకారంబు వొడమ
[వ. యో. వి. 839

పడఁతి మీ పెదతండ్రి భక్తిసారుండు
చిడిముడిఁ దనుఁబిల్చి చెప్పినయట్ల
[ప. యో. వి. 5–960

చిడిముడి సేతలు
చిత్తపుటేఁతలు చిడిముడి సేఁతలు
పొత్తుల తమ తలపోఁతలును
[4–154

చిడుముడి
అడియాలము లివే అక్కడ నిక్కడ
చిడిముడి విష్వక్సేనుఁడు గెలిచే
[6–108

నడుమ నడుమ విజ్ఞానపు కథలు వినుట
చిడుముడి నాచార్య సేవసేయుట
[8–212

పొడచూపె నదిగో భూవి దేవతలకు
చిడుముడి శ్రీ నరసింహుఁడు
[9–218

ఆసల నీవద్ద నుండి అద్దితానె ఆనవెట్టి
సేసచల్లే పతిమీఁద చిడుముడి యేలే
[17–325

కడు రాజసపు నీతో కలకలనవ్వుటకంటే
చిడుముడిఁ జిన్నఁబోయే చింతమేలు
[17–327

[సూ. ని. లో 'చిడిముడి' అనే రూపమే ఉంది. బ్రౌను 'చిడుముడి' అనేది కూడా చూపించాడు.]

చిడుముడి కోపము
వెడలేటి వూర్పుల వేఁడిమి చల్లి
చిడుముడి కోపపు శ్రీ నరసింహుఁడు
[9–278

చిడుముడి గోళ్లు
చిడుముడిగోళ్ళతోడ సింహపు మోముతోడ
తొడమీఁదఁ గూచున్న తొయ్యలితోడ
[10–163

చిడుముడి నుండి
అదరి నీసొమ్ములైన ఆత్మలలోనొకఁడనై
చిడుముడి నున్నవాఁడ చిక్కువఱచకుమీ
[8–231

చిడుముడి పడు
వెడరావణునిఁ జంపి విభీషణునిఁ గాచె
చిడుముడి పడక నీచే శార్ఙ్గము
[9–145

చిడుముడి ముచ్చట
వడదాఁకెఁ గదె దీనివాత గన్నుఁగొనలు
చిడుముడి ముచ్చటతో సిగ్గువడని
[4–13

చిడుముడి మూఁగు
చిడుముడి మూఁగిన జీవులలోపల
కడఁగి నేనొక్కఁడ నింతే
[6–71

చిత్తగించు
భోగము నేను నీకు భోగివి నీవు
శ్రీగురుఁడ విన్నిటాను చిత్తగించు
నన్నుచు
[7–40

చిత్తడి
చిన్ని చెమటలవాన చిత్తడిపాలైన నా
చన్నులంటేఁ దన్ను నే జంకించఁగలనా

[ఈ పదానికి 'చిఱుతముడి' అనేది వ్యుత్పత్తి అర్థమేమో అని సూ. ని. లో అని సందేహించారు. ఈ ఆరోపం దాన్ని రూఢి చేస్తుంది.]

చిత్తరు పటము
బడిబడి విరహానఁ బడలేక మా
పడఁతి నీకుఁ జిత్తురు పటమంపె నిదివో
[16–2–47

చిత్తురు వ్రాయు
తెరలం గ్రాఁగిన నెయి క
స్తురివంటిది మంచిదనఁగ దొలితొలి
కదుఁ జి
త్తురు వ్రాయఁగ నుద్యోగిం
తురు వేడ్క నసంగ రేపు దూకొనెఁగృష్ణా
[రేఫ. ఱ. 29

చిత్తశాంతము సేయు
చీకాకువడిన నా చిత్త శాంతము సేయ
లేకనా పీవు బహులీల నన్ను
[5–146

చిత్తానఁబెట్టు
చిత్తానఁబెట్టకుమీమాఁట శ్రీరమణమరవకు
హత్తి నిన్నె మెరుఁగుదు నజ్ఞాన నేను
[7–103

దోసము నీవల్ల లేదు తొలుతె శ్రీవెంకటేశ
సేసినవారి పుణ్యమే చిత్తానఁ బెట్టితివి
[8–43

చిత్తానఁ బెట్టుకొను
చేసిన నా విన్నపము చిత్తానఁ బెట్టుకొమ్మీ
వేసరించి యిప్పుడే నేవేఁడుకొంటిజుమ్మీఁ
[6–177

చితుకెక్కు
వొప్పుగ మేనులు వొరయగ మీకును
చిప్పిలుఁ జెమటలు చితుకెక్కె
[17–12

చిదిరించు
నెరులేరుపడి నిగనిగ చిదిరించు
మురుతైన కుచ్చెల మొరమొర మొఱయ
[వ. యో. వి. 2–137

చిదుగగు
చిదుగాయ సిగ్గులెల్లాఁ జెప్పరమ్మా వొళ్ల
చిదిమినా నెఱుంగదు చెప్పరమ్మా
[4–126

చినుకు చీఁకటిపొద్దు
వనిత కొండంత వలపులే నీ
వరుసకుఁ గాచకుండునా
చినుకుఁ జీకటి పొద్దున నీ వేడ
చెవితో నవ్వేవయ్యా
[16–2–106

చిన్నబోవు
ఏలనీవు చిన్నబొయ్యేవేఁటి కానలువెట్టేవు
[15–219

చిప్ప
నేయమ్మేవారము నవ్వనేరము పోనేమిదే
చేయిచాఁచుపెరుగుచిప్పఁ జిప్పిఁజేసి వలపు
[13–180

చిమ్మ చీఁకటి
యిమ్ముల వారి వాకిటి తిన్నెమీఁదఁ
జిమ్మచీఁకటిలోన జింతింపుచున్న
[వ. యో. వి. 4–1044

చిమ్మిరేఁచు
యెదుటనీవుగలవు యిహములో నేఁగలను
చెదరిన చిత్తమేల చిమ్మిరేఁచీని
[6–36

దేవుఁడవు నీవే యని తెలిపితి విదే మాకు
జీవులము మమ్ము నిఁక చిమ్మిరేఁచనేఁటికి
[8–55

మోవరాని మోపయి మలుగన్నియ్యదు
మమ్ము
చేవ సంసారముపైఁ జిమ్మిరేఁచీని
[9–63

నేనేమి సేయుదును నిన్నుఁబో వివేకము(?)
శ్రీనాథు మహిమలు చిమ్మిరేఁచఁగాను
[10–53

చిమ్మిలిబొమ్మ
కావరాన నీవుగూడి కౌఁగిటనే పిసిపేవు
శ్రీ వెంకటవిభుఁడు చిమ్మిలిబొమ్మ
[13–97

చిముడఁబెట్టు
ఎంతపని యిది యానతియ్యరాదా యీ
చింతచే నీ మనసు చిముడఁబెట్టేవు
[12-202

చిముడు
చెక్కతని నేనొక్కితే చిమిదేవదేమే
[14-199

చిమ్ముదొమ్ము దిమ్ములు
చిన్న చిన్న చిటిపొటి చిమ్ము
దొమ్ము దిమ్ములవి
వున్నవన్నియుఁ జూడ నొకటేకా నిజము
[5-91

చియ్యను
నెయ్యపు హేయము నిచ్చలుఁ గడిగెద
చియ్యని రోయను సిగ్గుఁబడను
[9-28

చిరుతపొగలు
అటమరి పెటపెటమని బెల్లెగసి
చిటచిట రవములఁ జిరుత పొగలెగసి
[8-239

చిల్లర
కాంతమాటలు నీకుఁ గట్టిన ముడుపుగాక
చింతల నింతలోననే చిల్లరయ్యెనా
[14-158

చిల్లర కులము
చెల్లఁబెట్టుదు రెండైనా చిల్లరకులము వారి
తెల్లమిగా మంత్రోపదేశమున
[10-199

చిల్లరదోషాలు
చేయనివాఁ డెవ్వఁడు చిల్లరదోషాలు
యేయెడ జీవులజాడ లీశ్వర కల్పితమే
[6-72

చిల్లరపని
చిల్లరపనికే కాని చేరఁబిలిచి వైకుంఠ
ముల్లసాన నిచ్చేవారు వొకరూ లేరు
[9-34

చిల్లర మనుజులు
దేవుఁడు కారణము తెలిసిన వారికెల్లా
జీవుఁడు గారణము చిల్లర మనుజులకు
[5-295

చిల్లర సతి
కొల్లగా శ్రీవెంకటేశ కూటితివినన్ను నేఁడు
చిల్లర సతిని నా చేతి కియ్యవలెనా
[17-252

చిల్లర సింగారాలు
చిల్లరసింగారాలు చెలులు వేయఁగ నేను
వొల్లనని యిన్నాళ్లు నుంటింగాని
[4-127

చిల్లరైన యిల్లు
చిల్లరైనయిల్లు మా యింటఁ జేసిన
పాటారగించు
చల్లతోడి బోనమైన చాలుఁజాల దనకా
[6-60

చిల్లులఁగాదు
వొడలు మోఁచితిమి వున్నతిఁ బెరిగితిమి
వెడఁజిల్లులఁ గారేది విడిపించ లేమయ్యా
[10-136

చిల్కలేని పంజరము
పంజరంబైతి లోపలఁ జిల్కలేని
పంజరంబునుబోలె పట్టలేకున్నా
[వ. యో. వి. 5-1471

చిల్లాపొల్లు
చిల్లాపొల్లాయ నీ మెయి జెమట
ముత్తెములెల్ల
పెల్లరేఁగి నీవె చక్కఁబెట్టుకొనరాదా
[17-158

చిలికించు
మటమాయములఁ దనమగువ పసిఁడి పీరు
చిటిపొటి యలుకలఁ జిలికించఁగా
[5-178

**చిలి విషములు**
వలువిధంబులఁ బాలుపడి మాపుదనకఁ
జిలివిషంబులు గొన్ని సేయుచున్నాఁడు
[వ. యో. వి. 5–242

**చిలుక చదువులు**
తెలిపే గురుడుండఁగ తెలియఁగ నేరమ
చిలుకచదువు వేరో జీవుఁడ
[16–1–14

**చిలుకలవోఁ చాలు**
బలిమిని యానల బారి బడకు మరి
చిలుకలవోఁ దాలో చిత్తమా
[16–1–12

**చిలుకవొట్లు**
పలుమారు వనములో బాయకవుండఁగానో
చిలుకవొట్లు మోవిఁ జెలరేఁగెను
[18–414

**చిలుకవోట్లు**
చిగురుఁగెమ్మోవిపై చిలుక వోట్లమనునా
మిగులఁగ కోవిలల మేఁతగాక
[14–60

**చిలుకు**
సెలవుల నవ్వువుట్టె చేరువకు నీవు రాఁగా
కలసిన నీకాఁగిట గర్వమువుట్టె
యెలమి శ్రీవెంకటేశ యిన్నిటా
ధైర్యము వుట్టె
చిలుకుఁ జెలువముల చిత్తగించవయ్యా
[14–15

**చిలుకు గోళ్లు**
చిలుకు గోళ్ళతోడ సెలవి నవ్వులతోడ
బలుజిహ్వతోడ యోగపట్టెముతోడ
[7–44

**చిలుకుఁ జూపులు**
చిలుకుఁ జూపులతోడ సెలవి నవ్వులతోడ
నిలుచున్న దెవ్వతో నీ ముందరను
[18–310

**చిలుకులు**
కన్నుల చూపులు గాలపు చిలుకులు
వెన్నెల నవ్వులే వెలితెరలు
[9–6

**చిలుకొట్టు**
నెలచెల్వరాల వెన్నెల సొగడాల
చిలుకొట్టి సేవల సెజ్జలమీఁద
[అ. మ. క. 2434

**చిలుపము**
మాటలమూటల చద్ది మనసులో చిలుపాలు
యేఁటిసేసీ విందువెట్టె నింతి నీకును
[14–166

**చివుకు తవ్వు**
చిరకాల ధర్మములు చివుకుదవ్వఁగఁబోతే
హరిమఱఁగు చొచ్చితి మాతఁదేరక్షించెను
[7–261

## చీ

**చీఁకటికి దీపమెత్తు**
తెలియఁ జీఁకటికి దీపమెత్తక పెద్ద
వెలుఁగు లోపలికి వెలుఁగేలా
[5–18

**చీఁకటి కొన**
కనకము దాటితేనే ఘన సుఖమున్నది
వెనక చీఁకటికొన వెలుఁగున్నది
[9–19

**చీఁకటి తప్పు**
పుడికి నతిఁ గైకొంటి పురుషోత్తమా
పొడమెఁ జీఁకటితప్పు పురుషోత్తమా
[7–49

చిట్టికాన రేపల్లెలో చీఁకటితప్పు సేయఁగా
అట్టె రాత్రులు మేననంటి నట్టుండెను
[10–177

చెప్పఁబోతేఁ బనలేవు చేసిన నీచేఁత లివి
యిప్పటి చీఁకటితప్పు లివియే కాని
[14-222

చెదరేవు నీమేను పెనుగోర నంటితేను
చెదరి చీఁకటి తప్పుసేయ వానిపలెను
[15-19

చీఁకటి తప్పుగొను
యెక్కఁగుట్టము గోళిగె నెనసి
పైకొంఁటే రొతు
తక్కక దానిఁ జీకటి తప్పుగొనవచ్చునా
[6-214

చీఁకటి తప్పుసేయు
మొక్కలమది చాలదా మున్ను
త్రిపురాంగనుఁ
జిక్కించి చీఁకటి తప్పు సేసినది
[15-25

చీఁకటి దవ్వు
జీవులు నిన్నెఱఁగక చీఁకటి దవ్వగనేల
శ్రీవెంకటేశ్వర నిన్ను సేవించేదే నేరుపు
[16-182

చీఁకటి దవ్వుకొను
కలకాలము చీఁకటి దవ్వుకొ నెడి
వలలభ్రమల నెవ్వరు వడరిట్లా
[5-163

చీఁకటి దేహము
మాకువంటి జన్మము గల కాలము
చీఁకటి దేహపు చిత్తపు గుణము
[10-268

చీఁకటిద్రవ్వు
అడియాసవలనపాయని చలంబునుఁగలిగె
కడు మమతవలన చీఁకటి ద్రవ్వఁగలిగె
[5-71

చీఁకటిపడు
విడువవు భవముల వెంట వెంటనే
విడుముడిఁ జిత్తము చీఁకటివడెను
[8-50

చీఁకటి విరిచుక్క
కడుదూర మరిగి చీఁకటి విరిచుక్క
వాడుచువేళకుఁ గృష్ణపురిఁ జేరవచ్చి
[వ. యో. వి. 7-721

చీఁదరగొను
చీఁకటి వాసినమీఁద చీఁదర గొనఁగనేల
మాఁకు వంటి వెడబుద్ధి మానదిదేమయ్యా
[11-27

చీఁదరరేఁగు
అంగమెల్లఁ జెమరించినట్టే గందము
గరఁగె
సింగారించుకొన్న కొప్పు చీఁదరరేఁగె
[14-196

చీకురు వాయులు
సాకిరి వయసు సంసారము గోరు
చీకురు వాయులు జీడిమాను గోరు
[10-107

చీటకము
చీటకపు చెమటల చిట్లు గందాలట
మేటిదార బిలువరే మెరసీనట
[17-183

చీటి
ఆ రమణికి నీవు అంపిన సొమ్ము వీడకుఁ
జేరెను తబ్బిబ్బుగాను చీట్లతోనే
[13-213

పావురము రెక్కఁజీటి నీవొద్దికిఁ
గట్టి యంపి
దేవరకే మొక్కుకుందురా - వెంకటేశ
సేవించు రావలెనంటాను
[13-223

చీటికి మాటికి
పాటించి తనిప్పుడు నా పానుపుపై
గూచుండితే
చీటికి మాటికి సేవసేసే నేను
[14-11

చీటికిమాటికిం బలుకు చెల్లఁగఁ
బెట్టెను నీదు చెక్కులం
గాటుక లేలవచ్చె నవి గానక
యాటిటివేమొ చూచుకో
[శృం. వృ. ప. శ. 99

**చీమంత**
చీమంత యిడక తెచ్చిన కాసులెల్ల
వేమాఱు డావంగ వేసరి యేను
[ప. యో. వి. 4–509

ఆయెడవేము చీమంత యోడినను
వేయింపు శూద్రులఁ జేయించునాజ్ఞ
[ప. యో. వి. 4–1225

**చీమంత మాట**
చీమంతమాటైన చెవిలో నీకు బోధించు
కోమలి నీ కెన్నాళ్ళకు గురుతాయఁగా
[17–482

**చీరచిక్కు**
యిందరితో నీమాటయేమని చెప్పుదునమ్మ
చెంది యీ కృష్ణుడు చీర చిక్కించేను
అందము సేసుక నేను అణంచుక
వుండే నంటే
మందమన్నాఁ డిదె నా మగఁడూర లేఁడు
[17–258

**చీరవెలిగా నవ్వు**
చీరవెలిగా నవ్వేవు సిగ్గు విడిచేవు
మోరవిడుపు చేసుక మాఁటలు నాఁకేవు
[4–128

**చీరికిఁ గైకొను**
కలుష రౌద్ర దుఃఖముల కించుకా
కలఁగను చీరికిఁ గైకొనను
[6–181

## చు

**చుంగు పయ్యెద**
కుంగిచేతిపై నొరగి గొబ్బున మెయి
చెమరించె
చుంగుపయ్యెదెత్తరాదా చుఱుకనె మనసు
[13–106

**చుంగులు వాలు**
చుట్టిన కెలఁకులఁ జుంగులు వాలఁ
గట్టిన హేమాంశుకంబు చూపట్ట
[ప. యో. వి. 673

**చుంచు**
ముంచిన నీ చెక్కు లద్దముల మించులు
పంచమోవి చుంచులు బింబపు టంచులు
[13–155

**చుక్కబొట్టు**
వెక్కసమై నా మాట వీను లాలకించునట్టే
చుక్కబొట్టే పెట్టఁబట్టె నూటియెందాకనే
[14–22

**చుక్కల పొడవగు**
సూక్ష్మమై శ్రీ వెంకటేశ చుక్కల
పొడవుగాఁగ
పక్ష్మనక్షత్రమువలె యాభరణ హారములు
[7–46

**చుక్కలు మూయు**
జలనిధి పొంగణఁగె చాయల
చుక్కలు మాసె
వలరాచగురు నుప్పవడము గమ్మనరే
[10–130

**చుక్కల మూక విప్పు**
కలువలవైరి చుక్కల మూకవిప్పు
జలజబాంధవుఁడు క్రౌంజాయతో బొడమె
[ఉ. క. 1097

**చుక్కలు మొలపూసలగు**
ఒక్క మొలగంట చంద్రుఁ డొక్క
మొలగంట రవి
చుక్కలు మొలపూసలై చూపట్టఁగా
[11–175

మించిన చుక్కలు మొల పూసలుగాఁ
ఎంచె మేను పెళపెళ నార్చి
[11-2-67

నిక్కిన కర్ణము లవే నీలమచ్చ పుర మిదే
చుక్కలు మొలపూసల నొక్క రూపమిదే
[7-145

మొక్కరయ్య అన్నిటికి మూలమీతఁడు
చుక్కలు మొలపూసలై సొంపుమీరినీతఁడు
[8-148

పూని చుక్కలెల్లా మొలపూసలుఁ గాగఁ
బెరిగి
భానుకోటి కాంతితోఁ జూప్పడు
హనుమంతుఁడు
[11-195

## చుక్కలు మోచిన దవ్వు

చుక్కలు మోచినదవ్వు చుట్టటీక మిదియని
యిక్కువతో వీధినేఁగ నెన్నికైనదేవుఁడు
[5-249

## చుక్కలు మోయు

చుక్కలు మోవఁ బెరిగి సుతు
(సూర్య ?) వద్ద వేదాలు
పుక్కిటఁబెట్టఁ గలశాపురహనుమంతుఁడు
[10-167

ముట్టిన చుక్కలు మోవఁగఁ బెరిగితి
విట్టి ప్రతాపివి యెదురేదయ్యా
[9-132

యెదిరె నిదిరె నదె యిందిరాధిపుని తేరు
కదిసి చుక్కలుమోచె కనకాద్రివలెను
[10-55

చుక్కలు మోఁచీ జూపు లెదుటనే
నెక్కొను మతికిని నిలుకడ యేది
[10-131

చుక్కలు మోవఁగ సొంపుగఁ దోలితి
తొక్కుల దేవర దేవెచ్చరికె
[11-2-30

## చుక్కలు మోవ పెరుగు

చుక్కలు మోవఁబెరిగి సూర్యుఁడు
దాసైనాఁడు
చిక్కుబాతాళము దూరి శేషుఁడై నాఁడు
[11-167

## చుట్టపు వరుస

చుట్టపు వరుసఁ గొంత చూచిఁ గాక
అట్టె యేమన్నా నెదురాడేవా నీవు
[15-145

## చుట్టముఁ జేసుక వచ్చు

ఎట్టివేసాలు సేయఁగ వద్దు గాక
చుట్టముఁ జేసుక రాఁగా సూడు వట్టినా
[18-331

## చుట్టాల సురభి

చుట్టాల సురభివని నొకనాడి నంతలోనె
నిట్టచూపులు చూచేవు నీ వెరఁగవా
[16-2-25

## చుట్టాలు పక్కాలు

నెట్టన సర్వాంతరాత్మై నిలుచున్న
దేవుఁడిట్టె
చుట్టాలపక్కాలపాటి శుభమియ్యనోపఁడా
[16-1-42

## చుట్టుకొను

యిట్టి శ్రీవెంకటేశు నిరవుగ సేవించి
చుట్టుకొన్న యానంద సుఖమే చాలు
[10-65

నీఁగని నా మరులిదె నీవుచుట్టుకొననేల
ఆఁగినేనే పొట్టు పొరలయ్యేఁగాని
[15-152

చుట్టరికమైనచోట చుట్టుకొనుమొగమోట
పొట్టఁబొరుగై తేను పొందుగలుగు
[18-255

చుట్టుఁ బళ్లెము
మేరుమందరాల వలె మెరయు నిద్దెనలు
సూరియ చంద్రులవంటి చుట్టుఁబళ్ళెలు
[9–10

చుట్టు వేడెము
మట్టిదైత్యపురాల మర్మాలువిదళించినాఁడు
చుట్టు వేడెమున యింతా సోదించినాఁడు
[11–10

చుట్లచొళ్లేలు
చెట్లవంటి చన్నులు చేతముట్టి పెనఁగీని
చుట్ల చొళ్లేలతోడఁ జూడరే యీబాలుని
[18–139

చుట్లత పారపు చుంగులు
దండవెట్టి నల్లవాఁడే దైవాలరాయఁడు
దండినెట్టెపుఁ జుట్లత పారపు చుంగులవే
[7–253

చురు చూండ్లు
చూచిన మోహపుఁ జూపులఁ
జురుచూండ్ల కెడమియ్యని
రాచతీకపు నెరజాణఁడు రసికుం
డాతఁడెపో
[5–132

చుఱచుఱఁ జుట్టుకొను
కఱతలయోగిని కర్మము లివంటునా
చుఱచుఱఁజడునైతేఁ జుట్టుకొనుఁగాక
[7–211

చులకఁదనము
చనవునఁ బెనగఁగా నమ్మతించకుండితేను
ఘనతయేది? చులకఁదనవే కాక
[13–11

చులుకఁదనము
వెలినున్న రమణుని వేడుకనేఁ బిలిచితే
చులుకఁదనముఁరాదా చూడగానె యిపుడొ
[17–498

చుల్లరపు సేతలు
ముల్లుచూవ తొలుతేల మొక్క-
తల వంచనేల
వొల్లనె యప్పటిజాడ నుండరాదా
చుల్లరపు సేతలేల సుదతికి చిక్క-నేల
జెల్లుబడిగా బుద్ధులు చెప్పరే యీతనికి
[15–159

చుల్లరపెట్టు చేఁతలు
చుల్లరపెట్టుఁజేతల బొక్కి-నాధదు
వుల్లముతో నీ నెలఁదలూరి బొక్కి-నాధదు
[16–2–20

చుల్లరీఁడు
చుల్లరీఁడపై యెండైనా జొరఁబారేవు కెరలి
పల్లటీఁడపై పడుచువనుల దిరిగేవు
[13–170

## చూ

చూడు
ఒప్పదువో యింక కొరవులం జూడేవు నా
కొప్పులెఱుంగవు యింక నొగిలించేవేలరా
[4–8

చూపు నొవ్వు
యాగాగ్ర పూజార్హుఁడైనట్టి దివ్య
యోగివాఁడని చూపు నొవ్వు దీపింప
[వ. ఫ్రొ. వి. 2–1610

చూపెట్టుకుండు
మనవార్తి నానాటి మాయచూపెట్టుకుండితే
జనించిన తనకు విజ్ఞాన సిద్ధియగుట
[7–272

చూపోపు
ఉదరి మాయకక్కఁ జూపోవక మీరు
పదివేలు ననసేలఁ బందలా రనుచు
[వ. యో. వి. 4–1299

చూమరలు
చూమరలఁ జూడఁ జూడఁ జుట్టాల వలనెవుండి
దోమటి పంచేంద్రియాలు దోడుగాక పోయను
[16-1-6

చూరగొను
నీవు నిర్మించినవే నీకే సమర్పణసేసి
సోవల నీకృపయెల్లఁ జూరగొంటిమి
[8-49

చూరలాడు
అతని సద్గుణకీర్తు లనెడి చంద్రికల
శ్రుతిచకోరములచే జూరలాడుచును
[అ. ప. క. 4551

చూరలుగొను
వలవనిజోలే యింతాను వడినిది గాక యేమిసేసినను
సులభమిందునే తొల్లిటివారలు చూరలు గొనిరదే మోక్షంబు
[8-101

చూరవిడుచు
వేడుకలర వెంకటాద్రి వెలసి భూతకోటి దన్నుఁ
జూడఁదనుచు మోక్షపదము చూరవిడిచె నీతఁడు
[11-3-112

చూరాడు
కొదలు మాఁటలనె గొణఁగుచు భువి
సుదతల సిగ్గులు చూరాడి
[16-2-82

చూఱ
అట్టడియాపె పెదవి చూఱలకు నాసపదేవు
[14-205

చూఱలుగొను
అరడి శ్రీవెంకటేశుఁడలమేలుమంగఁగూడి
చూఱలుగొన నెక్కెను శోభనపు తేరు
[10-35

## చె

చెంగలించు
తచ్చి నీకు వేఁడై తే తామర వోరుచునా
చెచ్చెరఁజల్లనై వుంటేఁ జెంగలించుఁగాక
[13-81

చెంగావి
సింగారపు సొమ్ములతో చెంగావి ముసుగుతోడ
[13-58

చెంజెమట
ఇచ్చకమాడ నెఱఁగ నేమిసేతునే
హెచ్చిఁ జెంజెమటలు యేమిసేతునే
[15-71

చెండివేయు
కొండమీఁదఁ గూచుండి దైత్యుమై
చెండివేసె నీ సింహము
[10-175

చెందిన చుట్టము
చేరిదగ్గరిన తొల్లి చెందిన చుట్టాలమే
తారుకాణలేక సందడి మరుపాయెను
[17-400

చెంబుమీఁది కనకపుఁ బూత
శ్రీకాంతునిపై జేయని భక్తులు చెంబుమీఁది కనకపుఁ బూత
దాకొని విష్ణుని తెలియని తెలువులు తగనేటి నడిమిపైరులు
[7-1

చెక్కడచు
చెక్కడచితేను చేటఁడు వలపులు
వొక్కమాటె నే నోపుదునా
[15-208

చెక్కలువారు
చెక్కలువారగోళ్ళఁజించి చెండాడినయట్టి
వెక్కసీఁడు వీఁడివో వీరనారసింహుఁడు
[10-162

చెక్కుచేతనుండు
అక్కలాల అమ్మలాల అందరున్నారిదె
చెక్కుచేత నుంటఁగాక సిగ్గువడి వుంటినా
[15-96

చెక్కుచేయి
చిక్కని తేనెలవంటి చెలియమాటలె నీకు
చెక్కుచేతి చింతలకు జిగురై యుంటె
[14-224

చెట్టడచు
చెట్టడచిన నిదె చేటకువండ్లు
గుట్టుదెలుసుకొన గురి నేను
[6-99

చెట్టాపట్టాలాడు
చేలలంటి గోపికల చెట్టాపట్టాలాడితివి
యీలీల మాఁడు పూరిలో యిట్లాదేవా
[8-179

చెట్టునడిగిన పిందియ
చెందిన జిగితోడఁ జెట్టు నడిగిన
పిందియకరణిఁ గాన్పించెద విపుడు
[ప. యో. వి. 2-1153

చెదరు
చెక్కులతమ్మ చెదరుచేతఁ దుడిచితిఁగాక
తక్కిన వెలుగుదునా తప్పులు నేను
[17-380
[నిఘంటువులలో క్రియగానే ఉంది. ఈ ఆరోపం విశేషణానికి ఉదాహరణ]

చెన్నుఁడు
అన్నిటా శ్రీవెంకటేశు నిన్నాదరించి
నిన్ను గూడె
చెన్నుడంటా నితనిఁ జెవిలో మెచ్చేవే
[14-171

చెన్నుమీరు
చెన్నుమీర నీపెట్టుఁ జెట్టే జీవులెల్లాను
వన్నెగా నీ సొమ్ము నీవు వలసినట్టు సేయ
[11-9

చెప్పఁ జూపఁ గతలు
ఎలమితోఁ దిరువెంకటేశుని బొందినయట్టి
చెలియ గర్వము నేఁడు చెప్పఁజూపఁగతలు
[4-33

చెప్పితేఁ బాసును
చెప్పితేఁ బాసునందురు చేసినదోసములెల్లా
వొప్పుగాని మన్నించ నుచితమౌ నీకు
[7-78

చెప్పుడు బుద్ధులు
చెప్పుడుబుద్ధులెందాక చిత్తములో నిలిచెనే
[17-288

చెప్పుడు మాటలు
చెప్పుడుమాటలె చెప్పుకొనుటగాక
చెప్పినట్లఁ దాము సేయరెవ్వరును
[5-133

చెయ్యారఁగను
నెయ్యనిపోసుకోరాదు నీళ్ళనిచల్లఁగరాదు
చెయ్యారఁగంటిమి నేఁడు చేరి నీతోఁ
పొందులు
[14-35

చెయ్యారచేయు
అయ్యేవను లేవిధాన నయ్యీఁగాక
చెయ్యారఁ జేసిన పనికి సిగ్గు లిఁకనేలా
[17-458

చెయిచాచు
శ్రీపతి నీకే చెయి చాఁచెదము
యేపున మమ్మిఁక నీదేర్చవే
[8-19

పాలజలధిపై దేవుని వారము పొఁడి
మాకు నిఁక నేమరుదు
ఆలింపగ నే మింతటివారము
అన్యులకిఁకఁ జెయిఁ చాఁచేమా
[9-82

చెయిమీఁదగు
నీచెయ్యే మీఁదాయె నీకుఁ జెల్లురా నిన్ను
యేచి వలపుల బయ లీదింప నైతిరా
[17-331

చెయిమీరు
మేలముతోడఁ బల్కి
చెయిమీరెదనంచుకొ వెంకటేశ్వరా
[శృం. వృ. ప. శ. 103

చెయి లోనగు
చెక్కులెల్లఁ బులకించె చెలికి
చెయిలోనాయ
వెక్కసాన దగ్గరీని వీఁడె చూడరె
[15-243

చెయివూఁత
చెలిమి విడువలేక చెయివూఁతలు
యిచ్చెఁ గాక
[16-2-68

చెయ్యూఁదు
పల్లకి దిగి వెంటఁ బరగు వైపపుని
నల్లన చెయ్యూఁది యాలోని కరిగె
[అ. చ. 825

చెయ్యొగ్గు
నాకు నాకే సిగ్గయ్యీని నన్ను
జూచుకొంటేను
చేకొని నీవే మన్నించఁ జెయ్యొగ్గేఁగాని
[10-2

చెఱఁగు మాయు
మొఱఁగకురా నీ మోహము నా
చెఱఁగు మాసె నిదె చెల్లె నీ చేఁత
[12-285

చెఱఁగు మాసినవేళ చేరి ముట్టవచ్చేవు
కొఱకంటా వద్దంటేఁ గోపగించేవు
[17-268

చెలప
వలపు నీపై నించె వడిఁ బులకలు వెంచె
చెలప చెమటలవె చెక్కున ముంచె
[15-121

చెలువరి
సింగారపు మేని చెలువరి యింక
చెంగలింతురా చెలువరీ
[16-2-21

చెల్లపిళ్ళలు
తలిదండ్రిగలవారు తమ లేము లెఱఁగక
చెల్లపిళ్లలై యాటలఁ జెందినట్లు
[8-54

చెల్లఁబెట్టు
కల్లని మీ త్రివిక్రమాకారము చూపె మీరు
చెల్లఁబెట్టితిరి వేదశిఖలందు మరియు
[8-68

యిదివో శ్రీవెంకటేశు డిట్టె తా నన్నునేలె
చెదరని ప్రియమెంత చెల్లఁబెట్టీని
[18-354

చెల్లుచీటి
క్షితినాథుచే సొమ్ము చెల్లినందులకు
నితనికి నిప్పింపుఁ డిటఁ జెల్లుచీటి
[వ. యో. వి. 6-610

చెల్లుబడి
చెల్లుబడి ధర్మరాయ చెప్పరాని వలరాయ
కొల్లలై నభోగరాయ కొండలకోనేటిరాయ
[7-225

యిల్లాలై సుఖమిచ్చి యెంచఁ బుత్రులైన
వాఁడ
చెల్లుబడిఁ దామొక్కొటి చేతిపై శ్రీహరియే
[10-11

ఇల్లురికి మాతో నేల యీవడించ వచ్చేవు
చెల్లుబడాతని మీఁదఁ జేయవే నీవు
[13-252

చెల్లుబడిగలవారు చేసినచేఁత
చెల్లఁబెట్టవలసితేఁ జెల్లింతువు
[14-18

చల్లరపు చేఁతలేల సుదతికి జిక్కనేల
చెల్లఁబడిగా బుద్ధులు చెప్పరె యీతనికి
[15-159

చెల్లుబడి దయచేయు
తల్లికిలేని ముద్దు దాదికి గలదా మరి
చెల్లుబడి నీవే దయ సేయుట గాక
[8-167

చెల్లుబడి యిచ్చు
గానిరి మచ్చరాన నీ కాంతమాన చేనివలె
చేసినచేఁతలకల్లా చెల్లుబ డిచ్చితిరా
[16-2-52

చెల్లుబడివాఁడు
చెల్లుబడివాఁడవు వే చేసినదే చేఁతగాక
వల్లదావఁ గొంగువట్ట భావ్యమా నాకు
[18-193

చెల్లుబడులగు
ధర దదీయ ప్రసాదపు విశేషమెకాదె
సిరుల శ్రీవెంకటేశ చెల్లుబడులాయ
[5-224

చెల్లుబళ్లు
జగతిఁగల చెల్లుబళ్లై
వగినగి భూషించునట్టి నానుడి పలుకుల్
[నం. ఆ. 59

చెవి పండుగ
అనుచు సుభద్ర దానాడు వాక్యములు
వివి చెవి పండగై విజయు డిట్లనియె
[సుభ. క. 622

చెవిఁబెట్టు
చిలుకాలు వద్దనిన చెలుల మాటలు చెవిఁ
బెట్టవు నీకుఁ దగిన బీరములె కాని
[15-220

అప్పుడే నీఁకు దొంగనియేను జాటి
చెప్పిన నామాటఁ జెవిఁ బెట్టవైతి
[వ. యో. వి. 4-1394

చెవియొగ్గి విను
చేదెల్లా నీ మాటలె చెవియొగ్గి వినఁగాను
[16-2-85

చెవి సోఁకు
ఉదిరి యస్మద్గురుబోనన్నమో యనిన
సుదతి వాక్యము చెవిసోఁకె సోఁకుటయు
[వ. యో. వి. 6-856

తవిలి కొండలు వచ్చు దళముల దళము
చెవిసోఁకఁ గడనుండి చేటుల్లిలిడఁగ
[వ. యో. వి. 7-90

చెవులకు వేఁడియగు
వినియది చెవులకు వేఁడియై యున్న
ననయంబు వగచు రామానుజార్యునకు
[వ. యో. వి. 8-689

చెవుల పండుగ
అంతరంగములోనను అయము
నీ చింత నాకు
బంతి నీ మాటలె చెవులపండుగ నాకు
[15-197

చెవులఁ బుడుకలు విఱచు
గడుసులేమియు నెఱుంగని రాజు చెవులఁ
బుడకలు విఱచి రేపును మాపు వచ్చి
[వ. యో. వి. 3-1247

చెవులు చిలులగు
చెప్పకువే వాని సుద్ది చెవులెల్లాఁ
జిలులయ్యీ
[15-102

## చే

చేకత్తి
చిగురుమోవి మాటల చేకత్తుల వంకాల
దగిలి నీపై యాపె దండవెట్టీని
[14-149

చేకత్తిగోళ్లు
చెంతలఁ బెనగఁబోతే కత్తిగోళ్ళే తాఁకు
నంతేసి లోఁతులు బొగనాఁడువారికేలా
[17-458

**చేకాచి**
చను మొనలు సోఁకఁగా జాణతనపుఁజేఁతలు
చెనకలేకనా కొంత చేకాచి కాక
[16-2-58

**చేకానిక**
ఆ కెఱుఁగు నీవూ నెఱుఁగు దదివొ మాట
చేకానిక నీకిమ్మనె చెలియ నన్నిపుడు
[13-112

**చేకానికలు**
పరివార వాద్యసంభ్రమము రెట్టింపు
కరమొప్పఁ జేకానికలు గొనివచ్చి
[అ. చ. 725

**చేకానిక**
చన్నులు నేలమోవ సాగిలి మొక్కి రావే
వున్నతి చేకానికె వొద్దబెట్టి రావే
[13-215

**చేకానుకలు**
కై కొను నీ రతిఁ గలనేటి కాంక్షలు
చేకానుకలనే చెప్పిని
[18-403

సొలయక 'శ్రీనివాసోరక్ష'తనుచు
నెలమిఁ జేకానుక లిచ్చి రిచ్చుటయు
[వ. యో. వి. 3-1029

**చేకానుకిచ్చు**
శ్రీవెంకటేశ్వర నీకు చేకాను కిచ్చేనంటే
లావు సంపదల నీవు లక్ష్మీనాథుఁడవు
[8-159

**చేకొద్దివాఁడు**
చేకొద్దివాఁడవు గాన చెప్పె నీకుఁబనులెల్లా
మాకు నిన్ను గేలిసేయ మరి యేలా
[13-202

**చేకొను**
ఆకటి రుచులివి యణఁగినపుడవో
చేకొని సుఖమును జెందేది
[7-177

శ్రీవెంకటేశ్వరుఁడు చేరి నిలుచున్నవాఁడు
సేవించినయంతలోనే చేకొని యేలునితఁడు
[10-138

**చేకొలఁది**
యీకడ శ్రీవెంకటేశ్వరుఁడ వైతివిదె
చేకొలఁది నిటుపీకె చెల్లు నీ మాట
[11-103

**చేఁగదేరు**
కాఁగిట నంగన గలసినవాఁడవు
మాఁగిన సిగ్గులు మరియాల
చేఁగదేర్చె నిదె శ్రీవెంకటేశ్వర
వీఁగక ననుపులు విడువకు మీఁకనూ
[17-34

[సూ. ని. లో చేగ అని అర్ధానుస్వార రహితంగా మాట ఉంది]

**చేఁగ దొలుచు**
తొలుప్రాయపు మింద తుమ్మెదా కడు
దొలిచేవు చేఁగవే తుమ్మెదా
[4-9

**చేఁగెక్కు**
వలుమరు నీతో వంతములాడగ
చెలియకు గుచములు చేగెక్కె
[17-12

**చేగడియ**
చేగడియదీసి వొచ్చి శ్రీవెంకటేశుఁ గూడె
వేగిలించి మావిదన వెలువల నున్నది
[17-476

**చేగదేరు**
ఆగమభోగములకు హరివాలోనున్నవాఁడు
చేగదేర నాకు మేలె చింతించుఁ గాక
[7-245

భాగవతులైనవారు వట్టినదెల్లా నీదేరు
చేగదేర వారలు సేసినదే చేఁత
[8-119

చేగదేర నీవు నన్నుఁజేసిన మానిసి నింతే
సొగల నా యజ్ఞానము చూడక రక్షించవే
[8-199

చేగమీరిన పనులు
చేగమీరిన పనులే నేపేవెల్ల
బాగుమీరఁ దనపై వచ్చే దెరఁగడు
[17-502

చేచాచి మొక్కు
యీ లీల శ్రీ వెంకటేశుఁ డెదుటనె
వుండ(గా?)
మూలలకుఁ జేచాఁచి మొక్కు నిక నేలా
[8-187

చేచాఁచు
అదన మన్నించఁగానే ఆసఁ
జేఁచాఁచితిఁ గాక
చెదరకనాఁడే నాకుఁ జేతిలోని వాఁడవు
[8-269

వీరిదై పొడలెక్కి విరుగఁబడఁగనేల
చేరియుండి నంతకే చే చాఁచరాదా
[11-131

చేచేత
చూచిచూచి నీ మూరితి నా బొమ్మగఁ
జేసుకొని
చేచేత నాలో ధ్యానము సేయుచు
నున్నాఁడను
[7-61

కాచేదెఱఁగరా ఘను డితఁ డెవ్వరైనా
చేచేత శరణంచుఁ జేకొనే బిరుదు
[9-62

యేచిన శ్రీవెంకటేశుఁడే యితఁడట
చేచేతఁ బూజింప సేవలు గొనఁడా
[8-141

చేచేత చేయు
లాచిపెంపుడుఁ గుఱ్ఱలు లలిన జీవులెల్లాను
చేచేత నీ దాసులను నేసినట్లు సేయు
[11-9

చేటకాడు
చేటకాళ్ళ మించిన ఘాతము
పోటుదారల పెద్దఘాతము
[11-3-43

చేటఁడేమి గంపెఁడేమి
నెలవి నవ్విన నవ్వు చేటఁడేమి
గంపెఁడేమి
పలుకులన్నియు నేమి పదరనేమి
[18-287

చేటవేలుపులు
సరి నెందువోయ్యేవంటే సకినాలువాటించి
తిరిగి తిరిగి వచ్చి తిట్టేవేరా
అరుదు నీకింతైతే నందువుయ్యేవనులకు
వెరవుతోడఁ జేట వేలుపులఁ జూడరా
[17-212

చేటువాటు
కీటమై వేంకటగిరి కిందనైనసుండక యీ
చేటువాటు కేలనోఁచె చెల్లఁబో ప్రాణి
[5-202

చేటెఱుంగని కూన
చేటెఱుంగని కూన చెలిచిత్తమే కదా
కోటికిని బడగెత్తెఁ గోరికలును
[4-135

చేడవెట్టు
బొడ్డుచెర్ల బొమ్మిరెడ్డి పొలమెల్లఁ జేడవెట్టి
గడ్డనుండి పైరువిత్తి కారుకుండగా
[11-2-41

చేతఁజుట్టుకొను
చేసిన పుణ్యము చేతఁజుట్టుకొని
రాని వెనుతగిలి రక్షించు
[11-7

చేతలు చిగుళ్ళగు
చేవ మా చేతలు నిట్టెఁ జిగుళ్లై
నిలుచుఁ జూమ్మీ
శ్రీవెంకటేశుఁడ ముందే చేకొనే
ఉన్నదానను
[18-11

చేతికిచ్చు
శ్రీవిష్ణునామమొకటే చేతికిచ్చె వైకుంఠము
తాపై యున్న నామములు తమికించి నివిశి
[9-8

చేతికి లోఁజేసుకొను
చూతమిఁక దనలాగు చూపే నీకు వట్టిసిగ్గు
చేతికి లోఁజేసుక చెనకఁగరాదా
[18–465

చేతికి లోనగు
చేతికి లోనైనప్పుడు చెప్పేఁగాని
యేతులసెలవి నవ్వు వీడనేలా
[15–231

ఏమని విన్నవించేను యెన్నని కాచేవు నీవు
శ్రీమాధవుఁడ నీకుఁ జేతికి లోనయ్యే
[10–208

చెలరేఁగే వదియేమే చేతికిలోనాయనంటా
వలపుమీఁద గలవాఁడు గాఁడా
[17–340

చెలిమిసేసినవాఁడు చేతికి లోనైనవాఁడు
తలచినప్పుడే నా దండకు రాఁడా
[18–348

చేతికి లోనైవుండు
చేతికి లోనైవుండునే చెప్పినట్టు సేసునే
యీతలఁ దనగుణము లేమని చెప్పుదునే
[18–123

చేతికివచ్చు
చింతించఁ జింతించఁ జేతికివచ్చె మనసు
అంతలో శ్రీవెంకటేశుఁ డందికాచెను
[10–219

చేతి నిధానము
చేతి నిధానము శ్రీ వెంకటపతి
యేతలఁ జూచిన నిందరికి
[6–43

చేతి పరుసమై యుండు
శ్రీవెంకటేశుఁడే మనచేతిపరుసమైయుండి
తావున నిహపరాలు తానియ్యఁగాను
[8–196

చేతిపైఁడి
వెక్కసాన చేతిపైఁడి వెలవెట్టికొనవద్దు
చిక్కులెల్లాఁ జాపెటి సంజీవి వున్నదిదివో
[16–1–54

చేతి ముసిడికాయ
జిగిగల చేతి ముసిడికాయయగునన్ను
మొగిఁగల్పకము ఫలముగఁ జేయగ
వసమా
[5–124

చేతివాఁడు
యింతటిదైవమవు నిన్నింతనెందు వెదకేను
చెంత శరణాగతుల చేతివాఁడవు
[8–188

చేతిలో మాణికము
సేవచేసిన వారికి చేతిలో మాణికమవు
భావించువారికి పరబ్రహ్మమవు
[9–129

చేతిలోనిది
చేసినట్టె సేసుఁగాక చెప్పేదేమి
సేసవెట్టినట్టి తన చేతిలోని దానను
[13–226

చేతిలోనివాఁడు
నేనా సిగ్గెరుంగ నీవే విచారించి కావు
శ్రీనిధి శ్రీవెంకటేశ। చేతిలోనివాఁడను
[2–19

అదనమన్నించఁగానే ఆసఁజేవాఁచితిఁగాక
చెదరక నాఁడే నాకుఁ జేతిలోనివాఁడవు
[8–269

చేతిలోనుండు
యీతలనేర్పరులకు నిందే యిహపరములు
చేతిలో నున్నవి యిది చింతించరో జనులు
[8–104

చేతుల తుద
కనురెప్పల తుదలఁ గట్టువడెఁ గాలము
ఘనమై చేతులతుదఁ గర్మమున్నది
[9–19

చేతులెత్తు
చెప్పఁగా నెఱఁగరా చేరి వేదవ్యాసులు
తప్పక చేతులెత్తి దైవమితఁడన్నది
[9–62

చేఁదగు
పోయిన రాతిరి నిన్నుం దోకుమంటాఁ
దలమారు
చేయివట్టి పెనంగుట చేఁదాయంగా
[4-131

చేఁదు తీపగు
అరిది చేఁదుం దీపై నంతకంటేనా
సరిలేని విభుతోడఁ జయ్యాట మాదేవు
[4-139

చేదోడు
చేదోడిందుకు శ్రీ వెంకటేశ్వర
ఆ దెస నిను శరణంటిమి గొంత
[9-286

చేనిమ్మపండు
కమ్మర నిదె వెంకటేశ నీచే
నిమ్మపండైన నీ బంటు
[11-2-67

ఇద్దరిచేనిమ్మపండవేమి సేయవచ్చు నిన్ను
అద్ది నీతో మాటాడ నను వెయ్యకా
[15-174

చేనుగా దున్ను
పొత్తులపాపమనేటి పోడు నఱికివేసి
చిత్తమనియెడు చేను చేనుగా దున్ని
[9-70

చేపట్టు
ఒక్కఁడే అంతర్యామి వుపకారి చేపట్టు
తక్కినవి యిన్నియును తలఁపురేఁచెడివి
[5-325

కందువ నీ బిరుదు సత్యము కానిమ్మని
నేము చేపట్టితిమి
అంది నీవే మాకు దిక్కైతివి అన్నిటా
సంతోసాన నున్నారమయ్యా
[7-105

ఒకటి సుజ్ఞానము వొకటి అజ్ఞానము
ప్రకటించి ఒకటి చేపట్టరో వివేకులు
[7-123

చేపట్టి పుణ్యము చేరువలయితే
శ్రీపతి దాసుల సేవే దొరకు
[9-21

చేపట్టు గుంచము
ఎంతమహిమో నీది యెవ్వరి కలవిగాదు
చింతించితే దాసులకుఁ జేపట్టుఁగుంచమవు
[6-191

చేపట్టుఁగుంచము శ్రీవిభుఁడు
వై పెరిఁగి పొగడవలెఁగాక
[10-174

చేపడు
చేపడిన మాత్రమున చేటులేని పదవుల
యేపున నెవ్వరున్నారో యెరుఁగరయ్యా
[8-134

చేమకూరకైత్యాలు
చెలువపు వినయాలు చేమకూరకైత్యాలు
కొలఁదిలేని ననుపు గోడమీఁది సున్నము
[7-34

చేమీఁదగు
నేము నీవారమె యించు నెరుసులేని
చేమీఁదయిన మీఁద చెప్పనేల పనులు
[13-69

చేముంచు
నా మనసే చక్కనైతే నాకుఁ
బ్రత్యక్షము గావా
చేముంచి నేరమేమి నేసితివో కాక
[6-175

కామక్రోధము లజ్జగించుటయే
కల్యాణానుభవము
చేముంచి పాపము సేయక
మానుటే చెప్పఁగ లాభము
[6-209

యీమాట గర్వముగాదు నీ మహిమే
కొనియాడితిఁ గాని
చేముంచి నా స్వాతంత్ర్యము
చెప్పిన వాఁడఁగాను
[7-104

చేమించి యిందరిలోన జితేంద్రియుఁడఁ
గాను
భూమెల్లా దానమిచ్చిన పుణ్యుడఁగాను
[8-181

సౌమిత్రి సహోదర దశరథరామా
చేముంచి గుత్తిలో వెలసిన రఘురామా
[9-210

కోమలపుమేనివాఁడు గొప్పకిరీటమువాఁడు
చేముంచి హిరణ్యదైత్యు జించినవాఁడు
[10-275

కామిని నవ్వులు నీకుఁ గప్పురవిడేలేకాక
చేముంచి మరివేరే చేఁదయ్యీకా
[14-158

కామిని శ్రీవెంకటేశ కాఁగిటఁ గలసి నేఁడు
చేముంచి ఆ కారణము చెప్పఁగలవా
[14-249

చేముంచి శ్రీవెంకటేశ చెలగికూడితినన్ను
వాములనిదెల్లా మరవకురా నీవూ
[17-231

నేమపువ్రతాలకోప నిందుమాయలకునోప
చేముంచి తమకముల చింతించుచే గాని
[17-370

ఏమిసేతు నిందుకు నిన్నెటువలె
వేఁడుకొందు
చేముంచి నీ మోము చూడ సిగ్గయ్యీ నాకు
[17-519

చేరి చేముంచి గొజ్జెగి పీటముంచి
సారెకు నీరీతి సరసంపు రీతి
[వ. యో. వి. 3-1976

[అర్థనిర్ణయంకోసం ఈ ఆరోపానికి వివిధ
ప్రయోగాలు చూపడమైంది.]

**చేముట్టు**

నీముద్రలు ధరించితి నీగుణాలు వొగడితి
చేముట్టి పూజించితి శ్రీయంగాలు
[7-23

**చేముట్టు సరసము**

చేముట్టి నీవు నాతో చేరి సరసమాడఁగ
యేమంటినో నిన్ను యెరఁగనేను
[15-270

**చేముళ్ళఁదాల్చు**

కదిసి హారమ్ముల గదివాడి యినుప
చదురులవలే దాల్చు చేముళ్ళఁ దాల్చి
[అ. మ. క. 3509

**చేయంటు**

దీపములుదెల్లఁబారె తిమిరమంతయు జారె
శ్రీ పురుషోత్తమునిఁ జేయంటి లెమ్మనరే
[10-130

**చేయార**

చేయఁబోతే పుణ్యుఁడుగా జీవునికిఁ దడవా
చేయారఁ గర్మము తన చేతిలోనే వున్నది
[6-7

కాయముతోనింద్రియ కింకరుఁడనై యేమని
చేయార నీ బంటు నని చెప్పుకొనేను
[10-2

**చేయారచేయు**

పాయమెల్ల సంసారము పాలేపడితిఁ గాని
చేయార నీసేవ నేఁ జేసుటలేదు
[8-60

కాయము మోచితి ఘనత గడించితి
చేయారఁ బుణ్యము సేసితినా
[8-156

**చేయారఁబూజించు**

చేయార నిన్నుఁ బూజించి చేరి
నీ ముద్రలు మోఁచి
యీయెడ నుండఁగా నీవే యీ దేరింతుగాక
[6-52

**చేయి చాచు**

సిరులు దనకుండినాఁ జేయిచాఁచుఁబరులకు
యిరవు లెరఁగరాదు యిది వో మాయ
[9-1

కంచపు గాలాపటించే కలిమిలోవారమింతే
చంచలపు టాసలు చేయిచాఁచ నేఁటికి
[9-45

**చేయిచ్చు**
చేయిచ్చి వున్నాఁడు శ్రీ వెంకటేశుఁడు
యీయెడ నీ రెండు నేకమే
[8-105

చేయిచ్చి యలమేల్మంగ శ్రీవెంకటేశుఁడ కూడే
వాయింతినే నేను నిజమాడి బదుకరాదా
[14-172

**చేయినోరు నోడగు**
బోయెఁబోయెఁ గాలమెల్ల పూఁటపూఁటకు
చేయినోరునోడాయ చెల్లఁబోయీరోఁతలు
[11-3-77

**చేయిమీఁదగు**
సాయరాదు కోయరాదు పడఁతుల సంగములు
చేయిమీఁదయిన దాక సిగ్గువీడదు
[14-146

నాయంతనె వచ్చెనా నాతుల కిదె చాలు
చేయి మీదాయెను నేఁడు చెల్లదా నీకు
[17-163

దాయకపాయక లోలోఁదగిలినవ్వుకొనేరు
చేయిమీఁదై మీలో మీకు సిగ్గులెల్లాఁ దేరెనో
[18-489

**చేయి మీఁదుసేయు**
వేర మొకరిపై నేయ వీచేయి మీఁదునేయ
నేరుపు నాలికనాలు నీ వియ్యవలెనే
[17-522

**చేయిముంచి చేయు**
చేయవలసినప్పుడే చేయిముంచి చేనేఁగాక
యీయెడ నుండియుఁ బంతాలేలే నాకు
[17-160

**చేయిముట్టు**
నరులెల్లఁజిక్కువడి చల్లువెదలై నవివే
సిరుల నిన్నెంతాపె చేయిముట్టెనో
[17-401

**చేయి సేసుకొను**
నీయంత నీవెఱఁగవు నేనా చెప్పితిఁజుమ్మీ
చేయి చేసుకోఁజాలక సిగ్గున నున్నదానను
[18-11

**చేయెత్తి మొక్కు**
కదిసి శ్రీపతిఁగూడి గద్దెమీఁదఁ గూచుండి
యెదుటఁ బ్రహ్మదుఁడు చేయెత్తిమొక్కఁగా
[10-162

**చేయెత్తు**
దేవతల మొరాలించు దీకొంటి వింతపనికి
చేవ నభయము ఇచ్చి చేయెత్తితివి
[7-127

**చేయెత్తుకుండు**
పోడిమిదైత్యులపూఁచి చేయెత్తుకున్నాఁడు
వాఁడి ప్రతాపముతోడ వాయుజుఁడు
[11-191

**చేరఁడు**
బారెఁడె కురులుగాని చేరెఁడేసి పాదాలు
[14-299

**చేరఁడేసి కన్నులు**
చెంగట మా మొగమున చేరఁడేసి కన్నులంటా
అంగనలందరు నన్ను నాడుకొనేరే
[15-210

**చేరలంతేసి కన్నులు**
ఊరకే పోనియ్యరా నన్నుద్దండాన
చేరలంతేసి కన్నులఁ జెంగలిచ్చే విప్పుడు
[4-165

**చేరికెసేయు**
చేరికసేసి కూరుచకు చేరి కరంబులనంటి మమ్మిప్పీ
[శృం. వృ. వ. శ. 40

**చేరుముత్యాలు**

చేరువఁ గాఁగిటిలోనఁ జెమరించేవిదియేమె
చేరుముత్యా లిటునటుఁ జిందినట్టు
[15–120

**చేరువ బంధువుఁడు**

జీవునికే కాలము శ్రీహరి చేరువ
బంధువుఁ డీతఁడు
భావములోపలి పెరరేపకుఁడై
శక్తి చేకొనును యీతఁడు
[7–158

**చేర్వ**

ముదిసె యొకఁడనును మోక్షము చేర్వని
తుదఁ బుట్టొకఁడది దూరమనును
[10–4

**చేలాగిచ్చు**

చెమటమేని తనకు చేలాగిచ్చిన దాన
అమరఁ గాఁగిటఁగూడ నరుదా నాకు
[17–478

**చేవదీరు**

చేవదీరె సందియము లేదిదే
భావము నమ్మి ప్రపన్నులకును
[11–3–157

దేవుఁడవు నీవు జీవులు నీ బంట్లు
చేవదేరి నీస్నేఁతే శేఖరమై నిలిచె
[9–226

దేవకి కృష్ణునిఁగాంచె దేవతలు నుతియించ
చేవదేరెఁ బనులెల్లా సేయరో పండుగలూ
[18–383

**చేవమీరు**

చేవమీర సిరుల బూజించేదేమి నిన్ను
శ్రీవెంకటేశ నీవు శ్రీపతివి
[7–222

దేవ నీ విచ్చినయట్టి దేహపు టూరిలోన
చేవమీర గాఁపురము సేసేమయ్యా
[9–16

చేవమీర సురల రక్షించే కల్పతరువు
యీవేళ జన్మించినాఁడు యిదె కృష్ణుఁడు
[10–139

వావిరి సుగ్రీవాది వానరకోట్లు గొలువ
చేవమీరి పొగడొందు శ్రీరాముఁ డితఁడు
[11–4

**చేవయెక్కు**

తగిలినేఁ గాలమెల్ల ధ్యానము సేయగనీకు
జిగి నీ మేనికిఁ గొంత చేవయెక్కెనా
[10–232

**చేవలుమీరు**

వోవితోడఁ గంసునికి నూరునిండెఁ
జూడఁగానె
చేవలు మీరినయట్టి శ్రీజయంతినాఁడు
[8–258

**చేవల్లకు వచ్చు**

చేవల్లకు రాకుండితేఁ జిగిరించు వంతము
భావించక లోఁచితేను వచ్చిదేరును
[13–225

**చేవ సంసారము**

మోవరాని మోవయిములుగవియ్యదుమమ్ము
చేపసంసారముపైఁ జిమ్మిరేఁచీవి
[9–63

**చేవొడ్డుకొను**

కంటికిఁ గంటిరెప్ప కాచుకవుండిన యట్టు
వొంటిదేహమెల్లా జేవొడ్డుకొన్నట్టు
[6–96

**చేసుకొన్న చెలి**

చేసుకొన్న చెలిగాన చేకొని కొవరితే
యీసులు రేఁచుకొనేవేమీ నీవు
[15–192

చేసురటి

కదిసి చేసురటి కాంతుఁడు విసరీ
నదె నీ చేతుల నందుకోవె

[17–547

చేసూటి

సిగ్గువడనివా రదె చేసూటినె వున్నవారు
కగ్గులేక గొబ్బునను గాఁగిలించు మనవె

[15–214

వాసన నీటిలో వంచి క్రోవించి
చేసూటిగా నొక్క చెలిమీఁద జిమ్మ

[శృ. క. 304

చేసూటిచూపు

చేసూటినే చూపెను సిగ్గు లిదేఁటికి నీకు
నేసపాలు వట్టుకొని శిరసెత్తరాదా

[18–309

## చొ

చొక్కుఁదనము

జోడుజోడు గూడదాయ
చొక్కుఁదనము మానదాయ
యేడకేడ తలపోఁత యెంతపేసె దైవమా

[5–128

చొక్కుమందు

కందువమై చమరించి-గందవొడిచల్లుకొని
పొంద నిన్నుఁదలఁచితిరా-వెంకటేశా
అంది చొక్కుమందు లాయిరా

[13–223

చొచ్చుకొను

నీ దాసుఁడననుచు నీమరఁగుచొచ్చుకొంచే
యేదెసనైనాఁబెట్టి యీడేరింతుగాక

[6–52

చొటు

అట్టె మన్నింతువుగాన ఆనవెట్టి యడిగితి
జట్టిగా మోహము నీకె సతిపై నయ్యా
చుట్టమ వందరికట చొటు నీకెన్ని నట

[15–186

చొప్పు

చొప్పుగా నీకెదురులు చూచిచూచివాకిటను
రెప్పలు ముయ్యగలేక రేసు వడితి

[14–25

యెప్పుడు వత్తువో యని యెదురు
చూచినందుకు
చొప్పుతో నీవున్నందుకు జూకలాయను

[15–244

చొప్పు పట్టు

చొప్పుగా శ్రీవెంకటేశుఁ డొక్కఁడే
దైవమని
చొప్పువట్టి కొలిచిరి శుకాదులు

[9–280

చొప్పుమాపు

చొప్పగు సంసార మిది వున్నతి
నాచార్య సేవ
చొప్పుమాపి పుణ్యానకుఁ జొరకుండా
జేసెను

[8–80

చొప్పులెత్తు

చిప్పిల సరికిబేసిఁ జెనకిన చెనకులే
చొప్పులెత్తి తమకెల్లాఁ జూపుమనేరు

[14–14

కళలు నీమోముననే కానవచ్చి నంటిఁగాక
పొలసి నీ రతులలో చొప్పులెత్తేనా

[14–45

చొప్పువేయు

కొప్పువిరులు రాలఁగ కొమ్మ
నీతోఁడఁ బెనఁగి
చొప్పువేసె నీవు దన సొమ్ముగాను

[18–427

చొప్పెత్తు
ఎప్పుడు శ్రీవెంకటేశుఁ డెదలోన
నున్నవాఁడు
చొప్పెత్తి యాతని మూర్తి చూచుటేబుద్ధి
[6–195

చెప్పకున్న దోసము సేసిన చేఁతలు నీతో
చొప్పెత్తి వయ్యెదగంటే సోదించక
మానఁడు
[17–490

## చో

చోద్యపడు
గోనకొని యావేత్ర కుంజంబు వెడలి
తనవారలెల్లనెంతయుఁ జోద్యపడఁగ
[వ. యో. వి. 2–368

చోదుముట్టు
పూసిన సిరి గందవొడి బుగబుగలు
దాని పంకజ భవాందము చోదుముట్ట
[వ. యో. వి. 4–1602

చిగురాకు బోఁడుల సేదలు దీర్చి
గొబ్బునఁదావి దిక్కులఁ జోదుముట్ట
[శృం. మం. 73

చొల్లుగుజ్జము
గొల్లముంజురాతజడ్డుకోరి బుద్ధుడై నగ్గు
చొల్లుగుజ్జుపు నూఁగు రొమ్ములు మానువా
[13–198

చొల్లెము
చొల్లెపుఁజట్టుతోడి చుంగల రాజసముతో
వెల్లివిరిగాఁ నేగి వెలదులు గొలువ
[13–58

## చౌ

చౌకపుట్టించు
కడఁగి మీఱిన నెన్ని గతులను లేని
నడిపై చిన్నపునకుఁ జౌకపుట్టించి
[వ. యో. వి. 3–1273

చౌకలుసేయు
సంగతిగాదు మానినులఁ జౌకలు
సేతురె నీవు కాంతకున్
పంగెన వాఁడవా యెఱుఁగ
బత్తి మొనర్పఁగ నిన్నుజేటికిన్
[శృం. వృ. వ. శ. 83

చౌలు
పదపదార్థంబు లేర్పడఁ జౌలకింపు
బదయింప రసరీతు లుప్పొంగుచుండ
[వ. యో. వి. 3–1660

## జ

జంకెన
జంకెనలనె పలు చదువులు చదివితి
మంకుఁ దనం బిదిమానదు
[9–28

చలములేటికి జంకెన తగదిఁక
బలిమి శ్రీవెంకటపతి గూడె
[17–456

జంగచాఁచు
వొక్క జంగచాఁచినాఁడు వొగిఁ
దూర్పుఁ బడమర
తక్కక భుజా లుబ్బించె
దక్షిణోత్తరాలు వింత
[7–116

నులిచితే వాలము మిన్నులు మోవఁ
జాఁచినాఁడు
జలధిదాఁటఁగ జంగచాఁచినాఁడు
[9–230

తూరుపుఁ బడమరాకు దొడ్డగా జంగచాఁచి
సారెకు నర్కుఁనివద్దఁ జదివీ వాఁడే
[10-158

జంగదండ
పెట్టిన జంగదండ పిడికిటి మొలచేయి
అట్టె వలచేయెత్తిన యాయిత్తము
[10-85

జంగవెట్టు
వసలుగా జంగవెట్టి వండ్లగుత్తి చేతఁబట్టి
అసురలనెల్లఁ గొట్టీ హనుమంతుఁడు
[10-272

జంగిలి
జంగిలి నతుల నీవు సారె సారె
నమ్మించఁగా
అంగడిబడే నవె నీ అన్నమాటలు
[14-151

నంగడి నేఁ జెనకితే నమ్మతించే
వెందుకైనా
జంగిలి రతులకు వేనరపుగా నీవు
[14-162

తరుణి యెదుటనె తలవంచుక వున్నది
వెరవున నీపెను నవ్వించ గలవా
పరనము లాడితేను జంగిలి కడుపులోన
దొరలితే నది గడు దోసమనీ సుమ్మీ
[14-249

పాలు తనపైఁ గారగా పడతులు నవ్వగాను
గేలికి లోనాయను జంగిలి కృష్ణుడు
[15-173

నంగడి జాణతనాలు నతులెల్ల నాడఁగాను
జంగిలి వలపులేల చల్లవచ్చేవూ
[17-3

[మా. ని. లో అల్పసైన్యాధిపతి, గోసమూహము, మంద, మృగముల సమూహము అన్న అర్థాలే యిచ్చారు.]

జంగిలింతే
జంగిలింతే సంసారము సాధించేది
లోకమెల్లా
అంగడి బడి జీవుని కలవు లేదయ్యా
[7-115

జంగిలి మనుజుఁడు
జంగిలి మనుజునకు సరుసఁబాపమే చవి
అంగలించవలదంటే నగ్గలమౌను
[9-1

జంగిలి విడెము
సరుసగూమందేఁ గాని జంగిలి విడేలలోన
వారిమొకుఁ జేయి చాఁచనోవరా నేను
[17-214

జంట జూజము
సరిబేసి మాటలాడ జంట జాజలా యివి
సిరులతో బెనఁగఁగ జెట్టిసాదనా
[13-121

జంటమొనసూది
సునరముగాదు జంటమొన
సూదిని రెంటి ముగ్గువ్వ నొక్కఁచే
[శృం. వృ. వ. శ. 73

జగజోగమాటలు
మఱియున్న జగజోగమాటలు మాని
తెలివవే చనుదెంచి తెలివవే గడియ
[వ. యో. వి. 4-969

జగజోలి
ఫలము వారలా కాక వనిమాలినట్టి
చలమువారలా వట్టి జగజోలి యేల
[వ. యో. వి. 7-1030

జగడగాడు
బిగిసి నామైనున్న పెనుకట్లుండఁగా
జగడగాండ్లు పగ చాటఁగను
[5-124

జగడించు
వనజాక్షి చూపులను వలరాజు తూపులను
యెనయకే జగడించె నిన్నాళ్లను
[12-36

గమితాన రేపుమాపుఁ గొసరాడించంగనేల
నముకాన దాని నన్ను జగడించ విడవరా
[17-227

జగజాగ
మగిడివచ్చిన సిగ్గుమాలుతు ననుచు
జగజాగ ముదుసలి సాదింపుచుండె
[4-302

జగజాఁగ
రమణుని సేఁతలు రచ్చల వేసితేను
రమణి అది జగజాఁగ గాక
[18-393

జజ్జరించు
దండి శ్రీ వెంకటపతి దాడిముట్టె నదెయిదె
బందుబందై జజ్జరించి పారరో దైతేయులు
[6-79

జట్టి
అట్టె మన్నింతువుగాన అనపెట్టియడిగితి
జట్టిగా మోహము నీకే సతిపై నయ్యా
[15-166

జట్టిగా నొనగూడు
జట్టిగా నొనగూడితే సంసారమే ఫలము
యిట్టె హరి దనకు నియ్యవలెఁగాని
[7-168

జట్టిగా మెరయు
రట్టడి శ్రీ వెంకటేశుఁ డిట్టె వీధులనెల్ల
జట్టిగామెరపేయట్టి సంభ్రమము లాయను
[8-161

జట్టిగొను
చదువులోనె హరినె జట్టిగొనవలెఁ గాక
మదముగప్పిన మీఁద మగుడ నది గలదా
[5-274

జట్టిగొనితొలె జరాసంధునిపై నదేతేరు
కొట్టి తొలె హంస డిభకులపైఁ దేరు
[6-110

అట్టె లోకమువారు అర్థకామపరులే
జట్టిగొని నీవైతే సర్వదాతవు
[7-72

పుట్టేటి జీవులు పొదలేటి జీవులు
జట్టిగొని రిదియే జగమెల్లా
[8-29

ఇట్టి యవివేకబుద్ధి యేపనికి వచ్చునిఁక
జట్టిగొని నా గుణము చక్కఁజేయఁగదవే
[8-189

జట్టిగొన్న దాసులకు శాంతసింహము
పట్టపు శ్రీవేంకట యోభళ నారసింహము
[11-120

జట్టి చేరగాఁడు
ఇట్టెకూడినందుకను యిచ్చగించవలెఁగాక
జట్టిచేరగానివలెనట వేఁటికే
[14-96

జట్టిమాయలు
పట్టపు శ్రీరమణ భవరోగ వైద్య
జట్టిమాయలతోడి శౌరికృష్ణ
[11-36

జడధి లోపలి యీఁత
నడిబెట్టె గటకటా సంసారము చూడ
జడధిలోపలి యీఁత సంసారము
[11-3-70

జడనువాపు
పాలుపడి నిన్నుఁజేరి పట్టి కొలిచినవారి
జాలిపాటు తొలఁగించి జడనువాపి
[11-32

జడిగొను
జడిగొన్న గుక్కిళ్లు చవిగొన్నయందాఁక
వాడలోమాటలు మోహముదుగునందాఁకా
[5-152

జడిగొని యెన్నఁడు బాయని
సంసారపు బంధంబుల
విడుమని వొక నిముషములో
విడిపించును యితఁడు
[5-177

జడిగొని యేకాంత లోకాంతమై
మతి సంగతి నాపు(డీత(డు
పొడలుచు వైదిక లౌకికముల నొక
పొత్తున( గుడుచును యీత(డు
[7–158

**జనవేషము**
జనవేషమేడ పారిజాతము దెచ్చినదేడ
తిని వెన్నముచ్చిమేడ దైవికమేడ
[7–195

**జన్నెపట్టు**
సంతతము నా వయసు జన్నెపట్టితి నీకు
యెంతైనా నా విన్నప మీడేరించవయ్యా
[15–270

జన్నెపట్టి పుట్టి జక్కగ( బెట్టిన
వెన్న దిన్నవా(డు వీ(డుగదె
[10–288

జవ్వాది మెత్తినది తన
జవ్వనమే జన్నెపట్టినది [12–315

**జన్మకోట్లు**
కొల(దిమీఱ జన్మకోట్ల( బెనగొని
తొల(గని నాలోని దురితము
[5–212

**జపిత**
జపితలు గొందరు శాస్త్రులు గొందరు
ప్రవత్తి గొందరు బలువులు [5–324

**జమళి**
జమళి వచ్యుతుని సమారాధనలు
విమలములే కాని వితథము గావు
[6–88

జమళి శ్రీవెంకటేశు సరసపూడిగానకు
తిమురుచునుండే యట్టి హనుమంతు(డా
[7–16

జమళి నీ యాయుధ లాంఛనము
మోచినప్పుడే
అమర( గాలదండము లవియెల్ల( బొలిచె
[8–12

నిమిషములో నిది నింగి( దిరిగాడేది
జమళిలోను వెలికి సరితూ(గేది
[9–60

జమళి సరసమాడ చన్నుల కస్తూరిపూత
అమరి నీ పురమున కడియాల మాయను
[13–132

చెమరించేవేటికే చెక్కునొక్కి యాత(డు
జమళి వే(డుకొని యిచ్చకమునేయ(గాను
[15–209

సమరతి నీ పాన్పుపై సరి నేనుండగాజాళి
జమళి( దమలోననె సన్న నేసేరు
[17–124

రమణితో నొకమాట రతి నాతో నొకమాట.
అమరదు యెన్న(డు నీ వాడకురా
కమలము వొక కన్ను కలువయు
వొక కన్ను
జమళి రండు నడప సాజమే నీకును
[17–173

తమకించే వింతలోన తలరావోలి నాతో
జమళి నక్కడే మేలు చల్లేవా వోరి
[17–203

జమళి క్రొమ్మెనల( జంచలపెట్టు కొప్పు
కమలారియై కళంకము లెన్ను మోము
[వ. యో. వి. 3–1554

**జమళిపుట్టు**
అమరుల జన్మములు నసురుల జన్మములు
జమళి( బుట్టినంతలో సరియౌనా
[6–44

**జమళి పెండ్లికొడుకు**
అండనె శ్రీవెంకటేశండె గోవింద రాజై
చండిదీర సిరికి భూసతికి నీవు
రెండుచేతుల యిద్దరికి( గా(గి లిచ్చిచ్చి
కొండుక జమళి పెండ్లి కొడుకవునైతివి
[13–183

జమళి భుజములు
తిమిర్చిమమ్ముఁ గావగ దిక్కాయి
మాకు నిలువ
జమళి భుజముల శంఖచక్రముల గలిగె
[8-3

జమళి విధులు
రమణి నేర్పు నేరములాయె
జమళివిధుల సరసపు విభుఁడా
[4-3

జమునోరిలో బ్రదుకు
జమునోరిలో బ్రదుకు సంసారము చూడ
చమురుదీసిన దివ్వె సంసారము
[11-3-70

జయంతి యగు
దాదాత రోహిణీ నక్షత్రము గూడిన రేయి
సాదించ లోకులకెల్లా జయంతి యాయను
[8-161

జయంతి పండుగ
హరి కర్మ్యము లీరో జయంతి పండుగ
సేయరో
కెరలి శ్రీవెంకటాద్రి కృష్ణుఁడితఁడు
[10-1

జయజయవెట్టు
సురలు జయజయవెట్ట నసురలెల్ల
మొరలెట్ట
సిరితో మెలఁగీ నరసింహదేవుఁడు
[6-228

జయపెటు
అనుచు లోకములెల్ల నదె జయవెట్టేరు
నినుఁ గొల్చితిఁ గావవే నీరజాక్షుఁడా
[6-111

ఎల్లవారలు జయపెట్ట నేలుచుండి
వినుతికెక్కిన యధిపుఁడు ఘనుఁడుదలఁప
[నీతి. శ. 30

జయలిడు
మొక్కరే మొక్కరే మీరు ముందు
ముందే జయలిడి
దక్కి శ్రీ వెంకటేశుఁడే తానైన దేవునికి
[7-145

జనులెల్ల జయలిడ సకలరాజ్యంబు
జనువడ నెంతయుఁ బాలించుచుండి
[వ. యో. వి. 5-35

ఇలయెల్ల జయలిడి నిష్టభోగముల
పలుపుచుండిరి మహోత్సాహంబు లెసఁగ
[అ. మ. క. 4502

జయలు వెట్టు
సంతతము నందరును జయలువెట్టఁగనీక
కాంతలిఁక వేరి నిన్నుఁ గాదనేరా
[14-286

జయవెట్టు
జగములెల్లా నీదేరె జయవెట్టి రిందరును
తగనేఁడు కృష్ణావతారమాయ నిదివో
[10-20

తొలియాదేఁ దిరుతేరు దుష్టులెల్లనణఁగఁగ
చాలుకొని శిష్టులెల్ల జయవెట్టఁగ
[10-178

సనకాదు లొకవంక జయవెట్టుచున్నారు
ఎనసి సురలు చేతులెత్తి మొక్కేరు
[11-174

జరగు
ఊరకె గుట్టుసేసుక వుండనీవయ్యా
పేరఁబెట్టి నటువంటి పెరుగెమా జరుగు
[1-7-344

జరచు
పొందుగా శ్రీ వెంకటేశ పూఁచి
నన్నుఁ గలసితి
చందముగా యిఁకనేమి జరసేమునిన్నును
[17-108

**జరయు**

సిరలేల యొత్తెను సిగ్గువడి వున్నవారి
జరసేటి వారు లేరా సారె వింతులు
[14-207

దొరలకె కాని లేదు తుంటతనము
జరసి నీతో నవ్వ సరి చానసా
[14-287

సారె నిన్ను వెంగమాడి జరయఁగ
నేరుతునా
ఆరీతినె నిన్నుఁ గొనియాడ నేర్తుఁగాక
[15-94

ఇందరు సవతులకు నేనె గురియా
సందడి నాతనినే జరయరాదా
[15-99

ఏఁటికి జాగులు నేసేరింకా మీరు
చాటిచెప్పి పతినిట్టె జరయరమ్మి
[17-309

సంతసాననే నీతో జరసి మాటాడఁగాను
వంతము దప్పినంటాఁ బలుకవు
[17-351

కాయము నాదే అట కర్తను నేనటనా
చాయకవిరావు నన్నే జరసేఁగాని
[10-58

**జరాసంధునిఁ దోలిన తేరు**

సమరములో జరాసంధునిఁ దోలిన తేరు
అమరుల వెనుబలమగు శౌరి తేరు
[6-227

**జఱయు**

వెఱగంది మోవినీకు విందుచెప్పేఁబో
నిన్ను
జఱసి నే గుక్కిళ్ళఁ జవిగొంటిబో
[15-59

మఱియొందూ గతిలేదు మనుష నీవేదిక్కు
జఱసి లక్ష్మిశ నీ శరణమే దిక్కు
[6-146

**జఱిగొను**

మరియు గృహా రామక్షేత్రంబులు
జఱిగొను మాయా జనకములు
[9-176

**జలగవలె బీరుచు**

లయించక లోభము జలఁగవలెఁ బీరుచఁగా
నియమించి మట్టుపెట్ట నేఁడు నాకు వసమా
[8-208

**జలధిలోపలి మీను**

జలధిలోపలి మీను జలధి దానౌనా
జలములాధారమైన జంతువుగాక
[5-139

**జలధిలో వానలు**

కెరలమీఁద మిక్కిలి నీ సేవలు
వరుస జలధిలో వానలు
[9-114

**జలపూఁత బంగారు**

చలువలోపలి వేఁడి సంసారము చూడ
జలపూఁత బంగారు సంసారము
[11-3-70

**జలములోపలనున్న చందురు నీడ**

జలములోపలనున్న చందురునీడవలె
సలుగడలఁ గదలీ నా మనసు
[11-53

**జలుక**

అలుకేది జలుకేది ఆకెయింటనున్న నన్ను
సొలసి చూచిన మారు చూడనా నేను
[15-32

[సణుఁగు, గొణుఁగు; వేసట, ఓప
అన్నట్లు అలుక, జలుక అని జంటగా
వాడుతారేమో అని ఈ సంకీర్తనలోని
ఇతరప్రయోగాలు చూస్తే అనిపిస్తోంది.]

**జల్లిబట్టు**

జవ్వనము తనసొమ్ము జల్లిఁ బట్టవచ్చునా
చివ్వనఁ దానే నాపై నేసవెట్టేఁ గాక
[18-472

జవకట్టినంత
వివరము మాలినట్టి వెఱ్ఱిదేహి తొల్లి
జవకట్టినంతేకాక చండి పోరనేఁటికే
[8-96

జవకట్టు
భవరోగములు పీడి పారఁగబెద్దలు మున్ను
జవకట్టి కొనిన నిచ్చలమైన మందు
[5-140

జవకట్టి పూర్వవాసనల సంసారమే
చవియె తాఁగాని ముక్తి చవిగాదు
[11-29

వివిధంబు లగు నేకవింశతి శ్రుతుల
జవకట్టినట్టి యా సప్తస్వరముల
[అ. మ. క. 2287

జవదాఁటు
చవిచేసుక యిటు జరిగెదము
జవదాఁటకురో సంసారులార
[9-253

జవళి
జవళి నీ పాదములే శరణము చొచ్చినాఁడ
తవిలి నీ చిత్తమింతే తరవాత నింకను
[6-106

చవికి కర్మం బనెడి చిచ్చు చొచ్చిన నాకు
జవళి నాచార్య కృప జలధియే దిక్కు
[6-146

యివియు నీమాయే యిన్నియు నీ యాజ్ఞలే
జవళిఁ బ్రాణులకెల్ల సమ్మతైనవి
[6-158

ఇవిగో మీమహిమలు యేమనిపొగడవచ్చు
జవళినెంచి చూచితే సరి బేసివంటివి
[7-58

తివిరి నన్ను నీకుక్షిఁ దెచ్చిడుకొన్నఫలము
జవళి నా నేరములు చక్కఁబెట్టఁ బడెను
[8-59

భువి శ్రీవెంకటమున నున్నాఁడిదె
జవళి వరంబుల సంతాయ జగము
[9-44

జవళి నాశాపాశములకుఁ గొడవలి
నవనీతచోరు నామంబొకటే
[10-16

భవనాసియేటి దండఁ బాదుకొని కూచుండి
జవళిదైత్యు పేగులు జందేలు వేసి
[10-162

చవికె లోపలనుండి చదురంగమాడ తాను
వువిద కిచ్చితివి నీ వుంగరము
జవళి నదే నిన్ను సారెఁ దలపించునని
తవిలి నీకెచ్చరించఁ దరవిచ్చె నిపుడు
[13-112

జవళి గన్నీరుతోడ చలపట్టుకుండఁగాను
తవిలి నీకింకా నేల దయపుట్టదు
[14-292

జవళి పంతాలవాఁడు
జవళిపంతాలవాఁడు శంఖుచక్రములవాఁడు
తివిరిన అహోబల దేవుఁడటె వీఁడు
[7-274

జవళి వేడుకలు
వవళించబోయి నీవేవరవయి వుండగఁజెలి
జవళి వేడుకలకు సంతసించెను
[17-153

జవళి శాస్త్రములు
భువిఁ దొల్లి లేరా పుణ్యము నేసినవారు
జవళి శాస్త్రములెల్లాఁ జదివినవారు లేరా
[7-261

జవ్వనపుఁ గాక
సతి కౌఁగిలొకటే జవ్వనపుఁ గాఁకరేచు
సుత కౌఁగి లొక వేరే సుఖమైతోఁచు
[6-163

జవ్వనపు ముక్కుగొయ్య
నగుబాటుగని జవ్వనపు ముక్కుగొయ్య
యగునట్టి ముదిమి వాయఁగజేసి నన్ను
[వ. యో. వి. 2-1043

జాగంటు
పుప్పటించి యాడకుండా పూరివారికెల్లాను
చప్పుడు జాగంటవేసి చాటుదములేవయ్యా
[14–222

జాజరకాఁడు
అంకుల చేతులవట్టి మానవేల పెట్టిని
వంకెలేని కొయ్యకాఁడు జాజరకాఁడు
[13–134

జాజరకానికి వంకోచవడరాదు
మొగమోట దూతకుఁ దగవుకాదు
[నీతి. శ. 38

జాజరగు
కళ్కానించేవు రతికి కడుఁదమకించే నేను
చక్కని యింతులమీఁద జాజకాయవలపు
[14–237

జాజరవంటు
వలరాజా వంపున వలపు వి త్తిన వంట
చలువై పున్నమనాఁటి జాజరపంట
[11–47

జాజరలో వాఁడు
వంతలోని జాణవు జాజరలో వాఁడవు
నింత లేదు నాకు నీకు విన్నప మిదయ్యా
[13–209

జాజరాడు
అల్లదె నీ రమణి ఆయ త్తమై వున్నది
పెల్లుగ జాజరాడఁ బిలిచీఁ బోవయ్యా
[17–172

జాజరలాడు
పవిత చూపులు కలువల వసంతము
ఘనమైన మోహము గంధము వసంతము
మనసులో కోరికలు మంచినీళ్ళవసంతము
పెనగిజాజరలాడఁ బిలిచీనయ్యా
[17–172

జాజుకొను
జలజలఁ జెమరించె జాజుకొన బులకించె
[14–290

జాడ జన్మము
నీడని మా యంతరాత్మ విష్ణుఁడు మా
జాడ జన్మ మతనికే నమర్పణము
[11–88

జాడదప్పి తిరుగు
తోఁడు నీదై యచ్యుతుఁడు
తొలఁగక వుండఁగాను
జాడదప్పి తిరిగేటి జాలి మాకేలా
[8–190

జాడలెత్తు
ఇల నీటిలో జాడలెత్తంగఁ జాలు
తలవరులను బిల్చి తచ్చాయఁ జూప
[వ. యో. వి. 7–973

జాణదేవర
ఇంతట నిద్దెవిచ్చేని యింతిగూడితేఁ గనక
వంతుకు నిన్ను జాణదేవర వనవచ్చును
[15–56

జాతరదైవాలు
జాతరదైవాల నిన్ను సరిగాఁ బూజింతురు
ఆతల వైష్ణవులు దాసనుకొందురు
[8–52

జాతిలేని జీవుఁడు
చేతనాత్మకుఁడట శ్రీ వెంకటేశ్వరుఁడు
జాతిలేని జీవునికి స్వతంత్ర మేది
[6–72

జామెక్కు
తెల్లవాటె జామెక్కె దేవతలు మునులు
అల్లనల్ల నంత నింత నదివో వారె
[4–25

వేకువజామున వెడలి జామెక్కు
దాఁక మిక్కిలి యెండ దాఁకంగ నడిచి
[అ. చ. 331

జాఱువడు
మాఱుమోమిదేఁటికి మంకుఁదనమి దేఁటికి
జాఱువాడ నే నవ్వితే వంతపించ వలదా
[13–43

జాలిదీరు
ఆలించు పాలించు ఆదిమ పురుషుడను
జాలి దీర నీకే శరణు చొచ్చితిమి
[11-43

జాలిపాటు
పాటుపడి నిన్నుఁ జేరి పట్టి కొలిచినవారి
జాలిపాటు తొలఁగించి జడను వాపి
[11-32

జాలిఁబడు
జాలిఁబదే నేతలు సంసారభోగములెల్లా
జాలిలేనివి విష్ణుని సంతతపు పూజలు
[7-8

యింకా శ్రీవెంకటేశుఁడితఁడేమాదేవుఁడని
సంకె లేకుండుముగాక జాలిఁ బడఁగలమా
[9-260

మేలెఱఁగి జవరాలి మెచ్చవద్దా
జాలిఁబడి నీవేల జంకించేవయ్యా
[18-410

జాలిఁబెట్టు
జాలిఁబెట్టి వెంకటేశ్వరుఁడు నన్నిదె రతి
నోలలాడించెను చూడరో పొందులు
[12-33

చల్లగాలి నిన్నును జాలిఁబెట్టె నంటా
వెల్లిగ నా కేలె లక్కే విఱచేవే
[12-208

జాలి రొప్పు
జాలిరొప్పితి వట్టి సటలనే యేపొద్దు
యేల మెచ్చ వింకాను యేమిసేతుమయ్యా
[9-267

జాళె
కొందరి జాళెలు నిండు కొందరికి
సొమ్ములవు
కొందరి పుణ్యాలఁ జేసుఁ గొందరి
పాపులఁ జేసు
[5-283

## జి

జిగిమించు
పగయెల్ల నడఁచి జగము లేలుచును
జిగిమించిన నరసింహము
[10-75

జిగిమించ నాలోన శ్రీ వెంకటేశుఁడే
ఒగివాయ దెన్నఁడును బదుకవో మనసా
[10-228

జిగురుకంటె
వెగటైన విషయాల వేడుక పడకు మలి
జిగురుఁగంటెలు సుమీ చిత్తమ్మా
[16-1-12

జిడ్డుపెట్టు
పుట్టుచు నతఁడు నేప్పునఁ దల్లి జిడ్డు
పెట్టరమ్మని యుగ్గు పెట్టఁ బోయినను
[అ. వ. 223

జిబ్బిటియగు
వొచ్చిదైన వేదమార్గ మొల్లని
పుణ్యమంటేవు
జిబ్బిటాయ తపమేలె జీవుఁడు
[16-1-14

జివ్వాడు
చన్నుగొండల వ్రేఁగు సైరింపలేక
చిన్నారికేఁ దీఁగ జివ్వాడుచుండ
[వ. యో. వి. 4-596

# జీ

జీతనాతములు
పగిదిఁ జెల్లించు నప్పగిది రాహుతుల
నగరిబంటుల జీతనాతంబులేలు
[ప. యో. వి. 3–1081

జీతాలువెట్టు
యెన్నఁగ బంట్ల నేలే యేలిక జీతాలువెట్టి
మన్నించి కాచుకొని మనిపినయట్లు
[7–109

జీనువ
ముదిత యెఱఁగు వింటే మొక్కలాన
వాలునమ్మా
చెదరని పెంపుదు చికిలివలె
సురతివుండిన యింటిచుట్టూఁదిరుగునమ్మా
చెదరని మతితోడ జీనువ వలెను
[16–2–115

జీరలగు
అలరు చెనకులచే నంగములు జీరలాయ
మలసి యిందుకు నిఁక మంత్రమేదాకో
[9–67

జీరవారు
పుక్కగోరిదాన నన్ను నొరసి చూడకురా
చెక్కలేద సోఁకినాను జీరవారీని
[18–375

జీరుకు బండ
మేరమీరె కోరికల మిసిమిచూడకు మవి
జీరుకు బండలాయి చిత్తమా
[16–1–12

జీవకోట్లు
ఇతని మఱచితిమి యెదుటనె యుండఁగ
యిన్నాళ్లను నేమెరఁగక
ప్రతి లే దితనికి జీవకోట్లకుఁ బ్రాణ
బంధుఁ డితఁడు
[9–17

జీర్ణవసతి
ఒక జీర్ణవసతిలో యోగసమాధి
నకలంక గతి నున్న యయ్యోగి కడక
[ప. యో. వి. 8–460

# జుం

జుంటియీఁగ
వంతుకు నీ విట్టి జుంటి యీఁగవలె
వాడవాడనేల తిరిగేవయ్యా
[16–2–106
[జుంటీఁగ అనే రూపమే గాని విసంధిగా
ఈ రూపం నిఘంటువుల కెక్కలేదు.]

జుంటీఁగ కత
యీమేర శ్రీ వెంకటేశ్వరుని శరణనె
సోమరి కర్మ మంటితే జుంటీఁగ కతవును
[6–29

జుంజురించు
ముంజు గబ్బుల తుట్టుముదుక వెంట్రుకలు
జుంజురింపఁగ విదుర్చుచు జుఋమనుచు
[అ. మ. క. 2090

జుట్టెఁడు యినుము
జుట్టెడు యినుము నమ్మి సొరిది
నొక్కఁడు భూమిఁ
గట్టిడి భయములెల్లఁ గడవఁగాను
[5–254

జునుఁగు
చట్టపు సంబంధాన సోఁకితే పరబాధలు
చుట్టుకోక లోనుగాక జునుఁగుచే బుద్ధి
[6–195

జునుగు
పెనఁగలు జునుగులుఁ బెట్టేవు పిలువఁగ
పనిమాలిన పని బలువమ్మా
[17–339

## జూ

జూజము
సొగసి యెంత వరాకో జూజాలశ్ట్ఘ ఆదేని
[18–20

జూజరి
శ్రీ వెంకటేశ నీవు చేరి కూడఁగానె కని
సోవలుగా మొరఁగితే జూజరి నేను
[15–3

జూటరి
నీటున శ్రీవెంకటేశ నినుఁగనియింతలోనె
జూటరినై యింతలోనె సుజ్ఞానినైతి
[5–226

కోటి చదువగవచ్చు కోపము నిలుపరాదు
జూటరై వొకఁడు దన్ను సోఁకనాడితేను
[7–240

చూడవే యిప్పటి నేనే జూటరినట
జాడలు తాఁగట్టిన పచ్చాడమె యెరుఁగు
[17–246

జూటుఁదనము
చాటిచెప్పి నింతే కాక సాదుఁ
గొయ్యతనమున
జూటుఁదనమున నిన్ను సూడువట్టవచ్చెనా
[14–213

జూటుదనాలవాఁడు
జూటుఁదనాలవాఁడవు సుగ్రీవ నారసింహా
పాటించి నిన్ను నేము పంగించేవారమా
[10– 64

## జె

జెట్టిపోరు
జెట్టిపోరునఁ దన్నుఁ జెనకవచ్చిన వానిఁ
బట్టి చంపినవాడు పసిబిడ్డా
[16–1–11

జెట్టిసాదన
సరిబేసి మాటలాడ జంటజూజాలా యవి
నిరులతోఁ బెనగఁగ జెట్టి సాదనా
[13–121

జెడగట్టు
చిగురుఁ బాదాల నిగ్గు జెడగట్టెనో అప్పటి
తగియల్లదె తులసి దండవలె నున్నది
[13–218

జెడలు
గడగడ వడఁకేటి గండస్థలములు
జెడలు గదలిచీ శ్రీ నరసింహము
[9–278

## జే

జేడవెట్టు
నినుపుగాఁ గావేరి నీరు గారెమునఁ
దనివారనెత్తి యంతట జేడవెట్టి
[ప. యో. వి. 4–76

జేవుఱు ముద్ద
మోమెల్ల జేవుఱుముద్ద చందమున
సోమించఁగణి కృష్ణుఁజూచి యిట్లనియె
[ప. యో. వి. 2–1253

## జొ

జొత్తు
కొత్తగా శ్రీవెంకటేశ కూడవింకకుముందు
జొత్తుల చెమట చెలిఁ జూతువు రావయ్యా
[14–144

# జో

జోక
మాకేమి బుద్ధి చెప్పేవు మాటిమాటికి
జోకలతో నీ వాపెకు చట్టమవే కావా
[14–116

జోడుకోడెలు
నల్లనివాఁడు కృష్ణుఁడు తెల్లనివాఁడు
రాముఁడు
అల్లదివో జోడుకోడెలై వున్నారు
[8–4

జోడు జోడు గూడు
జోడుజోడు గూడదాయ
చౌక్కఁదనము మానదాయ
యేడకేడ తలపోఁత యెంతనేపె దైవమా
[5–128

జోడు దొడుగు
యేకటతో శ్రీవెంకటేశుఁడెతానన్నుఁగూడె
సోఁకె చన్నుమొనలకు జోడు దొడిగీని
[15–238

జోతాలు
చిట్టి నీ బంగారు చేతుల హరికి
బెట్టుమా జోతాలు ప్రియము రెట్టింప
[వ. యో. వి. 3–189

జోలిదవ్వు
ఏలోకమున లేఁడు యింతటిదైవము మరి
జోలిదవ్వి తవ్వి యెంత సోదించినాను
[8–102

ప్రత్యక్షమే మాకుఁ బ్రమాణము
సత్యరూప దవ్వి జాలిఁబడనోపము
[10–122

జోలిఁబెట్టు
ఎంతకత నడిపితి వేమి జోలిఁబెట్టితివి
చింతించ లోకములు నీ చేతివే కావా
[7–81

ఆదట దయదలఁచి యాదరించినంతెచాలు
సోదించి యాఁతనినంత జోలిఁబెట్టఁజాలను
[13–5

జోలిఁబెట్టి పూరకై నా సొరిదిఁ బెనఁగరాదు
యీ లీల వొకరొకరు యెనయుటే తగును
[18–178

# ఠు

ఠుమర
ఘనమగు కోరలు కరాళ వదనము
చెనకుచు గొడనేటి జిహ్వాయును
నినుపుఁగ టమరలు (?) నిటలలోచనము
నొనరఁగ గొలుపై యున్నాఁడు వాఁడే
[6–113

# టా

టా [కొను ధాతువు-శత్రర్థకంలో వచ్చేది]
నిద్దురగఁటికిరాఁగా నీచేఁతలుదాఁచుకొంటా
వద్దఁగూచుండినదె వరుసా నాకు
[15–229

# ఠే

ఠేను
తనరుఁ గొండల తరతరము నా వురము
మినుకు వజ్రపుఠేను(?) మించు నామేను
[15–17

# డా

డాగుమోయు
చేకొని నీ సాకారచింత యేడ నేనేడ
పైకొని నీ డాగుమోచి బ్రదికితిఁ జాలదా
[6–169

యేమిటాఁ జిక్కవు నీవు
యింత దేవుఁడవు గాన
కామించి నీ డాగుమోచి గతిగనేను
[9–166

అరుతఁ గట్టిన తాళి యవె వనమాలికలు
సరుస మోఁచినడాగు శంఖచక్రములు
[10–113

**డాగువెట్టు**
నెట్టన నైదుగురికి నేము డాగువెట్టేము
చుట్టిచుట్టి వీడుబట్టు చూపి వున్నది
[9–198

**డాగు వేసుకొను**
వెనకటి సంసారము విడువక వుండఁగాను
వినయాన నీ డాగు వేసుకొంటిని
[11–189

**ఢాగులు మోచుకొను**
కోరి మా భుజముల డాగులు
మోచుకున్నారము
ధారుణిలోపల మమ్ము దయఁజూచుఁగాక
[6–101

**డాగులు మోయు**
కొలిచిన పతి చేకొని రక్షించును అని
కొలిచితిని డాగులు మోసి
[2–8

## డీ

**డీలుపడు**
ప్రకృతి వాసన డీలుపడుచు నజ్ఞాన
నికర వారిధుల మునింగి తేలుచును
[వ. యో. వి. 421

## డుం

**డుక్కులుదూరు**
డొక్కలు చెరబారి డుక్కులు దూరి
గుక్కుమిక్కనుచు డగ్గుత్తికల్వడగ
[ఉ. క. 938

## త

**తంగు**
ఎవ్వఁడో వీఁడేల తంగి వచ్చి
నవ్వీ నవ్వీ నాతోనే
[12–175

**తంగేటి జున్ను**
ధనధాన్య సంగతి తంగేటి జున్ను
గొనబైన ప్రాయంబు కొంగుపసిండి
[వ. యో. వి. 3–712

**తండము తండమగు**
దండము వెట్టెదన్ వలపు
తండము తండముగాఁ దొడంగెను
[శృం. వృ. వ. శ. 29

**తండుముండగు**
కొండవంటి యాసతోడ కోరక తాను
నుండితేను
తండుముండై లంపటాలు తగినీనా తనకు
[16–1–30

**తండుముండు**
కొండో నుయ్యో కుమతులాల
తండుముండు తట్టుముట్టు తాఁకైనఁగనుఁడి
[5-102

**తండుముండుపడు**
కొండలవంటికరళ్లు కోరిక లెందుచూచినా
తండుముండు పడేవారే దాఁటలేరెవ్వరును
[6–56

**తండోపతండములు**
తండోపతండములై తలమోపులు పనులు
చండివెట్టి పనిగొను సంసారము
[8–111

**తంపర**
తంపి నీ చుట్టరికము తామెరకంటె దంపర
[15–89

**తంపి**
సొంపుల నీ యిచ్చకాలు చుక్కలకంటె గనము
గుంపెన నీ గుణమె కొంచెముగాని
తంపి నీ చుట్టరికము తామెరకంటె దంపర
యింపు నీ వలపె యారడిన్నిటిలో గాని
[15–89

**తకపికలు**
ప్రకృతికాతుమదాను పరమాత్ముఁ డాతఁడు
తకపికలై మురియఁ దనకేల
[8–132

ప్రకటించి రమ్మనుచు పాదాలువట్టునాఆపె
తకపికలుగను ముందలపట్టఁబోలు
[15–267

**తక్కరి విద్య**
తక్కరివిద్యలు యేమీఁదలఁచకుమీఅయ్య
చిక్కఁడా వలచిన చేతిలోని దానను
[14–145

**తక్కరీఁడు**
తక్కరీఁ డంటిఁ గదవేదంట వీఁడంటి గదవే
అక్కడి కతలే చెప్పినంటిఁగదవే
[17–266

**తక్కరించు**
ఇంత బాఁతిపదేవానినేల మాకుఁ దక్కరించ
చెంత నిదే వెన్న బిట్టిఁ జిబ్బెడేసి వలపు
[13–180

**తక్కించు**
చిక్కక హిరణ్యకశిపు నాత్మలో నుండక
తక్కించి నీవెడసితే తానే పొలియఁడా
[7–81

**తకుమాఱు సేయు**
తనునొత్తి సేయనే తకుమాఱు సేయు
ననువునఁ గొనగోళ్ళ నలగుబ్బ బొత్తి
[అ. మ. క. 2457

**తక్కు**
వొక్క జంగ చాఁచినాఁడు వొగిఁ దూర్పు పడమర
తక్కక భుజా లుబ్బించె దక్షిణోత్త రాలు నింద
[7–116

**తక్కులబెట్టు**
ఒక్కలాగు వాఁడవా యోరి యిట్టి
తక్కులం బెట్టితి నన్ను దగిలించి నీవు
[4–6

ఎక్కడఁ గడచే రీ నరులు
తక్కులఁ బెట్టేరు తరుణులు భువిని
[9–6

**తగడుగొను**
అగపడి జిగి హాళాహాళిగాఁగ బిగిసి
తగడుగొన్నట్టి రత్నపుతేవ నలరి
[అ. మ. క. 5283

**తగవరి**
చెంతల నాతని మాటే చెల్లఁబెట్ట వచ్చేను
యెంత తగవరివే యేవే నీవు
[14–136

**తగవు**
నిన్నుమీర నోపను నే నెటువలెనుండిన
అన్నిటానే నీకే లోనవుతే నా తగవు
[17–544

**తగవుకుఁ దీయు**
తలచేటి నా మనసే నీకును ధనముగాఁ గప్పము వెట్టితిని
పలుమరు నన్నును తగవుకుఁ దియ్యక
వరమాత్మా నను గావగదే
[7–68

**తగినపాటనే తనియు**
అగపడి శ్రీ వెంకటాధిపు కృపచే
తగిన పాటనే తనిసేమయ్యా
[9–165

**తగు తగదను**
తలఁచి యెవ్వరినేఁ దగుఁ దనలేను
కొలఁది జీవుఁడ నింతే కొనమొదలెఱఁగ
[9-248

**తగుమానము**
ద్వాపరము లెట్లుండు తగుమాన మెట్లుండు
కోపము లెట్లుండు కొఱఁత లెట్లుండు
[4-27

**తగులనాడు**
దగ్గరి నిన్నెవ్వరైనాఁ దగుల నాడిననూ
ఎగ్గెఱుంగ కెందుకైనా నేఁగకుండేవా
[4-39

**తగులమి**
జిగిఁ గలయికలకు గుఱి సిగ్గు
విడుచు మెచెలియ
తగులమికి గుఱి యేకతముల వునికే
[13-35

**తగులము**
తలచిన యట్లనె తగులము
దలపులు నెలకొన్నవారి కెల్లాను
[14-264

**తగులాటమగు**
తలఁపులోపలి రతుల దమకించఁబోయినను
తలఁపు వలపులకెల్లఁ దగులాటమాయ
[4-155

**తగులాయము**
తగులాయ మైనందుకే తమకింతు
రెప్పుడును
నగవుల తేటలకే ననుపొడుదు
[13-105

నేరిపె నన్నియుఁ దానెయ్యమున నేఁగూడితి
తాపుకాణించఁగఁబోతే తగులాయమె
[14-263

**తగులు**
దరిచేపటాలేదు తగులులేదు నానాఁడు
నరకమే కురిసీని నా బ్రదుకు
[8-110

ఆతఁడే యెరుఁగును అంకెలైన తగులు
చేతిలో వున్నదిది చెప్పరాని తగులు
[13-200

**తగులు చేయు**
ప్రతిలేని దురితము పాలుసేయక
నన్నుఁ బాలించవైతివో కర్మమా
తతితోడ నాత్మ పరితాపంబు తోడు
తను తగులేల సేసితో కర్మమా
[5-187

**తగులువడు**
యెందుసు దగులువడ కేకరూపని నిన్ను
కందువఁ గొలుచువాఁడె ఘనపుణ్యుఁడు
[9-255

**తగులువీఁడు**
తనువుతో భోగాలు తగులు వీఁడగలేము
వెనక కర్మపాశాలు వీడించుకోఁ గలమా
[9-260

**తగులైయుండు**
జగము లేలేటివాఁడు సంసారి జేసినవాఁడు
తగులైయుండినవాఁడు తానేకాఁడా
[7-243

**తగులైవుండు**
నానావిధులను బొరలి యలపుతో
నలి నే నిద్రించేటప్పుడు
తానును ఆ పరిమాణంబులకు
తగులైవుండును యీతఁడు
[9-17

**తగ్గు ముగ్గులగు**
తగ్గుముగ్గులైన వేళ తలచినవారెల్ల
సిగ్గుబాటుకాక తమ్ముఁ జేరవచ్చేరా
[11-3-81

**తగ్గు, మొగ్గు**
తలవంచుకుండినాను తగ్గులేదు మొగ్గులేదు
పలుక వుండినాను భయములేదు
[17-15

అగ్గమై శ్రీవేంకటేశ అన్నిటా
నిన్నపె గూడె
తగ్గుమొగ్గులేనిది దయనుండ నేర్చునూ
[18-159

**తగ్గుల మొగ్గుల సేతలు**
సిగ్గులు దొలఁగని యాసలఁ జిక్కి
కదా దుర్మానపు
సిగ్గుల మొగ్గులచేతను చిక్కువడిరి జనులు
సిగ్గులు దొలఁగుట యెన్నఁడు చిత్తము
లోనొ చెన్నఁడు
తగ్గుల మొగ్గులసేఁతలు తలఁగుట
లెన్నఁడొకో
[5-78

**తచ్చన**
వచ్చిరాని పదముకంటివో వలపు
తచ్చన మాటలవంటి తమివలపు
[13-212

తక్కుల నీ గుట్టకు తచ్చన సన్నలకు
వొక్కమాటె యీపనుల కోపుదుజా నేను
[14-202

వచ్చి వచ్చి రమణుఁడు వాకిట నేల నిలిచె
తచ్చనలెల్లాఁ దెలిపె దగ్గరి రమ్మనవే
[14-57

**తచ్చన లెంచు**
యెక్కడనైనాఁ జేయి యెకసక్యాలు
తక్కిన వారితోడ తచ్చన లెంచకయ్యా
[18-1

**తచ్చన వినయము**
మెచ్చిమెచ్చినాతో నమ్మిక మాఁటలాడేవు
తచ్చన వినయాల యాతఁడవు గాదా
[16-2-19

**తచ్చిచూచు**
అమరఁ దట్టు పుణుఁగు అవధరించఁగాను
తమితోఁ బోలికలెల్లఁ దచ్చి చూడఁగా
[8-166

తచ్చి చూచేది తన్నుల దాసులమీదికరుణ
రచ్చకెక్కఁ గలశాపురము
హనుమంతుఁడు
[8-232

వచ్చిగరికెకాలము ప్రపంచములో బ్రదుకు
తచ్చిచూచేటి సూత్రము తన జ్ఞానము
[10-24

తచ్చిచూచితేఁ జాలుదైవమే కలఁడుగాక
హెచ్చిన మాయలఁ బడనేల మాకు నికను
[16-1-35

**తచ్చి తలఁచు**
చెచ్చెర మనసిది శ్రీ వేంకటేశ్వరుఁ
దచ్చి తలచఁగా దరి చేరెడిని
[8-47

**తచ్చివేయు**
ముచ్చటదీరదు తన మొగము చూచిన
దాఁకా
తచ్చివేసి నేనుండఁగ తనకేపె వెఱపు
[15-150

**తటతట నదరు**
కుటిలదేహియై కుత్తికఁ బ్రాణము
తటతట నదరఁగ దలచీనా
[5-207

**తటుకన**
ఇటు నిను దెలియఁగ నెంతటివారము
తటుకన నాసలఁ దగులుట గాకా
[7-71

**తట్టుపడు**
ఘనుఁడ శ్రీవేంకటేశ కమ్మర నీకృపచేతఁ
దనిసి యే విధులనుఁ దట్టువడనైతి
[6-27

ఏమిసేతుదైవమా యెన్నఁడుగరుణించేవో
దామెన సంసారములోఁ దట్టుపడే మనసు
[6-105

యెడగువ్వతలచూప నీకుండను బ్టై
పడు నెండవడి బెట్టువడిఁ దట్టు పడుచు
[ప. యో. వి. 7–268

తట్టుపుణుఁగు
సొలసి సొలసి నీతో జోడై వుండేటివేళ
తవిదుఁదోడి చూపులే తట్టుపుణుఁగు
[13–129

తాలిమితో జాలువారీ తట్టుపుణుఁగపిగోరే
పోలింపఁ బుణుంగుకపు పురుషోత్తమునికి
[14–153

తట్టు ముట్టు
కొండో సుయ్యో కుమతులాల
తండుముండు తట్టుముట్టు తాఁకై నగనుఁడి
[5–102

గట్టిగా శ్రీ వెంకటేశు కైంకర్యమే సేసి
తట్టుముట్టు లేనిదే తగ నిజభక్తి
[7–235

తట్టుముట్టు పడు
దక్కనివి గోరనేల తట్టుముట్టు పడనేల
చిక్కినంతకే సంతసించరాదా
[11–131

తట్టుముట్టు సేయు
యిట్టి శ్రీ వెంకటేశ యింతలో గూడితివీపెఁ
తట్టుముట్టు సేయకిట్టి దయఁజూడరాదా
[17–524

తట్టువడు
తట్టువడ లోకమెల్లఁ దప్పుకొనినా లేదు
తెట్టఁదెరువున నోరు దెఱచినా లేదు
[5–55

ముట్టుకొన్న యింద్రియాల ముదిసి
ముదిసి రాఁగా
తట్టువడి తనమేను తానె మరచె
[7–146

తట్టువడ్డ జీవునికి దైవము శ్రీహరియని
యిట్టె మొరయిడిరి యింద్రాదులు
[9–280

ఇట్టెసరి సారికేదియు లేదాయ
తట్టువడుటేకాని దరిచేరలేదు
[11–2–26

తట్టువడ లోకమెల్లఁ దప్పుకొన్న లేదు
తెట్టదెరువున నోరు దెరచిన లేదు
[11–2–29

తడతాఁకులు
అడవుల వెన్నెల లారడి బమకులు
తడతాకుల పరితాపములు
[5–24

కడగనుటే సౌఖ్యముగాక యీ
తడతాఁకుల నెందరు చనరిట్లా
[5–163

పగగొని తిరిగేటి జన్మపు బాధలు
తనకే కాలము
తగు సుఖమెక్కడ నున్నది తడ
తాఁకులె కాక
[5–209

అదియ నదియనయ్య యఖిలలోకైకనాథ
తడతాఁకుల తాపత్రయము మానుపుటకు
[11–121

జడిసివుండిన నీతో చనవు చెప్పుటకంటే
కడకాఁకులఁ బొరపే తడవకు మమ్మను
[17–327

తడవు
హరి నారాయణ యనియెడి నోరను
ధర నితరులపేళ్లు దడవుపెట్టు
[9–167

తడిపాఁత మెడగోఁత
తడిపాఁత మెడగోఁత తలఁపు
విషయాసక్తి
గుడిమీఁది తరువు అలకులము
(అలుగులము ?) ప్రాణులకు
[11–3–38

**తడిసూళ్లు**

తెల్లని కప్పున కాపు తెఱవు నవ్వులగూడి
పొల్లుగాని పుష్పాళ్ళ పోగులాయను
మెల్లని నీవు రూపుల మించుల రవలురేగి
వొల్లని తడిసూళ్లు వొత్తులాయను
[13–137

**తడుము**

అతని సముఁగావో చిత్రగుప్త నాయందలి
యోఁగాము లన్నియును
అతఁడే మీకు త్తరము చెప్పెడిని
యన్నిటికిని మునుఁ దడవకుమీ
[7–60

**తత్తరపరచు**

చిత్తవికారము జీవులపాపము
తత్తరపరచక తరయ దిది
[5–122

**తత్తరీఁడు**

నొత్తి శ్రీవెంకటేశుఁడు వాడిదట్టి
నన్నుఁ గూడె
తత్తరీఁడు మాటచెప్పె దగ్గరి రమ్మనవే
[15–57

**తనకుఁదానె వచ్చు**

అనుభవమునకుఁ బ్రాప్తియైనది
తనుకుఁదానె వచ్చి తగిలి కాని పోదు
[5–6

**తని**

చిలుకవే నవ్వులు సెలవుల నాది యేవే
బలిమిఁ జిలుక తని వంజరాన నున్నది
[13–208

**తనివి ఆకు**

వొక్కమాటె నవ్వు నవ్వి వొడివట్టి
తీసి నన్ను
తక్కులఁ బెట్టినదె తనివారెనా
[15–229

**తనివెఱుంగని యాస**

తనివెఱుంగని యాస తరుణి వేడుక గదా
నినుపులై రతులు పెన్నిధులాయెను
[4–135

**తనివోవు**

తనివోని యాగతంత్రములు లక్షల సంఖ్య
అనఘుఁడై చేసిన యటమీఁద
జననము లన్నిట జనియించి పరము పా
వనుఁడై మటికదా వైష్ణవుఁడౌట
[5–86

తనివోక మనసులో తన వెట్టిగానఁడు
ఘనుఁడు శ్రీవెంకటేశుఁ గానబొయ్యీనా
[8–135

నీవే యెరిఁగి సేయు నీ చిత్తమువచ్చినట్టు
తావులఁ గొసరేనన్నా తనివోదు నాకు
[8–188

**తనువు వేఁచు**

పనిమాలిన యీ పలు లంపటముల
తనువు వేఁచు టెంతషని యిట్లు
[5–167

**తన్నుఁదానె**

నెలపై శ్రీవెంకటేశ నిన్నుఁ గూడె
తన్నుఁదానె
అలమి పైకొనవయ్య అప్పటికి నీవు
[17–298

**తన్నువడు**

తగిలి భీష్ముఁడు శరతల్పమందునుండఁడా
అగడై విభీషణుఁడు అన్నచేఁ
దన్ను వడఁడా
[8–245

**తప్పకన్ను**

తప్పకన్నును బట్టతల గూని పీఁపు
పుప్పిగోళ్లను నీచపోయిన కాళ్ళు
[ప. యో. వి. 4–753

తప్పఁ దెలియు
వేదార్థముదప్పఁదెలిసినవిద్వాంసునివంటిది
పాదుగఁ జదువక తక్కించఁబోవు
పాండిత్యము వంటిది
[7–86

తప్పఁదోయు
తప్పఁదోయవే దైవశిఖామణి
యిప్పుడు నీకృప నెనసితి నేను
[5–272

తప్పి సేయు
బాలకివి నీ విపుడు ప్రౌఢనాయకుఁ డతఁడు
తాలిమి నీయదకుఁ దప్పి వేసేనా
[17–448

తప్పుగాలి
కాయపువోడ తప్పుగాలి విసరినవేళ
పోయినట్టే పోనిచ్చి పొనుఁగుటగాక
[11–79

తప్పుఁదెరువు
ఒక్కఁడే దైవం బున్నతుఁ డితఁడు
తక్కిన తలఁపులు తప్పుఁ దెరువులు
[9–274

తప్పుఁదోవులు
తారుమారు తాఁకునోఁకు తప్పుఁ
దోవు లిన్నియు
వారపారులేనివెల్ల వొక్కటెకా నిజము
[5–91

తమకి
పువ్వువంటి నా వయసు పూఁచి
నీపైఁ జల్లఁగానె
తవ్వేవు జాణతనాలు తమకి వౌదువు
[15–225

తమిపుట్టు
మెండుగాఁ బరకాంతల మీఁది
తమి వుట్టితేను
అందుకాచందుకు భ్రమయకుండుటే బుద్ధి
[6–195

తమిరేఁచు
మలసి యా చూపులు మనసునఁ దగిలించు
తలఁపు మాటలాడఁ దమి రేఁచును
[7–33

తమ్మచిట్టము
జీబుకొల్పుచుఁ దమ్మ చిట్టంబుగట్టి
గాటకోరిందలఁ గడు దట్టమైన
[వ. యో. వి. 7–97

తమ్మ పడిగము
పతి వదనము తమ్మ పడిగమాయె నీకు
మతిఁ జలకుంకా నీకు మానదటకే
[15–106

తరకాఁడు
తరుణకూటమి గంటే దప్పిదీర్చనే వలె
తరకాని వలెనుంటె తమియాడది
[13–227

[వేఁటకాఁడు, మాసటీఁడు కోవలోని మాట కాబోలు. 'వేటకానివలె నుంటె వేడుకేది' 'మాసటీని వలెనుంటె మచ్చి కేదది' అని మిగతా చరణాలలో వుంది]

తరఁగుమొరఁగులు
హరిభక్తి వోడయెక్కినట్టి వారలేకాని
తరఁగు మొరఁగులను దాఁటలే రెవ్వరును
[6–56

తరతరము
గరిమల శ్రీ వెంకటపతిఁ గొలిచితి
తరతర మిందే దక్కితిమయ్యా
[9–155

తరమిడు
తరిత్రాడు తరువ తరమిడి
తిరుగుట తిరియుట యుదిరము
తెరలుట తెరవున్
[రేఫ. ఱ. 26

తరవాటు

వారక యొక తరవాటు చేకొనుచు
నీరజోదరుల వర్ణించి వర్ణించి
[ప. యో. వి. 3-460

తరవాయిగొను

పురుష జంతువులెల్ల యీఁడు జంతువుల
తరవాయిగొని వెంటఁ దగులుఁ గాని
[10-134

తరితేపు సేయు

తెరవనిదె కరుణించె దేవుఁడేనాయకుఁడు
తరితేపు సేయఁగాని తలఁపులో నుండు
[12-343

తరవిడు

తరవిడి వెనక ముందరి ధనంబునకు
హరువుగై కొనుఁడు లేదనిన నా గడుసు
[ప. యో. వి. 6-257

తరవు

చవికె లోపలనుండి చదురంగమాడుతాను
వువిద కిచ్చితివి నీ వుంగరము
జవళినదే నిన్నుసారెఁ దలపించునని
తవిలి నీకెచ్చరించఁ దరవిచ్చె నిపుడు
[13-112

తానుచూచినంతె చాలు తరవులు వెట్టకురే
మేనులు సోఁకిని మీఁద మించీఁ గాని
[17-305

తరవులు పెట్టు

సాహసభూతము ఘన హింసలకే
చూఁపించి జేయి
దాహపుటాసలు వెనకముందరల
తరవులు వెట్టీని
[7-66

తనువికారములు తరవులు వెట్టిన
కొనయెదుకైనా కొరతవడు
[11-106

దండనున్నవతిఁ దరవులు వెట్టపు
నిండు రాజసము నీదమ్మా
[17-381

తానే వచ్చీగాని తరవులు వెట్టకురే
మోనమునఁ జెలులాల మొక్కరే మీరు
[18-148

తరితీపు

తరితీపువలనఁ జిత్తభ్రాంతి తగఁగలిగె
విరహంబు వలనఁ బరవేదనలుఁ గలిగె
[5-71

దవ్వులమాటలు వినే తరితీపు వేడుకే
యివ్వల నన్నుఁ గూడితి విదీ వేడుకే
[18-244

తెంచివేయని తరితీపుఁ గోరికలఁ
గలకొన విహరించెఁ గాంతకై తగిలి
[చ క్ర. మం. 62

తరితీపులు

తరితీపు లెట్లుండు తాలుము లెట్లుండు
గరువంబు లెట్లుండు కసరు లెట్లుండు
[4-27

చిఱునగవు మాటలకుఁ జిత్తగించితిఁగాని
తరితీపులని లోను దలఁపలేనైతి
[5-30

కలుగునే తనివి బహుపదార్థములు
గక్కున నంగళ్లను జూచి
కొలఁదిమీఱఁ గడు తరితీపులతో
కోరుచు నోరూరం గాక
[6-190

తరితీపులైయుండు

అరతఁ జేసే విన్నపా లడియాసలై
యుండు
తరితీపులై యుండు దవ్వులవిన్నపములూ
[18-125

తరిత్రాడు
తరిత్రాడు తరువ తరమిడి
తిరుగుట తిరియుటయు దిరసు
తెరలుట తెరువుక
[రేఫ. ఱ. 26

తరువులువెట్టు
వరుఁడవే యలపరాత్పరుఁడవే యనుచుఁ
దరుచుగా గోపికల తరువులువెట్ట
[అ. మ. క. 2333

తఱచు టూరుపులు
మఱలు దేహియై మఱచి వున్నయెడ
తఱచు టూరుపులఁ దలఁచీనా
[5-207

తఱవాయి
నెఱి నరకములో నానితివియుఁ గొన్నాళ్ళ
తఱవాయి దెలుసుకో దానికేమి
[9-42

తలకిందగు
కోవిలపలకదు కొమ్మావి లతల
దైవిక మిదివో తలకిందాయ
[12-44

తలకూడు
గుణములెల్ల నిరుణముగాక
తలకూడదు శాంతంబు
అనువున కనువై అంతయుఁ దాఁగక
ఆనందము లేదు
[5-276

తలచిన తలఁపులు దలకూడె
వెలుపలె లోపల వెరగిఁ కొనవే
[15-276

తలకెత్తు
వసముగాని పనివడిఁ దలకెత్తుక
అసురుసుర గానిదది సుఖము
[9-256

తలకెక్కు
తలకెక్కెఁగదె దీని తనువికారములు
పొలుపైన నెరులు కొప్పున జారెను
[4-13

కానిమ్మనియాపెరాఁగా కాఁగిటనీవుంచఁగా
కానమై నా వలపు తలకెక్కెను
[17-568

తలకెత్తుకొను
చక్కజ్ఞానియైనవాఁడు పారార్థము
వేదమందు
తక్కక చేకొనుఁగాక తలకెత్తుకొనునా
[6-186

తలకొను
కలుషంపు దుర్మదము గడచినప్పుడు గదా
తలకొన్న మోక్షంబు తనకుఁ జేవదుట
[6-104

తలకొను కాలత్రయ ధర్మంబును
అలరఁగ నారాయణుని మహిమలె
[7-111

తలగుండు గండఁడు
మారీచసుబాహు మదమర్దన తాటకాహర
కూరేంద్రజిత్తు తలగుండు గండా (?)
[6-220

సోదించు మారీచుని తలగుండు గండ
ఆదినారాయణ యసురభంజనా
[11-5

కొలమై (?) బరుని తలగుండుగండరామా
చలమరి సమరపు జయరామ రామా
[11-62

తలఁజుట్టుట
పలు లంపటములచేఁ బడుట దుఃఖంబులు
తలఁజుట్టుటేకాక తనకేమి కలదు
[5-92

తల తడియార్చుచందము
తలతడియార్చుచందము దోఁప మౌని
కులసాధుసోఁకంగఁ గ్రొమ్ముడి విడిచి
[ప. యో. వి. 4-653

**తల తిక్క**
వాక్కొక్కనాటి వద్దె వాదిగీఁగాని తల
తిక్క గొన్నిపాపములు దీరకపోయను
[16-1-6

**తలను వేఁగు**
నీ తలనే వేఁగెనా నిన్ను దూరఁ బనిలేదు
జాతిఁ బుల్లఁదీఁగెలకు సారె వలుగుదురు
[13-50

**తలనె వేఁగు**
నీ తలనె వేఁగినా నిందు భోగాలు
కాతరపుఁ దమకము కాదనఁగఁ గలవా
[15-170

**తలపట్టు**
తలపట్టుతోనుందాన దగ్గరకు రాకురా
తలఁపట్టి నీమీదఁ దగులాయెనే
[15-48

**తలపట్టు పెట్టుకొను**
తలఁబట్టు పెట్టుకొంటిఁ దతి గా దీ వేళను
పొలసి మాయ త్త నేఁడు పొరుగింట
నున్నది
[17-476

**తలపులకొనవాఁడు**
తలఁచిచూచినాను తనలోనే మఱచిన(నా?)
తలఁపుల కొనవాఁడు దైవమొకతె
[9-91

**తలపువాఁడు**
తలపూవాడని తరుణినే నేను, నే
నలరుఁజవికలోని యాకెనే కదే
[4-105

**తలఁపెట్టు**
చిక్కని నీ మాటలకే చెమరించె మే నెల్లా
తక్కిన చేఁతలు వించే తలపెట్టానో
[14-192

**తలపే కూళై తగులు**
ఇల జాణతనము లిన్నిటికిఁ గలదు
తలఁపే కూళై తగిలీ కాని
[7-179

**తలపోసుకొను**
యిచ్చఁ గామక్రోధాలనే హిత
మంత్రులునుఁ దాను
తచ్చి తలపోసుకొనీఁ దగజీవుఁడు
[6-58

పరమయోగీశ్వరుల పద్ధతి యిది
ధరణిలో వివేకులు దలపోసుకొనుట
[8-212

తాలిమితో మహిమలు దలపోసుకొనవలె
వేళవేళ ధ్యానించి వెదకఁగవలెను
[8-228

**తలమరకాఁడు**
సరిఁబాపపుణ్యముల సరకులు నించుకొని
దరిచేరె జీవుఁడనే తలమరకాఁడు
[9-99

**తలమీఁద నిడుకొను**
తలమీఁద నిడికొనఁ దలఁచిన నిన్నుఁ
దలమీఁద నిడుకొన్నదానిగాఁ జూడు
[వ. యో. వి. 5-1783

**తలమొల**
దైవమా నీ మాయ తలమొలెఱఁగ నీదు
కావరపు విషయాల కట్లు వదలవు
[6-4

**తలమోపులు**
తండోపతండములై తలమోపుల పనులు
చండిపెట్టి పనిగొను సంసారము
[8-111

**తల రాయి యగు**
తలరాయిగాఁగ నెందరికి మొక్కెడిని
తెలివిమాలినయట్టి దేహి
[11-3-72

**తల రాయి సేయు**
సిగ్గువిడిచి కూడెను శ్రీవెంకటేశుఁడు
వొగ్గి తల రాయిసేసు కూరకైనాను
[17-596

**తల రాయి సేసుకొను**
చిఱుత నవ్వులేల సిగ్గులు వడఁగనేల
గుఱ్ఱఁ దలరాయి సేసుకొంద మిఁక
లేవయ్యా
[41–222

**తలరో**
మెలఁగ పరశురాము మెల్లేసిన బాణము
తళతళ మెరసీని తలరో యసురలు
[10–283

**తలకెత్తుకొను**
లంపటాలుసంపదలు లలినంబారాసులాయ
యింపుల ముంచి తలల కెత్తుకోరో
[8–170

**తలలేదు తోఁకలేదు**
తలలేదు తోఁకలేదు దైవమా నీమాయలకు
తెలిసియుఁ దెలియక తిరిగేము నేము
[11–73

**తలవీడు**
తలవీడి వుండేనేమి తప్పక చూచిననేమి
నెలవునఁ గూడితివి నీకు మేలు
[14–44

**తలవెంట్రుకలందరు**
తలఁచి వరము లడిగే వారలు
తలవెంట్రుకలందరు వారె
యిల సందడిలో నా కొలువు
యెటువలె నెక్కునో
[7–67

**తల్లాడ నిల్లాడ**
అరిది సేఁతలే చేసి తల్లాడ నిల్లాడ
సరిలేక వుండితివి జలరాశికాడ
[5–197

**తవ్వించి తలకెత్తు**
అవ్వల సంసారభ్రాంతి అనాది
నుండియు లోలోఁ
దవ్వించి తలకెత్తే యంతర్యామే కాక
[6-45

**తవ్వికట్టుకొను**
జవ్వనము మోఁచేదియు సరి
ముదుసేదె కాని
తవ్వికట్టుకొనే దేది దాఁచే దేది
[7-37

**తష్టి గట్టుకొను**
నష్టిలేదు నడచేది నడవక మానరాదు
తష్టిగట్టుకొంటి(?) గాక తామానబొయ్యీనా
[10–197

**తహతహదీరు**
యిల నీ దాస్యం బిది యొకటే
సిలుగుల భవముల బిలుగు
మాన్పగదె చిత్తము తహదీర
[7–142

**తళివెట్టు**
తలకక వడి నగత్తలు పూడ్చుకొఱకు
దళముగా నందంద తళివెట్టువారు
[వ. యో. వి. 6–320

## తా

**తా (శత్రర్థక క్రియా ప్రత్యయం)**
నవ్వుతా నే నుండఁగానె నంటున
గిలిగించేవు
అవ్వల నీ కింకా నెంత ఆసోదమోయి
[15–225

**తాఁకు సోఁకు**
తారుమారు తాఁకు సోఁకు తప్పుఁ
దోపు లిన్నియు
వోరపారు లేనివెల్ల వొక్కటెకా నిజము
[5–91

**తాఁచుబాముఁవంటి.......**

వంకచీరఁ దాఁచుఁబామువంటి
దేవరమీఁద నానవెట్టితి
[16-2-106

**తాచు**

చేచేత నీ రేవులను శ్రీ వెంకటేశుఁడవు
తాచియున్నదాన దయదలఁపు నీచేతిది
[14-297

చీచీ నతుల మనఁగా సిగ్గు గదా
తాచి యిన్నియు నింగఁ దచవ నేమిటికి
[17-406

యేచి కోపించక తొల్లె యింతిచే
సేవ చేయించి
తాచి నీ కాఁగిట నీవు తమిరేఁచవయ్యా
[17-486

**తాఁటకూఁటలు**

తాఁటకూఁటలూ నేల తావచ్చినట్టె వర్తము
పాటించి నా వలపు పండి పొల్లవొయ్యీనా
[13-20

**తాటిమాని నీడ**

రతులలో మాటలు రావిమాని పువ్వులు
తతిఁ విరహపు కాఁక తాటిమాని నీడ
[7-34

**తాటకూఁటలు**

ఏఁటికయ్య మాఁటలు యింకా
తాటకూఁటలు
యీటువెట్టుకొని నిన్ను నేమనేము నేము
[15-233

**తాటించు**

యీటుతో శ్రీవెంకటేశుఁ డిటు నను(గలసి
తాటించి పొగడిని తనకు నే నెదురా
[13-15

**తాటోటుకాఁడు**

తప్పురే కూడై నటి తాటోటుకాఁడవు నీతో
యిప్పుడునమ్మి నీపొందు వెట్టునేఁజేసితిరా
[13-10

**తాడుపడు**

యీడుగాని చెలి నన్ను నేమేమో ఆడగాను
వేడుకనోరాఁ గన్నుల వినేవు నీవు
తాడుపడి నేనందుకు తరిఁ జిన్నఁ
బోయుండఁగా
గూడెనా నీ కేమైనాఁ గోరి కట్టుకోవయ్యా
[17-409

**తాడుపడ్డ మనసు**

తాడుపడ్డ మనసుకు దైవము విష్ణుఁడే యని
పాడి కొలిచిరి తొల్లి బ్రహ్మాదులు
[9-280

**తాడుపై తపసు**

పాడూరికో బ్రదుకు పాపకర్మపు బుద్ధి
తాడుపై తపసు తమ ధనము ప్రాణులకు
[11-3-38

**తాడువేఁడు**

నారలు నావి వొలిచి నమ్మికల దాడు వేఁడి
బోరచిని వల్లెవేసే బొట్టివాఁడవు
[13-93

**తాఁదాను (తనకు తాను)**

నేనేమీ ననఁ జుమ్మీ నెలఁతలాల
కనకమై సిగ్గువడీ తాఁదానే
[14-36

**తాపజ్వరము**

తరుణుల కౌఁగిలనే తాపజ్వరాలు వట్టి
కరఁగి మేనెల్ల దిగఁ గారజొచ్చెను
[9-67

**తాపలేక మేడలెక్కు**

తావలేక మేడలెక్కుఁ దలచేము
యేపులేని చిత్తముతో యీహీహీ నేము
[11-3-28

**తాపి**

చూపరాదు గాని నా చుట్టుకొన్న తమకము
ఆఁపరాని నిట్టూరుపులందుఁ జూడరా
తీపులమాటలఁబోదు తేటల వెన్నెలఁబోదు
తాపియై నిన్ను బోదించే దానిగంటే గాని
[17-354

తాపికాండ్లు

తాపికాండ్లారు గోరు ధర్మాసనము వారు
చాపలమే పను లెట్టు జరగీనయ్యా
[9–175

తాయిమక్కళాలు

అయలేరే యేమిచెప్పి రాతవినుద్దులు నాకు
తాయి మక్కళాలె కాక దయగద్దా తనకు
[4–115

తారి తారి దాఁగు

నేరమి సేసినవాఁడు విక్కపు వెలికఁగని
తారితారి యిందు నందు దాఁగినయట్టు
[8–107

తారితూరు

గోరవడి గడించేవి కోట్లు కొలఁదులు
తారితూరి నోటికిఁ దగ్గంత గాదు
[9–249

తారుకాణ

తారుకాణలైనచోట తమకించి కూడకున్న
చేరఁగ జాణఁడాగోడ చేరుపుగాక
[13–11

తారుకాణవై యుండగ దాచనేల
కూరిమెల్ల నీ మీఁద గుంపువైనరోట్ల
[13–62

తారేడ వారేడ

తారేడ వారేడ దైవము శ్రీవెంకటేశు
డారయ నంతరాత్ముఁ డని తెలిసి
[6–126

తావిగాలి

దొరసిమోముఁ దమ్మిపై తుమ్మెదలు
చెలరేఁగే
గరిమ ముక్కునఁ దావిగాలి విసరే
[18–307

తావుకొను

మనసు నమ్మనేర్చితే మనుజుఁడే
దేవుఁడౌను
తనలోనె వున్నవాఁడు తావుకొని దైవము
[7–118

తావుకొని చేరువ నీ ధ్యాస మిట్టేవున్నది
భావించి నమ్మేటి వారి పని యింతే కావి
[8–284

దైవమై మమ్మేలి దాసుల రక్షించె
తావుకొనఁగ నిటు దయతోఁ జూచి
[9–218

భావించినట్టు మతిఁ బరమ యోగులకెల్ల
తావుకొని నిచ్చలుఁ బ్రత్యక్షమైతివి
[11–132

తగు శ్రీవెంకటాద్రిఁ దావుకొని వరాలిచ్చీ
చక్కఁదనముల కెల్లాఁ జక్కని నరహరి
[11–197

భావించి నీవు చూచిన భాగ్యమే యెక్కుడు
తావుకొన్న నీ రతులే ధనధాన్యాలు
[18–106

తావులిచ్చు

ఎవ్వనికిఁ గలదయ్య యిటువంటి నేరుపు
దవ్వులకుండఁగా నీవు తావు నిచ్చేవు
[14–198

తావులువేయు

కాఁకరేచవద్దు గాక కలయ వద్దంటినా
వేఁకపుఁ దావులు యాలో వేసేఁగాక
[15–238

తాసు

చేసినంతే చేఁతగాక చెలులెల్లా నీ వట్టుకు
తాసువలె మెలఁగితే తగ వెటిగేవా
[17–20
[కార్రివడి లేకుండా ప్రయోగం]

తాళికట్టు
నేరుపరి వన్నిటాను నీకుఁ గట్టితేనే దాళి
చేరిమాటాడకున్న, జెచ్చెరఁ దిట్టైనా
కోరిన కోరిక నీవు గుంపించి నేనేదేమి
తాడుకాజైన దాఁకా నీ దండ నుండే
మయ్యా
[14-235

కన్నుల నీ మొక్కులకు కరుణారసానాకు
కన్నెనయ్యే నీకు తాళి గట్టితిఁగాక
[14-202

తాళిగోణము
విమలమై నిండారు వెన్నెలసోగ
కొమరు మించిన తాళిగోణంబుతోడ
[వ. యో. వి. 3-1207

తాళిమెడవాఁడు
చిగురుమోవివాఁడు శ్రీ వెంకటేశుఁడు
(వాఁడు)
తగు నలమేలుమంగ తాళిమెడవాఁడు
[13-116

తాళుకొను
కాల మక్షయము నేయ కర్మము ఫలించఁ
జేయ
తాళుకొని మరపించఁ దలపించ [7-85

# తి

తిక్కపట్టు
తిక్కవట్టినాకు నాకే దేవతలకెల్లా మొక్క
వొక్కరివాఁడ గాకుందు వుస్సురను
కొంటాను
[8-98

తిక్కముత్తెలు
తిక్కముత్తెల కుచ్చుల తిరుతేరు
తెక్కలఁ బ్రతాపించీఁ దిరుతేరు
[11-24

తిట్టపెట్టు
పట్టివానగురియించ పైరులు మొలపించ
తిట్టపెట్ట నొకానొక దేవుఁడు గలఁడు
[7-85

గుట్టుతోఁ జైతన్యమై గుణము లన్నిటికిని
తిట్టపెట్టి రచించిన దేవుఁ డింతే కాక
[6-45

తిట్టములు
బెడిదవుఁ బెద్దలెల్లాఁ బెట్టిన తిట్టములంటా
యీడుకుఁజేసేఁగాక యిందేమి గలదు
[6-74

తిట్టువడు
పరగ శ్రీవెంకటాద్రి పతియును నీతఁడె
తిరమై గొల్లెతలచేఁ దిట్టువడేఁగాని
[10-249

తిట్టువాటు
కోపింతువట నీవు కోరి నేనోరువలేనా
దీపించ నన్నిటా నీకుఁ దిట్టువాటని కాక
[13-138

తిట్టేటి మాటలును దీవించే మాటలు
తిట్టేటి మాటలును దీవించే మాటలును
అట్టే సరేని తలచి నాతఁడే సుఖి
[5-309

తిత్తిదేహము
మత్తిలి యీతనికంటె మరిలేదితరములు
తిత్తిదేహపు బ్రదుకు తెలిసేటి వారికి
[5-327

తిద్దుబడి
వొద్దికె నప్పటిఁ గొన్ని వుపచారాలువలెనా
తిద్దుబడి నోరుచుకో తిద్దితివి చాలదా
[14-117

తిద్దుబడుగుజ్జము
పొద్దొకబై రూపము పొదలేటి యీ వయసు
తిద్దుబడి గుజ్జము హత్తినగుణము
[10–24

తినుకు
యిరుకుమాని సంది నేఁటికి జొరవలె
తిరుగలేక యేల తినుకవలె
[16–1–49

తిన్నవెల్లఁదీరు
నిన్న నిద్రించితిమి నేఁడే మేలుకొంటిమి
తిన్నవెల్లఁ దీరినచే తెలియమయ్యా
[10–136

తిప్పన తొప్పన
తిప్పన తొప్పనకేతు దేవన బావన గన్న
పప్పన బొప్పనగారిఁ బాడిపాడి
[11–3–77

తిప్పుతీరగు
దెప్పరపు భవములఁ దిప్పు దీరైతి మిదె
తప్పుకొని కావఁగదో కర్మమా
[11–37

తిప్పుఁదీరులాడు
తప్పి రెండు దునుకలు గూడినవాని
తిప్పుఁదీరులాడే దేవుఁడు
[11–3–45

తిమిరి
తెమలి వానరులై యీ దేవతలే బంట్లైరి
తిమిరి శ్రీవేంకటపతికి నేఁడు నాఁడు
[5–302

తిమురు
జమళి నిద్దరూ నెంత సరులకుఁ బెనఁగేరు
తిమురనేఁటికి మీలో దిందు పడరాదా
[13–121

తిమ్మటులు
మలసి సంసారమే మరగిన మనసు
తలనేము తిమ్మటలు గైకొనేది యరుదా
[10–39

దెప్పరాన నీవు లోలోఁ దిరిగే తిమ్మటలకు
యిప్పటి మా యలుకలు యేడకెక్కీను
[15–224

తనువునకుఁ గలిగె సంతతమైన తిమ్మటలు
మనువునకుఁ గలిగె నామస వికారములు
[5–84

దెప్పరపు సంపదకుఁ దిమ్మటలే దక్కెఁ
గాక
యెప్పుడు శ్రీ వేంకటేశుఁ డిక మానీనా
[5–214

దించక తిరిగే తిమ్మట లన్నియు
అంచల వెఱ్ఱుల అలమటలు [8–137

తిమ్మిరిపట్టు
మతిలేని రతులఁ దిమ్మిరివట్టె దేహాలు
మతిమఱచె నిందుకు మందేదొకో
[9–67

తిరిగాడి
ఇట్టునట్టుఁ దిరిగాడి యేమైనాఁ జెడనాడి
పెట్టరంటాఁ బోయరంటాఁ బెక్కులాడి
[5–59

తిరియబోవు
ధరఁ దనయింటఁగోటిధనమట్టేవుండఁగాను
మరలి తిరియఁబోతే మట్టుపడేనా
[8–67

తిరుతేరు
రణములు గెలిచి మరలె నదె తిరుతేరు
గణుతికెక్కెను శ్రీవెంకటగిరిదేవుఁడు
[8–145

అదె యెక్కె దిరుతేరు అసురలు బెదరఁగ
త్రిదశులు చెలఁగఁగ దేవదేవుఁడు
[10–178

తిరుపగు
తిరుపై యవ్వలవ్వలఁ దిరుగు
చుండేటి వేళఁ
దిరిగినట్లు నుండు దిక్కులెల్లాను
[6–75

తిరుపళచ్చి
వేఁకునఁ దిరుపళచ్చి విష్ణునికిఁ జేయరో
ఆఁకటి కొదగినట్టి ఆరగింపులు
[9–9

తిరుపుగొను
తిరువీధులే గని తిరుతేరు
తిరుపు గొన్నట్లాను తిరుతేరు
[11–24

తిరుమిక్కాళ్లు
ఆలాగు వాఁడనేనని చిలుకజోదుల
వాలు తిరుమిక్కాళ్ళకు వడినిల్చేవా
[13–181

తిరుమేను
దేవతలందరు నీ తిరుమేనై నమూర్తి
ఆవాలఁ బాదాన లోక మణఁచితివి
[10–194

తిరువనందలము
తనివారఁ దిరువనందలము నేవనేఁడు
అనువుగా సేవించరో అమరులు ఋషులు
[15–189

తిరువాముడి
చదివేరు వైష్ణవులు సారెఁ దిరువాముడిదె
కదిసి శ్రీ సతి ముందే కాచుకున్నది
[9–195

తీ

తీఁగసాఁగు
ఈరీతిఁ దనలో విగురొత్తు కోర్కె
సారెసారెకుఁ దీఁగ సాఁగ రంగేశు
[వ. యో. వి. 3–1895

తీగనవ్వు
తెల్లని మేనితోడ తీగనవ్వులతోడ
చల్లని గంధముల వాసనలతోడ
[7–121

తీగెమాటలు
తీగె మాటలాడుకొంటా తేరి
పన్ను వేసుకొంటా
బాగుగా నెవ్వతో నీ పక్కనున్నది
[18–310

తీగెలు సాగు
మగుడఁగ నేరవు జన్మజన్మముల
మనసు వీవికే సహాయము
తెగవెన్నటికిని యింద్రియ సంపద
తీగెలు సాగుచు నొకటొకటి
[8–88

తీగె సంసారమత్తులు
తీగె సంసారమత్తులు తెలియక వీరివలె
వేగినంతా నయ్యేమంటే వెరవులఁ
బకవు (?)
[8–119

తీఁట తీగెలు
తీఁటతీగెలు సొమ్మంటా దేహము
నిండాఁ గట్టె
తీఁటకుఁగాక బాలులు తెగి వాపోగా
[6–167

తీఁడుకొను
కోరలు దీఁడుకొంటాను
ఘోర నారసింహుఁడు
సారెసారె నెత్తురులు చల్లుకొంటాను
[11–210

తీఁడేటి మీసాలు
వాఁడివాఁడి కోరలతో వడినసురఁజక్కాడి
తీఁడేటి మీసాలతోడి దేవసింహము
[8–153

తీదీపు
దినదిన సుఖాలు తీదీపు దుఃఖములకు
యెనసి సరికిసరి యిందు కిందుకు
[9–74

సంచితపుఁ గర్మమట జనన లయములట
ముంచిన తీదీపే కాక మోదమున్నదా
[10–129

**తీదీపుచేయు**
తిప్పితిప్పి నాయాసలు తెగి వైష్ణవధర్మానఁ
దెప్పలఁ దేలకుండాను తీదీపు సేసె
[8–80

**తీదీపులు**
రేపేపో రేసులెల్లా నీ
తీపే పో తీదీపులూ [4–110

వరుసము సోఁకియు బ్రదుకవద్దా
తిరిగి కర్మము లింక తీ దీపులా
[5–183

చేపట్టి గురుబుద్ధి సేసేటిదే సుఖము తీ
దీపులఁ బడనియ్యట్టి దీనమె సుఖము
[6–159

భగవంతుఁడ నీ పదములు గనకే
తెగని పాపముల తీ దీపులైతి [8–182

దినదిన తపములఁ దీదీపు లవుతుంచే
తనిసి శ్రీవెంకటేశు దాసులై బ్రదుకరో
[9–279

దిక్కెవరు యీ తీ దీపులలో
దిక్కుముక్కులకు దేవుఁడె కాక
[11–3–15

**తీదీపులు రేఁచు**
చాపలగర్వము యెవ్వరినైనా
సాధింపించీని
తీపుల ధనములు మీఁది మీఁదనే
తీ దీపులు రేఁచీని
[7–66

**తీపునంజు**
మోపులు మోవంగ నొల్లములుగఁగనే
నొల్లి
తీపు నంజనొల్ల చేఁదు దినఁగనొల్ల
[10–65

**తీపులకు దీపు**
వూపవయసునవందు వొడమించు నీవలపు
తీపులకుఁ గడుదీపు దినదినము వలపు
[9–111

**తీపుల పుట్టించు**
తీపుల పుట్టించు దినదిన రుచులై
పూవల సంసార భోగములు
[9–207

**తీపులఁబెట్టు**
అంచెలఁ గంచములోఁ బదార్థములై
వుండినవి
తెంచరాని పాశములై తీపులఁ బెట్టేవి
[6–199

**తీపుల యాసలు**
తీపుల యాసలు దీరినపుడ వో
తాపత్రయములు దలఁగేది
[7–177

**తీపులు పుట్టించు**
తీపులు వుట్టించి యెవ్వరేమనినఁ
దెలిసి వాదడువ నేమిటికి
శ్రీపతిఁ గొలిచితి చేరె సంపదలు
జిగినితఁడే మా రక్షకుఁడు
[8–117

**తీపులు మఱపు**
యేపున శ్రీ వెంకటేశ్వరు శరణమే
తీపులు మఱపేటి దివ్యానందము
[7–231

**తీపువిల్లు**
విరహాగ్ని వొదవె వేవేగ మన్మథుఁడు
విరితూపు తన తీపు వింట సంధించి
[శృ. క. 491

**తీరనివెట్టి**
అనినకృషి వాణిజ్యాలన్నియుఁ దీరనివెట్టి
మానని యాచార మాల్మికుఁ బడ్డపాటు
[6–185

**తీరుగడ**
జగడమునుఁబోలె నలసతలేని మమతదను
తెగివేఁచనే కాని తీరుగడలేదు
[5–210

**తీలు**
మేలెల్ల వొక్కచే మించు తీలా నొకచే
తాలిమితో ఫలియించు తలఁపూ నొకచే
[10–37

చెలువుఁడ నీవు మేలు చిత్తమె తీలుగాని
పలుకులఁ దానిసితి బాసవెట్టో గాని
[15–89

**తీలుపడు**
నేలకు మింటికి మేనునిండఁ బెరిగి యక్షుని
తీలుపడఁగొట్టినట్టి దేవహనుమంతుఁడా
[7–16

## తు

**తుంటతనము**
దొరలకె కాని లేదు తుంటతనము
[14–287

**తుండించు**
యెలమి జక్రాయుధున కెదురా దానవులు
తొలఁగకెందు వొచ్చినఁ దుండించుఁ గాక
[8–1

**తుంపెనలాడు**
గుంపులె చీఁకటి గుమురుల మూల
దుంచలోయన జడల్ తుంపెనలాడు
[అ. మ. శ. 749

**తుకతుకలు**
వొకరు రక్షించఁగా వేరొకరిపాలైన నాక
తుకతుకలే కాక దూరఁగఁ జోటున్నదా
[7–176

**తుటుములువెట్టు**
తుటుములువెట్టుచుఁ దుటుమ గట్టుచును
నటనిటరారె మీరనుచుఁ నొండొరుల
[అ. మ. శ. 2959

**తుత్తుమురగు**
తూపుచేతనంటితేనే తుత్తుమురై పారుదురు
రాపు నీలికాళ గంచే రణభీతి గొందురు
[8–186

**తుత్తుమురై విరుగు**
పారిరి దానవులెల్లా పంచబంగాళమైరి
తూరిరి గొందులెల్లాను తుత్తుమురై విరిగి
[10–21

**తుదకెక్కించు**
పదునాలులోకములుపన్నివున్నవి మోక్షము
తుదకెక్కించనవైనాఁ దోడుగావు
[8–205

**తుదకెక్కు**
యెదుట శ్రీవెంకటేశ యిట్టె నన్నుగావితివి
తుదకెక్కితిమి యింక దొలఁగఁగ వలెనా
[7–285

వదలక నా భోగవాంఛలే పెంచిపెంచి
తుదకెక్క వెదకని దుష్టుఁడ నేను
[8–39

తుదకెక్క నీవే యితరములు దొరకని
మరేమి సేసినను
బదికిరిందునే పరమవైష్ణవులు
పలు చదువులలో వినరాదా
[8–101

దోమటికర్మాలు నేసితుదకెక్కవాఁడఁగాను
యేమిటికిఁ గాచితివో యిది సోద్యమయ్యా
[8–181

దురితమణఁగె నిటు తుదకెక్కె సుఖము
హరియొక్కఁడెగతి యన్నపుడే
[8–242

గోవిందుఁ డితనిఁ గొలిచితి మిదివో
తోవయుఁగంటిమి తుదకెక్కితిమి
[9–265

పూనిన శ్రీవెంకటేశ వొంటి నీకు శరణని
తోనే యీ రెండుఁగడచి తుదకెక్కేఁ గాక
[10-44

ఈరీతి శ్రీవెంకటేశుఁడ నా మనసు
తోరపు విజ్ఞానము తుదకెక్కె మనసు
[11-40

**తుదగట్టు**
వేటొక భావనయేల వీనితోఁ బెనఁగనేల
తూటినందే హరిఁ గూర్చి తుదగట్టగాక
[6-123

**తుదగను**
బంతినే నీనామములు ప్రతిధ్వనులై వున్నవి
దొంతులైన భవముల తుదగను మనుచు
[6-102

**తుదమీఱు**
చుట్టుఁ గన్నిటికికి చూపుఁ జాతకముల వె
కొట్టి యిఁకమీఁద నవి తుదమీఱఁగలవా
[13-1

**తుదముట్టు**
అట్టె గరుడధ్వజ మటు మిన్నుముట్టితేను
కిట్టి దనుజుల కపకీర్తి తుదముట్టెను
[8-92

**తుదిపదమగు**
తిరువెంకటాద్రి పతిపై
దొరకని చెప్పంగఁ బదము
తుది పదమయ్యెన్
[సం. ల. 2

**తుదిపదము**
చిక్కినాఁడు మతి శ్రీ వెంకటేశ్వరుఁ
డిక్కడి తుదిపదమెఱఁగరు గాని
[6-10

తుదిపదమునకుఁ జేదోడైన విభవము
వదలపు శ్రీ వెంకటపతియే యెఱుకా
[6-63

వూహల శ్రీవెంకటేశ వున్నతి నన్నేలితివి
బాహుబలము తుది పదమయితి వానికి
[8-265

చిక్కినాలోనైనది శ్రీవైష్ణవధర్మము
తొక్కినది భావముల తుదిపదము
[10-40

పొరిఁగర్మపుబుద్ధి పుట్టువుపై నునిచి
వెరవునఁ బాపముఁ బుణ్యము
విడుచుట వివేకమగు దుదిపదము
[10-90

**తుదిపదమెక్కు**
ఇందునే తుదిపదమెక్కి రిందరును
మందర నీ మహి మిదివో
[9-259

వుల్లము శ్రీవెంకటోత్తము శరణని
యెల్లందుఁదిపద మెక్కిరి గాన
[10-86

**తుప్పుడు**
తొలఁగఁదోసి తుప్పుడుతోడనే లోహంబు
వెలయ బంగారు గావించిన గతి
[5-124

**తుర్రులూడు**
మురదనుజుని పెద్దమొదలి యెముకఁ దీసి
తురులూడదరే తుత్తు తుత్తు తుత్తుత్తు
[11-354

**తుఱిగొను**
తుఱుము తుఱిగొనియె ననఁగాఁ
దఱిగె ననం దక్కు వనుట తలపోయంగా
[రేఫ. ఱ. 80

**తులఁదూఁగు**
తొలుకారు మెఱుఁగులం దులఁ దూఁగు
పసిఁడి
గొనుసులతోడఁ గోల్కొని చెన్ను మిగిలి
[ప. యో. వి. 3-944

**తువ్వరవడు**
పువ్వులనెత్తావిఁ బొదలు తేనియలు
తువ్వరవడు నెలదోఁటలో నిలిచి
[ప. యో. వి. 7-272

# తూ

తూంట్లబొంత

కాలము పారేటి దాడి కాయము
తూంట్ల బొంత
అలరి శ్రీవెంకటేశ యది నీ చేత
[11-102

తూఁగుమంచము

చేరి తూఁగు మంచముఁచే చెలియ
చనుమొనలు
తారుచు బొటనవేలఁ దాఁకించవా
[13-123

కౌఁగిలించి నన్ను వెంకటరాయ నీవువోరి
తూఁగుమంచావకుఁదీసి దోపాలు గట్టకురా
[4-137

తూఁచినట్టు

రేఁచి నీవు నన్నుఁ గడు రేసు లెంత
పుట్టించినా
తూఁచినట్టు కళలెల్లా తుదముట్టేనా
[17-573

తూఁటరి

కూటమే నాదిగాక గురుతులు సోకించేటి
తూఁటరిని నీవు గావా దొరసాని విపుడు
[14-101

తూకొను

పైకొనిఁ నేజేసిన పాపమె కావలె నొండె
తూకొని నా నామముచేఁ దుంచుట యుండె
[10-203

వాకిట నున్నాఁడు వాఁడె వనిత నీ
రమణుఁడు
తూకొని నీ వెదురువత్తువో యంటాను
[13-224

యీ కడ నన్ను మన్నించి యింటి
కిట్టె వచ్చేవంటా
తూకొని నీ రాకల కెదురుచూతును
[17-480

తూపొడుచు

తుమ్మెదదాఁటులఁ దొలఁగఁ దూపొడిచి
పైకాపుగాఁగ సంపంగలు ముడిచి
[శృం. మం. 138

గోపుచ్ఛ గోమూత్ర గోరోచనముల
తూపొడిచియు మీఁదఁదుడిచి బొట్టిడుచు
[అ. మ. క. 683

తూరనవ్వు

చెలువుఁ డెదుట వచ్చి చెయ్యి వట్టు
కున్నవాఁడు
తొలగఁదోయఁగ రాక తూర నవ్వేనమ్మ
[13-13

తూరిపారు

చెంత నీ సంసారము నేసేవాఁడ నేనంటా
దొంతుల కోరికలతోఁ దూరిపారేను
[8-189

తొరలఁగ సొలసితే తూరిపారు (?)
మర్మములు
యిరవైన యాపెఁజాసి యెట్టోరువఁగలఁడే
[18-479

తూరిపెట్టు

యిచ్చక మాడుదురుఁగాని యీసడించ
నెన్నఁడును
తుచ్ఛమాడకుండా నాన తూరిపెట్టేనే
[14-8

తూరుపెత్తు

మొల్లమిగాలి యొకటి ముంచి
తూరుపెత్తుచోట
పొల్లకట్టు కడఁబడె పోగువడె గట్టివెల్లా
[10-267

దొంతినున్నవలపులు తూరుపెత్తే వేళలకు
అంతలో పొలివారించె నది మెచ్చవలదా
[14-113

పొంగుచుఁ దూరుపెత్తంగఁ బొలి
వారె నివ్వెరగు
పంగులఁ గోరువట్టు నీ భాగ్యము
కొలఁదయ్యా
[17–442

దొంతినున్న నా వలపు తూరుపెత్తితిఁ గాక
పంతము చూపితినా పదరి నీకు
[18–386

తూర్పు వీవలులు
ములముల వికసించు మొల్ల క్రొన్ననల
పలపులఁ దూర్పువీవలు లెచ్చరింప
[వ. యో. వి. 5–1686

తూర్పెత్తు
తొడరిగా లప్పుడు తూర్పెత్త కవేను
విడిచి మఱచిన వెనక వెదికితేఁ గలదా
[5–274

తొడుకు మేయఁగరాదు తూర్పెత్తితేఁ
బొల్లువోదు
బడినే శ్రీహరిభక్తి చెట్టుకట్టితేను
[8–230

నుటిపిలి పాపములన్నియు నుగ్గుగ
నిటు తూర్పెత్తిరి
వెఱవము వెఱవము కర్మపు విధు
లిఁక మాకేలా
[9–79

మెలఁగెడుజాడఁ బ్రామినుకు వజ్రములు
తులగింప జలజలఁ దూర్పెత్తినట్టి
[వ. యో. వి. 3–531

## తృ

తృణము మేరువుచేయు
యెలమి నే నుపకార మెవ్వరికిఁజేయలేను
మెలఁగి నీవే తృణము మేరువుసేయుదువు
[8–45

తృష్ణ
కలసిన కర్మపుఁ గలిమిచేతఁ దృష్ణ
వెలితిగాక యిల్లువెడల దేమిసేతు
[5–110

## తె

తెంకి
ఇంకనేల వేగిరము యింతలోని పనికిఁగా
తెంకినే పాన్పుపుమీఁద దిద్దుకొనేఁ గాని
[15–63

తెంకిఁ గూచుండు.........
తెంకిఁ గూచుండి కన్నులు తేలవేసి
నిన్నుఁ జూచి
కొంకక నీ చెవిలోనఁ గొరిమేమోచెప్పెరా
[15–151

తెందేఁపగా నొసఁగు
ఆ పూర్ణ సదనాంబరాదులతోడ
దీపించు సిరులఁ దెందేఁవఁగా నొసఁగి
[అ. మ. క. 3814

తెందేపలు
కొలిచే మనే బంట్లు గోటానఁ గోట్లు
గలరు నిమ్న
దెలిసే మనే జ్ఞానులు తెందేప లున్నారు
[7–67

కోరినవి యెన్నిలేవు కోరఁగల వెన్నిలేవు
తీరని సంపదలతో తెందేపలు
[8–9

ఎన్నఁడు దీరీని తెందేపలు
వన్నిన జీవుల బంధములు
[8–50

కోరికలై తేను కొండల పొడవులు
తీరని మోహాలు తెందేపలు
[11–11

తెకతెర బుక్కాడి దిను
సకలరాజ్యంబు నిశ్చలత నిన్నాళ్ల
తెకతెరబుక్కాడి దినియుండు నీవు
[వ. యో. వి. 6–514

తెక్కలికాఁడు
దిక్కందరికి నైన దేవుఁడు కడుఁ
దెక్కలికాఁడైన దేవుఁడు
[11–3–45

తెక్క
గక్కన రావది యేమే ఘనుఁడు
నవ్వుతా నిన్ను
తెక్కలనె చేయివట్టి తియ్యఁగాను
[17–310

తెగక కన్నులు మూయు
తెగక కన్నులు మూసి దేహము
మఱచేవాఁడ
నిగిడి దేవుఁడని విన్నెరిఁగేనా
[8–108

తెగఁగొను
తిరువెంకటేశుం దెగఁగొంటి విట్టే
ఉరముపై దిగకుండంగ వద్దా
[4–122

తెగడు
పొగరు మూఁకులమీఁది పువ్వుల
వాగరే లేదా
తెగడిపెరఁబెట్టితే తేనెలయ్యేవి
[13–84

తెగని జీవనము
అగపడి శ్రీ వెంకటాధిప నీ కృపఁ
తెగని జీవనము దినదినమెల్లా
[8–29

తెగని బంధువుఁడు
తెగని బంధువుఁడు దేవుఁడు
బగివాయఁ దిహముఁ బరమునగు
[7–238

తెగిన కొలుచులు
తిలకింపఁగ నాహారంబునకును
తెగినకొలుచు లవి యెన్నెన్నో
యిలపై నే బ్రదికిన కాలము యెంతని
వ్రాసెనో చిత్రగుప్తుఁడు
[6–189

తెగివిడుచు
కంటి మిదివో వేంకటగిరిపై మా
వెంటరాక తెగి విడువఁగదో
[5–141

తెగుదెంపు
లంపటము విరియించ లావుచాలక తుదిని
దింప నొకకొంతైన తెగుదెంపులేదు
[5–120

తెగుదెంపులేని భ్రాంతికిఁ జిక్కి యాచార
మెగసి గొందులు దూరె నేఁటి బ్రదుకు
[5–98

తెగుదెంపులేమి
తెగుదెంపులేమికి దీనగతే దిక్కు
బిగువుఁగూటికి వట్టి బీరమే తగవు
[6–63

తెగువడు
నగుసంపదలచేత నన్ను నేనే మరచితి
తెగువడి వివేకించఁ దీరదెప్పుడు
[9–258

తెట్టతెరువు
యిట్టె శ్రీ వెంకటేశ యిందుకే నిన్నుఁ
గూడితిఁ
దెట్టతెరువున నన్నుఁ దీవించే వేమిగా
[17–323

తట్టువడ లోకమెల్లఁ దప్పకొనినా లేదు
తెట్టఁదెరువున నోరు దెఱచినా లేదు
[5–55

**తెట్టఁదెరువున దించు**
పట్టుకొంటి మిదె పాపపుణ్యములు
తెట్టఁదెరువుననె దించాలేము
[9–53

**తెట్టెగట్టు**
పూని శ్రీ వెంకటేశుపై పొందే (దియ ?)
లమేలు మంగపై
[8–150

**తెప్పతిరుణాళ్లు**
ఎందు నీకుఁ బ్రియమో యీ తెప్పతిరుణాళ్లు
దిందుపడె సిరులతో తెప్పతిరుణాళ్లు
[6–143

**తెప్పదేలు**
ఆ లక్కమాంబతో నా సూరివరుఁడు
మేలి సంపదల నర్మిలిఁ దెప్పదేలి
[అ. చ. 184

తగువస్తువులఁ గన్నుఁ దనియంగదోచి
తెగడుచుం గడుఁ దెప్పదేలి యామీఁద
[ప. యో. వి. 7–116

**తెప్పల కోనేటమ్మ**
దేవునికి దేవికిని తెప్పల కోనేటమ్మ
వేవేలు మ్రొక్కులు లోకపావని నీకమ్మా
[7–192

**తెప్పలదేలు**
చిప్పిల నహోబిలాన శ్రీవెంకటాద్రి మీఁద
తెప్పెల దేలేటి యట్టి దేవసింహమూ
[7–129

తిప్పితిప్పి నాయాసలు తెగి వైష్ణవధర్మానఁ
దెప్పలఁ దేలకుండాను తీదీపు సేసె
[8–80

ఇయ్యెడ శ్రీవెంకటేశ ఇదే నీ దేవులనైతి
వయ్యెదఁ గప్పి ఇట్టె తెప్పలఁ దేలవలదా
[18–284

**తెమలించు**
రారే యింకా నతని రవ్వసేతురా
ధీరుఁడైన వానినంత తెమలించ వచ్చునా
[14–129

**తెమ్మ**
తెమ్మలైన పిరుఁదు మరుతేరువలె
నుండగాను
నెమ్మది నీ కెదురుగా నిలుచుందునా
[14–281

**తెమ్మరదూది**
నెరయఁ దెమ్మరదూది నించి చూపట్టు
పరపుపై నొసపరి బాగు లేర్పడగ
[ప. యో. వి. 2–1455

**తెమ్మలగు**
యిమ్ముల నీవావి యిద్దరి కొకటే
తెమ్మలాయ నీ తీరని చిక్కు
[9–276

**తెరచిరాజను**
తిరముగ ధ్రువునికి దివ్యపదంబిచ్చి
తెరచి రాజన్నట్టి దేవుఁడు
[12–243

**తెరచీర**
పరిమళము లతఁడు పైపైఁ బూయగఁ
బూయగ
తెరచీరఁ దుడిచీని తీసి తీసి యదివో
[17–326

**తెరచీరమఱఁగు**
తెరచీరమఱఁగింతే తెరువేల మూసేవు
గురుసేల దాఁచేవో గలియుగమా
[11–3–52

**తెరదీసినట్లు**
పరమాత్ముఁ దేలుకొంటే బంధములు
గలవా
తెరదీసినట్లానె తెగుఁగాక
[9–134

తెరదీసినట్టు

తెరదీసినట్టుండు తెలిసితే జ్ఞానము
మరుగక మఱచితే మరఁగై తోచు
[11–179

తెరనాటకము

ఒక్కటి తరవాత వేరొకటై కాచుకుండు
చక్క దెరనాటకము సంగతి సంసారము
[8–111

తెరమరఁగు

వేవేగ నాతఁడే నన్ను విచ్చావ విడిఁ
గూడెను
దేవరే మేలు నేసె తెరమరఁ గేటికే
[17–353

తెరమరఁగులు

తెరమరఁగుల కర్మ దేహాలెల్ల వీరితోడ
పురుఁడు వెట్టుకోఁబోతే పోలికలు రావు
[8–119

తెరమరఁగు వలలు

తెలియరాదు నీమాయ తెరమరఁగుపెక్కు
వలలఁ జిక్కక నిన్నే కొలువఁగవలయు
[7–101

తెరమరుగుదినాలు

తెరమరుగు దినాలు దేవుఁడ నీ కల్పితమే
సొరిది యీ సుఖలెల్ల చుట్టాలె నాకు
[8–8

తెర మఱఁగుకు మఱఁగు

పైరగు తనలో భక్తి వదలితే
కూరిమి తెరమఱఁగునకును మఱఁగు
[8–69

తెరమఱఁగు మెకము

ఇరవైన యట్టుండు యెఱఁగన దీ మాయ
తెరమఱఁగు మెకమువలె తిరుగు
నీ బ్రదుకు
[5–311

తెరవేఁటి సింహము

దిట్టయై వేదాలలోని తెరవేఁట సింహము
నెట్టుకొనిన దురిత నివారణ సింహము
[8–151

తెరవేయు

తివిరి శ్రీ వెంకటేశ తెరవేసి నిన్నుఁ
గూడె
[13–71

ఇద్దరుఁ దెలుసుకోరే యిన్నిటా జాణలు
మీరు
పొద్దునఁ దెరవేసేము పొలఁతుల మిపుడు
[14–24

యింత సిగ్గువడఁగాను యెరుకలు నేయరాదు
వాతలు నేయక తెరవేయవమ్మా
[14–135

వనిత నీమోముచూచి వసివాడు వాడినదె
వెనుకొని నీవు తెరవేయరాదా
[15–10

తెరువాటుగొట్టు

వదలక మండలేశ్వరునైనఁ గా
కొదుకక తెరువాటు గొట్టనోపుదము
[వ. యో. వి. 7–520

తెరవేసి కలయు

మాటాడఁ దతివేదొ మనసియ్యఁ దతిలేదొ
నాఁటముగ దెరవేసి కలయరాదా
[14–169

తెల్లఁబారు

దీపములు దెల్లఁబారె తిమిర
మంతయు జారె
శ్రీపురుషోత్తమునిఁ జేయంటి లెమ్మవరే
[10–130

తెల్లవారించు

మల్లాడి తనదాసులమతిలోఁ దా నుదయించి
తెల్లవారించే వాఁడు దేవుఁడు
[11–42

తెవులుపడు
తెవులు వడినవాఁడు తినబోయి మధురము
చవిగాక పులుసులు చవిగోరినట్లు
[5–15

తెవ్వనికాలము
చివ్వన నాలోకములు చేరి కాలము గడుపు
తెవ్వనికాలము నిద్రాఁ దెలివినై ముంచును
[7–112

# తే

తేటతెల్లమగు
యీటుతో శ్రీ వెంకటేశ యెనసె
నీవు రాగాను
తేటతెల్లమాయ మేలు తెలుసుకోవయ్యా
[15–265

తేటతెల్లమి
తేటతెల్ల తెల్లమి మాటలఁ దెలియ
నాడు గదరా
మాటిమాటి కింత యేల మరఁగులాదేవు
[16–2–79

తేటతెల్లమిగాఁజెప్పు
తెలిసినమాట తేటతెల్లమిగాఁజెప్పేను
[16–2–46

తేటముత్యాలు
చేరి ముత్యపుఁజిప్పల చిమకులు నిలిచితే
మేరతేటముత్యాలై మించకుండేనా
[10–66

తేనెచాడె
చిక్కనితేనెచాడె చివ్వనరాతవేసితే
అక్కడ జోరునఁగారె యశోదమ్మా
[10–161

తేమరేఁగి ఊటువట్టు
ప్రేమముతోఁ గేదారిపెరిగి పండినపంట
తేమరేఁగి ఊటువట్టె తిమ్మనాయఁడా
[11–241

తేమల పండించు
కామించి పస్యములు గలిగించి
చంద్రుఁడనై
తేమలబండించేటి దేవుఁడనేను
[7–204

తేరకత్తె
ఊరకుండుమనవే వొక్కటొక్కటే
రేఁచక
తేరకత్తెనై తేనేమి దిద్దుబడి కనరే
[14–295

తేరకత్తెనెవ్వతెనో తెచ్చి యాపెచేతనాకు
చేరికొనఁబెట్టి సేవ సేయించేవు
[17–358

తేరకొను
సారెఁ జుట్టివట్టితివి జారినపయ్యదకొంగు
తేరకొననిది యేమో తెలిసేనా నేను
[17–272

తేరసొమ్ము
దున్నినఁ జోళననాధుని యాన నీకు
నిన్నాళ్లు తేరసొమ్మిటు తినందగునె
[వ. యో. వి. 7–754

తేరిచూచు
తేరిచూచి యీవేళ తేనెమోవియానితేను
ఆరితేరి మారుమాటలాడించేనే
[14–260

తేరిన నీళ్లు
కారణాన నప్పటిసేఁగలిగెనా నది మతి
తేరిననీళ్ళ వండు దేరినట్లవును
[6–29

తేరుపడగెలు
కూరిమి మటములు గోపురంబులును
తేరుపడగెలే తెరువెల్లా
[11–3–53

తేలగిలు
తేలగిలే నిన్నుఁజూచి తెలివొందె నా మొగము
కోలుముందై ఆపె నిన్నుఁగూడగాను
[14–128

తేలింపుఁగన్నులు
తేలింపుఁగన్నులయాపె తీపులమాటల యాపె
లోలునిఁగాజేసె నిన్ను లోకమెరఁగ
[15–287

తేవ
మోవి నీఁదికెంపులకు మోనమెమరఁగు
కావికన్నులకు నిద్రకడుమరఁగు
తేవలనిట్టూర్పులకు తీగెనవ్వెమరఁగు
యీవిధాలుగంటి నాతో నిఁకనేలమరఁగు
[15–127

మోవఁగ విషయంబులపై మోహము కడుఁబుట్టు
శ్రీవెంకనాథా అని చెప్పఁగరావయ్య
ఆవలజూడఁగ జల్లనైవుండుఁగాని
తేవలఁగూఁకటవేళ్లు తెగఁబారునుమిగులా
[16–1–60

[ఉత్సవ విశేషము అని నిఘంటువుల అర్థం]

తై

తైలు
మొగమునేముచూచితే మోనులువార నవ్వేవు
తగువనంతపునీట దైలువోసేవే
[13–206

తైలువారు
తమిరేఁచఁగావలపు దైలువారఁగా నవ్వి
సమరతికిఁ బెనఁగి సమ్మతించవయ్యా.
[18–357

జలకేళినలపు కాంక్షలు దైలువార
తిలకించి పసిఁడియందియలు మ్రోయంగ
[ఉ. క. 317

తొ

తొంగిచూపులు
తొంగిచూపులమొక్కులు తుమ్మెద పిండు రెక్కలు
బొంగేటి చనుఁగొనలు పూఁవమొనలు
[18–266

అంగలించి మీరు రతినలయుచుండఁగాన
తొంగిచూపులవాకిట దొట్టుకున్నది
[18–482

తొంటిసంసారి
గొంటరై శ్రీవెంకటేశుఁ గొలువకుండిన వాఁడు
తొంటిసంసారవుఁగాక దొరయేఁటికొను
[5–301

తొండివోవు
ఆసలచే వేఁగేది నీకింతవేడుకై తేఁజాలు
దోసమా నాపై వణకు దొండివోయీనా
[17–255

[తొండి అంటే రంధ్రము. తూటు అని సూ. ని. ప్రయోగం ఇవ్వలేదు.]

తొక్కుమెట్టాడు
ఎక్కడఁదిరిగినా మాయింటికేవత్తువు నీవు
తొక్కుమెట్టాడి నిన్ను దూరనేఁటికి
[13–197

తొక్కులఁబడు
ఎక్కడనున్నారో సురలెవ్వరు భూమికి దిక్కో
తొక్కులఁబడె జీవుఁడు దుండగీలచేతను
[8–64

తొక్కులాడు
తక్కులమొన్న నా మఱందలితోడ
నీవు వోరి
తొక్కులాడితివి చాలు దోసాలు గట్టకురా
[4–137

తొట్టు
విరులపైఁ జల్లరెవెట్టఁ బొరలున్నవాఁడు
తొరలఁగప్పురమీరె కొట్టీఁదగ
[15–266

తొడఁగుచ్చి కట్టుకొను
కలకాలముననుండి కాపురపులంపటలె
కలిమితో తొడఁగుచ్చి కట్టుకొనిన
[11–20

తొడమె
తుంచి తమలపాకుల తొడమెలు నీమీఁద
ఇంచుకించుక వేసి నిందరుఁజూడ
[13–62

తొడసు
చెంతలనీతని సేవకులకుమరి
దొంతికర్మముల తొడసీఁకనేలా
[11–28

గాలపుఁ జిక్కుల కర్మపుతొడసుల
యీలకరచే మేమొకో
[16–1–5

తొడికితీయు
ధరణిపైఁ జెలరేఁగి తనువువేసరినాను
దురితాలు నలువంకఁ దొడికితీసినను
[10–206

తొడికిపట్టు
వగలఁ గోపము పాపమువలె నాలుక
చాఁచఁగ
పగటుతోడఁ దొడికిపట్టఁగ నేరుతునా
[8–208

పక్కన నుక్కుఁగంభము పగిలించుక
వెడలి
తొక్కి హిరణ్యకసిపుఁ దొడికిపట్టి
[10–285

తొడిమనూడి
వనివితొడిమనూడి పండుతీఁగెనంటదు
జనులకెల్లాఁ బ్రకృతిసహజమింతే
[7–54

తొడుకుమేయు
చిక్కినావు తొడుకుమేసివచ్చెసంటా
గొల్లఁడు
దుక్కక కావక పోఁదోలవచ్చునా
[6–214

తొత్తు
దొరవై పనులుగొన తొత్తులుబంట్లులేరా
[14–207

తొప్పందోఁగు
అప్పళించిన జవ్వాది యంటినమేనులతోడ
తొప్పందోఁగు చెమటలం దొరుగు
వెన్నుండురా
[4–147

తొప్పఁదోఁగు
పిప్పిగాఁగఁ బిప్పరించి పేగులు జందెలువేసి
తొప్పఁదోఁగుచు నెత్తురు దోసిటఁ జల్లె
[10–285

కప్పకుర చెఱఁగు వేంకటరాయ చెమటలఁ
దొప్పఁదోఁగి యెవ్వతో పొందులకునేగితివి
[12–52

కాఁగేటి కుచగిరులు కమ్మఁ జెమటలఁ
దొప్పఁ
దోఁగగా తమకంబు తొలఁగ నాఁచేవే
[12–202

వసంతములాడవచ్చిన వడిఁదానె
తొప్పదోఁగె
[17–462

యిప్పుడే శ్రీవెంకటేశ యీకెనేలితివిగాక
తొప్పఁదోగినచెమట దొమ్మి నోలలార్చదా
[18–481

బంతుల సరసంబు పైకొని యాడఁ
జెదిరిన పుష్పాళ్ళచేఁ దొప్పఁదోఁగి
[శృం. మం. 92

తొప్పఁదోఁచు
వెలఁది వేంకటగిరి విభుఁడు నా కౌఁగిట
తొలఁగక చెమటలఁ దొప్పదోఁచీనే
[4-22

తొఋక కవిత్వాలు
తొఋక కవిత్వాల దోషాలఁ బొరలితే
దిఋకార నవ్వఁడా దేవుఁడైనాను
[7-260

తొరలఁగాచు
తొరలఁ గాఁచినప్పుడు తోడంటు
వెట్టినప్పుడు
పెరుగుఁబాలును నొక్క పేరుపునే కాదా
[15-222

తొరలించు
కరఁగినట్టె కరఁగి కరతలెల్లా మొరఁగి
సిరులఁ గూడదుఁగాక చింతలేవే
యిరవై శ్రీవెంకటేశుఁడెనసెఁదానేనన్ను
తొరలించు కొంచుఁగాక తోయనేలే
[14-3

[ఈ ధాతురూపానికి నిఘంటువులలో
ప్రయోగాలు చూపలేదు.]

తొరలింపు వేడుకలు
ధరలో బిడ్డవొక్కటి తల్లిదండ్రు లిద్దరు
తొరలింపు వేడుకలై తోఁచుచుండ
[7-119

తొరలు
యిరుదెసవీతోనేము యేకతములాడఁగాను
తొరలఁ గాఁగిలించేవు తోతో నీవు
[15-271

సమపకంబము మాఁటు సమరతి
. తోడు చూపు
అరుదుగఁ జిమ్మిరేఁగె నమ్మఁగారికి
తొరల నాడినమాట తొడమీఁద నింటఁబెట్టి
అరమరపులు నిండె నయ్యఁగారికి
[15-297

తొక్కఁ బాదము లతఁడు తొరలి
పెనఁగు నీకె
చెక్కులు నొక్కి బుద్ధులు చెప్పనె పట్టె
[15-293

నిరతి శ్రీవెంకటాద్రి నిలయుఁడు నిన్నుఁ
గూడె
తొరలిన నీ రతుల దోడు చూపవలదా
[17-192

తొరలువోవు
చూపరఁ బసురము తొరలువోయినను
సొమ్ము గలుగువాఁడే పరవంజుక
పైపైఁదానే వెదకితెచ్చి కాపాడఁగ
నతనికి భారము గాన
[9-108

తొర్లుఁబూఁట
యేపును సంసారమున యిదిగాక
కమ్మటాను
దాపుగ తొర్లుఁబూఁట తగిలించుకొంటిని
[10-142

తొఱ్ఱపెసలు
మిఱ్ఱువల్లములకుఁ దెచ్చి మెటిసి.
భూతజాలములకు
దొఱ్ఱపెసలు గొలిచినట్టి దోసమేల
పాయును
[5-113

తొలరో
దోసము దోసము తొలరో శ్రీహరి
దాసాను దాసుల దగ్గఱకా
[5-144

తొలి తొలుత
చేకొని తొలి తొలుతే చేసిన పన్నీరుకాపు
జోకఁ గాలువలై పొరిది జార
[6-50

తొలిపల్కుకొన దఱి బండు పంట ?
గుఱిమీఱు తొలిపల్కుకొన వేల్పుప్రాసఁ
దఱిఁ బండు పంట నా ద్రావిడభాష
[వ. యో. వి. 2-1431

తోకచిచ్చు
వేఁకపుఁ గోపము నేఁడే విడుమంటే
నేలవిడు
తోఁక చిచ్చయిన యానఁ దుంచినఁగాక
[11-3-75

తోఁగు
దాఁగిలి ముచ్చిములాడే దాయగాఁడ
వైన నిన్ను
తోఁగి చూచెట్టు నీరతి దొమ్మికిలోనైతినా
[13-10

తోఁడుదొక్కు
యిలఁ దోఁడు దొక్కితేను
యెండించకుండునా (?)
చెలులయిండ్లకుఁబోతే చిక్కించకుండురా
[8-273

తోఁడుఁబోతు
సమయగాంద్రకు మఱి చనవు చెల్లింపక
తోఁడుఁబోతుల నిల్లు ద్రొక్కనీక
[నీతి. శ. 49

తోకు
తొయ్యలి యెవ్వతె యైనాఁ దోకినా
నవ్వేటి నీవు
యియ్యెడ నే మెక్కినాను యేవగించేవు
[16-2-5

తోడంటు
ఉడికేటి పాతము లుగ్రనరకములు
తొడికేటి కర్మము తోడంటు
[8-50

తోడంటువెట్టు
పోరచి మోవితేనెలు పొదిగి తోడంటు పెట్టి
సారెకు విందువెట్టేవు చతురుఁడవు
[14-148

ముంగిట నే పాలుగాఁచి మూలఁ
తోడంటు వెట్టఁగా
సంగతి గానప్పుడే మంచము వంచేవు
[14-198

తొరలఁ గాఁచినప్పుడు తోడంటు
వెట్టినప్పుడు
పెరుగుఁ బాలును నొక్క పేరువునే కాదా
[15-222

తోడఁ దోడఁ దెలుపు
వీడక శ్రీ వెంకటేశ వెలయ నీ దాసులకు
తోడఁదోడఁ దెలుపుచు తోడయి రక్షింతువు
[6-196

తోడనే
తోఁగిన చెమటలార తోడనే శ్రీవెంకటేశు
రేఁగి నవ్వించుట గాక రిచ్చవడేదా
[14-61

తోడఁబెండ్లికూఁతురు
చేపట్టి నిన్నిదె కూడె శ్రీ వెంకటేశు
డో యమ్మా
కోపులఁ దోడబెండ్లి కూఁతురా నేను
[13-55

పీడెము చేతికిత్తువు వెరపులు వాపుదువు
తోడఁబెండ్లికూతుర రాలై తొక్కవే కాలు
[13-187

తోడు నీడ
తోయరాక రెంటికిని తోడునీడై తి నింతే
బాయటి కర్మములాల పట్టకురో మమ్మును
[5-289

తోడునీడై వచ్చు మరిదొరతనము సేయించు
పాడితేఁ బంచేంద్రియాలఁ బంపు సేయించు
[8-140

దోమటి నింద్రియాలేకా తోడు నీడయై
నన్ను
వేమరు భోగించఁజేసి వెనుబలమైనది
[8-288

యీడనే శ్రీవెంకటేశుఁ డింతలో
దా నన్ను నేలె
తోడునీడవలె నిద్దే దొరసితే నేను
[18-274

యేడనున్నాలంపటాలు యెదుటనే పొలసీని
జోడువాయనీక తోడునీడలవలె
[7-97

తోతొక్కులాడు
తోతొక్కులాడుచు ద్రోవ కిక్కిరిసి
[సు. శ. 287

తోతో
ఘాతల వరాంగనఁ గలసితివని నిన్ను
తోతో మునులకిఁక దూరఁ జోచేవయ్యా
[10-89

తొడమీదవేయకురా తోతో యిందరు
నవ్వేరు
యెద యిక దగ్గరితే నిదే పనా
[17-303

నీ తెరువువచ్చితిమా నీకేమిగారణమె
తోతో నారాయణుని దూరుదుగాక
[17-313

తోదోపు
దూపయునాఁకటికిఁకా తోదోపు మాకిఁక
వద్దు
కాపమృతమథనుఁడుగలడిద్దే కాన
[9-197

తోదోపులాడు
దొంతులైన మోహములు తోదోపు
లాడఁగాను
పంతములాడవచ్చునా ప్రియురాండ్లకు
[18-516

తోదోపులు
మిన్నుచూచేయందుకుఁగా మిక్కిలి
తోదోపులేల
అన్నిటా నీవుండఁగాను అడుగనేల
[9-124

తోదోపులాడుచుఁ దొలఁగకనంత
వేదశాఖలువోలె వెలయు శాఖలను
[వ. యో. వి. 3-450

తోఁపుతిత్తి
తొలుతే మా కాఁపురాలు తోఁపుతిత్తి
దాఁపురాలు
[17-344

తోపడు
పాపపుణ్యముల భవముల జీవిని
తోపడ కర్మము దొబ్బెనా
[10-69

తోపునూకుడు
వీఁపుగానరాగాదాఁగే విభమేఁటికే
తోపునూకుడించునేది దొరసానివిపుడు
[14-101

తోపునూకుడువయసు
తీపుమేలములఁజిక్కి దిక్కులతనకు
మొక్కి
తోపునూకుడువయసుదొబ్బఁగాను
[15-131

తోపుసేయు
తోపుసేయఁగరాక దురితపుతరువుల
కాపదలకు లోనాయ బ్రదుకు
[5-153

తోఁబుట్టు
ఎందరికిఁ గొడుకుగాఁ డీ జీవుఁడు వెనక
కెందరికిఁ దోఁబుట్టఁ డీ జీవుఁడు
[11-3-31

తోయపుపేటె
చాయనేసుకొనివుండి స్వామి ద్రోహిఁ
జెప్పనట్టి
తోయపుపేటిని మంచితోవనేపెట్టితివి(?)
[8-94

తోలిబొమ్మ
పాలువోసిపెంచిన నాపాలిట వెంకటేశనే
తోలిబొమ్మఁ జూమ్మీ కాతువుగాని దైవమా
[5-189

తోలుఁదిత్తి

నేలాఁ దడియదు నీరూఁ దివియదు
తోలుదిత్తికే కొలఁది దొరకొన్నమాయ
[9–14

తోలుదేహులు

నేమముతో నడచేటి నేరుపేది మావల్లి
దీముతో మోచిన తోలుదేహులము
[8–249

తోలుబొంత

తోలుబొంతగట్టుకొన్నదొర నింతే
నన్ను నీవు
కూళసంసారమా యేల కొసరేవు
[9–45

తోలుబొమ్మలు

తోడునీడ సతులెల్లా తోలుబొమ్మలె కాక
వేడుక కూటములకు వెలపెట్టేవా
[14–212

## త్రా

త్రాణ

విన్నపము లింక నేల వేగినంతాను
మన్నించ కింక నుంటే మఱి యేది త్రాణ
[14–62

[పల్లవిలో మొదటి పాదంలో తప్ప—ఈ సంకీర్తనంలో 13 సార్లు త్రాణ అనే పదం పాదాంతంలో వాడారు.]

## ద

దంచనపురాయి

మాయనుగ్గులుసేయ మాధవుని దంచనపు
రాయివో వైరాగ్యరచన జీవులకు
[5–74

దంగుడు బియ్యము

తొంగలి రెప్పలు రాత్రులుఁ బగలును
సంగడి కనుఁగవ సరిఁదిప్పుచు
చెంగలించి వెసఁ జేతులు విసరుచు
దంగుడు బియ్యము దంచీమాయ
[5–72

దంట

తొలుతనేఁ జెనకితే దొమ్ములయ్యీఁ
జేఁతలు
తలవంచుకుండితే దంటనందురు
[14–16

దంట శ్రీ వెంకటేశుఁడు తానే వచ్చి
నన్నుఁ గూడె
యింటిలోనె నన్ను మెచ్చి యింత
కోపఁగలనా
[14–49

దంటతనము

నేరుచుకోవే నీవు నిక్కము దంటతనము
[14–100

దంటతనమునకటు తగులఁ జూచితేఁజాలు
యింటికి రాక డాయక యెందువోయీనే
[15–256

గొంటవై శ్రీవెంకటేశుగూడితివినన్నునిట్టె
దంటతనమున నని తలఁచుకో నీవు
[17–11

తనలోనె మోహించీ దంటతనము నేరదు
ననుపువేయాకె తోడ నడపవయ్యా
[17–178

దండచేరు

భావములోపలఁ దన పాపబంధములఁ బాసి
తావుల నాతనికృప దండ చేరరాదా
[7–181

దండదాపు

తన నిజభక్తియె దండయు దాపును
మనను నిలుపుచే మరి శుభము
[10–173

దండవెట్టు
చిగురుమోవి మాటచే కత్తుల పంతాల
దగిలి నీపై నాపె దండవెట్టీని
[14–149

దండి బారగు
అళులెల్ల దండిబారై మున్ను నడవ
చిలుకల గమి వాని చెంతనే యరుగ
[ఉ. క. 522

దండెకాయు
తనువే వాళవు తలయే దండెకాయ
ఘనమై పూర్వులు రెండు కట్టినతాళ్లు
[9–178

దండెఁ గూర్చు
చూడదు తలయెత్తి శ్రుతి దండెఁగూర్చి
పాడదు చెలులెల్లఁ బైకొన్న సరస
[శృం. మం. 183

దండెమీటు
అంతకముందే నారదుఁ డవి దండె
మీటి చెప్పె
యింతటా వేఁటాడి జీవహింసలు సేసినది
[6–162

దండెవేయు
జీవునికి దండెవేసినవాఁడవు నీవు
వావాతిమాటలే నీపై వన్నెవదాలు
[9–178

దంతపుటోవరి
దంతపు టోవరిలోన తానే వనినుండఁగానో
కొంత నేఁ బిలిచితే నూకొనెఁగా తాను
[15–83

దంతెనపుఁజేయి
చేరి విన్నూ బూజించనిచేయి
దంతెనపుఁజేయి
తారి నీకు మొక్కనట్టి తలయే పెడతల
[7–216

దందు
సందు సుడివలపుల సదమదమై వుండగా
దందు పసరమువలె తానేల వచ్చీని
[13–237

యిందుకే శ్రీవెంకటేశ యిదే గోపక
లున్నారు
దందువంటి రాజసపుదాన నీకుఁ బ్రియమా
[14–220

దక్కఁగొను
దక్కఁగొంటేఁజాలు పెద్దతనమే మియరుదా
తక్కక శాంతముతోడి దయలోననున్నది
[6–7

గక్షన నీపాదములు కొఁగిలించీ తనియను
దక్కఁగొని మోవియానీ తనియను
[18–116

దగదొట్టు
చిప్పిలనవ్వఁగఁబోతే సిగ్గులు రేఁగవా
దప్పికి మోవడిగితే దగదొట్టదా
[18–316

దగ్గరి [= క్త్వార్థంలో]
తప్పక వొట్లువెట్టి దగ్గరి రమ్మనవేమె
[15–241

దగ్గరి విన్నపాలు
దగ్గరి విన్నపాలకు తరుణి గాచుకుండగా
వొగ్గక వుంటివి తడవున్నదాఁకాను
[17–144

దగ్గరు
తలఁపులోపల నీవు దగ్గరితేనే చాలు
కలలోని కాపురముఁ గైవల్యమే
[10–128

తప్పక వొట్లువెట్టి దగ్గరి రమ్మనవేమే
వట్టి యాకతాయి చెప్పినద్దికి దగ్గరె నిదే
[15–242

దగ్గరుచు
మేరలో దగ్గరుతానె మెచ్చె నిన్నిటా నీకె
ఆరతి నీవెరుఁగదు వధికుఁడవు
[17–101

దడి సుడులు
సరగున మంగళస్నాన మాడించి
తరుణికి జిలుగారు దడిసుడు లిచ్చి
[వ. యో. వి. 5–1570

దట్టమైన పుట్టు
పుట్టితేఁ దనపాలికిఁ బుట్టె నీ ప్రపంచము
దట్టమైన పుట్టెల్లఁ దనతోడిదే
[9–163

దట్టి కట్టుకొను
చెలియ మునుపు సింగారించుకొన్న
చెంగావిచీర యిది నీవు
తలఁకక నేఁడు దట్టిగట్టుకొంచె
దానికేమి దోసమా
[16–2–57

దప్పము చెడు
దప్పము చెడినవాని తరుణి కౌఁగిటఁ జేరి
అప్పటప్పటికి నుస్సురనినయట్టు
[5–143

దప్పికిఁ బన్నీరిచ్చు
తడఁబడే పెదవుల దప్పికిఁ బన్నీరిచ్చి
అడియాలాలెల్లాఁ దన్ను నడుగనేలే
[18–338

దప్పిదీరు
కప్పియట్టె కల్లలాడఁ గలిగిన నాలికె
దప్పిదీర శ్రీహరి దలఁచఁగ లేదా
[8–139

దప్పిదేరు
వ్రేఁకపుటారుపులేలె వెచ్చని మేనిది యేలె
తాఁకియుఁ దలఁచవదేలే దప్పిదేరవదేలె
[4–53

ఎప్పుడు వచ్చునోయంటా నెదురు
చూచీఁ బతికి
దప్పిదేరు మోముతోడ దాఁచలేదుప్రియము
[12–335

యిప్పుడు వచ్చితివి మాయింటికి నీవు
దప్పిదీరె నాపయి దయ దలఁచఁగవలదా
[18–281

దప్పులుదేరు
తప్పకాతని మోవినే దప్పులు దేరీఁగాక
యిప్ప డింత పన్నీరు ఇచ్చిరే నాకు
[18–242

దయాధర్మపువాఁడు
ధర్మపువారిలో నీ దయాధర్మపువాఁడ
మర్మపువారిలో నీ మాయల మర్మము
వాఁడ [9–20

దరి దరి
దరిదరిఁగాక నే దగ్గరి కూడగఁబోతే
సరసమే విరసమౌ సకియలాల
[17–498

దరిచేర్చు
పురుషోత్తముఁడ నీవే పుణ్యము
గట్టుక నన్ను
దరిచేర్చి రక్షించి దయఁజూడఁగదవే
[8–121

నెఱవుగ శ్రీ వెంకటేశ్వర నీకే నే
శరణాగతి చొచ్చితిని
తతి దరిచేర్పఁగఁ గూడు వెట్టఁగా
దైవమ నీకే భారము
[9–84

దరిదాపు
దొరకె మాపాలికిఁ గందువ యర్థము
దరిదాపై యుండిన తత్త్వార్థము
[6–3

తక్కక మాయలోఁబడి దరిదాపులేవి
నన్ను
వెక్కసార రక్షించక విడిచేవా నీవు
[8–70

దాసవర్గములకెల్లా దరిదాపు మీరె కాన
వాసికి నెక్కించరాదా వసుధలో మమ్మును
[8–267

దరిదాపు యితఁడేకా తగ వెనుక వేసుకో
విరవిరఁబాపాలు నావెంటఁ బడినాను
[9–128

దరియించు
ఎట్టు దరియించవచ్చును యిటువంటి
వెల్లఁ జూచి
బట్టబయ లీఁదించఁగా భ్రమసి నట్టయ్యీని
[13–238

దరిశనభక్తి
దరిశనభక్తిచేఁ దనరినవారికి
యిరవైనమోక్షము యెదిటిది
[9–106

దఱికొలుపు
దఱికొలిపెఁ దేటి కనుఁగొనఁ
దఱుమఅయనఁ బెద్దఱాలు తలకొనెఁగృష్ణా
[రేఫ. ఱ. 80

దవ్వు చుట్టఱికము
తలపోసి ఆదియును దవ్వు చుట్టఱికమని
యిలఁదేరి మీఁదనేఁగీ నిందిరా విభుఁడు
[5–249

దవ్వు చేరువ
ఎవ్వరి భాగ్యం బెట్టున్నదో
దవ్వు చేరువకు తానే గురుతు
[6–43

దవ్వులు తిరుగు
దినకర సోమగ్రహణ కాలముల
తీర్థాచరణలు చేసిన ఫలములు
తనుఁదానె సిద్ధించును వూరకే
దవ్వులు దిరుగఁగ మతియేలా
[7–2

దవ్వులే చేరువలగు
యివ్వల నప్పుడే వెంకటేశుం డిదె
నిన్నుఁ గూడె
దవ్వులే చేరువలాయె దక్కెఁగా నీ పనులు
[4–145

దవ్వువోవు
జీవములు దవ్వువోయ చీమలునుఁ
బుట్ట చొచ్చె
వేవేలయిన నిది విడువనయ్యా
[10–79

దళ్యావితనము
వెల్లవిరినింత యాల వెనక ముందరిపాటు
దళ్లావితనము మాని తలఁచుకో రాదా
[16–1–31

దళ్లుకొను
మురిపంబు నొయ్యారమును దళ్లుకొనఁగ
నొరయు ముద్దులుగురియుచునొక్కనాఁడు
[వ. యో. వి. 5–741

ధర్మపుణ్యాం
నీవు ధర్మపుణ్యానకు నెలవై కూడితిగాక
దావతి నానలువెట్ట దగవున్నదా
[17–25

## దా

దాకాల మోఁకాల
దాకాల మోఁకాల దాటించెఁ గొందరి
ఆకాశవీధినుండి హనుమంతుఁడు
[9–13

దాకొను
దాకొని జగములు పుట్టించు
బ్రహ్మకు తండ్రివి నీవే
[10–104

దాకొని శ్రీవెంకటేశు దాసుఁడైన వానికిని
యేకముగఁ బంపు నేసు నేమి మాయో కాని
[10–134

దాకొనియాకెముందరతనగుఱుతెరుఁగించి
ఆకార మటు చూపె హనుమంతుఁడు
[10–155

దాఁగిలి ముచ్చిములాడు
దాఁగిలి ముచ్చిములాడే దాయగాఁడ
వైన నిన్ను
తోఁగి చూచెట్టు నీరతి దొమ్మికి లోనై తిరా
[13-10

దాఁగిలి ముచ్చిములు
చావులుఁ బుట్టుగు లాడెడి సరి
దాఁగిలి ముచ్చిములు
భావపు టారంభంబులు బాలలీలగతులు
[5-270

దాఁగిలి ముచ్చులాడు
అక్కఁడ దాఁగిలి ముచ్చులాడి దానిఁ
గన్ను మూసి
దక్కినా మోదాని నాకుఁ దమ్ములము వెట్టేనే
[16-2-94

దాఁగిలి ముచ్చులు
తగు విభాండకునితో దాఁగిలి
ముచ్చులాడితి (వి ?)
అగడుగా బండివిరివాటలాడితి
[8-179

దాఁచబెట్టు
వెన్నుఁడ నన్ను నిట్టె విడెము దెమ్మ నేవు
యెన్ని దాచబెట్టితివి యేరా నీవు
[16-2-99

దాడి
కాలముపారేటిదాడి కాయముతూంట్లబొంత
అలరి శ్రీవెంకటేశ యది నీ చేత
[11-102

దాడింబు
దాడింబపువ్వులవన్నె తళుకుఁ
బయ్యెద కొంగు
వేడుకతో వల్లెవాటు వేశి
[4-42

దాడిపోవు
చూడరో చూడరో నేఁడు సురలార
నరులార
దాడివోయి దనుజుల దండించి తావచ్చె
[9-223

దాతపు దైవము
శ్రీ తరుణీశ శ్రీవేంకటపతి సేవారతి
నిను నే భజియించెద
దాతపు దైవమవై నను( గావుము
తలఁచెద మిదియె తత్వంబు
[11-155

దాదాత
దాదాత రోహిణి నక్షత్రము గూడినరేయి
సాదించ లోకులకెల్లా జయంతి యాయను
[8-161

బొలఁతికి బాసయిచ్చి బొమ్మచారివై
వుండఁగ
చెలి వేరొకతెవచ్చి చేయివట్టీని
బలిమి యెవ్వరిదో పనులు దాదాత మోచె
నిలువు నూరువండీని నీమేని పులకలు
[14-66

దాపిరము
మూసి దాఁపిరము వేల మోవి నున్నవి
కెంపులు
[14-105

తగులనాడినవాఁడు దాఁపిరపు మాటలేకె
[13-74

చేసుకొన్నయట్టివాఁడుచెప్పినట్టె సేసుగాఁక
మూసి దాఁపిరములేలె మొరగులేలె
[17-90

దాపుదండ
చాపలపు గుణములే సరిఁజొచ్చేయేరులు
దాపుదండ చేకొని దాఁటలే రెవ్వరును
[6-56

సమరవిజయమైన శార్ఙ్గాది శరములు
తమితోడ మాకు దాపుదండై వుండుఁగాక
[6-101

నెలపైన సుఖమియ్య నీ ధ్యానమే చాలు
అల దాపుదండకు నీ యర్చనే చాలు
[7-248

దామెన
ఏమని వూరడించేవో యిఁక నీ చిత్తము కొద్ది
దామెన తిట్లతోడ తలవంచీ నదివో
[14–102

దామెన కట్టు
పామరపు టింద్రియాల బారిఁ దోసితివి నన్ను
దామెన కట్టుగాఁ గట్టి తత్వమా నీవు
[6–59

దామెన సంసారము
ఏమిసేతుదైవమా యెన్నఁడుగరుణించేవో
దామెన సంసారములోఁ దట్టువడీ మనసు
[6–105

దాయక పాయక
ఆయమందుకను హరిదానైయై
దాయక పాయక తగిలున్నాఁడు
[7–270

దప్పిదేర గూడితిమి దాయకపాయక మన
మెప్పుడు నిట్లానుండేదిదివో మాట
[13–205

దాయగాఁడు
దాఁగిలి ముచ్చిములాడే దాయగాఁడ వైన నిన్ను
[13–10

దాయగాండ్లు
దాయగాండ్లెవ్వరినైనా దప్పించుకొనేవారే
బాయిట నున్నా నీపొన్న శరణ్యుఁడవు
[7–72

దాయము
చాయలకె మాటలాడీ సన్నలకె పాటపాడీ
దాయముగా జూడరే సంతసపుఁ జూపు
[15–213

దాయికొను
దాయికొని రమణుఁడు దగ్గరఁ గూచుండితేనే
పాయక అవ్వలి మోమై వవ్వళించేవు
[13–24

దాయిదండ
సేయఁగలకర్మమెల్లా సేసి తొల్లి ఫలించెను
దాయిదండగల హరిదాసులకును
[8–256

తతి నెవ్వరికెవ్వరు దాయిదండయ్యేరయ్య
అతివ నీకుఁ గాఁగ నాయఁగాక
[14–284

దాయిదండయి నా తమకము లివియె కా
నేయరాని వినయాలు నేయించెను
[18–52

దారకత్తిసాము
తరుణి కొనగోరనే దార కత్తిసాము సేసె
అరిది ముంజేయి కొర డందుకుఁ దోడు
[18–314

దారదప్పు
మేరతో శ్రీవెంకటేశ మీరె దయ జూడఁగాను
దారిదప్పుకిట్టె మీ దాసుఁడనైతి
[8–283

దారదప్పి మగవాఁడు తనయిచ్చఁ దిరిగాడి
యీరసాన నేమనిన యెగ్గులనుఁ బట్టడు
[17–477

దారఁబెట్టు
తేనెదెచ్చి కత్తికి దారఁబెట్టి (న)
నానావిధముల నాఁకేరు
[11–2–4

దారానుద్దపు మాఁటలు
దారానుద్దపుమాఁటలు తాఁకనాడీ మదనుని
నారసాలు సేసుకు నారసింహుఁడా
[16–2–18

దారిదప్పు
నేరమెల్లా జీవునిది నేరుపెల్లా దేవునిది
దారిదప్పి విజ్ఞవీఁగఁ దనకేల
[8–132

దాలు (?) వేఁడు
వాలిన కాలుని వసమైనప్పుడు
దాలు (?) వేఁడఁగాఁ దలఁచీనా
[5-207

దావతి
జీవన్ముక్తుడనైతి శ్రీవెంకటేశ్వరుఁ జేరి
దావతులిన్నియు మాని తన్మయుఁడనైతి
[5-290

కాపరించినట్టి కాఁపురములలో
నీవలావలయ్యే మేమొకో
దావతి సుఖమిల దారి దెలిసియు
నేవగించవే మేమొకో
[16-1-5

భావించి నీదాసులనె భజించు మంటివిగాక
దావతి లంపటాలలోఁ దడఁబడు మంటివా
[16-1-40

నీవు ధర్మపుణ్యానకు నెలవై కూడితి గాక
దావతి నానలువెట్టఁ దగవున్నదా?
[17-25

నీ వేలివుంగరమిదె నేఁడు నాచేఁజిక్కినది
దావతి యిఁక నేఁటికిఁ దగునైతి నేను
[17-104

దావతి పాట్లు
దావతి పాట్లుమానె తరవు లుడిగెను మా
తోవ రాకుండితేఁ జాలు తొయ్యలు లాల
[17-334

దావతు
దావతులఁ దాను గన్నతల్లి గొడ్డనివల్క
దేవతా నిందతుల దెలుపంగ వశమా
[16-1-58

దాసానుదాసి
దంటనై యాతని దాసానుదాసినై
వొంటి నుండెదనేమి నొల్లనోయయ్య
[5-138

దాసోహము నొల్లరు
నీ ముద్రలూ నొల్లరు నీ దాసోహము
నొల్లరు
కామించి నీమీఁది భక్తి కడు నొల్లరు
[8-52

దాస్య గరుఁడడు
కనలి మనసనెడి యాకాసమున నున్నానాకు
కనుఁగొనఁగ నీ దాస్య గరుడఁడే దిక్కు
[6-146

దాస్య బలవంతుఁడు
బలువులలో నీ దాస్య బలవంతుఁడ నేను
యెలమి మాకిఁకఁ జూడనేమి గడమయ్యా
[9-20

## ధా

ధావతి
భావించి చక్రమీతఁడు పట్టితే నసురలెల్ల
ధావతి తొడుతను పాతాళము వట్టిరి
[13-220

## ది

దిండుపైఁడి చీరకాళతెక్కులవాఁడు
కొండగద్దెమీఁదివాఁడు గొప్పకిరీటము
వాఁడు
దిండుపైఁడి చీరకాళతెక్కులవాఁడు
[7-274

దిందుపద
దిందిపదూరకుండక దీపమెగసనద్దొచ్చి
ముందు నేనే నవ్వినది మోసము నావల్లి
[13-7

**దిందుపడు**

యిందుకు నందుకుఁ బోనీ రిహలోకమందు వారు
దిందుపడని వళకు తీరుచవయ్యా
[9-41

కందువ శ్రీ వెంకటాద్రి ఘనవరము లోనఁగె
దిందుపడ్డలోకులకు ద్రిష్టమిదేకాదా
[9-56

దిందుపడి దేవతల దేవునికి శరణు
అందిమిన్నునేల నేకమై నతనికి శరణు
[9-85

చెంది చేఁదుదిన్న నోరు చేఁదేయయి వుండుఁగాక
దిందుపడి కొంతైనాఁ దియ్యనుండేనా
[10-186

జమళి నిద్దరూ నెంతనరులకుఁ బెనఁగేరు
తిమురనేఁటికి మీలో దిందుపడరాదా
[13-121

మందలోననున్న నేము మాపటంతఁగాని రాము
దిందుపడీఁ గొంగువట్టి తియ్యకువయ్య
[17-273

**దిక్కుదెస**

దిక్కుదెసవై నాకు దేవుఁడవై యేలికవు
చొక్కి నా మనసింత సోదించవలెనా
[6-59

దేవ నీయాధీనము దిక్కుదెస నాకు నీవే
దేవసేయకుండీనా రక్షించ నీకు భారము
[6-214

అక్కఅతోఁజేసిన పుణ్యమే కట్టివేసునట
దిక్కుదెస యెవ్వరు యీ దేహిఁ గరుణించను
[7-25

దిక్కుదెసయి స్వతంత్రుఁడయి తేరిన ఆదిమూలమై
అక్కజపుమహిమల యాతనికే శరణు
[7-48

మనిపికావఁగ దిరుమణి లాంఛనమే చాలు
యెనసెను దిక్కుదెస యిఁకనేల వెదక
[7-248

**దిక్కుదెసయగు**

తెగనిమాయెయుండు దిక్కుదెసయై యుండు
నగుతా మాపాలనుండి నటియించు బనిఁడీ
[5-283

**దిక్కుమొక్కులు**

దిక్కెవరు యీ తీదీపులలో
దిక్కుమొక్కులకు దేవుఁడెకాక
[11-3-15

**దిక్కులవారు**

మిక్కిలి నీవు మెచ్చఁగా మేనికి వెంగయై తోఁచీ
దిక్కులవారు నవ్వేరం తేశాలయ్యా
[13-108

**దిగవిడుచు**

మహిమల నీవిది మరిదిగ విడువవు
వివారణజీవులు విడువఁగ గలరా
[7-162

**దిగులుచొచ్చు**

తెరలి దైత్యులగుండె దిగులుచొచ్చె నత్తరి
సిరులమించినయట్టి శ్రీజయంతినాఁడు
[8-258

**దిగ్గుడుకు దిగ్గుడు**

శ్రీ వెంకటేశ్వర నీ సేవే ధ్రువపదము
దేవతాంతరమెల్లా దిగ్గుడుకు దిగ్గుడు
[8-201

**దిచ్చరి**

దిచ్చరి చెంచువారికి దేవరకు మీవని
ముచ్చటలాడఁగ చన్నుమొనలునాఁటీవి
[14-194

పచ్చని మోవి చిగురువందిరివెట్టెమాటల
దిచ్చరి సిగ్గులు నింతి తెరగట్టెను
[14–259

నిచ్చనిరులు విరులు నీకుఁ బాదపూజలాయె
దిచ్చరి నీ యలుకింకాఁ దీరదాయనా
[15–106

దిచ్చరిమనసు
చంచలపుఁ గనుదోయి సతుల బారికిఁ
జిక్కి
చంచలమందెను నా దిచ్చరిమనసు

దిచ్చరీఁడు
దిచ్చరీఁడై యిట్లు దిరువేంకటేశ్వరుండుఁ
నిచ్చనిచ్చలునుఁ గడుబెచ్చు పెరిగీని
[4–62

దిట్టతనము
అట్టునేయదాపె నిన్నాఅడిఁబెనఁగకున్న
దిట్టతనము నేరక దిగేవంటాను
[14–111

దిడువగు
అడరి వైరాగ్యధనమర్చించనోపెనా,
దిడువై జితేంద్రియస్థిరుఁడాతఁడు
[7–218

దినకొత్తలు
కోపములై తేను కోటానుకోట్లు
దీవనములై తేను దినకొత్తలు
[11–11

దినదినకోరికలు
తీరెఁ దీరె అన్నములు దినదినకోరికలు
కోరఁబోతే యాసలెల్ల కోటానఁగోటి
[10–221

దినదినభోగాలు
యెనసితి వీలాగున యిట్టే శ్రీవేంకటేశ
దినదినభోగాలఁ దీరవు నీ రతులూ
[18–318

దినదినము
కాయముపై మోఁచిపెట్టిఁ గట్టివేసిన
సొమ్ములు
మాయలై దినదినము మమతరేఁచీని
[9–63

దినదినముదొబ్బు
మదినొక్కవేళఁ దనమాట దలపోతునే
కదిసి యొకవేళ దన్ను కలలోనఁ గందునే
పదములనె నొకవేళ యెదురునడకునేఁ
దనకు
తుదనిట్లు దినదినము దొబ్బుదునే నేను
[15–78

దినదినరుచి
దినదినరుచిగోరేటి దేహమా
ఘనమోహపాశాలఁ గట్టేఁగదె దేహమా
[5–241

దినదినరుచులు
దినదినరుచులివి దేహమువి
చెనకేటి కోరిక చిత్తముది
[10–81

బాలులకు వృద్ధులకు పాయపు వివేకులకు
తేలించే బంధములు దినరుచులు
[9–72

తనువు మోచితినంటా తరుణుల
పొందులంటా
దినదినరుచులంటాఁ దిరిగేము
[11–75

దినబాధ
మనసున నెప్పుడు మానదిది
దినబాధెటువలెఁ దీటీనో
[5–122

దినభోగాలు
తీరవి నా జన్మమిది దినభోగాలకుఁజర
యీ రీతి విడిపించ నిఁక నెవ్వరో
[10–202

దినమత్తులు
ఘనసిద్ధగంధర్వులు కడగానలేరట
దినమత్తులయు మా తెలిసేటిది
[8–124

దినములు దొబ్బు
పనిగొంటే జవ్వనము బంగారువంటిదె పో
దినములు దొబ్బితే వన్నెదీసుఁగాని
[14–59

తుంచరాదు నీ మదము దొబ్బరావు
దినములు
[14–122

దినములె ఘనము
యిలయును జగమును యిదే యిదే
తెలిసిచూడఁగా దినములె ఘనము
[9–253

దినమొక్క వయసెక్కు
దినమొక్క వయసెక్కు దేహమాసారె
పెనుమదము గురిసే బెండుదేహమా
[5–241

దినలెక్కలు
దినలెక్కలూరుపులు తెచ్చితెచ్చి
వొప్పించఁగ
యెనలేని జన్మముల కెవ్వరు గురి
[11–6

దినవలపులు
కనుచూపులకొనరు గబ్బితనపుటుసురు
దినవలపులకు నెత్తిన యసదు
[17–526

దినవేడుక
తనదాసునికొరకు ధరియించె నీ మానము
దినవేడుకఁ గదికె నారసింహుఁడు
[16–1–37

దినసంతలెక్క
కొనేవారుఁ దినేవారు కూడికూడి మూఁకలై
దినసంతలెక్కనిదే దేహాలాల రారో
[8–170

దినసంసారము
దినసంసారమే మాకు దేవుఁడని కొలుచుక
వెనుకొని ఘనముక్తి వెదకేము
[8–174

దిబుకారనవ్వు
తొబుక కవిత్వాల దోషాలఁ బొరలితే
దిబుకారనవ్వఁడా దేవుఁడైనాను
[7–260

దిబ్బలువెట్టు
దిబ్బలువెట్టుచుఁ దేలినదదివో
ఉబ్బునీటిపై నొకహంసా
[5–16

దిబ్బాలు దొడుకులు
కలసితి నేను శ్రీవెంకటపతినిపుడని
తొలుత నీ చనుదిబ్బాలు దొడికేగాని
[13–181

దిబ్బెము
యింతలో నా పిరుఁదులు యిసుకదిబ్బె
లంటూ
రంతులుగాఁ గదునేల రాఁపు సేసేరే
[15–210

దిమ్మరివిద్య
దేవరదానైన దిమ్మరివిద్యలతఁడు
యీ వేళ నా కోరిక యీడేర్చలేఁడా
[14–13

దిమ్మరిమాఁట
నెమ్మొగమువాడెనంటా నిండుఁజెమటఉడ
దంటా
దిమ్మరిమాటల నిన్నుఁ దిట్టవచ్చునా
[17–411

దిమ్మరిమాయ
పుట్టుమాలినదరుబోఁకిలి నన్నుఁ
దిట్టేవదేమోసి దిమ్మరిమాయ
[11–3–41

**దిమ్మరివాఁడు**
నీయంత నీవే యెరిఁగి నిచ్చ నన్ను గాతుగాక
మాయలతోఁ బొరలే దిమ్మరివాఁడ నేను
[7–258

**దిమ్మరేఁచు**
తుమ్మఁగానే లేచేవు తొయ్యలి యెవ్వతె యైనా
దిమ్మరేఁచి వాదుదీసి తిట్టకుండీనా
[13–30

కమ్మరఁ గమ్మర నీతో కందువ నవ్వీన నవ్వు
దిమ్మరేఁచి నీ గుణము తేలించకుండీనా
[15–200

**దివెపంజులు**
దీమసపుపారివార దివెపంజులు చేఁబట్టి
యేమరక మీలో మీరు యియ్యరోజవి
[10–116

**దివ్వార్ద్రబువ్వులకోవి**
ఇసుముఁ గన్నపుఁగత్తి యెద దట్టిలోనఁ
బొసఁగిన దివ్వార్ద్రబువ్వులకోవి
[ప. యో. వి. 6–770

**దివ్వెత్తు ఫలము**
ఏమియుఁ జేయఁగపద్దు యింతలోనె మోక్షము
దీమపు విజ్ఞానమే దివ్వెత్తు ఫలము
[5–255

**దివ్వెత్తుఁ బొద్దు**
దివ్వెత్తుఁబొద్దుదాఁక తిరిగివచ్చియింటిలో
వువ్విళ్లూరుచు నసురుసురై వున్నాఁడు
[14–189

**దివ్వెన**
నవ్వులనె నొకమాట నటనల నొకమాట
దివ్వెనల నొకమాట తిట్టేవేమే
[14–73

**దిష్ట దిబ్బములు**
పడఁతికి నీవు నమ్ముమని బాసలు చేయుచు నున్నవేళ న
క్కడ నొకలేమ మీ నటన కాంక్షలఁ జూడఁగ దిష్టదిబ్బముల్
[శృం. వృ. ప. శ. 86

**దిష్టదైవము**
దేవశిఖామణివి దిష్టదైవమవు నీవు
యీవల నీబంటు నాకు నెదురింక నేది
[9–129

**దిష్టపు జన్మము**
ఆవల నాకర్మమున కాచార్యుఁడే గురి
దేవ నీ శరణు గురిదిష్టపు జన్మానకు
[10–224

**దిష్టపు నాలిక**
పరమపదమె గురిపట్టినవ్రతమునకు
తిరుమంత్రగురి దిష్టపు నాలికకు
[10–224

**దిష్టపు మన్నన**
తేటలఁ గతలుచెప్పి దిష్టపు మన్నన లిచ్చి
యీటునఁ గోపము దీర్చె నిదివో విభుఁడు
[17–500

**దిష్టము**
తెలిపితివి బుద్ధులు దిష్టముగాఁ గూడితివి
[14–277

గుంపెన శ్రీ వెంకటేశ గూడితిమయ్యా నిన్ను
దింపక నా వురమున దిష్టము మోచితినే
[15–59

నేనేల తనునాడె నేఁడు గొత్తలా నాకు
తేనెగారె తనమోవికి దిష్టమున్నదనవే
[15–262

కలదుగా యిటువంటి గడుసరి భూమిమీద
తెలిసితి మిన్నాళ్ళకు దిష్టముగ నీవిని
[17–198

తుచనుదాఁచఁగరాదు తోడ దిష్టమైవుండఁగ
మదిమది యిట్లైతి మగఁ డూరలేడూ
[17-258

దిష్టించి చూచు
తేరకొన నాపె నున్నది దిష్టించి చూచినది
కోరి నీ చేయివేసిన గుణమయ్యా
[17-496

దిష్టించు
అగడుఁ దాపపు రవికినారనే రాహువదె
తెగి యందుమీఁద నది దిష్టించగలదా
[13-1

చూపులు నీపై నిలిపి సుద్దులు నేఁజెప్పఁగాను
తీపలేమి వెదకేవు దిష్టించి నన్ను
[14-183

చిగురాకు నామోవి చిత్తజు నాడిదమట
తెగుఁజేసు నీ వంత దిష్టించకురా
[15-86

# దీ

దీకొను
దేవతల మొరాలించి దీకొంటి వింతపనికి
చేవ నభయము లిచ్చి చేయెత్తితివి
[7-127

వైకుంఠ మెరుఁగుదుమా వర్ణించి
యింతక తొల్లి
దీకొని శ్రీవెంకటాద్రిఁ దిరిగి కాక
[10-111

దీకొనుచుఁ జేసేరు దేవపూజాది యజ్ఞాలు
యేకాత్మవాదులాల యికవా యీమాట
[10-269

దీనకులు
పెట్టించె అసలను పెడకొడమలఁ దన్ను
తిట్టించె నిజద్రవ్య దీనకులచేత
[5-127

దీపంబు లెత్తు
అలచోటి చెంచెతలకి శిరోమణుల
బలు పొదరిండ్ల దీపంబు లెత్తెదరు
[వ. యో. వి. 5-1840

దీపనము
వుడివోని దీపనమున కోరిచినవె మరికదా
జడివట్టి నా జిహ్వాచాపల్యము మానుటా
[16-1-4

దీపనాగ్ని
దీపనాగ్నితోఁ దిరిగేటి దేహము
పైపై విరతికిఁ బట్టేది
[2-284

దీపమగు
దీపమైన హరిభక్తి దెలిసి యింతటనైనఁ
గాపాడి వరమీవో కర్మమా
[11-37

దీపమిడు
కలయఁ జీకటియైతేఁగాని దీపమిడుకోఁడు
యిల నజ్ఞుఁడైనఁగాని యెరుక వెదకఁడు
[10-37

దీపమెత్తు
యిల నంధకారపు టింటిలో నొక
దీపమెత్తి మెఱసినట్టు
వొలసి శ్రీ వెంకటపతి శరణాగతి
వొకచే నాకు
[10-77

దీపాళిపండుగ
తివిరివేగుదాఁకా దీపాళిపండుగ సేసె
జవకట్టి నినుఁబాసి జాగరాలను
[17-184

దీమసము
కోమలులు మీఁదమీఁద కోపగించినాఁజవి
దీమసానఁ బెదవుల దిట్టినాఁ జవి
[13-65

దీము
భూమికి దిక్కైనవారు పొడచూపికావవద్దా
దీముగా నిలువలేరు తెలిసేమంటేను
[8-115

దీము భోగములు
వెఱ్ఱిదెలిసి రోఁకలిచెనఁ జుట్టుకొన్నట్టు
యిట్టి దీము భోగములు నెనసేము
[8-174

దీవెత్తు పొద్దు
యీరీతి నింత గలిగితె యింటికైనా
దోడితేవే
తీరవు మీముచ్చటలు దీవెత్తుఁ బొద్దాయెను
[17-190

# దొ

దొంగల ధర్మాసనము
ధీరతచెడి తను జీవుఁడు తెలియఁగ
నేరకయుండిన
ధారుణిలోపల దొంగల ధర్మాసనమాయ
[11-3-6

దొండెము
తుత్తుమురై కోరికెల దొండెము
రేఁగఁగఁ జొచ్చె
జొత్తుల వెరగుపడి చూచీఁ బుట్టుగులు

దొండ్లు వాడుచు
చక్కిలాల కుండలెల్లా చలాన దొండ్లు
వాడిచి
దిక్కైన దోఁటి కోలలఁ దీసేనమ్మ
[10-161

దొంతరకొండ
అగ్గమై శ్రీవెంకటేశుఁ డలమేలు
మంగఁ గూడె
తగ్గులేని మొత్తపు దొంతరకొండ వలెను
[10-55

దొంతర కొడుకు
వంతుకు యశోదకు నవ్వల నందగోపునికి
దొంతరకొడుకై నాఁడు తొల్లి వీరేపుణ్యాలో
[7-275

దొంతినుండు
అంతట మాటలెయాడి హరిశరణనకుంటె
దొంతినున్న భవములు తొలఁగునా వివేకికి
[10-196

దొంతి పెట్టిన కుండలు
ఇంతయు నీ మాయామయమేగతిఁ
దెలియఁగ వచ్చును
దొంతిబెట్టిన కుండలు తొడరినజన్మములు
[6-133

దొంతి విషయములు
దొంతి విషయములాల దొరలాల
చెంతమీఁదటి బుద్ధి చెప్పరో మాకు
[7-173

దొంతులకు ఉరుకు
సంతసాన నిన్నుఁ జూచి సరసమాడి
నంతలో
దొంతుల కురుకఁడుగా దొరకనిమనుఁడు
[15-7

దొంతులకు నెక్కు
అలమె శ్రీవెంకటేశుఁ డంటిన మా
వొడఁబాటు
తొలుత మీ నవ్వులెల్లా దొంతులకు
నెక్కవా
[13-41

దొడ్డవిండి పండుగ
తూటి సీతపెండ్లి హరు దొడ్డవిండి
పండుగాయ
పాటిపాటి నమ్మ నేటువలె వచ్చు వీరిని
[6-8

దొడ్డివారు
తెలిసి వెన్నారగించీ గోవిందుఁడు
తొలఁగ దోసేరు దొడ్డివారు
[8–162

దొడ్డు
కోటిపూజ లిల లేవా కుమతులు సేసేవి
పాటలప్రపన్నుని భక్తి దొడ్డుగాక
[9–123

దొడ్డు ఎంచు
తొరలిశ్రీవెంకటేశ దొడ్డుగొంచమెంచనేల
యిరవై లోకహితాన కేదైనా నేమి
[7–203

దొప్పఁదోఁగు
మంచికస్తూరి యుమ్మవి దొప్పఁదోఁగి
యించితంబైన కంఠాంబుజాతంబు
[వ. యో. వి. 333

దొబ్బు
వూరకే దినదినాల యుగాలు దొబ్బితిఁగాని
నేరిచి వివేకము నిలుపనైతి
[8–283

దొబ్బుకొను
నిబ్బరమైలోకమెల్లా నిండుకవుందురువట
దొబ్బుకొంటాఁ దిరిగేము తోవల నిన్ను
[8–231

దొబ్బుఁ దెడ్లు
పాపపుణ్యములురెండు పక్కనున్నచీలలు
తోపుల యన్నపానాలు దొబ్బుఁ దెడ్లు
[6–152

దొమ్మిచేయు
పంచేంద్రియములాల పంచభూతములాల
అంచెలఁ దొమ్మి సేయకురో మీరు
[9–208

దొమ్మిపూజ
దొరతనానకుఁ రాగా దొమ్మిపూజలాయెఁగా
[17–600

దొమ్మి పోఁజు
చిడిముడి జంకింతుము చెక్కులద్దె
నొక్కుదుము
తొడసోఁకిన జీతాలఁ దొమ్మిపోఁజువారము
[14–182

దొమ్మి సేయు
జలకమాడెటివేళ సంగడికి వచ్చేవు
తొలమంచె కాఁగిలించి దొమ్మిసేసేవు
[17–262

గుట్టుతోఁ గాఁగిలించఁగఁ గొప్పువీడె
నింతే కాక
తొట్టిన రతులలోన దొమ్మి సేయవచ్చెనా
[17–316

దొమ్ములఁ బెట్టు
చెల్లినంతా వచ్చి వచ్చి చెట్టవట్టేవు
తొల్లియు నెందరినిట్టే దొమ్ములఁ బెట్టితివో
[12–29

దొమ్ముల మేయు
దొమ్ముల మేసువారికి దొడ్డవరి కేటిఁమాట
[14–194

దొమ్ములు
నమలెడి నా వాచవులకు నానావిధ
భక్షణములు
కమలిన దుర్గంధపు శాకమ్ములు
దొమ్ములును
[11–3–129

దొరకాలువ నెత్తురు
కాంచన దైత్యుఁడు దొరకాలువ
నెత్తురువార
చించెను గోళ్ళ నరసింహదేవుఁడు
[6–228

దొరకోలు
తొలఁగక నన్నుఁగూడి దొరకోలు
సేసుకొని
చెలఁగీ శ్రీ వెంకటటాద్రి చిన్నబావగారు
[17–355

దోఁగిపోవు
వున్నతి దోలఁగ వాని వొళ్ళెల్లా
దోఁగిపోయ
కన్నెలార యీకృష్ణుఁ గంటిరంటరమ్మ
[6–165

దోఁటు
వేడుకనీమోవినాపె విందుగా మోవంటితివి
ఆడానీడా దోఁటిగా నేఁడందెగా మీ వలపు
[14–141

దోమటి
దొడ్డ మేఁకపాల గూడు దోమటి
దొడికినాఁడు
గడ్డు వయసగు బిడ్డ గన్నవాఁడు
[4–43

దోమటి నా మతిలోనఁ దోడునీడపై యుండి
పామెచె సుఖములనే భ్రమయించ వలెనా
[6–59

యేమాయ నీపాదములిటు నేము పిసికితే
దోమటి నాపె కాలు దొక్కఁగాఁ గాక
[13–9

తొడఁదొడ మోచిన మేలము
దోమటి వీడెపుఁ టుదుటులు
జడిగొను చూపుల ననుపులు సతికిని
నీ కమరె
[13–131

కామినికెమ్మోవికాంతి కట్టుకొనే చంద్రగావి
ఆముకొన్న మోహకళ లాభరణాలు
ధోమటిమాటలవిందు ధూపదీపనై వేద్యాలు
కామించినటువలె కలిగె నీకిపుడు
[13–168

దొంతుల వెరిగి గొల్ల దోమటాయ వలపు
యెంతటిదాన నయ్యేనో యిందరిలో నేఁడు
[14–121

ప్రేమపు మోవితేనెలు పెదవిమీఁదనే
వుండు
చే ముట్టి వడ్డించఁబోతె చిరునవ్వులు
గామిడి శ్రీవెంకటేశ కలసితివిటు నన్ను
దోమటి దొడికేమంటే దొడ్డమాకు
[14–267

మఱియేఁటి సుద్దులు మమ్మేమడిగేవు నీవు
మెఱసి మీయిక్కువలు మించెను దోమటై
[14–174

కూడిన నీ సతులనుఁ గూచుండఁ
బెట్టుకోఁగా
తోడులు నీడలు నొక్క దోమటాయను
[14–273

ప్రేమమునఁ బిలువఁగా బెట్టి వూఁకొంటిఁ
గాన
దోమటిఁ దడవకుంటె దొమ్మి నేతునా
[15–132

ఏమి సేతు నీ సుద్దుల కేమందును
దోమటిఁ గొంగువట్టఁగ తొలఁగి పోరాదు
[15–271

చూమరలఁ జూడఁ జూడ జుట్టాల
వలనె వుండి
దోమటి పంచేంద్రియాలు దోడుగాక
పోయను
[16–1–6

దోమటి చెనకులనె దుండగాలు నేనేని
దీమసము తోప నన్నతి వెంగళప్పుడు
[16–2–29

ఏమి బాఁతినే నీకు యిటు నాకె దక్కితివి
దోమటి నిందుకె పోసి తొత్తనైతి నేను
[17–2

యేమాడిన నాఁట దాని కెగ్గులేదు తప్పులేదు
నేమాన నూరకుండిన నేరమిలేదు
దోమటిగా జూచినాను దొరతనమై తోఁచు
వేమారు నవ్విన నవి వేడుకలై నిలుచు
[17-15

కామించి శ్రీ వెంకటేశ గక్కన గూడితి నన్ను
దోమటి దొడికించితే దూరను నే నాపెను
[17-68

నీ మేలులోనిదాన నీవు మన్నించేటిదాన
దోమటి నన్నియు నీ చేతుల నున్నవికను
[17-138

యేమనీనె చెన్నుఁడూ యేకతాన నన్నునూ
దోమటి వావులు నాపై దొరలించీని
[17-162

కామించి నగవచ్చేవు కాఁగిటి బిగించేవు
యేమి నననివారితో యేతులా నీకు
దోమటి దొడికితివి దొడ్డ చుట్టమువలెనె
వేమపు శ్రీవెంకటేశ నీవె నేనై తిరా
[17-223

తామరవేసె నతఁడు తట్టితివి చేత నీవు
దోమటి దొడికేవేళ దోసమూ యేమి
[17-382

దోమటి కర్మాలు
దోమటికర్మాలు నేసి తుదకెక్కవాఁడఁగాను
యేమిటికిఁ గాచెతివో యిది సోద్యమయ్యా
[8-181

దోమటి కుడుచు
శ్రీమంతుఁడ నీచేఁత దేహమిది
దోమటి గుడువక తోయఁగ వశమా
[9-119

దోమటి దొడికినట్లు
తొల్లియు రేపల్లె గొల్లదోమటి దొడికినట్టు
తల్లి అనసూయ పాలఁ దనిసినట్టు
[6-60

దోమటి దొడుకు
దొంతి వెట్టిగొల్లెతలు దోమటిదొడుకఁగాను
బంతిచిక్కినట్టి మోవిపండు నే దాఁచితినే
[14-79

దోమతెర
విన్నపాలు వినవలె వింతవింతలు
పన్నగపు దోమతెర పైకెత్తవేలయ్యా
[4-25

దోమతెరవేయించి తొంగిచూచే విందరికి
వోముచూ నీ వేసాల కోపునా ఆపె
[13-251

కామిని నీవురాఁగానె గక్కన లేచి నిలిచి
దోమతెరమాటు కేఁగి తొంగిచూచీని
[17-300

దోసకారి
యీసుద్దులకె నే నీ యింటికిరాను వెలుకు
దోసకారి చెలికత్తె తోడితెచ్చేఁగాని
[13-2

దోసాలు గట్టు
వావిగాదు నీకు నాకు వద్దువద్దు నీ
తోవ రా వెలుతుమన్నా దోసాలుగట్టకురా
[4-137

దోసిలించు
తూరేటి నెరులతో దోసిలించి మొక్కఁగాను
[14-292

దోసిలొగ్గు
ఆసలనిమోడి వెట్టి యంగడి వెంటాఁ దిప్పె
దోసిలొగ్గించె దైన్యము దొరలెదుట
[8-64

ద్వా

ద్వాపరమునాటి ముసలి
తగ నలవడఁజేరి తను జూచువారు
మొగి ద్వాపరమునాఁటి ముసలి వీఁడనఁగ
[వ. యో. వి. 7-298

# ద్రి

ద్రిమ్మరి దిప్పకాయ
తలపోయ నీ తుమ్మెదలు గూడ గొట్లు
మలయమారుతము ద్రిమ్మరి దిప్పకాయ
[వ. యో. వి. 5–1388

ద్రిష్టి మంత్రము
ఘాతఁగరుణాకరుఁడై కరుణదృష్టివాఁడే
మా తరతరము ద్రిష్టిమంత్రపు రక్ష
[10–54

# దు

దుంకదూరు
ఏలవచ్చి యేలపోయీ నెందుండీ ప్రాణి
తోలుతిత్తిలోనఁ జొచ్చి దుంకదూరనా
[5–202

దుత్త
ఆలదొడ్డివారము నే మంతేని యెఱఁగము
పాలదుత్త దుత్తఁదేసి పట్టవయ్య వలపు
[13–180

దుప్పటి
అప్పటిఁ బోదువుగాని అందాకా విచ్చేయుమంటా
దుప్పటి కొంగువట్టేవు దొడ్డదానవే
[13–4

దుబ్బ
తోడనె వెన్నదుబ్బలు తోడుత నేలవచ్చీని
వేడుకకాఁడు శ్రీ వెంకటేశుఁడు
[13–134

గొల్లెతలమెఱఁగము గొప్ప జాణతనములు
చల్లదుబ్బ దుబ్బఁదేసి చల్లేమువలపు
[13–180

దుమ్ము దూరుపెత్తు
ఇంతే మతేమిలేదు యిందుమీఁదను
దొంతుల కర్మాలు దుమ్ము దూరుపెత్తుటా
[5–223

దుమ్ములు
దుమ్ములుగా సాల్వునిపై దొడ్డగాఁ దోలిన తేరు
దొమ్మి రుక్మిణిపెండ్లికిఁ దోలినట్టి తేరు
[10–35

దురదుర
మరుని కార్ముకబాణము మహిమ గదు నెఱిఁగించె
దురదురనఁ జేతులనె తుడిచేరు సతులు
[4–173

దువ్వటము
చివ్వనమై చెమరించి చిత్తడి చెమటతోడ
దువ్వటపుఁ బయ్యెదెల్లాఁ దొప్పఁదోగెను
[13–144

# దూ

దూఁటి [ఔపవిభక్తికం]
పీఁటమీఁద గూచుండి ప్రియములు చెప్పి చెప్పి
దూఁటి చన్నుల నొత్తెను తొలుతాతని
[14–140

దూతికె
కాతరాన నీ గుణాలు కదుఁగదు గొసరిని
దూతికెవలెనే మాట దొమ్మిసేసీనో
[14–92

దూపిల్లు
దూపిలేవు నీచేఁతకు దొరలకుందాననంటూ
చావలాన నీ వాపెను సమ్మతింపించరాదా
[14–197

దూరిపోఱు
రూపువో సౌఖ్యంబుడిచి చేసినది పువ్వుఁ
దూపువో హృదయంబు దూకి పాఱినది
[4–159

దూరి మాఁటలు
ఆడకు దూరి మాఁటలిఁక నాడకు
వత్తువుగాని వూరకే
[శృం. శ. 31

దూరుకెక్కు
దూరుకెక్కరి నీచేత తొల్లే గొల్లెతలెల్లా
యీరీతి విద్యలు నీకు నింకా నెన్ని గలవో
[18–226

దూరువేయు
నేరకుంటె నరకము నేరిచితే స్వర్గమంటా
దూరువేసే లింతేకాక దోషమెవ్వరిదయ్యా
[5–234

దూఃఱుగా జెప్పు
అయ్య మీ పనులన్ని ఆగడాలాయె
తొయ్యలి నాతోన దూఱుగా జెప్పె
[సు. క. 416

దూఱుముట్టు
పాముతో నటుపొందు పాటింపఁగా రాదు
దుర్జనసంగతి దూఱుముట్టు
[నీ. శ. 36

దూఱులు వల్కు
దొరకొన్న యపుడె చెంతకు
దొరకొల్పుట మేలనంగ దూఱులువల్కన్
[రేఫ. 31

దూఱు లెక్కించు
దూఱులెక్కించెదో తోయజాక్షునకు
[సు. క. 625

దూవు
వీవుగుఱ్ఱముదోలఁగ నెలతచిక్కుదీయుచు
తావులమేడపైనుండి తప్పక చూచె
కావించి నీ సమకట్లలో నల్లజల్లి
దూవిన నేరుపుల కెదురువలచెనయ్యా
[16–2–102

దూళికాళ్లు
చెడ్డచెడ్డ మనసుల చెంచువారము ఆల
దొడ్డివాఁడ పోవయ్య దూళికాళ్ళరాక
[12–58

## దృ

దృష్టంబరచే నుండు
అకటా దృష్టంబరచే నుండఁగ
సకలము నుపదేశము లిఁక నేవి
[8–120

దృష్టించి చూచు
కష్టపు విధిగాక కడపట దీని
దృష్టించి చూచిన దృష్టి దాఁకెడిని
[ప. యో. వి. 4–1426

దృష్టి తీయించు
దృష్టి తీయింతుమే తెలివిరా నీకు
[సు. క. 775

దృష్టి దాఁకు
కష్టపు విధిగాక కడపట దీని
దృష్టించి చూచిన దృష్టి దాఁకెడిని
[ప. యో. వి. 4–1426

# దె

దెత్తి
త త్తరించి తలఁచక దవ్వుపోయి పరులకు
దెత్తిపై యేలనోళ్ల దెరచేవో మనసా
[8–196

దెత్తిగొను
నెత్తికన్ను మానినవాని పెండ్లికి
దెత్తిగొన్నయట్టి దేవుఁడు
[11–3–45

దెసలఁ దిరుగు
తిరువెంకటాచలాధిపుని మాయలచేత
దెసలఁ దిరిగినయట్టి కర్మమా
హరిదాసులగువారి నాదరింతువు గాక
అంత నొప్పింతువా కర్మమా
[5–187

దెసల దేవుఁడు
పసులగాచేవాని బ్రహ్మ నుతించె నంచేను
దెసలదేవుఁడే యని తెలియవద్దు
[5–328

దెసలు వెదకు
పసుర మడవిఁబడ్డ బసురము గలవాఁడు
దెసలు వెదకింటికిఁ దెచ్చుకొన్నట్టు
[9–148

# దే

దేవకాంతరాలు
తప్పఁదెరువుల దేవకాంతరాలు
దడవకు వోవో జీవుడు
[16–1–3

దేవపిండము
యిల దేవపిండమ వయ్యీన నీ యాటలయ్య
బలు సముద్రాల మీఁది పాటవరువు
[15–9

దేవరలేని పూజ
వట్టిజోలితో నూరక దేవరలేని
పూజవంటిది
వొట్టుక ఫలములులేని వంటలకు
వొడిగట్టే యటువంటిది
[7–86

దేవాసనము
శ్రీ వెంకటేశుఁడు వాఁడె చేరి
యలమేలుమంగ
సావధానమున సరసములాడఁగ
దేవాసనం బెక్కి తేఁకువ నారగింపులు
వానివిరిఁ జేకొనీ వాఁడె వాడవాడలను
[17–304

దేవులమ్మ
దేవులమ్మ యిందిర మా దిక్కై
విన్నవించరాదా
శ్రీ వెంకటపతికి చిత్తమందను
[8–267

దేవులసాని
దండికోడ నూడిగపుదాన నయ్యేనంటేనేల
చండిపోరి నీ దేవులసానిఁ జేసేవయ్యా
[17–504

దేవులు [దేవికి గౌరవసూచక బహువచనం]
దేవరవైతి విన్నిటా దేవులాయ నాపెనీకు
[13–3

దేవుళ్లు [దేవికి బహువచనం]
నీవు నే నొక్కటిగాఁగ నిజము నిన్ను
జించితి
దేవుళ్ళు నీ కెందరు తెలుపవయ్యా
శ్రీవెంకటేశ నేను జిగి నలమేల్మంగను
తావుగాను రమించితి తగు వింతగలదా
[15–166

వదియారువేలు నూటయెనమండ్రు
దేవుళ్ళకు నన్నిరూపులై
వినోదించిన నెరజాణుండవని
[వై. వ. 40

దేశాంత్రులు
తగ నూటయిరువై యెనిమిది తిరుపతుం
గల స్థానికులును చక్రవర్తి పీఠములును
అగణితంబైన దేశాంత్రులు మఠంబులును
నదికమై చెలువొందఁగాను
[5–130

దేహపుటూరు
దేవ నీ విచ్చినయట్టి దేహపుటూరిలోన
చేవమీరఁ గాఁపురము సేసేమయ్యా

దేహమెత్తి కను
సరిమూఁడులోకములఁ జాటి నర్థము
గరిమ నీదేహమెత్తి కంటిమి మేమిదివో
[10–137

ధే

ధేయను
వాగియబిగువింత వదలి దాఁటించి
రాగేలు బిగియించి రవళి ధేయనుచు
[వ. యో. వి. 2–674

దాఁటించి ధేయని తరులు గావించి
యాటోవకోపంటు లడరఁ దోడ్తున
[వ. యో. వి. 3–1726

ధృ

ధృవపట్టము
శ్రీవెంకటేశుదాసులు చేసినదెల్లా సృష్టి
యేవంకా ధృవపట్టమే యిటు వారికి
[8–119

దై

దైలువారు
తలవంచే నిన్నుఁజూచి దైలువారే
నా చెమట
[14–128

యినుమడించెఁ జెమటల వేఁటికె
యింతిఁ రతిఁ
దీనివోని కళలెల్ల దైలువారెలా
[16–2–42

దైవారు
తలఁపు లీడేరెను తమకము దైవారెను
చలపట్టితే నింక చప్పఁగాదా [15–289
చిప్పిల నెలవులను చెలియ బ్టై నవ్వఁగాను
తప్పక చూచే వక్కడె దైవారుతా
[17–54

దైవిక మెరుగు
దీమసాన నీ దాసుల ద్రిష్టమెరుఁగుటగాని
యీమేర నీదైవిక మెరిఁగే వారెవ్వరు
[7–69

న

నంజువంటి పాము
వల్లని నాయారు యిది నంజువంటిపామట
[15–86

నంటు
పితోనె అనతీవయ నంటున సంతసించేను
చేతికి లోనైతి విఁక జేరె నాకు మేలు
[17–115

నంటుచేయు
అంటి మేనుదాఁకించి ఆకుమడచి నీ కిచ్చి
నంటు సేసె నీతోను నా యెదుటనె
[17-11

నంటు తమకము
జంటవై(శ్రీవెంక టేశ నరినన్నుఁ గూడితివి
నంటుతమకము లింత నానవేతురా
[17-152

నచ్చికములేకుండు
కమ్మటి నీ భక్తియనే కామధాను
వున్నవారు
వుమ్మడి నచ్చికము లేకుందురయ్యా
[7-75

నచ్చు
మచ్చరము నాకుఁ చీరె మనసెల్ల
నొక్కటాయ
నచ్చులనాపె నీతో నవ్వఁగాను
[13-255

యిచ్చకమైయుండేవాఁడ వెగ్గులేల వచ్చేవు
నచ్చుల నే తిట్టినాను నవ్వవలెఁబో
[17-49

నటనలుసేయు
నవ్వి నవ్వి నీతో నటనలు సేసేనంటే
యెవ్వలనో జాజమాడే వేమిసేతును
[14-28

నట్టేటి వరద
నట్టేటివరదవలె నానాటి నీ మాయ
కొట్టుకపారఁగఁజొచ్చె కూడెన విజ్ఞానము
[8-32

నడ
వడియఁ జెమటలతోడ వత్తివంటి
మోవితోడ
నడ మురిపెముతో(డ) నవ్వేవేమే
[13-42

నడగొండ
నానావర్ణముల నడగొండవలెను
దానవారి తేరదె తగ తిరువీధుల
[10-55

నడపు
నడపుల హంసలనయన చాతకములు
వడతి శ్రీవెంకటపతి పొదిగె
[14-7

గుంపెన మానడపు కొప్పు గడు నిడుపు
[15-114

నడివీది పెసర
గటిరాజు బదుకాయ కడలేని మనసు
నడివీది పెసరాయ నయమైన మనసు
[11-3-125

నడుమంతరాలు
నామమాత్రజీవులము నడుమంతరాల వచ్చి
నేము గర్తల మనుచు నిక్కేము గాక
[8-61

నడుమగు
ఉడివోని సంసారాన నున్నారము
నడుమాయ నవ్వులకు నా బ్రతుకు
[8-110

నడుమ రుచులు
నడుమ రుచులకే నాలుక అమ్ముడువోయ
యెడయేది నిన్ను నుతియించే అందుకును
[8-176

నడుముచొచ్చు చుట్టాలు
వుడిగినా గామాదు లొక్కొక్క
వ్యాజానవచ్చి
నుడిసి నడుముచొచ్చు చుట్టాలవలె
[7-97

ననచు
యెనలేక శ్రీవెంకటేశ నన్నుగూడితివి
ననిచితి నిది నీకు నయమే కాదా
[17-197

ననుపుచేయు
చనవులెల్ల నెరపి పలిగెల బొరలుచు
ననుపు నీ కాపె సేసీ నా యెదుటనే
[17-11

నసుపులు నడుపు
పెనగక నాతో ప్రియములు చూపేవు
నసుపు విందుననె నడపేవా
[17–8

నన్ను దగ్గరకు వచ్చు
తగుమాటలేమి గల్లా దవ్వులఁ
జెప్పుదురు గాని
అగడయ్యీ నీవు నన్ను నంత దగ్గరకుదా
[15–130

నమ్మిక
నవ్వునవ్వ వేళలేదా నమ్మికకు వేళలేదా
[14–169

నమ్మిక బొంకులు
[3–72

నమ్మినవారి నిధానము
నెట్టన నమ్మినవారి నిధానమై వున్నవాఁడు
పట్టపు శ్రీ వెంకటాద్రి పతియైన దేవుఁడు
[8–125

నయగారము
నయగారి నీ సుద్దులు నాకుఁ గొత్తలా
ప్రియములన్నియు దాఁచిపెట్టిఁచెట్టవయ్యా
[13–108

నయగారి
నయగారి మాటలెల్ల నమ్మితిఁగనక యిట్టే
భయము విడిచి నీతోఁ బలికే నేను
[14–126

నవ్వుల జాణతనాలు నయగారి వినయాలు
యెవ్వతె నేరిపెరా యేరా నీకు
[17–231

నయగారి మాటలు
నయగారి మాటలాడి నవ్వులు మాతో
నవ్వేది
నియతము నీకుఁ దొల్లె నేఁడు గొత్తలా
[15–253

వయగారి మాటలు నటన చూపులను
ప్రియము నయముల బెల్లించి పొంచి
[అ. మ. క. 3352

నరకమే కురియు
దరిచేరుటా లేదు తగులు లేదు నానాఁడు
నరకమే కురిసీని నా బ్రదుకు
[8–110

నరమిగొను
అరగునా దుర్బలున శరుదైన యన్నంబు
కురుచ బుద్ధులను నరమి గొనుఁగాక
[5–145

నలఁకువ
ఇలదుర్గుణముల కీ జన్మంబున
నలఁకువ సేసెఁబో నా వ్రాఁత
[5–136

నలినలిసేయు
నలుగడఁ జూచి చూచి నరహరి మోవి
నలినలి సేతురా నరహరి
[13–229

నలిరేఁగు
పిలిచి యిప్పటివేనే ప్రియములు
చెప్పఁగాను
నలిరేఁగి మెచ్చేది నా భాగ్యము
[13–133

సొలసి సొలసి నిన్నుఁ జూచిన
యీ చెలిచూపు
నలిరేఁగి నీ మతిలో నాటకుండేనా
[15–200

నలుగుల పాఁతర
కాంతలు నవ్వుచునై నాఁ గన్నులఁ
జూచిన చూపు
వంతమున నలుగుల పాఁతర సుండి
[6–26

నలుదిక్కుల కడగను
కలయ నలుదిక్కుల కడఁగానఁగ రాదట
జలజాక్ష నీ రూపు తలపోయగలనా
[7–28

నల్లతిండి
నల్లతిండే మరి మీఁద మరగితేరోఁతలా(?)
వుల్లమిచ్చే వెంకటేశు వొద్ది కిటువంటిది
[11–3–60

నల్లనిచేత
చెలఁబో తనకుఁ దెచ్చెదు నంత లేదె
నల్లనిచేఁత మానక పోయి తెపుడు
[ప. యో. వి. 6–518

నల్లుపెద
వెట్టి విన్నపములాయ వేఁగుదాఁకా
మా కతలు
జట్టిగా మా విరహము వెదలాయను
[17–413

నల్లెటనాడు
పొదలుచు మృత్యువు వందివోసై
నల్లెటనాడఁగ
పదిలముగాఁ గింకరులును చొప్పరుల
బర విడిచి
[5–201

నల్లెఁడంత నాలికె
నడుమనె నల్లెఁడంత నాలికెవాఁడ నింతే
వుడివోని సుద్దులెల్లా నుగ్గడించేను
[7–193

నవకము
తివిరి శ్రీవెంకటేశ తెరవేసి నిన్నుఁగూడె
నవకానఁ బట్టు మీకొన్నది కోలువలపు
[13–71

నవరేత్రి
శ్రావణ బహుళాష్టమి నవరేత్రి కాడను
శ్రీవిభుఁడుదయించెఁ జెలులాల వినరె
[10–287

నవ్వులకైనా
నవ్వులకైనాను నా మాట మీరని నిన్ను
యెవ్వతెరా నిన్ను నింతగ జేసినది
[16–2–97

నవ్వులుచేయు...
ఎవ్వరికైనను యీ వ్రాఁత నను
నవ్వులు సేసెఁబో నా వ్రాఁత
[5–136

నస
కొసరే మా మాటలు కూరిములో తేటలు
నసలు నేఁడింపౌనా నాఁడే కాక
[17–154

నసచేయు
వసతో శ్రీ వెంకటపతి నన్ను నిటు గూడె
నసచేసి నాతోనె నవ్వీనటా
[17–183

# నా

నాకు నాకే......
అన్నేసి నాకు నాకే ఆడుకోరాదు
యెన్నుకొమ్మీ నా మాట లితవైన యపుడు
[14–93

నాఁగువారు
చేఁగదేర గూడితివి శ్రీవెంకటేశ నేఁడు
నాఁగువార మీఁదమీఁద నవ్వవచ్చుఁగా
[14–254

చేఁగదేరఁగూడెనిన్ను శ్రీవెంకటేఁశు
డతఁడు
నాగువారె సరసాలు నవ్వకుండఁ గలవా
[15–170

నాఁగువార శ్రీ వెంకటనాథ నన్ను
గూడితివి
యేఁగివచ్చి యిట్టె మా యింట నుండ
వయ్యా
[16–2–23

యేఁగివచ్చి శ్రీవెంకటేశ నన్నుఁగూడితివి
నాఁగువారె వలపులు నమ్మి కియ్యవలెనా
[17–558

నాఁగేటిగీఁత
బాఁతిలేని దారవోత పావము
చూడని చేఁత
నాఁతిమీఁది తలపోఁత నాఁగేటిగీఁత
[12–274

నాగవల్లి సోబనము
వంటుతోడి సరసాలు నాగవల్లి సోబనాలు
పెంటలైన సమరతి పెట్టినపేట
[15-199

[నాగవల్లి నిష్ఠూరం అన్నది ప్రసిద్ధమే. అన్నమయ్య కాలంలో నాగవల్లినాడు సోబనమేగాని నిష్ఠూరం లేదా?]

నాగవెల్లి
పానుపుమీఁదికిఁ దీసె పాణిగ్రహణమున
నానారతులఁ జేసె నాగవెల్లి
[14-259

నాగవెల్లి కట్నాలు
చందకావులు నీకు సరిగట్ట నంపెనమ్మ
యిందు నాగవెల్లి కట్నా లింతలోనె
వచ్చెనా
[13-55

నాగేటి వేగిలి
రానికెక్కె మునులకు రచ్చైన పొలము
పేవరక నాఁగేటి వేగిలైన పొలము
[10-52

నాఁటకపుది
యేఁటికయ్యా నీవు మాతో యేలాట
లాడేవు
నాఁటకపుదావనా నవ్వేదానఁ గాకా
[18-278

నాఁటకుఁడు
గాఁటపు కమలజుఁ గాంచిన యీ
నాఁటకుఁడే మా నమ్మిన విభుఁడు
[11-3-17

యేఁటికి బొంకేవు నాతో యెవ్వతెఁ
దెచ్చితి వోరి
నాఁటకుఁడ నా మనసు మన్నించరా
[17-217

నాటికి నాఁడే
నవిచిన వావులెల్ల నాటికి నాఁడే కాక
కొనవేసి మమ్మునేల కూరిమి గొసరేవు
[17-457

నాఁటకీఁడు
ననిచి శ్రీవెంకటేశ నాటకీఁడ వవుత నిన్ను
యెనసిన వేళనేమీ నెంగమైతిమిరా
[17-18

అసల శ్రీవెంకటేశ అలమేలుమంగ నేను
నాసరి నాకెఁ గూడితి నాటకీఁడా
[17-589

నాణెపుముద్ర
ధరణీశునాజ్ఞల తమదేశములందు
సిరుల నాణెపుముద్ర చెల్లీనట
[5-215

నాదించు
వేదాలకొడయడట వెన్నలు దొంగవెనట
నాదించి విన్నవారికి నమ్మికా యిది
[17-415

నాదు దీయు
తెగరానిచోట వాదుదీసి యెంత మాటాడిన
పగలేదు చనువులు బలిమె కాని
[15-223

నాదుపుట్టు
దట్టమై యీతని భేరిఁ దగనాదు పుట్టితేను
పుట్టీ నుత్పాతాలు వైరిపురములందు
[8-92

నానుడి బాసలు
మానకురా యిటు మాటాడీని
నానుడి బాసలు నమ్మితిని
[18-57

నానుడిమాఁట
సరిగాఁడు నీఁ దనవలదు జగమున
రాజు వలసినది దేవులు
యిరవుగ నందరు లోకము లోపల
యిది నానుడిమాఁట
[7-64

నా భాగ్యము నీ చిత్తము
యెఱఁగను శ్రీవెంకటేశ్వర యెంతో
ఇఁక నాలోపలి దుర్గ(గు?)ణములు
మెఱఁగు చొచ్చితిని నే విన్నాకు మరి
నా భాగ్యము నీ చిత్తము
[8-88

నాము
మోమునఁ గళలుముంచె మోవిపై
చేఁతలురఁగె
నాముతో శ్రీవెంకటేశ నన్నుఁగూడితి
[14-196

నాము మేయు
మింగుచుఁ గర్మపు నాముమేసిన సంసారికి
అంగడి కర్మమే బ్రహ్మమై తోఁచును
[9-78

నాము రేఁచు
రవ్వలైన వెన్నెలల రాఁసాయ మోహము
నవ్వినవ్వి వానిచూపు నామురేఁచేనే
[16-2-44

నాములెక్క
యేమిటికే బిగువు యింకానా తగవు
మోముచూచి నవ్వితేనె మోపుగట్టేవా
నాములెక్కఁ బంతములు నావిసేయ
నీకనేల
కై మీకినందు తతనిఁ గాఁగిలించుకొనవే
[15-237

నామువారఁ గల్లలాడు
నామువారఁగల్లలాటి నాలికఁగొంతపాపము
గోమునఁబాపము మేనఁ గుప్పలాయనివిగో
[9-38

నామువారు
నామువార సెలవినె నవ్వులు లోలోనదాఁచీ
[14-248

నాయఁడు
రొమ్మునఁ బూసగల వురుటు నాయఁడ
నంటావే
బమ్మరబోవుచు మాపై నొరగేవు
[14-194

నాయిటిగాలి
అంగన విరహవేళ నాయిటిగాలై వూర్పు
వెంగలితనాన నట్టె విసరఁజొచ్చె
[17-442

నాయిటివోవు
వేవేగ నాయిటివోతె విసరదు బెట్టుగాలి
[16-2-104

నారవలె నారటిలు
చీరినఁ దునుఁగక చేసిన దురితము
నారవలెనే కడు నారటేలి
[8-224

నారుకొను
పూరకే పరాకైనట్టుండును దేవుఁడు
నారుకొన మతిలోఁ దనపైనే చింత
[7-110

నారుకొన్న వంటలు నీ నై వేద్యాలుగాఁ
దలతు
నీరెల్లా నీ తీర్థమని నెమ్మిఁదలఁతు
[7-90

నారుకొనె సంపదలు నానారూపములై
తీరదేమిటా నీ చిక్కు దేవుఁడు వెట్టినది
[7-256

తగిలి శ్రీ వెంకటేశ తతినీకెఁ గూడితివి
నగవులు సెలవుల నారుకొనఁ జొచ్చెను
[13-139

నారుకొన్నవెన్నికంకణాలుదాఁగట్టుకొనినా
వూరివారి కేమిటికే వుప్పతించను
[13-152

నారువోసుండు
లావుగా నీ ప్రసాద తులసి నారువోసున్నది
వేవేలు పాతకాలెల్ల విదళించుమనుచు
[6-102

లావుగా నీ ప్రసాదతులసి నారువోసున్నది
వేవేలు పాతకాలెల్లా విదళించు మనచు
[8-285

నాలి
నవ్వులు నవ్వగరాదు నాలినూరకుండరాదు.
యివ్వల నీతో సరసమెటుఁ బోరాదు
[17-404

నాలిక త్తె
నాలిక త్తెలు నీమాఁట నవ్వుదు రింతెకాని
వాలాయించి మంత్రముగా వ్రాయవచ్చును
[13–140

నాలిక త్తె దానిమాట నమ్మితివా నీవప్పుడె
మూలల ములిగేమేలు ముందరనె వున్నది
[18–62

నాలికాఁడు
నాలికాఁడు మొదలనే నవ్వులనె పొద్దువుచ్చీ
యేలినప్పుడేవీఁ గాక యింతకోపఁగలనా
[14–49

నవ్వ నవ్వనోపనా నాలికాఁడు రమణుఁడు
[14–189

నాలికాఁడు శ్రీవెంకటనాథుడు నన్ను నిట్టె
వోలివెట్టకె కూడ నోయమ్మ వీఁడు
[16–2–6

నాలికూళలు
మాయలు నేర్చినవారు మహిమలోన
జాణలు
నా యాలు నడచేవారే నాలికూళలు
[17–86

నాలికెఁ గడచు
మేలు దెలుసుకొని మెచ్చెదమంటే
నాలికె గడచితే నరకములు
[8–137

నాలిక కొన నిలుచు
ఆడిగొని వెదకితే నాలిక కొన
వేదమై నిలిచినాఁడు వీఁడివో హరి
[8–57

నాలిఘోరములు
నానాజీవులువడే నాలి ఘోరములు చూచు
దీనికెంత వగతువో దేవనిచిత్తానను
[8–246

నాలిచేయు
ఏల వొడఁబరచేవు యింతలోనె నన్ను
నాలిసేసి నీతోను నవ్వేదానవా
[17–65

నాలితోడ సన్నచేయు
తాలిమితో మీఁద మీఁద దరవయ్యీఁ
గర్మము
నాలితోడ సన్నసేసె నవ్వునవ్వీ మర్మము
[9–168

నాలిమింటి వెత్తుపెట్టు
గాలిముడియగఁగట్టి కలుగుడి గట్టుయోగి
నాలిమింటి ఎత్తువెట్టి నగు నొకయోగి
[6–125

నాలిసంసారము
నాలిసంసారము బ్రహ్మనాఁటనుండిఁ
జేసేఁగాని
మేలిమి మోక్షముతోవ మెలఁగఁగ నైతిని
[8–283

నాలిసేయు
నవ్వులు నవ్వనే పట్టె నాలిసేయనే పట్టె
ఇవ్వల నన్నుంగూడేది యెన్నఁడే తాను
[4–115

నాలి వెన్నెల
క్రొవ్వెల కావరె కోమలి మనము
నవ్వినట్లనె యుండు నాలి వెన్నెలలు
[అ. మ. క. 4591

నాలిసేయు
నాములెక్కఁ బంతములు నాలిసేయకు
నిఁకనేల
కైమీరినందు కతనిఁ గాఁగిలించుకొవవే
[15–237

ఏల మాతోఁ జెల్లఁబెట్టే వెమ్ములు నీవు
నాలిసేయ కిఁక నవ్వ వచ్చీ మాకు
[17–110

నాలుక కెక్కు
పాలుపొంగినటువలెఁ బాయము మోచితిమి
నాలుకకెక్కినవెల్లా నమలితిమి
[9–267

నాలుక కొనల నాను
నాలుక కొనలనె నానుచు నున్నది
గాలపు నిజమును గల్లయును
[9–105

నింగిమోచిన చేఁతలు
చెంగట మొఱఁగి కలసితివి వేంకటరాయ
నింగిమోచిన చేఁతలు నే నెఱంగనా
[12–26

నింగిమోయు
నిక్కిన కర్ణములు నింగిని మోచిన
బొమ్మలు
చక్క శిరసుఁపై దారఁజూచిన తోఁక
[10–85

నించాఁ బెంచా
నేరమి నేరుపు నించాఁ బెంచా
నేరీతినైనా నితఁడే
[11–2–12

నించు
నించేవు కాఁగిటను నిన్నుఁజూచినవ్వితేను
మంచముపైకిఁ దీసి తా మన్నించేవు
[14–41

నిండిన సంపదవలె....
నిండిన సంపదవలె నెలఁత నిన్నంటితేను
అండ నోరెత్తవేవైతి వదేమయ్యా
[15–23

నిండు కుండ
వేగినంతా నిన్ను నేల వేసరించగు
నీ గతి దప్పకు చాలు నిండుకుండే నేను
[18–22

నిండు గర్వి
నీటున నే నూరకున్న నిండుగర్వి నేననేవు
యేఁటికిఁ గొసర నీ మే లిటువంటిదయ్యా
[18–14

నిండు జాగరము
బొండుమల్లి పానుపుపై-నుండి నన్నుఁ
బాడి పాడి
నిండు జాగరము లుంటిరా-వెంకటేశ
యొండలాయ వెన్నెలలురా
[13–223

నిండు నిధానము
అండనే శ్రీవెంకటేశు నలమేల్మంగనుఁ
గొల్చి
నిండునిధానములై నిల్చినారయ్యా
[7–32

నేర్చినవారికిం వలపు నిండు నిధానము
వేంకటేశ్వరా
[శృం. శ. 82

నిండుబండికిఁ జేట
వేనకు వీడేల యనకుము విడువ
నిన్నింక శరణుచొచ్చితి
నీ సరెవ్వరులేరు వెదకిన నిండు
బండికిఁ జేటవేఁగా
[6–35

నిండు మేఘవర్ణుఁడు
మేకొని నీవే నిండు మేఘవర్ణుఁడవ గాన
నీకు మేఘపు పుష్పాలే పన్నీరు కావు
[

నిండు దానాలు
నేనే స్వతంత్రుఁడ నంటా
నిండు దానాలెల్ల మాని
పూనియిక఼జేయఁబోతే పొంచి యవి నగవా
[8–74

నిండె నిండదను
నిండె నిండదనరాదు నిచ్చనిచ్చఁబ్రకృతికి
కొండవంటిహరిమాయ గురియైన లోకము
[10–193

నిండు నిధానము
దండితోడ నీ మాయదాఁచే యందు
కుపాయము
నిండు నిధానమైన నీపై భక్తే
[7–100

నెట్టనఁ దలఁచేవారి నిండు నిధానమవు
పట్టినవారి చేతి బంగారమవు
[9–219

నిందవాయు
అందుకు హరికథ యను తీర్థంబున
నిండవానె నీ(క నిర్మలమైతి
[10-187

నిచ్చ కల్యాణాలు
వున్నతి శ్రీవెంకటాద్రినుండి లక్ష్మి
దేవి తోడ
వన్ని నిచ్చ కల్యాణాల( బరగినమ్మా
[8-193

ఇంతటి నీ నోము ఫలమేమి చెప్పేదా
కాంతరో యిదె నిచ్చకల్యాణము గాదా
[18-147

నిచ్చ కొత్త పంటలు
సకలధాన్యం నిచ్చ కొత్త పంటలై
రాసులవుచున్నవి
[వై. గీ. 12

నిచ్చకొత్తలు
వీరుబుగ్గతంటిది నిచ్చకొత్తలైనది
పోరచి పంచభూతాల పొరుగైనది
[9-60

యి(టసింట శ్రీవెంకటేశ పంతమిచ్చి
నన్ను
నంటియంటి నిచ్చకొత్తలాయె(బోనా
మనువు
[15-73

నిచ్చన
నిచ్చనలవంటివి నా నిందు(గోరికలు నీకు
హెచ్చిన వలపు తలకెక్క(జేసే యిందుకు
[17-414

నిచ్చనిచ్చ
చెచ్చెరవాసులెక్కించ చెప్పినపనులుసేయ
నిచ్చనిచ్చ నాపెకు నీవు గలిగితివిగా
[17-530

నిచ్చపంట
యెన్న(డు( గల(గవట్టి హితుఁడవు నీవె
వన్నివద్దెవ్వండె నిచ్చపంట నీవె
[16-1-46

నిచ్చ పండుగలు
నిచ్చ పండుగలుసేసె నీతోడి మాటలనె
[17-184

నిచ్చ పెండ్లికూతురు
నిచ్చ పెండ్లికూ(తురనై నేనె నీవై
యుండగ
నచ్చుల నీ మోవితమ్మె నావంతు సేసేవు
[15-264

నిచ్చ బెండ్లి
కొచ్చి శ్రీ వెంకటేశు(డ కూడితివి
అందుకేమి
నిచ్చ( బెండ్లాయను లోనికి నే(గరాదా
[14-165

నిచ్చ సంపదలు
నీ దేవియైన లక్ష్మి నిచ్చ సంపదలు నిండె
ఆదిమై శ్రీవెంకటేశ ఆకె నీ వురాన నిండె
[9-127

నిచ్చళించు
బలిమిగూడ(గా నీవు పైకొంటి విపుడెకాక
తెలుసుకొందమనెంచే తేటపదేవా
నెలవై శ్రీవెంకటేశ నిచ్చళించ నెట్టువచ్చు
కులికెటి నీ వలపు కొల(దే కాక
[17-140

నిజబాన
నెమ్మది(గూడినదాన నిజ బానడుగనై తిని
[17-528

నిజమరి
అయ్యెడ నిజమరి అట్టె వుండక
కయ్యాన( దానేల కల(గినే
[15-254

ఆనలు నీ కేమిటికి నంత నిజమరివై తే
కేనాన నీవే బదికేవు గాక
[17-323

నిజము గల్లలు
నీ శరణాగతి యొక్కటి గలిగిన
నిజము గల్లలకు వెఱపేలా
ఆకల నీ వంతర్యామివి గన అందిన
దేహమె వైకుంఠము
[10-76

నిజము నిష్ఠూరము
నీతో నే మాటాడితే నిజము నిష్ఠూరము
నీ తెరఁగి మాటలెల్ల నీ వాడనయ్యా
[14–85

నిటలపు వ్రాత
కటకటా యేమిటాను కడవరగానఁ డిదే
నిటలపువ్రాఁత యెట్టో నిజము దెలియదు
[8–79

నిట్టచరులు
సర్వదేవతలు మృగజాతులై చరించేకొండ
నిర్వహించి జలధులే నిట్టచరులై నకొండ
[9–182

నిట్టచూపు
నిద్దిరించు మంచేను నిట్టచూపు చూచీని
[17–361

నిట్టచూపు గుడ్లు
నిక్కిన కర్ణములతో నిట్టచూపు గుడ్లతో
మిక్కుటమైన పెద్ద మీసాలతోడ
[9–229

నిట్టతాడు
వెట్టగా రావణురొమ్మువిరుగఁ జేతనే గుద్దె
నిట్టతాడువంటిది వాఁడు నీ బంటు
[11–3–3

నిడిగూఁతలు
నిలువుఁ గాగతో నిడిఁగూతలతో
కొలకొలమని గోవిందుఁడు
[8–142

నిడుద మొక్కులు
అడరి శ్రీవెంకటేశ అన్నిటా గెలుతువు యీ
నిడుద మొక్కులు దొల్లె నేఁడు గొత్తలా
[15–253

నిడుప పగ్గాలు
నిరతితో పట్టునూలి నిడుప పగ్గాలతోడ
యిరవై శ్రీపతి తేరు యేఁగీ వీధులను
[9–221

నిడుప మీసాలు
నిడుప మీసాలతోడ నిట్టూరుపులతోడ
మిడిగుడ్లతోఁ దెల్లని మేనితోడ
[7–44

నిడువుల గూడు
నడవుల హంసల నయన చాతకములు
పడఁతి శ్రీ వెంకటపతి పొదిగె
నిడువులఁ గూడుచు నిన్ను పోఁకించెనని
జడియకుమీ నీ చనవులె మెరసే
[14–7

నిడుసాగు
తరవులనే పెట్టీని తతిలేని యాసలివి
నిరతంపు జన్మములు నిడుసాగఁగా
[9–194

నిత్యకొత్తలు
ఆతుమ దొల్లిటిదే అంతరాత్మ దొల్లిటిదే
నీతితో యీ దేహములే నిత్యకొత్తలు
[8–104

నిద్దరమడలు
పిన్నవాఁడు కృష్ణుఁడు పెద్దవాఁడు రాముఁడు
వన్నె నిద్దరమడలవలె నున్నారు
[8–4

నిద్దిరించు
కద్దుగద్దు నీవల్ల కడమలేమీ లేవు
నిద్దురించు నీగుణము నిన్ననె పో వింటిని
[17–348

నిద్దిరించువాని చేతి నిమ్మపండు
నిద్దిరించువానిచేతి నిమ్మవంటివలెనే
చద్దికర్మములు తానే జారితే జారె
[5–256

నిదులు
నిదుల శేషాచలము నిక్కి పైపైఁ
బొడచూపె
యిదివో కొలువున్నాఁడు హృదయాంత
రాత్ముఁడు
[6–111

నిద్దురగంటెఁ బెట్టు
అద్దమరాతిరివో యమ్మలాలా అయ్యో
నిద్దురఁ గంటఁబెట్టదు నిన్నటినుండి
[12-32

నిద్దుర చిత్తము
వొద్దిక భూమెత్తిన యా యెద్దుకు
నే ముద్దుగాక
నిద్దురచిత్తముతోడి నీకు నే ముద్దా
[11-3-20

నిధి నిధానము
వంచక శ్రీవేంకటేశ వారివారి బ్రదుకులు
నించి నీవేయైతివి నిధి నిధానమవై
[7-124

నీ నామమె మాకు నిధియు నిధానము
నీ నామమె యాత్మ నిధానంజనము
[11-130

నిద్రామందము
కరచరణాదులు గల చైతన్యము
గక్కున బానుపుపై నుండి
సరుగన సడలిన నిద్రామందము
సమకూడీ నరుల కటువలెనే
[11-22

నినుచు
బచ్చెనరూపులు పెక్కువదెచ్చుల వేసినట్లు
నిచ్చల నినుచున్నది నీ మాయ
[6-180

నిన్న నేఁటివారు
మున్నె నీ కొప్పగించితి ముంచిన
నా దేహమెల్ల
నిన్న నేఁటివారి మాటనే వినేనా
[17-445

నిన్న మొన్న
కాకలించ నిన్న మొన్న కాఁగిలించఁ
గలమా
[15-155

నిప్పు లేశైపారు
గోరపు వెన్నెల వెల్లిగొని మీఁద
మీఁద నిప్పు
లేశైపారఁగఁ జొచ్చెనెందు చొత్తమే
[4-16

నిప్పువంటి....
మనసార నీవె నిప్పువంటి బాస
మగువకు నిచ్చివచ్చితి
[16-2-106

నిబ్బరికము
తెలవక చన్ద్రోవఁ దివురిని బిడ్డఁ
బరికించి యింత నిబ్బరికంబు లేదు
[వ. యో. వి. 3-223

నిమిషమేఁడగు
భ్రమయించే విద్దే పదిమారులు
నిమిషమేడాయె నీచేత నాకు
[4-103

నిమ్మకుఁ బులుసు
కలదిగలట్టే కర్మఫలంబులు
నిలిపితిమా నేము నిమ్మకుఁ బులుసు
[5-275

నిమ్మపంట గొనివేయు
రమ్మని చేరఁబిలిచీ రాకున్నాఁ దనచేతి
నిమ్మపంటఁ గొనివేసెనె నన్నును
[17-468

నిమ్మపంటఁ గొను
అమ్మరో పానుపుమీఁద నాకె నీవు
నున్నారంటా
నిమ్మపంటఁ గొని నేము నిన్ను
నేయవచ్చునా
[17-411

నిమ్మపంట వేయు
నిమ్మపంట వేయగాను నిక్కముగా
వచ్చేనవి
నమ్మితిగా యాదవ నారాయణా
[16-2-22

ఉమ్మగిలఁ జిత్తముతో నుడుకుతా
నుండే నన్ను
యెమ్మెలకుఁ జెనకేవు యేరా నీవు
తమ్మిమొగ్గ వాట్లకె తల్లడించేనా మేను
నిమ్మపంట వేసేవు నే నోపఁగలనా
[17–384

పువ్వులనే వేయఁగాను పూచి నిమ్మ
పంట వేసీ
[17–470

నిమ్మపండు అందుకొను
సమ్మతించననఁగను సందడిమాటాడరాదు
నిమ్మపండందుకొంచే నీవే నే నమ్మ
[14–135

నిరత పుణ్యములు
ధరపైఁ దపసుల తపముల చెరచెను
నిరత పుణ్యముల నీరు సేసె నదె
[10–36

నిరుహేతుక దయానిధి
నిరుహేతుక దయానిధివి నీవు
కరుణించు నీకు నొక్కటి విన్నపము
[6–106

నిఱిగొను
నిఱిగొనియె ననఁగ నిండుట
[రేఫ. 85

నిలగు
చలము నీకు గలిగితే సాదించవలెఁ గాక
నిలిగి ముసుగిడుచే నిష్ఠూరము గాదా
[17–195

నిలిచిన నిలువున
పిలిచినంబుల నడ్డపెట్టి యీ బొమ్మ
నిలిచిన నిలువున నేఁడు గైకొనుఁడు
[వ. యో. వి. 4–1220

నిలువ సిడ
మలసి యితఁ డొకఁడు వొడమఁగఁ
గదా యిందరికి
నిలువ సిడలు గలిగె నిధి నిధానములై
[11–3–50

నిలువుకు నిలువున
నిలువుకు నిలువున నీ మోహము
చూచి నేను
బలిమి సేసి పెనఁగితేఁ బసురువేయదా
[15–31

నిలువుగన్నులు విల్లు
అలవడ నంగజం డరుదెంచి పొంచి
నిలువగన్నుల వెల్లి నెరినెక్కు ద్రోచి
[వ. యో. వి. 5–1364

నిలువుఁ గొలువు
వలపుల చెమటల వసంతము చల్లిని
నిలువు గొలువులను నెయ్యము నించీని
[18–299

నిలువున బొంకు
కలదిగలట్టె మాకు తల్లలాడరాదు గాక
నిలువున బొంకు బొంక నీకుఁ జెల్లదా
[17–545

నిలువున నూరు పండు
చెలరేఁగే మంజేతి చిలుకవో వలపు
నిలువున నూరుపండేటి మొలకవో వలపు
[13–212

నిలువు నూరు
నీ రచనల నీవును నిలువు నూరు నిండు
[14–267

నిలువు నూరు వండు
నెలఁత నిన్నుఁ జూచితే నిలువు నూరు
వండేని
యెలమి నీ పుణ్యమిఁక నెంతనఁగ
వచ్చునే
[18–424

నిలువెంత నీఁవెంత
నిలువెంత నీఁవెంత నీ మాయ లివి భువి
బలిమిఁ దెలియువాఁడె పరతత్వ వేది
[11–68

**నిలువెల్లఁ బులకించు**
అలమోహనాంగి చేయంటుటవలన
నిలువెల్ల బులకింప నెనరామతింప
[ప. యో. వి. 4–692

**నిలువెల్లాఁ జేఁదు**
నిలువెల్లాఁజేదే నెరిఁ గొన్ని వృక్షములు
కలదెల్లఁ దీపే కమ్మరఁ గొన్ని
[9–261

**నివురుగాయ**
కులధనములతోఁ జిగురుఁగండె నీ మాయ
నిలువు నివురుగాయ (?) నీ మాయ
[9–58

**నివ్వరి ముల్లంత**
నిలువెల్లా నెంచుకొంటే నివ్వరి
ముల్లంతలేను
బలువుఁడ నీవైతే బ్రహ్మాండము
[8–45

**నిష్ఠూరపరుఁడు**
పనిలేదు నిష్ఠూరపరుఁడు దానై వుండు
తనకుఁదానే కర్త తనమాటఁ గాన
[5–49

**నిష్ఠూరి**
తలవయ్య మమ్మనేల తడవేనయ్య
నెలవైనే నిజమాడి నిష్ఠూరి నింతే
[17–167

రవ్వగా నీవు ముద్దరాలవౌట యెఱఁగరు
నివ్వటిల్ల నాతనినే నిష్టూరి యనరా
[13–70

**నిష్టూరులు**
యిచ్చకమాడేటివారు యిన్నిటానితవరులు
నిచ్చ బుద్ధి చెప్పేవారె నిష్టూరులు
[17–86

## నీ

**నీకు నీకె**
నీకు నీకె తెలుసుకో నీ సుద్దులు
నాకుఁ బొద్దుసేసి నవ్వు నవ్వఁదగునా
[15–63

**నీఁగు**
నీఁగని నామరులిదె నీవు చుట్టుకొనవేల
ఆఁగి నేనే పొట్టువారు లయ్యేఁగాని
[15–152

కాఁగిట నేనించగాను కన్నులు మూసు
కొనేవు
మాఁగఁబెట్టేవు వలపు మతిలో మేలే
సాఁగిన శ్రీవెంకటపతి నన్నుఁ గూడితివి
నీఁగనిరతులు నేఁడు నేరుచుకొంటివా
[17–360

**నీ చిత్తము నా భాగ్యము**
నీ కెటువలసె నటుసేయ నీ చిత్తము
నా భాగ్యము
యేకడనైనా లక్ష్మీకాంతుఁడ యిదియేపో
నా విన్నపము [9–84

నీతోడి వారమా నిను దూరేమా నీ
చేతిలోనివారము నీ చిత్తము నా భాగ్యము
[15–268

**నీటముంచు పాలముంచు**
నీటముంచు పాలముంచు నీ చిత్తమిఁకను
చాటితి నీ కృప గురి సంసారమునకు
[10–224

**నీటమునిగి వేచుట**
ఇలనేఁగ వటినని యీపూపుఁదేనె నీటను
నెలకొని నీవు మునిఁగి వేచేవా
[13–18

**నీటిపై వ్రాఁత**
లలనల జవ్వనాలు లక్కపూసక పురులు
నెలకొని సేసే బత్తి నీటిపై వ్రాఁత
[7–34

నీటిపై వ్రాఁతలా నీరజాసమవ్రాత
లెఱఁగెనా తత్త్వంబు నింతలోన
[సి. శ. 40

నీటిలోన బుగ్గ
నీటిలోన వొకబుగ్గ నిమిషములోనఁ బుట్టి
కోటిసేసి నట్లుండుఁ గొంతవడి
[7–126

నీటుగర్వాలు
యెన్నగ శ్రీవెంకటేశ యిందరినేలేవు నీవే
నిన్నే కొలుచుటగాక నీటు గర్వాలేల
[9–124

నీటుల మిత్తి
నీటుల మిత్తి వన్నెల వేఱువిత్తు
పాటించి చూడ రూపము పాలిమరి
[వ. యో. వి. 2–1093

నీడకన్ను యెండకన్ను
యిదె నీడకన్ను యెండకన్ను మఱి
కదిసి నీయందే కలిగెనటా
[5–240

నీడ దిరుగని చింతాడు
బడిబడి నొసఁగుచు (ను?) బ్రాణచారులకు
కడిమి నీడ దిరుగని చింతాడు
[11–3–108

నీడమాను
మంతన మేమాడుదువు మాఁటిమాఁటికి
నాతోను
మంతుకెక్కిన నీడమానివంటివాఁడు
[14–78

నీడయపోలె వశమగు
నీడయపోలె నన్నిట వశుం డగుచు
నాడుమన్నటువలె నాడుచునుండు
[వ. యో. వి. 3–876

నీడలేని యెండ
నిద్దురలో తెలివంటా నీడలోని యెండంటా
వుద్దువుద్దులై లేని వొద్దిక నున్నారము
[11–3–7

నీడలోపల యెండ
నీడలోపల యెండ నెలకొన్న బంధంబు
గోడపై సున్నంబు కొదలేని యెఱుక
[11–3–38

నీడవంటివాఁడు
యీడనే శ్రీవెంకటేశుఁ డిట్టె నన్నుఁ
గావెఁగా
నీడవంటివాఁడ నేను నేరుపింక నేదో
[9–65

నీడవెట్టు
దట్టపుఁ దమకపు మైదావానలానకు
నిట్టూరుపులె పో నీడవెట్టీని
[12–280

నీదెసఁ జుట్టమా
ఏదిర నాడుకంటసరి యిప్పుడు
నీ చెలిమేనఁ బెట్టితిన్
నీదెసఁ జుట్టమా యదియు నెట్టన
నీవలె నుండఁగానె పో
[శృం. శ. 90

నీరగు
మనసులో పాపబుద్ధి మరి యెంతదలఁచినా
నినుఁ దలఁచినంతనే నీరౌను
[9–88

నీరాటి రేవు
నీరాటి రేవుల బొంచీనమ్మా
నిక్కినిక్కి తానె చూచీనమ్మ
వేరులేక యెట్టు దగ్గు నుదుము
గోవింద కృష్ణరాయని
[16–2–111

నీరాడు వచ్చి ముంత చొచ్చు
వాడాలేదు పీడాలేదు వచ్చేవంటా నీరాకకు
తోడనే యెదురుచూచె తొలఁగ కిదే
యేడగా నాకు నిద్దె యిచ్చకాలాడేవు నీ
రాడువచ్చి ముంతచొచ్చె రారాదలోనికి
[14–214

నీరార్చు
ధావతిఁ దలిదండ్రులు తమబిడ్డల
తనువులఁ బంకములంటినను
యే విధముల నీరార్చి పెంతురటు
యిన్నిట నీవేగతి నాకు
[9–103

నీరాళ్ళ గొంది
నెఱయ మించులతోడ నీరాళ్ళ గొంది
మెఱచెం దళుక్కున మేఘంబుల చెంత
[వ. యో. వి. 4–579

నీరుకొలఁది తామెర
నీరుకొలఁదితామెర నేరిచితేను వలపు
యీరీతి విన్నవించరే యింతులాల పతికి
[18–228

నీరుచందమున నిలువన గరఁగు
నలినశరుండైవ నను( జూచెనేని
నిలువుఁ గరఁగడే నీరు చందమున
[వ. యో. వి. 4–410

నీరుచేయు
ధరపై దవనుల తపములు చెరిచెను
నిరతపుణ్యముల నీరు సేసెనదె
[10–36

నీరుబుగ్గ
నీరుబుగ్గవంటిది నిచ్చకొత్తలైనది
పోరచి పంచభూతాల పొరుగైనది
[9–60

నీరువంక తుంగ
కదిసి చేకూరితేను ఘనమై హర్షించు
వెద నీరువంక తుంగ విధమాయె మనసు
[11–122

కోరికలు మించినట్టి కొలని నఖులచేత
నీరువంక తుంగైనవి నీ గుణాలు
[14–151

మేరమరినవ్వరాదు మెలుఁతనుదూరరాదు
నీరువంక తుంగవలె నీ వున్నాఁడవు
[14–179

నీరువంక పొలము
నిండినట్టి మడుగుల నీరువంక పొలము
కొండలు మోఁచిన పెద్ద గొబ్బరపుఁ
బొలము
[10–52

నీళ్లునములు
నీళ్ళే నమలేవు నీ లోనె సన్నల
వేళ్ళే చూపేవు వెలుపలికి [4–58

నీవు నీళ్లు నమలితే నిండెను వేదములు
యీవలఁ దలెత్తితేనె యింద్ర పదవులు
మించె
[6–156

# ను

నుగ్గాడు
పక్కన జరాసంధు బలమెల్ల నుగ్గాడి
నిక్కము మధురము నిల్పె నీచే గద
[9–145

నుగ్గు నూచంబగు
నుగ్గు నూచంబులై నుఱుములై జడిసి
కగ్గులేముగ్గులై కకపిక లగుచు
[అ. మ. క. 4217

నుగ్గునూచంబు
దిగ్గనంజొచ్చి యేత్తెర వీరవరులు
నుగ్గునూచంబుగా నురుమాడఁ దలఁచి
[వ. యో. వి. 6–346

నుగ్గు నూచము సేయు
ఎగసి రాక్షసబలం బిట్టటుగాగ
నొగల కేతువు నుగ్గునూచంబు సేసి
[ఉ. క. 957

నుడుగులు దప్పినాను నోము ఫలము
దప్పదు
అడిగిరావె విభు డందు కేమనీనో
యెడయని బాస నీ కిచ్చినాఁడు
నుడుగులు దప్పినాను నోము ఫలము
దప్పదు
కడవి యింతటినైన దగ్గరి రమ్మనవే
[15–22

నుద్దము
నెట్టన నుద్దాలుమెట్టై నిలుచుండి తమకము
మెట్టుక నెరపేఁగాని మీఁదుకిం దెరఁగదే
[17–240

నున్నని సుద్దులు
పేరు నారాయణుఁడవు బెంబాడిచేతలు నీవి
నోరు మూసుకొన్నఁ బోదు నున్నని
నీ సుద్దులు
[6–162

నున్నని మాటలు
అన్నియుఁ జదివితిఁగా ఆహా నేను
నున్నని మాటల నోరు నుడిగెదదేదో
[9–65

నుయ్యో కొండో
నిక్కము నాతనికింక నేనేలె నీవు
నొక్కకువే నా చెక్కు నుయ్యో కొండో
[12–340

నుఱుపు
నుఱిపిరి పావములన్నియు నుగ్గుగ
నిటు తూర్పెత్తిరి
వెఱవము వెఱవము కర్మపు విధులిఁక
మాకేలా [9–79

నులిపచ్చి పయ్యెదకొంగు
పనుపడ నులిపచ్చి పయ్యెద కొంగు
మొనల నానిన కుచముల నొప్పుదాని
[ప. యో. వి. 4–633

నులివెచ్చ నూర్పు
నులివెచ్చనూర్పి కన్నులకెంపు నెఱయఁ
దలఁపున నెలకొన్న తాల్మివో విడిచి
[ప. యో. వి. 529

నులివెచ్చమాటలు
నులివెచ్చమాటల నొవ్వనామనమునోఁకఁ
బలికేవదేల బట్టబాయిటను [4–96

నులివేఁడి
బలుపైన బొట్టమీఁది పాల చాఱలతోడ
నులివేఁడి వెన్నదిన్న నోరితోడ
[4–1

## నూ

నూఁగురులు
నున్నని గోరుదీసి నూఁగురుల కొప్పు దీసి
యిన్నినే రట్టు సేసితే నేమిసేసేవే
[14–73

నూఁటికి సెలవు
నూఁటికి సెలవు గాఁగ నూలిపోఁగే
యందురు
యేఁటికి మాఁటలెల్లా నిందులోనే వున్నవి
[17–435

నూరార్చు
ఓర్చి ప్రియంబు వల్కుటకు నొద్దిక
తోడఁ గరంగిమాట నూ
రార్చి పెనంగు నవ్విభుని నక్కున
జేర్తురు గారవంబునన్
[శృం. శ. 82

నూరిపోయు
పామరులఁ దనమీఁది పాటలెల్లాఁ
బాడుమంటా
భూమికెల్లా నోర నూరి పోసినవాఁడు
[11–3–55

నూరునిండు
నోవితోడఁ గంసునికి నూరునిండెఁ
జూడఁగానె
చేవలు మీరినయట్టి శ్రీజయంతినాఁడు
[8–258

నూరు పండు
బలిమి యెవ్వరిదో వనులు దాదాత మోచె
నిలువు నూరువండీని నీమేని పులకలు
[14–66

నూరు వండు
నిలువు నూరు వండేని (?) నిచ్చలు
నీ దేహమైతే
వొలసీ దుఃఖములకు నోరువలేదు
[8–248

నూరూఁ బండు
వెలయ నాతఁడె నిన్ను వెల్లివిరిగాఁ గూడె
నిలువు నూరూఁబండె నీకేలె వెరపూ
[17–335

నూరేండ్ల బ్రతుకు
వరగ నూరేండ్ల బ్రతుకునకే కా
ధర నన్నియును గూర్చి దాఁచుకొనేది
[9–271

నూఱు బండు
మీఱు జవ్వనము క్రొమ్మినిమితో నిల్పు
నూఱుబండెడిని గన్నులఁ దన్నుఁజూడ
[ప. యో. వి. 4–406

# నె

నెంజరివి
వాలుకరెప్పలువంచి వడిఁదప్పక చూచేవు
వోలినిందాఁక నేడనుంటివంచేను
తాలిమి లేనప్పటిని తగఁ గసరుకోనేవు
యేలని నెంజిరివింక నెంతటాఁ దీరదురా
[17–345

నెక్కొను
చెక్కులఁ జెమటవుట్టె చింతతోడనిగ్గులను
నెక్కొని రానికోపాన నిట్టూర్పు వుట్టె
[14–15

నెటికలుదీయు
సిగ్గులు వదుతా నీ చేతి నెటికలు దీసె
అగ్గమై నీ లోని యాయాలు ముట్టెనా
[18–359

నెటుకలు విఱచు
నివురుచు సొగసుగా నెటుకలు విఱచి
సవరగాఁజే పరుసన మించకుండ
[ప. యో. వి. 3–1216

నెత్తి మాసారు
నెత్తిమాసారని నెత్తురుకందు
తిత్తటి నను నాజి నీల్గింత మనుచు
[అ. మ. క. 3085

నెత్తిమీఁది చిచ్చు
మిత్తివలెఁ జెల్ల రేఁగి మీఁదఁ
గానే యెండకంచే
నెత్తిమీఁది చిచ్చుగదా నీడలోని యెండ
[12–198

నెత్తురు గుండాలు
పైపై నితఁ డడుగిడ పాతాళానఁ
[illegible] గుంగుదురు
కోపించినంత నెత్తురుగుండాల పాలౌదురు
[8–186

నెత్తురు నీరు
వాలి నెత్తురునీటను వాఁడి పదనిచ్చినమ్మ
కూలిచె నొక్కమాటునఁ గుంభకర్ణుని
[8–133

నెత్రు పట్టము
ఆనవడి వరదాన మడిగిన బొలము
బొనలతోఁ గడునెత్రు పట్టమైన బొలము
[10–52

నెప్పున చేయు
యిప్పుడే శ్రీవెంకటేశ యిటు
నిన్నుఁ గొలువఁగా
నెప్పున నేఁ జేసినట్టి నేరములెల్లా నడఁగె
[6–61

నెప్పు
తప్పక చూచినవాఁడు తలవంచుకొనవేవే
నెప్పుదాఁక గురువేసి నేఁ గాననీనా
[14–2

అప్పటి నన్నె కొపరినది వో ఆపె
నెప్పున నన్నిపనులు నీకె తెలుసును
[15–223

నెప్పున దాఁచగనేల నిన్నుఁ బాయలేనంటి
యిప్పుడిట్టె విచ్చేసితి వియ్యకోలా నీకు
[17–115

నెప్పున నీ మహిమకు నేనె తారుకాణ
చెప్పెనేల నిఁకవేరె చేసి చూపఁగాను
[7–116

కప్పురపు బాగాలు కట్టివేసితి నీపై
నెప్పున నందుకొంటివి నిచ్చెనెక్క నీవూ
[17–137

నెమరువెట్టు
నీరాని నెమ్మది నెమరు వెట్టుచును
జేరువ గుమురుగాఁజేరి ధేనువులు
[అ. మ. క. 3210

నెమలి చుంగులు
నెలఁతల కనుదిష్టి నెమలి చుంగులై
యుంచె
వలఁబెట్టి చలపట్టు వద్దనవే
[15–97

నెమలి నడపు
నెమలి చుంగులవాఁడ నిలునిలురా ఆ
నెమలి నడపులెల్లా నీకు లేదచే
[15–108

నెమ్మెలు ఆఁడు
నీవే జాణవైతే నిన్ను మెచ్చేను
ఆవల నెమ్మె లూరక ఆడుకోకువే
[13–125

నెయ్యము దియ్యము
తన భక్తవరుఁ బరాంతకుఁ గేలఁజూపి
యనియె నెయ్యమునుదియ్యమును రెట్టింప
[ప. యో. వి. 7–18

నెరజాణఁడు
చూచిన మోహపుఁ జూపులఁ
జురుచూడ్ల కెదమియ్యని
రాచఱికపు నెరజాణఁడు రసికుం
డాతఁడెపో
[5–132

నెరపరికలు
పొరపొచ్చెమెట్లుండు పొలయలుక
లెట్లుండు
నెరపరికలెట్లుండు నెఱుకలెట్లుండు
[4–27

నెరవాది
ఇయ్యకొంటిగానీవే యిందుకేమి
నెయ్యపు మాటలకెల్లా నెరవాది తాను
[13–72

నెరవాదితనము
పైకొని కొంగువట్టితే బలిమి నుసురనేవు
నీకు నీకే తెలుసునే నెరవాదితనము
[15–2

నెరసులెంచు
నిర్మితము నీదింతే నెరసు లెంచఁగనేల
ధర్మమందు నింక గజదంత పరీక్షేఁటికే
[5–322

నెరివిరి
నిదురమోముతో నెరివిరి గుండఁగ
గుదిగొనిఁ బైకొనఁ దగవా
[17–156

నెఱజాణఁడు
అంగనలాల మనచే నాడించుకొనెఁగాని
సంగతెఱిఁగిన నెఱజాణఁ డితఁడే
[5–279

నెఱమంటల పిల్లలు కత్తి
మానిసిదిండ్ల మొత్తు నెఱమంటల
పిల్లలకత్తి వేల్పు పెన్
బోనపుముద్ద నిద్దముల పొల్పు
దొలంకెడు సంకుఁ గలు
[శ్రీ. 16

నెఱిగుజ్జు మెడ
నిడువెడఁదగు వెన్ను నెఱిగుజ్జు
మెడయుఁ
గడుదొడ్డ పిఱుఁదు చక్కని ముద్దు నడలు
[ప. యో. వి. 2–539

నెలకట్టు
నిగనిగం దళుకొత్తు నెలకట్టు క్రింద
జిగివిభూతి ద్వియచిత్రితంబగుచు
[ప. యో. వి. 269

నెలవరి
వాసుదేవ నీవు నెలవరివి మగుడనేల
యీసరి నీవద్ద నుండే యె(నెః)ట్టైనఁ
జేయవయ్యా
[10-143

నెలవుకొను
యీతల శ్రీ వెంకటాద్రి విటు విజనగరాన
నీతితో నెలవుకొని నెగడితివి
[10-274

నెవ్వదీరు
నెవ్వదీర నిదె నిను విశ్వరూపుఁ
డెవ్వల నని శ్రుతు లెంచీఁగాక
[11-123

నెళనెళన విరచు
నెళనెళన విరిచె నిక్కి వాని యెముకలు
పెళపెళనారిచి పెచ్చుపెరిగె హరి
[11-218

# నే

నేమస్తుఁడు
యిట్టె వదిలితేను యెండై నాఁటారు మనసు
కట్టుకనేమస్తుఁడైతే కైవసమై యుండును
[

చెంతల నేఁబిలిచితే చేరి వూరకున్నాఁడవు
వంతముదప్పేనా పలికితేను
యింతలో నేమస్తునిగా నెవ్వతె సేసెనో
నిన్ను
నంతోసించేగాని ఆ సతిఁ జూవరాదా
[13-104

నేరాలెంచు
నిర్మించి శ్రీవెంకటేశ నేరాలు నన్ను
నెంచుక
ధర్మము దలఁచి నీవే దయఁజూడవే
[8-177

నేల దలకిందు చేయు
మూల నిధానముగని ముందుగానఁ
దొకయోగి
నేల దలకించుసేసి నిక్కు నొకయోగి
[6-125

నేల మిన్ను నొకటగు
నేల మిన్ను నొకటై నిలుచున్నరూపుతోడ
పాలువడి మెరసీని ప్రత్యక్షదైవము
[11-64

నేస్తము సేయు
ననిచి నేరమా నా నేరమింతే కాక
నిను దొరవని నమ్మి నేస్తము సేసినది
[16-2-69

# నొ

నొచ్చమను
అన్నిటా నేనే మఱి యప్పటిమాఁటేయంచు
నన్నల నన్నందుకు నొచ్చమని దూరకుమీ
[6-177

నొప్పులు సేయు
పొడవుఁ జందురుఁడు నొప్పులు
సేయు విరహులను
పెడమొకము చేసి నొప్పించేవు
[4-111

నొసలివ్రాత
మొగి సురలకు మేలు ముంచి
దైత్యులకుఁ గీడు
తగిలి నొసలివ్రాఁత తప్పదిది తొల్లి
[10-5

## నో

నోటి చదువు
ఆదికాలపు వైష్ణవులందరి నోటిచదువు
గాదిలి నారాయణాష్టాక్షర మిదియే
[10-33

నోటి విన్నపములు
కోటులైన వేదములు కోనాడీ
విన్నందులోన
నోటి విన్నపము లొక్క నువ్వుగింజంతె
[8-42

నోరఁ జిక్కించి నుడుగు
జిగి నీనామము నోరఁ జిక్కించి
నుడిగేదేమి
మగుడి శబ్దాక్షర మంత్రరూపుఁడవు
[7-222

నోరారఁ గన్నుల విను
యీడుగాని చెలినన్ను నేమేమో ఆడఁగాను
వేడుక నోరారఁ గన్నుల వినేవు నీవు
[17-409

నోరు నిండా నుతియించు
ఆరసి పెద్దలనన్ని నడుగుచుండఁగవలె
నోరునిండా నుతియించవలెను
[8-228

నోరు మూసుక మొక్కు
ఊరకే మూసుక వొంటి నీకు
మొక్కేమయ్యా
చేరి నారాయణ నీవు చేసినట్టు సేయవే
[10-230

నోరుబారు
కెరలి తరువఁగ నరుదుమీఱఁగ
సురల దొరలకు నోరులూరఁగ
[శ్రీ. 3

నోరూరు
నొక్కుచు మోవియ్యగానె నో రూరెను
[14-159

నోళ్లు దెరచు
యీకడ నచ్యుత మరఁగు చొచ్చితిమి
యెన్నటికిని నాశములేదు
యేకొఱఁతనియిఁక నానవడుచు
నే మెవ్వరికి నోళ్లు దెరచెదము
[9-82

## ప

పంగించి చెప్పు
కొంగుపట్టి తీసితేనె గొబ్బున లోనౌదువు
పంగించి చెప్పు నీ కొక్కపాటి వున్నదా
[15-175

పంగించు
జూటుఁదనాలవాఁడవు సుగ్రీవ నారసింహా
పాటించి నిన్ను నేము పంగించే వారమా
[10-164

యెంగిలి మోవితోడ నేమి మాటలాడినాను
పంగించె యెంతైనా నంటు
పాయదంటాఁ జుమ్మీ
[14-249

ఏల వేగిరించేవు యిట్టె నిన్నుఁబంగించి
మేలిమి చేఁతలుచూపి మెప్పించెఁ జుమ్మీ
[15-253

చెలిమి నీతో నింకాఁ జేయవచ్చితేఁ గనక
పలుమారు నీ వప్పుడు పంగించరాదా
[17-234

అనుక శ్రీ వెంకటేశుఁ డలమేలు మంగఁ
గూడె
పానిపట్టి యింతలోనె పంగితమిపుడు
[17-301

నిన్ను నేఁగూడినరతి నేరుచునా యెవ్వతైన
పన్ని నిన్ను నేనిట్టే పంగించఁగాక
[17-368

పంగు
అంగన విరహవేళ నాయిటిగాలై పూర్వు
వెంగలితనాన నట్టె విసరఁజొచ్చె
పొంగుచుఁ దూరుపెత్తంగఁ
బోరివారె నివ్వెరగు
పంగులఁ గోరువట్టు నీ భాగ్యము
కొలరయ్యా
[17-442

పంగెనలవారు
యెంచుకొంటే నిన్ను నన్ను నెంతకెంత
వంచబాణుని బలము పంగెనల వారము
[18-291

పంగెమగు
కాలమునడపి పూర్వుగాలిఁబుచ్చేబదుకు
పాలుమాలే యింద్రియాల
పంగెమాయ బదుకు
[7-163

పంగెము
అవల నిశ్చలబుద్ధి అదియేడ నేనేడ
భవము చంచల మనసు పంగెమే యెపుడు
[7-174

జక్కవలె చన్నులై జంట వాయకుండఁ
గాను
పక్కనఁ గొండలతోడి పంగెమేటికే
[13-166

పంగెమైన వాఁడు
పాయపు మదములకు పంగెమైన
వాఁడను (?)
యీయెడ నీ వాఁడనని యెట్టుగొలిచేనయ్యా
[7-246

పంచగాల వేలములు
అంచెలశ్రీవెంకటేశుఁడనే బోయనాయఁడు
పంచఁగాల వేలముల బలుబోయనాయఁడు
[5-285

పంచదారిడినఁ జేదు
చేరి పంచదారిడినఁ జేదు దెచ్చి పెట్టినాను
ఆరగించి తనివొందే యతఁడే సుఖి
[5-309

పంచబంగాళము
పారిరి దానవులెల్లా పంచబంగాళమైరి
తూరిరి గొందులెల్లాను తుత్తుమురై విరిగి
[10-21

పంచబేరములు
పరగి నీ ముందరను పంచబేరములుండఁగా
గరిమఁ జక్రము నీకుఁ గాపై వుండగా
[7-130

పంచబేరములకుఁ బ్రణుతిగావించి
పంచి పాత్రములఁ దప్పక విలోకించి
[వ. యో. వి. 4-1169

పంచలఁదోయు
బహుసంసారములెల్లఁ బంచలఁ
దోసినవాఁడ
సహజపింద్రియముల జారినవాఁడ
[9-22

పంచల నిధానము
హరికృపాధనముచేనబ్బిన
మహాత్ములకు
సరకుగాకుండు పంచల నిధానములు
[6-114

పంచలవేయు
యెంచగా నాపె నీకు హితవరుగాలు గాని
పంచలవేయఁగ నీకుఁ బగవారమా
[17-515

పంచినపాళ్లు
యెంచగ శ్రీవెంకటేశు దాసులకు
బంచినపాళ్ళఁ బరగిన దొకటే
[10-16

పంచేంద్రియ పదిలములు
కడుపునిండితే ఘనమై నిండును
బడిఁ బంచేంద్రియ పదిలములు (?)
[10-213

పంజ
వుదయచందురుఁజూచి - అదె నీ పంజని నవి
యెదురుకోనే వచ్చితిరా - వెంకటేశ
బెదరి మారుమోమైతిరా
[13-223

పంటుముద్ర
పండువంటి మోవికేలే వచ్చి లక్కముద్రలివి
పండిన పంటకే కావా బలుముద్రలు
[13-38

పండఁబడు
యిలనేఁ బండఁబడేవి యీశ్వర నీకు మొక్కలే
తలఁచే నా తలఁపెల్లా దామోదర నీ ధ్యానమే
[6-201

పండితనాయం
బడిబడి నీవు చెప్పే పండితనాయానకు
తొడిఁబడు నెవ్వతైనా తుచ్ఛమాడకుండునా
[16-2-77

పండిన పసిఁడి
అందనున్న హరి నాత్మ దలఁచిన
పండిన పసిఁడే బ్రతుకరో ప్రజలు
[11-3-85

పండిన మనసు
అంద నిన్నిటాఁ దనిసి యాసలెల్లాఁ దెగఁగోసి
పండిన మనసువారు ప్రపన్నులు
[5-287

పండి పొల్లవోవు
తల్లడించి పడనేల దైవము దూరనేల
చెల్లఁబో నేఁడే పండిపొల్లవోయెనా
[11-2-50

పండి రాసులగు
నిండెను లోకములెల్ల నెరి నితని కరుణ
పండిరాసులాయఁ గీర్తిప్రతాపము లెల్లను
[11-3

పండుగమొక్కు
నీడనుండె అలసీని నిలుచుండె కలసీని
పాడితోడనె మొక్కరే పండుగమొక్కు
[15-213

పండు గాయసేయు
ఎండలోని నీడ యీ మనసు
పండుగాయసేయఁ బనిలేదు మనసు
[11-3-125

పండ్లగోల
బెట్టుగానొకచేతఁ జూపెడి తన ప్రతాపము
పట్టుకున్నాఁ డొకచేతఁ బండ్లగోల
[8-232

పెక్కుపండ్లగోలలు పిడికిలించినవాఁడు
మిక్కిలి లంకసాధించి మించినవాఁడు
[9-230

యెడమచేతఁబట్టె నిదివో పండ్లగోల
కుడిచేత రాకాసి గుంపులఁ గొట్టె
[10-167

పండ్లఁ బెట్టుకొను
పాని నీపై మచ్చరము పండ్లబెట్టుకొటీతేను
మోనాన వాండ్లెక్కి నీమోవిమీఁదనిండెను
[14-221

పంతపు వుబ్బు
పంతపు వుబ్బు మానితే పరమాత్ముఁడు తోడౌను
వింతలు దలఁకొంటే విశ్వరూపమే
[8-152

పంతనము
పవ్వళించేవేమే నీ పంతనాలో పొంతనాలో
యివ్వల శ్రీవెంకటేశుఁ డెదమియ్యగాఁ
[17-341

పంత మిచ్చు
వెన్నడించి సూడువద్దే విష్ణుమాయ
నీకు నేము
యిన్నిటా బంతమిచ్చేము యింకఁగావరో
[6-40

సవతి మచ్చరమున సతులదూరితి నేను
పవళించనేల నీకుఁ బంతమిచ్చేమయ్యా
[24-216

పంతసు చెరచు
పంతము చెరచి వాఁడు పానుపుమీదికివచ్చి
యింత సేయలేని వలపేటికమ్మా
[4-21

పంతియ
అంత రెండవయోగి యతనిపైఁ బ్రేమ
పంతియ మితిలేని భక్తియే చమురు
[ప. యో. వి. 882

పందెమేయు పసురము
బట్టబయటఁ దోలితేను బందెమేయుఁ
బసురము
పట్టిమేపితేను తన పనులు సేయు
[7-107

పంపుచేయు
కొచ్చిన శ్రీవెంకటేశు కొలువుడు
బంటు నింతే
వచ్చియింద్రియాలకెల్లాఁ బంపు సేసేను
[7-193

యింపుల శ్రీవెంకటేశ యిదె నీ దాసులవి
పంపునేసి బ్రదికించె ప్రపన్నసుగతి
[8-32

తగు శ్రీవెంకటేశ్వరు దాసుఁడై గెలిచితేనే
పగటున నివియెల్లాఁ బంపు సేయకుండునా
[8-273

దాకొని శ్రీవెంకటేశు దాసుఁడైన వానికిని
యేకముగఁ బంపు నేసు నేమి మాయోకాని
[10-134

తొరలిన యింద్రియాలఁ దోసిపోవ
నెట్టు వచ్చు
సిరుల నేలిక వంపు సేయు టింతేకాక
[10-248

శ్రీపతి పంపిటు సేసితి మింతే
తాపి మమ్ముఁ దగులఁ దగవేది
[10-254

సూటినీవు దలఁచితే సురలు పంపునేసిరి
చాటితేనే నీపేరు జవమాయను
[10-280

పంపుఁజేయు
పంపు నాకుఁ జేయదు భవమది నాదైనా
తెంపున కర్మవీధులఁ దిప్పేఁగాని
[10-58

పంపుడు దయ్యము
పంపుడు దయ్యమై బాధఁబెట్టెడు యాన
కొంపలోన నుండనీఁ గోరినా
[5-129

పంపువెట్టు
కాకాసురు వేసిన కసవే రావణుమీఁద
నాకడఁ బంపువెట్టితే నప్పుడే సమయఁడా
[7-81

పంచేంద్రియములు నాపైఁ బంపు
వెట్టితివి నీవు
యెంచి వానినే దండించే దిది
నేరమౌఁ గాదో
[8-20

పంపువెట్టి దండంపిన బలు నీ వుద్యోగాల
గుంపు గూర్చి ముక్తి చూరగొనరాదా
[8-217

పంబి
అంబరాననున్న ధ్రువునజ్ఞానమెల్లఁబాపె
పంబి నీచేతనుండిన పాంచజన్యము
[9-145

పకపక నవ్వు
మొక మొకమెదుటనె ముంగోప మింకనేల
పకపక నగుతానె పంతమిచ్చె నాతఁడు
[17-385

యీయెడ శ్రీవెంకటేశ యిట్టె నిన్నంగన గూడి
పాయపు మదముతోడ పకపక నవ్వెను
[17-395

పక్కన జన్మాలు
పక్కన జన్మాలనెల్లాఁ బాటువడేదెల్లాను
యెక్కడో సంసారాన కిందుకింతే కా
[6-69

పక్కనఁ బొడచూపు
చెక్కుమీటిపాలువోయ చేరినోరుదెరచితే
పక్కనను బొడచూపే బ్రహ్మాండాలు
[10-237

పక్కున మొక్కు
పక్కున మొక్కేరా నీవయిఁడి కాళ్లకు వోరి
అక్కతోఁ జెప్పేఁగాని అందుకొనే రారా
[6-14

పగ గెల్చు
యేలికకు ధనమిచ్చి హితభోగా లందేరట
కేలఁగత్తి పూని పగ గెల్చేరట
[7-30

పగటు
పలుమారుఁ బెనఁగక పదవే నీవు
నిలుచున్నాఁ డెదుటనే నీకెంత పగటే
[17-171

పగటుఁ గోవెల
పగటుఁ గోవెలమించి పాఱిడా సతిపలుకు
జగడమునఁ బికిఁబాసి సన్నగిలెఁగాక
[4-7

పగటుమేలము
పగటుమేలము చాలు పదవోయి నీకేమి
తగులువీరికాఁడవు దక్కివద్దే వుందువూ
[17-465

పగ చేసుకొను
పగసేసుకొన్నవాఁడుఁ బలుమందసము లోన
వెగటు జాగరముల వేగించినట్టు
[8-107

పగపాడు
పగపాడే చూచుచుండ భాగవతులను హరి(?)
తగిన పుణ్యులనిందు తప్పులెంచవచ్చునా
[8-245

పగలగు
ఎడయక తిరువెంకటేశుఁ దలఁచని వాని
అడరుబుద్ధులు పగలేఁబో లోలోననె
[5-143

పగ్గాలు పట్టితీయు
పరగు వేదరాసులే పగ్గాలువట్టి తియ్యఁగ
సరుగ దుష్టులఁగొట్టి జయము చేకొనెను
[8-122

పచారము
సరి సంసారము సంతల కూటమి
సొరిదిఁ బచారము చూపే దిది
[11-21

పచారాలు
విచారించుకోరో యిది వివేకులాల మెండు
పచారాలు చూచి మీరు భ్రమయకురో
[8-241

పచారించు
విచారించుకొనేవారి వివేకాల కొలఁదులు
పచారించి వున్నవెల్ల భావన మాత్రములు
[10-30

అడరి యెవ్వతో యింటి కరిగేవేళ విభుని
వడిఁ జేపట్టి తీసితే వచ్చీనటే
బడి నేయరిగి యాకెఁ బచారించియానవెట్టి
కడు బలిమిఁగూడినఁగాక నీఁడబ్బునట్టే
[13-165

చెలిపంత మేమాడినా చెల్లించగ వలదా
బలిమి నీ వింతలోనే పచారించవలెనా
[14-98

అలరి విన్నాపెచూచు నా వెనుక
నేనుఁజూతు
బలిమిదెలియక నేఁబచారించఁగాని
[14-115

చెంతలనే నిన్నుఁగూడె శ్రీ వెంక
టేశుఁడు లోలో
బంతినే మోవి తీపులు పచారించవమ్మ
[14-135

బాసలు నీ విచ్చినవి పచారించ వచ్చెనా
[14-213

పచ్చగందు
పచ్చగందని పడుచఁబడఁతి నేను నే
డ(వః)చ్చి వేసినట్టి వనితనె కదవె
[4-105

క్రమము తప్పక పచ్చగందక తెచ్చి
యమృతోపమానంబులైన శాకముల
[అ. మ. క. 6293

పచ్చలకోలపులు
బచ్చనరూపెలు పచ్చల కొలపులు
విచ్చల నిచ్చల నెయ్యములు
[5-24

పచ్చారు
యిచ్చగించి యేపొద్దు యీపె చన్నుఁగవకే
వచ్చారేది యెఱఁగ మా వంతగాఁడా
[13-141

వలుమారుఁదన్నుఁజూచి పచ్చారుకంటేను
తలవంచుక తనముందర నుండుటే మేలు
[18-109

పచ్చికపట్టు
పవిపకి గొల్లవాఁడు పచ్చికపట్టునఁబసుల
తవియగ నిల్పినిల్పి తానే మేపినట్లు
[7-109

పచ్చిగచ్చు మేను
యెచ్చరికతోడ వేంకటేశు దాసులఁగూడి
పచ్చిగచ్చుమేనితోడ భయమెల్ల బాయుఁడు
[5-102

పచ్చిగరికె కాలము
పచ్చిగరికె కాలము ప్రపంచములో బ్రదుకు
తచ్చిచూచెటి సూత్రము తన జ్ఞానము
[10-24

పచ్చిచేయు
మెచ్చితి బళిరా వోరి మేటి జాణ నిన్నుఁ
బచ్చి చేసేదింత నీకుఁబంతమా లోకాననూ
[12-62

పచ్చితనానఁ దిరుగు
వచ్చితనానఁ దిరిగి వండవద్దా చిత్తము
గచ్చులఁ దాఁ గనుఁగాయే కలకాలము
[9-147

పచ్చితిట్టు
పయ్యెదపై జెయివేసి పచ్చితిట్టు దిట్టితేను
నెయ్యమునఁ గరఁగితి నిదేమో గాని
[15-147

పచ్చిదీరు
బచ్చెన చేఁతల నిన్ను భ్రమయించే
దానఁగాను
పచ్చిదీర నాకిచ్చిన బాసలు నీచేతివి
[18-10

పచ్చిదేర నవ్వు
విచ్చన విడిని శ్రీవేంకట నారసింహుఁడు
పచ్చిదేరనట్టే పకపక నవ్వి
[11-210

పచ్చిదేరు
పచ్చిదేరుచు నుట్ల పండుగాయను
గచ్చులకు గొల్లెతలు కొఁగిలించి పట్టఁగా
[8-150

అలిమేలుమంగ నీయకుక్కమీఁదనిలువఁగా
బలిమి శ్రీ వెంకటేశ పచ్చిదేరేవు
[18-136

పచ్చి నవ్వు
పయ్యెదమఱఁగునసే పచ్చినవ్వు నవ్వనేల
చయ్యనఁగూడి మోవి చవిచూపవే
[18–382

పచ్చినెత్తురు
పగఁగొని మానక పచ్చి నెత్తు రెప్పుడును
తెగికొనుఁ దానె తి త్తి తి త్తి తి త్తితి
[11–3–54

పచ్చి పాపాలు
పచ్చిపాపా లణఁచ నీ ప్రసాదమే చాలు
యెచ్చుకొందు వుపాయాలు యిఁకనేల
వెదక
[7–243

పచ్చిపాలలోని వెన్న
పచ్చిపాలలోని వెన్న పరమాత్ముఁడు
బచ్చన వాసినరూపు పరమాత్ముఁడు
[5–235

పచ్చిపోక
అది సోఁక నొక కాంత యదరంటి కాఁక
యెదసోఁకఁ గోసి జయ్యెన పచ్చిపోక
[శ. క. 267

పచ్చిమీఁద పచ్చి
కలయునీపతివచ్చె గక్కున నిన్నిదెమెచ్చె
పలికీని చిలుకలు పచ్చిమీఁదఁ బచ్చి
[15–16

సోఁకనన్నమానదు నాసోగయే నేమొకాని
పైకొని నీ పచ్చిమీఁదఁ బచ్చిదగునా
[15–64

పచ్చి యింద్రియాలు
కొచ్చిన శ్రీ వెంకటేశు కొలువుదు
బంట నింతే
పచ్చియింద్రియాలకెల్లాఁ బంపు సేసేను
[7–193

పచ్చి వడఁగండ్ల గుళ్లు
పడఁతుల వేడుకలు పచ్చివడఁగండ్ల గుళ్లు
కడుమోవితీపు చింతకాయ కజ్జము
[7–34

పచ్చి వెచ్చి
మచ్చిక నాతఁడు నేఁడు మా యింటికి
వచ్చెనంటా
పచ్చిగొంతా వెచ్చిగొంతాఁ బలికేవేమే
విచ్చనేఁ గాఁగానె కాక నీచేత మరొకతె
పచ్చివెచ్చి రోఁతల బడఁబోయినా
[17–215

పఁఐకుఁ బంతాలలోని పచ్చివెచ్చి వెంగేలు
వెలయించీ నీకె చేత వింటేరటే చెలులు
[18–328

పచ్చివెచ్చి చదువులు
నిచ్చలుఁగోరిన యంతే నిజమైనలోకము
పచ్చివెచ్చి చదువుల భ్రమయఁగ నేలా
[10–220

పచ్చివేఁడి
నగవులోపలి యలపునంపైన పొలయలుక
పగటు లోపలి వెరగు పచ్చివేఁడి
[4–70

పచ్చివొళ్లు
పచ్చివొళ్లు మోచితిమి పాపమెల్లాఁ
జేసితిమి
హెచ్చినమీఁద సుద్దులేఁటివో కాని
[9–243

పచ్చిసతుల వలపు
తచ్చి విషము మింగితే తలకెక్క
కుండునా
పచ్చిసతుల వలపు భ్రమయించకుండునా
[8–273

పచ్చిసేఁతలు
పయ్యెద చెరఁగుజారఁ బచ్చిసేత
లిన్నియును
ముయ్యఁజూచీ నిటువంటి మోహ
మెందుఁ గలదా
[12–327

పచ్చిసేయు
భజనమెరయ నన్నుఁ బచ్చి సేసేవు ఇంత
గజరుఁజేఁతల కోపఁగలనా యిఁకను
[12–242

అకటా నావంటి మంకులైన చెలులైతే నిన్ను
పకపకనవ్వి నిన్నుఁ బచ్చిసేయకుండరు
[18–20

పచ్చీవెచ్చీ
పగలూరాతిరీఁగాని పటుసంధ్యాకాలమందు
మొగిఁ బచ్చీవెచ్చీగాని మొనగోళ్ళచే
[–11–212

పటువాళి చీర
కుటిలంపుఁ జేఁతలు కుచ్చులుగాఁ గట్టి
పటువాళి చీరలమ్మే బలు బేహారి
[5–178

పట్టపగలై వుండు
పట్టపగలై వున్నాఁడు బాయట నెందు చూచిన
గట్టిగాఁ గాననివారి కల్లయింతే సుండి
[10–244

పట్టపు దేవుళ్లు
పట్టపు దేవుళ్లఁ దాను బంతి సాగి వున్నవాఁడు
అట్టినేయరో పులుగ మారగింపులు
[9–9

పట్టపు నెమలి చుంగు
బొట్టుల మెకముసేసే బోయనాయఁడు
పట్టపు నెమలిచుంగు బలుబోయనాయఁడు
[5–285

పట్టమెక్కు
యెక్కెను ధ్రువుఁడు పట్టము యిదివో నిన్నుఁ గొలిచి
చిక్కెను నీ శరణాగతి నేఁడు శ్రీవైష్ణవులచేతను
[10–217

పట్టమేలించు
నమ్మితే నితఁడే మన్ననఁ గాచు
ఇమ్ముల ధ్రువునిఁ బట్టమేలించినట్లు
[11–41

పట్టరాని జవ్వనము
పట్టరాని జవ్వనము పరసిపోవే ముదిమి
నెట్టుకొల్పి వుబ్బడఁచీ నీ మాయ
[6–180

పట్టితే పసిఁడి రాలు
పట్టితే పసిఁడిరాలీ బచ్చన సంసారము
గుట్టుదెలియఁ బ్రాణము కూటి చేతిది
[8–248

పట్టినందుకెల్లాఁ దీసు
పట్టినందుకెల్లాఁదీసు పాపమే చవులుసేసు
నిట్టి పిడిఁ బోనీదు నీ మాయ
[9–251

పట్టినదెల్లా నీడేరు
భాగవతులైన వారు పట్టినదెల్లా నీడేరు
చేగదేర వారలు సేసినదే చేఁత
[8–119

పట్టి పిసుకు
పట్టి పిసుక నిఁక బనిలేదు
గుట్టు దెలిసితే గులగులలు
[8–137

పట్టుఁగొమ్మ
అట్టె శ్రీవేంకటేశ అంతరంగాన నీవేకా
పట్టుగొమ్మవై యుండఁగ బదికేది నేను
[8–288

పట్టువెట్టు
మెఱసి పెండ్లికివలె మేలు కట్లు గట్టించి
పిటిగొన ముత్యాలపేఁట పటువెట్టెను
[18–406

పట్టెడ
నయమే కలిగితేను నమ్మించవలెఁగాక
భయము లేకింతవడి పట్టెడఁ జెల్లునా
[16–2–72

పట్టువెట్టుకొను
పాయలేక నన్నుఁజూసి పట్టువెట్టు
కొంటి వంటా
మాయలు నేసేవదేర మాటి మాటికి
[4–107

పడగెత్తు
గండరగండఁడై పసిఁడి కంబమునఁ
బడగెత్తి యల్ల స
త్కుండలి మండలాధిపతి గోత్ర
విచిత్ర నివాస సౌఖ్యమున
[శ్రీ. 13

పడచు మాట
పడచు మాటనకా ప్రహ్లాదునకు
పొడచూపె నాదిపురుషుడు
[5–219

పడని పొట్లు
కడుపెంత తాఁగుడుచు కుడుపెంత దీనికై
పడనిపొట్లనెల్లఁ బడి పొరలనేలా
[5–205

పడిగాలు పడు
పడిగాలు పడియున్న ప్రాణాధారముల
పడఁతుల ధనములఁ బాలించితి
[5–183

పడి తళించు
పాయని చుట్టరికాలు పడితళించఁగ వచ్చు
చాయల నీ గురుతులు సరివచ్చి వున్నవి
[13–216

పడిబొమ్మ లెట్టు
వరుసతో జోడించి వాడిమి మెరసె
భావజునకు మారు పడిబొమ్మ లెట్టు
[ఉ. క. 232

పడుచులాట
తహతహలఁ గర్మబంధములఁ
దగిలిన యపుడే
అహహ దేహికిఁ బడుచులాటవో బదుకు
[5–297

పడెచ్చులు
బచ్చెనరూపులు పెక్కు పడెచ్చుల వేసినట్లు
నిచ్చల నినుచున్నది నీ మాయ
[6–180

పడె దన్నము
మిగిలినదేమిఁక మీఁదట దేహికి
అగపడు నొక పడెఁ దన్నంబు
[9–268

పడ్డవోఁద మెక్కు
యెఱఁగనా యీ లోక మిది
మాయమయమని
యెఱిఁగినాఁ బడ్డవోఁద మెక్కరాదు
[9–73

పతికి పతి
కూరిమిఁ గాలుచాఁచేవు కొనుకొంటివా
వోరి
వూరకె పతికిఁ బతి నోపనా నేను
[17–237

పతివాది
యెదుట మాకల్లా నిజమేరుపరచఁగ వచ్చి
అదె పతివాది వయ్యే వప్పటి నీవు
[17–287

పతివెట్టు
ఇంత నీవు మన్నించుట యిందుకా నన్ను
వింతవారిఁ బతివెట్ట వేడుకా నీకు
[17–250

పత్రసాలము
మొలచు జననలోకమునకు నుదుట వ్రాసే
బలుఁడ నీచే నేఁ బత్రసాల మందుకొంటి
[11–126

మనసురానివాఁడవు మాతో నవ్వఁగనేల
అనువు గాదని విడనాఁడగరాదా
చనవున నిన్ను నాఁగ సరి బత్రసాలమా!
యెనయుచు నేకరాజ్య మేలవయ్య నీవే
[17–305

పదను దీయు
ఇచ్చకము లాడరే యింతులాల
వచ్చిజవ్వన మింతలో పదను దీసేనా
[13-20

పదము
ముసరు సిగ్గులె మోనాన నుండిన
వన నీ పదములె పాడించీని
[14-219

పదవి మీరు
మొదల నంతర్యామి మూర్తివయిన నీకు
పదవిమీర నదియే ప్రాణప్రతిష్ఠ
[10-46

పదారంగుళాల ప్రాణము
లచ్చనఁ బదారంగుళాల ప్రాణమింతే
కుచ్చికాలపు దినాలు గొలచీని
[7-193

పదిఁ బది
ఇదిగాదదిగా దిన్నియు నింతే
పదిఁబది హరి నీ పదమే నిజము
[9-23

యిదివో నా నోముఫల మిఁక వెరపులేదు
పదిఁబదై యాసలు నాపై దనకున్నవి
[18-270

పదిలించు
విదళించె భవములను వేంకటేశ్వరుఁ
గొలిచి
పదిలించె నతని కృప పరమ సౌఖ్యములు
[5-127

పదివేల తెఱఁగుల భావించు
పదివేల తెఱఁగుల భావించి యేము
వెదకెదు లాగుల వెదకి చూచితిమి
[వ. యో. వి. 3-1314

పదివేలను
ఉదిరి మా యక్కఁ జూపోపక మీరు
పదివేలు వననేఁ బందలా రనుచు
[వ. యో. వి. 4-1300

పదివేలు
యిచ్చకాన నీకు నాకు నేఁటి
మొగమోట మింక
వచ్చినదే పదివేలు వాదులాటే చాలును
[17-579

పదివేలు చెప్పు
వినుఁడు మీ రిటు పదివేలు చెప్పినను
వినఁగూడునే నాకు విపరించి చూడ
[వ. యో. వి. 3-1116

పెఱవారలవి కనుపెట్టి కైకొనఁగ
వెఱతురు తుదిఁ బదివేలు చెప్పినను
[వ. యో. వి. 3-1397

పదివేలు పనులు
పాయరాని పదివేలు పనులు నీకు యీ
కాయము నీ విప్పుదైన కాఁగలించుమీ
[4-179

పదివేలు పలుకు
పదివేలు మీతోడఁ బలుకంగనేలఁ
ద్రదకు లచ్చెరువంద దివి భువి క్రింద
[వ. యో. వి. 3-1444

పదివేలు భోగములు
మదన జనకునికి మజ్జనవేళ
పదివేలు భోగములు వరగీనదె
[8-163

పదివేలు వచ్చు
ఎట్టయినఁ జేయరా నీవిఁక నేలా నన్నుఁ
బట్టకుర పలుమారు పదివేలు వచ్చెను
[12-47

పనికి వచ్చు
అనుమాన మైనందుకు అన్ని యాసలు
వెట్టిన
పనికివచ్చునో రాదో భావించరాదు
[17-394

పనిగొను

పెనగొన్న జంతువులు పెక్కులెన్నైగలవు
పనిగొన్న నీ దాస పరికరములే
[9–255

పనిగొను

పనిగొంటే భువిలోనేఁ బరియే అక్షరములు
కొనాడితే నీ గుణాలు కోటానఁగోటి
[7–80

పనిగొను వారల భాగ్యమిది
వెనక ముందరికి వివేక మొకటే
[10–7

అతిభక్తిఁ బనిసేసి అధికుడాయ నొకఁడు
సతతముఁ బనిగొని సఖుఁడాయె నొకఁడు
[10–8

తలచినట్టుండదు తలఁపు నాదైనాను
కులికి నన్నే పనిగొనీఁ గాని
[10–58

పని పాటలగు

ముంచి యందరికై నాను మోపులై
వుండి కర్మము
వంచు కందరికిఁ దమ పనిపాటలై
[7–124

పనిపాటలు

చిమ్ముచు నాతఁడు నేమించిన పని
పాటలలో
వుమ్మడిఁ జేసేటి వట్టి వూడిగాలే కాక
[7–250

పనిపూను

పని పూని కరముతో పాంచజన్యము వట్టి
అనిశముఁ గరుణించీ నాది నారాయణుఁడు
[9–234

పనివూనివుంటివటు భక్తపరతంత్రుఁడవై
తనిసి నీ వధికమో దాసులే యధికమో
[7–215

పనిమాలు

పనిమాలిన యీ పలు లంపటముల
తనువు వేఁచు టెంతటి పనియిట్లా
[5–163

ననుఁ జూచి హరి నీవు నవ్వకుండేవా
పనిమాలెంత బయలుపాఁకీ నా మనసు
[6–187

పనిలేని పని

పగటున నీవేళఁ బనిలేని పనికి
నగనేల చెపుమ పన్నగరాజశయన
[వ. యో. వి. 4–885

పనిలేని పనులు

కొనరేరు మునరేరు కోరిక దీర్చు మనేరు
పనలేని పనులకు బడల నే నోపను
[8–220

పనిలేని పాటు

వట్టి యాసలనె యిటువలెనె పో యిన్నాళ్ల
బట్టబయ లీఁదితిమి పనిలేని పాట
[11–3–89

పనివడు

తన నీడ యద్దములోఁ దానే యటు చూచి
పనివడి వూరకే భ్రమయవలెనటయ్యా
[7–210

పనివడి భక్తపరిపాలకుఁడవట నీవు
తను భోగాలు భోగించఁ దగవౌను నీకు
[7–78

చనవై శ్రీవెంకటేశు శరణను టొక్కటే
పనివడి చెఱకునఁ బండు పండినట్లు
[10–80

పనివడి యొక్కటె ప్రపంచమార్గము
కొన నొకటే వైకుంఠమార్గము
[10–218

పనివనిగా

అప్పుడే బలిమిసేసే వందుకేమి
చిప్పిల పనివనిగాఁ జెప్పర నాతోను
[17–155

పనివాఁడు

యెలమి పన్నెలితివి యియ్యకొంటినేనట్టె
పలుకుఁ బంతము చెల్లె పనివాఁడ వౌదువు
[15-225

పనివి

పనివి నిన్నుఁ దలచి పాటలు పాడేవేళ
అనుఁగు గాంధర్వ కాంత యనవచ్చును
[15-56

పనిపూను

పొనిగి భయదుఃఖములఁ బొరలి
నప్పటి వేళ
పనిపూని మీమీఁది భక్తి గలుగు
[17-182

పనుపడి

పెనఁగులాడేటివేళ బెరసిన చెమటల
పనుపడి నీ తమికిఁ బదనాయను
[13-132

పనుపడు

పాయక యిందే పనుపడి పనుపడి
చాయలు మరచిరి జంతువులు
[8-118

పనులు అంగడిఁబెట్టు

వెంగలితనాన నిన్ను వెల్లవిరి సేయరాదు
అంగడిఁ బెట్టకు పనులట్టె వుండ
నీయవచ్చు
[15-168

పన్నారు దొంతులు

పన్నారు దొంతుల పాలుఁ బెరుగులు
యిన్ని నారగించె యీశుఁడు గదవె
[10-288

పన్నివుండు

పదునాల్గు లోకములు పన్ని వున్నవి
మోక్షము
తుదకెక్కించనవైనాఁ దోడుగావు
[8-205

పన్నీటి పొట్లము

పొక్కఁడి చెలిఁ బన్నీటిపొట్లానఁ దాఁకవేసి
తక్కఁరి నవ్వులతోడఁ దలవంచేవు
[12-37

పన్నీరు

పెదవికిఁ బదనురాఁ బిలిచి పన్నీ రిపే
కదసి యెవ్వతెకో కతలు చెప్పె
[14-234

పన్నీరుకాపు

మేకొని నీవే నిండు మేఘవర్ణుఁడవు గాన
నీకు మేఘపు పుష్పాలే పన్నీరుకాపు
[7-46

పన్నుకొని

పన్నెల నీ వచ్చుడాన వ్రాసిన కోలాటపు
అన్నువ పతిమలను అలుచూచి
మున్ను పురకామినుల మోహము
మఱవలేక
పన్నుక వున్నాడవని పకపక నవ్వేను
[15-74

పన్నుకొను

పన్నుకొంటి సంపదలు పంచభూతాలలో
నైతి
యిన్నిటా నీ పంపుననే యిఁకనో బుద్ధి
[8-270

పన్నెల నిష్టానిష్ట వస్తుభేదములెల్లాను
పన్నుకొన్న యటువంటి భావన మాత్ర
ములు
[10-30

పన్నుగడై వచ్చు

వెన్నలు దొంగిలుదురు వీఁడు వాఁడు
నొక్కఁటే
పన్నుగడై వచ్చినారు పట్టరే యీ బాలలు
[8-4

పమ్ము

వచ్చెదేరెఁ బనులు పమ్ము జూఁపు మొనలు
హెచ్చెనిదె నా మాట లియ్యకొనరాదా
[15-249

పయిడి కాళ్లు
పక్కన మొక్కేరా నీ పయిడి కాళ్ళకు వోరి
అక్కతోఁ జెప్పేఁగాని అందుకొనే రారా
[6-14

పయిరు సేయు
అలరి శ్రీవెంకటేశ అప్పటి నన్నుగూడితి
బలిమిఁ బయిరుసేయఁగ పంటవండె వలపు
[13-83

పయ్యాడు
పయ్యాడినవారి చేతి బాగా లందుకోనీవే
యియ్యకోలై ఆకుమడిచిచ్చేఁ గాని
[17-147

పరకటనుండు
పాపముఁ బుణ్యము పరకట నున్నది
చేపట్టుము నీ చేతిది ప్రాణి
[9-105

పరకళ్లు
గొందిఁ బంటసేయువాఁడు కొలుచులు పరకళ్ళఁ
జిందకుండా గాదెఁబోసి చేరి కాచీని
[9-148

పరచఁగు
చేతలు యీ గుణమైన సిగ్గువడవలదా
బాఁతివడి విషయాలఁ బరచయ్యీఁ గాక
[9-147

పరచు
కాంతుఁడ యిటు గాకున్న కన్నవారి వెంట నెల్లా
వంతపు నీ మనసిది పరచై తిరుగుఁగా
[15-167

పరచుఁదనము
మరలి పద్మజుని మనుమనినైనఁ జంపే
పరచుఁ దనమున వృథా పాలుమాలీనే
[4-22

పరఁదు
నరహరి కరుణే నమ్మిన వారికి
పరఁదున నిఁక భయపడఁ జోటేది
[11-85

పరఁదుకొను
యెంతని పరఁదుకొనే విందిరానాథుఁడా
అంతరంగముల నుండె అందరిలోన
[16-1-41

పరపు
మేనికి నీ కాఁగిలి మెత్తని పరపు నాకు
[15-197

పరబ్రహము
యీ యపరాధము యెంచకుమీ నను యిందునెపో నీ శరణంటి
పాయను నిన్నిఁక శ్రీ వెంకటపతి పరబ్రహమవు ఆటుగాన
[10-103

పరవఁజుక
చూపరఁ బసురము తొరలు వోయినను సొమ్ము గలుగువాఁడే పరవంజుక
పైపైఁదానే వెదకి తెచ్చి కాపాడఁగ నతనికి భారముగాన
[9-103

పరవంజుకొను
బావల సంసారము పరవంజుకొని తొల్లి
యేదినమ్మి పాటువడె నీ జీవుఁడు
[8-79

పరవిడచు
పొదలుచు మృత్యువు పంది వోలై నల్లెట నాడఁగ
పదిలముగాఁ గింకరులను చొప్పరులఁ బరవిడిచి
[5-201

పరసిపోవు
పరగి నాలుకనొంపు పరసిపోయ
పరులనే నుతించి పలుమారు
[6-61

వట్టరాని జవ్వనము పరసిపోతే ముదిమి
నెట్టుకొల్పి పుబ్బడచీ నీ మాయ
[6-180

పాపపుణ్యాలంటె నంటాఁ బాయవు
సుఖదుఃఖాలు
పైపై ననుభవించఁ బరసిపోవు
[9-270

పరాకుసేయు
యిది నీవు సేయు నుద్యోగంబునకు
బరాకుసేయుట గాదు గదా
[వై. వ. 14

పరాకై యుండు
పరమాత్మ నీవెందొ పరాకై యున్నాను
పరగ నన్నింద్రియాలు పరచినాను
[10-206

పరాకై వుండు
తలఁచితే నీ రూపము తానే యెదుటనుండు
యిలఁబరాకై వుండితే నెచ్చోటాఁజిక్కదు.
[8-201

పరి అరికట్టుకొను
పలు జన్మములే నన్ను పరి అరికట్టుకోఁగా
తొలగఁదోసి నాకుఁ దోడై తివి
[5-300

పరిగలేరు
పరిగలేరేటి వానిఁ బట్టపురాణిఁగా
విరతభోగము లిచ్చి నిలిపినట్లు
[5-185

పరిణము
కురులు నెన్నుదుటికిని గుణుతు
లధరంబునకు
మురిపెంపు జిఱునగవు ముద్దుమోమునకుఁ
దిరమైన వేడుకలు తిరువేంకటేశునకుఁ
బరిణాపు మాటలివి పడఁతు లిందటికి
[4-23

పరిపాటి మార్గము
జితకాములకు గాని చేతికిని లోనయి
చిక్కవే కాలంబు కర్మమా
మతిహీనులైనట్టి మాకు నొక పరిపాటి
మార్గంబు చూపవో కర్మమా
[5-187

పరియ విడచు
దేవా మీరు పంచేంద్రియంబులం
బరియ విడిచి
ప్రాణుల నజ్ఞానంబున ముంచి
యెత్తి భ్రమయింపంగా నీతో
నెదిరించి వాటి నడంప శక్తులమే
[వై. వ. 13

పరివోవు
పరివోని దురిత కూపములఁ బడకుమని
వెరవు చెప్పెడివారు వేరే
[5-70

పరివోని సురత సంపదల నింపులచేత
వరవధూతతికి పరవశమైన దితఁడు
[5-112

పరుజు
వాడి వో కంటిరటవే వన్నెలవాఁడు
పైడి మోలము కటారు పరుజులవాఁడు
[13-116

పరువతము
అజుత లింగముగట్టి యది నమ్మఁజాలక
పరువత మేఁగిన బత్తుఁడనైతి
[5-19

పరువుదోలు
చేపట్టి యాపె చేతులఁ బిగ్గఁబట్టుక
పైపై వీధులవెంటఁ బరువుదోలిని
[13-58

పరుషవచ్చేకత
కోపరమై యేఁటనేఁటాఁ గోరి
వరములకుఁ గా
కావించి పరుష వచ్చేకత చూచుకోరయ్యా
[8-134

**పరుసమంటు**
మమ్ముఁ జూడనేల నీ మహిమె
చూతువు గాక
వుమ్మడిఁ బరుసమంటే దొక్కమాఁటే
కాదా
[10–232

**పరుసము దాఁకు**
పక్కన లోహము పరుసము దాఁకిన
తెక్కువనంతా హేమమె కాదా
[9–250

**పఱఁడు**
పనిమాలినట్టి వట్టి పఱఁడుగాక మాకు
ననిచి యిదియు నొక్క నగుఁబాట్లా
[5–214

**పఱచగు**
పలుశాస్త్రములుచూచి బలుదేవతలఁ
గొలిచి పఱచైన యీ దేహము
పలు సందేహములను వచ్చిన తెరువునను
పాపుకోనేఁ గలనా
[10–77

**పఱచుఁ దలఁపులు**
తటి విరహవేదనకు తలపోఁతచే బాధ
పఱచుఁ దలఁపులకుఁ దావముల బాధ
[4–36

**పఱివోవు**
పఱివోని యాస దనుఁబట్టుకొను భూతమని
వెలచినది యదిగదా విజ్ఞాన మహిమ
[5–123

పెఱమూకలు పెఱచేతను
బఱివఱియలు సేయు టనఁగఁ
బఱివోయె ననన్
[రేఫ. 92

**పలకెక్కు**
ఉలి వచ్చియై యుండ నొకయింత యూరి
పలకెక్కు గుగ్గిల పదును గానిచ్చి
[వ. యో. వి. 4–78

**పలగొను**
వావిరి ముమ్మారు పలగొని వచ్చితి
నీ వారమైతిమి నిలిచితి మిపుడు
[7–88

**పలవి**
పలులంపటాలఁ బడి బడలినగాని నాకు
పలవి నిన్నుఁ దలచే భక్తిలేదు
[10–106

**పలికి తప్పు నడచు**
యిల నీ దేహముమోఁచి యింతాఁ
గల్లలనుచు
పలికి తప్పు నడచే భావమే పాషండము
[5–256

**పలుకఁబాటు**
పలుకఁబాటెను గనుపట్టె నంతటను
వల నొప్పు నల్ల గల్వలబంతి యూరు
[వ. యో. వి. 719

**పలుకు పంతం**
పిలిచి శ్రీవెంకటేశ పెనగి నన్నుఁ
గూడితివి
పలుకుఁబంతాన నీ నా బలువింతే కాకా
[17–253

యెలమి నన్నేలితివి యియ్యకొంటి నేనట్టె
పలుకుఁ బంతము చెల్లె పనివాఁడవౌదువు
[15–225

**పలుకుల కొనవాఁడు**
పలికి చూచినాను పలుకక మానినాను
పలుకుల కొనవాఁడు పరమాత్ముఁడే
[9–91

**పలుపేగుల జంద్యాల పంతాలవాఁడు**
సెలవి నవ్వులవాఁడు చేకత్తి గోళ్ళవాఁడు
పలుపేగుల జంద్యాల పంతాలవాఁడు
[7–274

**పల్లకట్టు**
వలపు చప్పఁజేసెటి వగకాఁడ నీ
బలిమి నా మనసుకుఁ బల్లకట్టవలెనా
[17–159

పల్లటీఁడు
పంతమాడనేర నా పల్లటీఁడు నాయకుఁడు
[14–189

పల్లదము
చెల్లఁబో నాకె సుద్దులు చెప్పకువయ్యా
పల్లదాన నీవు నీవే బదుకవయ్యా
[17–167

చెల్లఁబో నే నెంత దనచేతి కలవ త్తినే
పల్లదము దననోరఁ బైపైనున్నది
[17–248

వొల్లన శ్రీవెంకటేశుఁ డొద్దికతో
నిన్నుఁ గూడె
పల్లదాన నవ్వేఁబో పాసియుండే దానిని
[17–318

పల్లదీఁడు
బాలుఁడటవే సాదటమే పీఁడు
పల్లదీఁడు గాక
[16–2–111

పల్లపు పాతాళము
కెల్లరేఁగి నిక్కి హరికీర్తి భుజములవె
పల్లపు పాతాళానఁ బడరో దనుజులు
[6–79

పల్లాండు పల్లాండే
గుట్టువఁ గోరికలెల్లఁ గొల్లవట్టినే
వట్టపు దేవికి పీకుఁ బల్లాండు పల్లాండే
[12–187

పల్లించు
పల్లించిన నీ పసిఁడి గరుడనిని
కెల్లున నీ వెక్కిన యపుడు
[11–3–26

పల్లుసోకించు
పవ నీ మోవిపైఁ బల్లు సోకించీ
పసిబిడ్డల బాగులా
[16–2–81

పశుబంధము
చటుల కరంబులఁ గుటిల దానవుని
బటుగతిఁ బట్టెను బశుబంధముగా
[10–175

పసలు పుట్టించు
ఫణిరాజ ముఖులకుఁ బసలు పుట్టించు
ఫణిరాజ గోత్ర సౌభాగ్యంబు మరఁగి
[శృం. మం. 63

అసమ యశంపాన్వితంబు దోదయము
పసలు పుట్టించు నప్పనము నచ్చటను
[వ. యో. వి. 3–28

పసిగొను
పసిగొని రుణానుబంధము కొలఁదే
పసులనుఁ బడతులు బహూసుతులు
[7–188

పరమపదంబను చేనికి పసిగొను
నర మృగములకును
తరమిడి సంసారపు టోఁదములనె
యాఁగించి
[5–201

పసిగొని యింద్రియాల బంటై
వుండు నొకవేళ
మునిపితోడై వానకు మొక్కు నొక్కవేళ
[6–97

పసిగొని తనుఁబాపములు భ్రమించిన
కసరి సృష్టి చీఁకటి వడు నపుడే
[8–69

పసిడితము
పసని గద్దియ పీఁటపై నుంచి మంచి
పసిడితంబుగ నీటఁ బాదము లిడిగి
[వ. యో. వి. 4–1070

పసిఁడి మొల్లాము
పసిఁడి మొల్లాము గుబ్బల కవాటములఁ
బొసఁగి చూపట్టు గోపుర మంటపములు
[వ. యో. వి. 3–66

పసిఁడి యక్షంతలు
పసిఁడి యక్షంతలివె పట్టరో వేగమే రారో
దెసఁ బేరంటాండ్లు దేవుని పెండ్లికిని
[8-194

పసిబాల
వుసురన నిఁక నేలె వొగిఁ
దలపంచ నేలె
పసిబాలవా యేమె వదతి నీవు
[15-291

పసిబాల వయసు
పసిబాల వయసున బండి దన్ని విరిచితి
వెసగె నే మాయెల్లా యివె వితలేశ్వరా
[10-171

పసివట్టు
పైకొని మైగాలిఁ బసివట్టి తిరుగు
మెలఁగు మయూర గామినులొట యెఱఁగి
[శృం. మం. 114

పసుబాలు
పాఱకున్న పసుబాలై బడదు మనసు
పాటితే జవ్వనమునఁ బట్టరాదు
[6-157

పసురు వేయు
నిలువుకు నిలువున నీమోహముచూచి నేను
బలిమినేసి పెనఁగితేఁ బసురు వేయదా
[15-31

బలిమిఁ బిసుకఁబోతే పసురువేయు విరులు
యెలజవ్వనిని నేఁడు యింత నేతురా
[17-226

పసురెక్కు
కొనరియప్పుడునిన్నుఁ గోపించినదియల్లా
పసురెక్కుఁగాక యిఁకఁ బంతమిచ్చేనా
[17-234

పసుల పొఁడి
గోపాలకృష్ణుని చూపే కోరిన
పసుల పొఁడి
గోపికావల్లభు కృపే కూర్మి వనిత
[10-51

పళ్లెపు మోవి
పచ్చని చిగురువంటి పళ్ళెపుమోవి చెలి
కుచ్చి తేనె మాటలు కురిసీ నదె
[17-64

పళ్లెము కూటివారు
పరమమైన యాతని పళ్లెము కూటి వారికి
ధరలో నేమిటి వంకాఁ దప్పులే లేవు
[9-277

పక్షి సకినగాఁడు
భవరోగ వైద్యుడైన బలువెజ్జు
సవరని పైఁడి పక్షి సకినగాఁడు
[16-1-22

## పొ

పొంగెములో వాఁడు
బచ్చెనల నతదు నీ పొంగెములో వాఁడె
నెచ్చెలి నీకుఁ గొంకితేనే నీకు వెరతునా
[17-194

పొక్కపొక్కను
పొక్క పొక్కని తమ భాషఁ జెప్పుచును
గ్రక్కున నటకు దగ్గఱ నేగుదెంచి
[ప. యో. వి. 2-34

పాఁగు
యింతగాల మింద్రియముల నిట్టె
పాఁగిన తలఁపు యిఁక
నంతగాలము చిత్తమాఁగినే నది
దిప్పుకోఁ గలనా [10-77

లోఁగుచునే విను లోనికిఁ బిలువఁగ
కాఁగిట తానేల కదిమీనే
వీఁగక కూడె శ్రీ వెంకటేశ్వరుఁడు
పాఁగి తా నేటికి భ్రమసీనే [15-254

దాఁగవీ పనులు నేఁడు దక్కితి
శ్రీ వెంకటేశ
పొఁగిన జాణఁడ నాతోఁ బలికి మెప్పించరా
[17-217

పొఁగని శ్రీవెంకటపతి నన్నుఁ గూడితివి
పిఁగని రతులు నేఁడు నేరుచు కొంటివా
[17-360

పొగకాఁడు
వంతాన నామోము తప్పక చూచే వదియేమీ
వంతుకుఁ బొగకాఁడ వీవల నీవే కావా
[13-151

పొటుమగు
కొంచక శ్రీవెంకటేశ కూడితివి నన్ను నిట్టె
వంచల నీ మన్ననలు పొటమాయెఁ గదరా
[14-122

పొటి చెడు
ఒచ్చపుఁ బాపాలకెల్లా నొడిగట్టె మనసు
ఐచ్చన చంచలములఁ బొటిచెడె మనసు
[11-40

పొటిపట్టు
వెల్లవిరిగా దొంగిలి వెన్నలు దిన్న నోట
వల్లదాలేమాడినాను పొటివట్టేమా
[13-92

పొటిమీఱు
పొటిమీఱిన భక్తి పరత నీ కట్టు
కోటలెన్నిన రాతి కోటలేవయ్య
[ప. యో. వి. 7-1299

పొడి నడపు
పంతములాడవదేమే పలుమారును నీవు
అంతేసి పొడినడపే వందుమీఁద గలదా
[13-75

పొడిపంతాలు
యింతులెల్లఁ గూటితిరి యియ్యకోలు
నేసితిరి
యింతలోనె పొఁడిబంతా లెన్నికాయనే
[15-243

వేడుకగలవారికి వెంగెములే హితవౌను
పొడివంతా లిందునేల పచారించేవయ్యా
[18-390

పొడిఁ బంటా
బల్లిదపు హరిభక్తి పొడిఁబంటా నాకు
వొల్లము కర్మఫలము లొకటి నేము
[8-63

హరిపదములె మాకు నన్నపానభోగములు
పరమాత్మపాదములె పొఁడిఁబంటా మాకు
[10-149

పొఁతరఁబెట్టు
అలయకువే నీవు అప్పటి నొలయకువే
తలఁపులో రతులు పొతరఁబెట్టేవా
[15-237

పొఁతు మాకు
చేతఁలు దవ్వేటివాఁడు సిగ్గువడ నేరుచునా
పొఁతు మాకై వుండేవాఁడు పైకొనీనా
[17-475

పొతక కోట్లు
పొతకకోట్లు భవములు భస్మీ
భూతము నేయఁగఁ బొడవొకటే
[5-188

పొతాళముల నిధానములు
పరమాత్మునికిఁ గాని తపంబులు
పొతాళముల నిధానములు
మరు గురునికిఁగాని పూవుల పూజించి
మగఁడులేని సింగారములు
[7-1

పొతురలాడు
పుట్టుగుకెల్ల సుఖము వొల్లలేని నీ భక్తి
తొట్టి కాళ్ళ సుఖము పొతురలాడుట
[10-78

పొతురాడించు
బలిమి నరంట్లను పక్కనఁబెట్టైఁదోయనేతే
అలమి యంచులఁ బాతు రాడింతురా
[13-182

**పాద**

యీదెస శ్రీ వెంకటేశ యిటె నన్ను గూడితివి
పాదగు జాణవు నే నీ పలుకులో దానను
[15-268

**పాదపుఁబరము**

పంకజపుఁజేయిచాచి పాదపుఁబరమిచ్చిన
వెంకటేశు కృపతోడ వెలయఁదానే
[5-104

**పాదికెత్తు**

పాదికెత్తు మెరుఁగారు బంగారుగుండు
నేదదేర మెడఁగట్ట చిత్తగించితి
[12-218

**పాదుకొని కూచుండు**

భవనాసియేటి దండఁబాదుకొని కూచుండి
జవళి దైత్యు పేగులు జందెలు వేసి
[10-162

**పాదుకొను**

పాదుగా శ్రీ వెంకటాద్రిపై మహిమ వెదచల్లె
పాదుకొన్న యీతని శ్రీపాదములే సాక్షి
[8-271

వేదమందు శాస్త్రమందు వేవేలు వాదములందు
పాదుకొని బోధించీఁ బరమాత్ముఁడు
[9-283

వేదవేదాంతములందు విజ్ఞానశాస్త్రములందు
పాదుకొనఁ బలికేటి పరమార్థము
[10-169

**పాదుగఁ బుట్టు**

ఆదికి నాది హరి యొకఁడే
పాదుగఁబుట్టెటి భవములె వేరు
[9-253

**పాదు పడు**

పాదుపడక నడుమను దిరిగాడెడి ప్రపంచముదే నేరమి
యేదెస నొకచో నిజమేరుపడక యిటువలెఁ దిరిగాడెడిఁ గాన
[9-107

**పాదై యుండు**

యీదెస శ్రీవెంకటేశ నీవు నాలో
పాదై యుండి నన్ను బ్రదికించే న (వ?) య్యా
[10-107

**పాని**

నే నున్నదెసయెంత నేఁడు దన వేడుకెంత
పానిపట్టి యింతలో నే బాఁతైతినా
[17-275

అనుక శ్రీవెంకటేశుఁ డలమేలు మంగఁ గూడె
పానిపట్టి యింతలోనె పంగింత మిపుడు
[17-301

**పాని కుచములు**

కానుకలందే వాఁడవు గక్కున నన్నంటరాదా
పానికుచముల నిమ్మపండ్ల దానను
[17-105

**పానిన**

ధ్యానమే మా ధనము దయే మా ధనము
పానిన శ్రీవెంకటాద్రి పతియే మా ధనము
[7-223

**పాని పట్టు**

మానని కాముకులకు మగువలే దైవము
పానిపట్టి వారివారి భ్రమ మాన్ప వశమా
[5-323

పానిపట్టి శ్రీ వెంకటపతి యింతకు మూలము
అనుక యీతని శరణనే వారి నేరుపు
[6-90

పానివట్టి హరియది వరిహరించని వాఁడా
ఆనుక హరిదాసుల కంతటనే భంగమా
[8-245

కానను ముందరవచ్చే ఘనకర్మపాశములు
పానిపట్టి (?) యించుకంతా భయము లేదు
[9-258

నానాదేవతలకు నరసింహుఁ గంభములో
పానిపట్టి చూపినట్టి ప్రహ్లాదుఁడా
[11-135

పానిపట్టి సర్వవిధ బంధుఁడు
విష్ణుఁ డుండఁగా
మానిని చుట్టరికాలు మరుగఁగఁ జెలునా
[16-1-55

ఆనవెట్టినా మానరు అప్పటి మీరు
పానివట్టి చెలులాల వగరాన నటరే
[17-555

తానేల నిలుచున్నాఁడు తడవుల నుండీని
పానిపట్టి చెలులాల పదమనరే
[17-166

పాను

పాని నీపై మచ్చరము పండ్లఁబెట్టు
కుంటితేను
మోనాన వాండ్లెక్కి నీమోవిమీఁదనిండెను
[14-221

తానకమాయె నిదిగో తగుదివ్వెల పండుక
పాని నీ కరుణఁజూచే వచ్చి చూపులు
[15-87

పానుకొను

పానుకొని దనుజుల బలు కిరీటమణుల
సానలఁదీరిన వో చక్రమా
[5-125

పామరి

పామరిపై దుర్వ్యాపారమునకు
వలుమారునుఁ బొయ్యేవు
వేమరు దుర్జన సంగాతంబులు
విశ్రామ మనుచు నుండేవు
[5-126

పాముఱితనము

పాముఱితనమున బహు వేదనలను
నామన సెనసెఁబో నాబ్రాఁత
[5-136

పాముతోడి పొత్తు

బలుసంసారపు పొందు పాముతోడి
పొత్తు సుండి
వెలలేని వలపులు విషము సుండి
[5-319

పామునోరి కడి

పామునోరి కడి మీప్రాణపు టూరుపుగాలి
జాముజాము మేలుఁ గడు చక్కఁజేయఁ
గనుఁడు
[5-102

పాము పరపు

పాము పరపుపైఁ బండిన సిద్ధుఁడు
పాము పాశముల పరిహారము
[5-263

పాము పుట్ట గొంతు

పాముపుట్టగొంటి మీఁది వడుమటి తెరువు
చీమక దొంతరలోని చిన్న తెరువు
[5-147

పాములవాకట్టు

పాముపైఁ బండేటివాఁడే పాముల
వాకట్టు రక్ష
నేమపు సర్వ జీవాత్మ జీవరక్ష
[10-54

పామెటి సుఖములు

దోమటి నా మతిలోనఁ దోడు నీడవై
యుండి
పామెటి సుఖములనే భ్రమయించవలెనా
[6-59

**పాయము పిడికిటఁ బట్టు**
పాయము పిడికిటఁబట్టుచు నుండేటి
కాయధారులకుఁ గలదా విరతి
[5-257

**పాయవట్టము**
వచ్చలు దాచినయట్టి పాదుకలు మెట్టినది
లచ్చన మొగపుల మొలనూళ్లది
అచ్చపు టుంగరముల అందెలుఁ
బాయవట్టాలు
గచ్చుల ముంజేతుల కంకణ నూడిగేలది
[15-79

**పారఁగొలుచు**
కొలుచు ముంచుట పారఁ
గొలుచుటయొండు
దెలియఁ గారాక యెంతే చిత్రగతుల
[వ. యో. వి. 6-663

**పారఁదోసు**
దంట మమకార మిట్టే తన్ను నేల
సాగనిచ్చు
బంటుఁజేసి ఆసలనే పారఁదోసుఁగాక
[5-119

**పారఁ బట్టించు**
ఇంత మమ్మిట్లా నెలయించకురా నీ
పంతములన్నియుఁ బారఁబట్టింతు నోరి
[12-10

**పారణ చేయు**
వొక నీ నామము వోగిఁ దలంచిన
అకళంకం బగు నా పాపంబులు
అన్నియుఁ బారణేసేసె
[7-142

**పారవెళ్లు**
పారితెంచి యెత్తివేసి పారవెళ్లితివి (వి?).
నీరసపు పెద్దలైన నీకు నే ముద్దా
[11-3-21

**పారాడించు**
పంచల నరులవెంటఁ బారాడించే మనసు
కొంచక శ్రీ వెంకటేశుఁ గొలిపించలేదా
[8-139

**పారాడు**
చప్పుడుతో నింద్రియ విషయ పరివారము
అప్పుడు పారాడుదురు ఆహా మేలు
[6-124

**పారిటాకులు**
పట్టుచీరేఁటికి నాకు పారిటాకులె చాలు
దట్టిగట్టు కొమ్మనవే తన మొలనే
[4-108

**పారితెంచు**
పాటించి యీ సుద్దివిని పారితెంచి
చూచితేను
కోటికోటి సొమ్ములాయ కొత్తలో యమ్మా
[6-167

పారితెంచి నిన్ను బలిమిఁ గూడేనంటే
నేరుతు రందుకుఁ దగు నెపములెల్లా
[13-22

**పారివారు**
దీమసపు పారివార దివె పంజులు చేఁబట్టి
యేమరక మీలోమీరు యియ్యరో జాలి
[10-166

**పారుపత్తెము**
బహుముఖంబులఁ బాఱు పత్తెంబె కాని
యహరహంబొక ముఖమై యుండఁ
దెపుడు
[వ. యో. వి. 3-746

**పారుపత్యము**
బత్తితోఁ బంచేంద్రియపు పరివారము
గొలువ
చిత్తజు పారుపత్యము సేసే నిదివో
[9-97

**పారుపత్యములు ఇచ్చు**
కైపుగాక నన్ను శ్రీ వెంకటనాథ
కూడితివి
పైపై నాపెకుఁ బారుపత్యము లిచ్చితివా
[16-2-52

పారుబడి వడ్డి
ముందటి జన్మములెల్లా ముంచెఁ
బారుబడి వడ్డి
యెందుచొచ్చినానుఁ బోనియ్య దీ రుణము
[5–294

పాఱబట్టు
పట్టి శతాంగంబు పైఁ బెట్టికొనుచుఁ
జుట్టియున్నట్టి రాజులఁ బాఱబట్టి
[అ. మ. శ. 6526

పాఱితెంచు
పాఱితెంచి దశకంఠు పది శిరసులమీఁద
ఆఱికి(?) నమ్ము వేసె నాదిదేవుఁడు
[9–183

పాలకూళ్లు
బంతి మోవుల యావుల పాలకూళ్ళవంటివి
మంతనాన నుండి నీవు మన్నించేవేళను
[7–58

ఆనగల వానికిఁగా అందరితో వినయాలు
బానగల వానికిఁగా పాలకూళ్లు
[14–129

పాలలెక్క
నంటుమీఱి సెలవుల నవ్వులేల వుమిసేవే
గెంటులేని కన్నులను కెంపు లెక్కని
యింటిలోనే శ్రీవెంకటేశుఁడ గూడితినేను
వంటలై పులకపైరు పాలలెక్కని
[13–44

పాలకొండ మల
మందల పాలకొండ మలకు నట్టనడుమ
విందగు దాసులతోడ వి(ర)హరించీ
దేవుఁడు
[11–80

పాల చాడె (?)
చెక్కులనొక్కితే నీసెలవులఁ బాలుచింద
చక్కని రేపల్లె పాలా చాదే (?) దొంగవా
[18–447

పాలతోడఁ బోయు
ఎంతవని కెంతవని యిది యేఁటిదే
వంతమె సతులకిది పాలతోడఁబోసిరో
[17–306

పాలతో వోయు
చెల్లులేవే యాతఁడు నీచేతఁ జిక్కెనే
పల్లదమే తల్లి నీకుఁ బాలతోనే వోసెనే
[17–522

పాలనే పెరుగు
పాలనే పెరిగిన పసిఁడి టెంకాయ
పాశెల నెడనీరు వట్టి పెట్టినను
[అ. ప. 53

పాలముచ్చిమి
వేసులు మాకుఁ జెప్పి విన భారతముగాఁగ
మోసని పాలముచ్చిమి మొదలుగాను
[6–162

పాలవుట్లు పండుగ
పాలజలధి యల్లుండె (డై ?)
పాయకుండే యీతనికి
పాలవుట్లవండుగ బాఁతే (తా?) యనచే
[8–17

పాలసుఁడు
తాలిమితో నాలో నిన్ను ధ్యానము
సేసేనంటే
పాలసుఁడ నేను నీపాటి వాఁడనా
[7–102

పాలార్చు
యితవై పనిసేసేటి యింటి వసురమునకు
వెతదీరఁ బాలార్చి వెద్దువెట్టఁ దగదా
[5–237

యితవై పనిసేసేటి యింటి వసురమునకు
వెతదీరఁ బాలార్చి లెద్దువెట్టఁ దగదా
[10–207

పాలార్చి తొట్టెలలోఁ బండఁబెట్టి యశోద
నీలవర్ణుఁ దొంగిచూచె నిద్దురోయని
[10–258

రీతిగా సింగారించి రేయిఁబగలుఁ బాలార్చ
పూతల సింగార బొమ్మ గలిగెఁగా నీకు
[17–482

పాలికిచ్చిన రాసి
పండిన కర్మఫలము పాలికిచ్చిన రాసి
అండనే శ్రీ వేంకటేశుఁడైన లోక
బంధుఁడు
[8–281

పాలిమాలు
నీటుల మిత్తి పన్నెల వేఱు విత్తు
పాటించి చూడ రూపము పాలుమాలి
[వ. యో. వి. 2–1040

పాలు
నెలఁతల మర్మము నీ కొక్కనికె పాలు
అలరిన నీ రతులు ఆమె పాలు
[13–69

పాలుకొను
పాలుకొనెఁ బులకలు పమ్మె
సిగ్గు మొలకలు
గోలదానవా యేమే గుట్టు దాఁచేవే
[14–76

పాలుపు
సోలి నే వీరిఁ గొలిచే సూత్రపు
బొమ్మ నింతే
పాలుపుఁ గర్మములాల పట్టుకురో
మమ్మును [5–289

పాలుమాలు
పాలుమాలే మంకునైనా పనిసేయించు
నీ మాయ
రేలుఁ బగళ్ళొకరు ప్రేరేఁపుచుండ వలెనా
[8–237

పాలువట్టు
పాయపు వలపు తొల్లే పాలువట్టే
వార మింతే
నాయములు చెప్పి మిమ్ము నవ్వేటి
వారమా [14–134

పాలు వెన్నగాఱు
తేటి కన్గొనఁ జెక్కు దెనఁబాలు వెన్న
గాఱెడు యీ ముద్దుగాఱెడి వారి
[అ. మ. క. 3690

పావ
ఇందాఁక రాకుంటితే నిది పావ గావలెనా
చందాలు చెప్పవచ్చేవు సాదించవచ్చేమా
[17–513

పావాలు
దంతపుఁబావాలు మెట్టి
పంతాన నేను వాఁగాను
యింతలో బలిమిఁ బట్టేవు వెంకటేశ
అంత నీకుఁ బ్రియమైతినా
[13–223

పాసిక
అంతలోనే పగడ పాలాడుమనే వాఁడెను
యింతి యలసెఁ బాసిక లెత్తియ్యరాదా
[13–151

పాసుండు
ప్రాణికై దేహము పాపపుణ్యము సేయు
ప్రాణి వెంటనె బొంది పాసుండదు
[11–3–93

పాసెములూఁ జక్కెరవెట్టు
చనవున వేంకటస్వామి కౌఁగిటఁ గూడి
కినిసి పాసెములూఁ జక్కెరవెట్టెఁ దరుణి
[4–163

పాశెలపట్టు
పాశెలపట్టుకుఁ బోరో బ్రహ్మా
రుద్రాదు లిందరు
పాలసముద్రాన హరి పవ్వళించెను
[9–236

పిండిలి వండు
శరనిధి మంధర శైలంబు గలఁచు
శరణిఁ బిండితి వండుగానేనఁ గలఁప
[అ. మ. క. 6730

పిగ్గె
చేపట్టి యాపె చేతులఁ బిగ్గెఁబొట్టుక
పైపై వీధులవెంటఁ బరువు దోవనీ
[13–58

పిడికిట తృప్తులు
పిడికిట తృప్తులు పితరు లెవ్వనిని
దడవిన ఘనుఁడాతనిఁ గనుఁడి
[5–5

పిడికిటి మొలచేయి
పెట్టిన జంగదండ పిడికిటి మొలచేయి
అట్టె వలిచేయెత్తిన యాయితము
[10–85

పిడికిలించు
పెక్కు పండ్ల గొలలు పిడికిలించినవాఁడు
మిక్కిలి లంకసాధించి మించినవాఁడు
[9–230

పిడిగుండ్లు
వువిద చన్నులనొత్తి పూరడించఁ
జూచితేను
యివె పిడిగుండ్లయితే నేమి నేసును
[14–293

పిడిఁబోవు
పట్టినందుకెల్లాఁ దీసు పాపమే
చవులు నేసు
నిట్టి పిడిఁ బోనీదు నీ మాయ
[9–251

పిడుగు వ్రాలిన మాడ్కి
పిడుగు వ్రాలిన మాడ్కి పెళపెళ నార్చి
పొడు పొడు పొడుఁడంచు పోపీకుఁడచును
[ప. యో. వి. 7–103

పిడుచ గట్టు
పిడుచ గట్టిన యట్టు పెడచేత నడచి
పడసీక పురములోపలఁ జొరఁబొడడి
[11–3–82

పితాళ్ళు
యిచ్చ నెవ్వనిఁ దలఁచి యిత్తురు
పితాళ్ళకు
ముచ్చట నెవ్వని నామములనే సంకల్పము
[9–69

పినుఁగు దాసరి
బినుఁగుదాసరి నొక పెద్దగాఁ జేసి
కొనివచ్చి పొడవునం గూర్చుండఁ బెట్టి
[ప. యో. వి. 5–239

పిన్నవి
మున్నుగా మొలనున్న ముమ్మూలకావి
పిన్నవి వడిమెడం బెనచి తగిల్చి
కడువాడి యేకాంగి కత్తి దేమల్చి
యెడయుచు మెడబూను నంతలోపలనె
నంచులు నచటి స్థానంబులవారు
బంచిన భీతి జేబట్టి గొబ్బునను
బిన్నలి దప్పించి........
[4–321

పిప్పిగట్టు
వుప్పతించి దూరఁగానె వొద్దఁ
గూచుండినాతఁడు
పిప్పిగట్టె సిగ్గులతోఁ బెనఁగేవే
[15–1

కప్పుర మలపినవాఁడు కొఁగిటికి
వచ్చునే కా
పిప్పిగట్టి మరినవ్వి పెనఁగేఁ గాక
[18–164

పగటునఁ దనతోను పంతమాడే దానవచె
బిగువుఁ గౌఁగిట మోవి పిప్పిగట్టె నిపుడు
[18–432

పిలిచి వడమియ్యరే పిప్పిగట్టెఁ బెదవులు
చెలులకుఁ గతలెంత చెప్పినాఁడో
[18–462

పిప్పి చవి యడుగు
పిప్పిచవి యడుగుట పెక్కు
దైవాలఁ గొలిచి
తప్పిన శ్రీ వెంకటేశు కరుణ సాధించుట
[6–49

పిప్పి మీఁగడ
కప్పిదొడ్డివారమైతే కన్నుల
మొక్కినంతలో
పిప్పిమీఁగడున్నదంటూ పెదవు లానేవు
[13–156

పిప్పివంటివాఁడు
ముప్పిరిఁ బెక్కుగాలము ముదిసిఁ
దనియలేఁగా
పిప్పివంటివాఁడ నేను పెనఁగేటి దేదో
[9–65

పిమ్మటి
కమ్మరనంతటఁ బోకక కాఁగుల
పాలంటఁ బోఁగాఁ
బిమ్మటిగాఁ గిందుమీఁదై పెనగితేనే
[15–87

పిరితియ్యక
బింకమునఁ జూడరో పిరితియ్యక నేఁడు
అంకపు దనుజ సంహార సింహము
[5–13

పిరితియ్యు
వేమర నవ్వఁగవచ్చు విరహము పట్టరాదు
ప్రేమము చల్లితే నాన పిరితియ్యదు
[18–476

పిరితీయు
అగ్గలపుఁబ్రేమ చల్లి అంతలోఁ బిరితీసేవు
నిగ్గులు నీడలు గొన్ని నేరుచుకొంటివా
[17–360

పిరిదూరు
సారెసారెఁ బిరిదూరి సాకిమలు చెప్పగావు
కురిచేటి చెలులెల్ల దీవించకుందురో
[16–2–50

పిరివీకగు
వొక్కటివాఁడు దానైతే వున్నచో
నే మేలు చేరు
పెక్కుబుద్ధులఁ బోతేను పిరివీకౌను
[6–94

పిరివీకు
దీకొనిజగములోని ద్రిష్టములే చూచుఁగాని
భీకరపు జన్మముల పిరివీకు చూడఁడు
[10–284

పిరివీకులు
చనవు తా నిచ్చినది చలముతో మాటాడితి
పెనఁగఁబోయితే మరి పిరివీకులె
[14–263

నెట్టుకొని పీరు గడు నిజమనుచు
హరి నాత్మఁ
బెట్టనేరక వృథా పిరివీకు లైతి
[5–121

ఎవ్వరివాఁడాఁగాను యిదె పిరివీకులై
నవ్వుచు నీ శరణంటి నన్నుఁ గావవయ్యా
[9–41

చనవులేనిచోటి జగడాలు
పెనఁగఁబోతే వట్టి పిరివీకులు
[14–265

పిరివీకు సేయు
యెక్కడచొచ్చి జీవుఁడీ కర్మపురుణములు
పెక్కు విధములఁ బిరువీకు సేయఁగా
[16–1–6

పిఱివోవు
పఱవఁగ నోపక తోడీఁబరఁ
బఱివోయెననంగ ఱాలుపెనగొనెఁ గృష్ణా
[రేఫ. 92

పిలిచి బిడ్డ నిచ్చుట
వలరాయని గరిడివంటిదివో వలపు
పిలిచి బిడ్డ నిచ్చిన ప్రియ మిది వలపు
[13-212

పిలుచులు
వలుకల చిలుకల పాటల కోవిలల
పిలుచులుగా చెలి పెంచెనదే
[14-7

పిలిపిలి నడలు
కలకల రవణింపఁ గారుమెఱుంగు
పిలుపనా నింటిలోఁ బిలిపిలి నడల
[వ. యో. వి. 5-576

పిలువని పేరంటము
ప్రియముతో మంచమెక్కె పిలువని
పేరంటము
లయకాఁడు గదవే తొలఁగు బావగారు
[17-355

పిలువని పేరటము
పిలువని పేరటము ప్రియుని వద్దికి వచ్చి
చలముకొనేటి దావి చలమేటి చలమే
[17-297

పిలువని పేరటము పెందలకాడే వచ్చి
కొలువులు నేసిన గుఱుతెఱిఁగించీని
[18-431

పిల్లదీపులు
పిన్నవై గోపాలుతోఁ బిల్లదీపు లాడితివి
యెన్నికమాడుపూరిలో విట్లాడేవా
[8-179

తెగడి నీతోఁ బిల్లదీపులాడఁ బిలిచేవు
[13-201

పిసరు
వసమైన వారిమాట వలచి వచ్చినవారు
పిసరుమందె మేళాల పెంచకుండరు
[13-19

పిసిఁడితనము
పిసిఁడితనంబిది పిమ్మటఁ దిట్టించు
గడు నహంకారంబు కష్టపఱచు
[సి. శ. 43

## పీ

పీరుచు
మచ్చిక దోఁగెదు తాను ముద్దుల
విరిచినాఁడు
పిచ్చిలఁ బూతకి చన్ను పీరిచినాఁడు
[8-235

పీలిచుంగు
పేలరి మాటలాడేవు పెద్దతనమా యిది
పీలిచుంగుతోడి చెల్లి పిల్లరాయఁడా
[6-2-80

పీలిచుంగులు
వచ్చని చీరగట్టిన బలు దొరనంటావే
కుచ్చుల పీలిచుంగుల కొంగువట్టేవు
[14-194

పీలిపించవు పాగ
వమ్మిన పీలిపించవు పాగ చూచి
నీ వనుచు
దిమ్మ విడిచి వొయ్యనె తెప్పిరివె నిపుడు
[16-2-105

## పు

పుంగడుగు
మృదువైన తరుణుల మెఱుగు
బాహులతల
పొదలెల్లఁదూరితూరిపుంగడుగయ్యేరయ్యా
[5-137

పుంటి నొవ్వులు
అంటుకొని మరుఁడొంటి అతివ
నేఁపుట కుంచె
పుంటి నొవ్వుల విరులపోలై మేలు
[12-42

పుండ్లు బూచులు
పురుషోత్తమా యంటేఁ బుండ్లు బూచులు మాను
పరమౌషధ మీతఁడే పాటింప మాకు
[5–286

పుక్కాట
దక్కె శ్రీవెంకటదైవముఁ గొలిచితి
పుక్కాట గర్వము పోదింకాను
[10–187

నిక్కచందురుఁ జేమోమై నిండు గళలు దేరఁగ
పుక్కాట నద్దముతోడి పురుఁడేఁటికే
[13–166

తళుకక వయ్యెదలోన దాఁచిన నీ కుచములు
పుక్కాటైన జక్కవల పొయగాయెనే
[17–94

పుక్కాట సతులు నాతో పురుఁడుకురాగాను
దక్కెనా నీ వంతమదె తగఁజూచేవు
[17–409

పుక్కిటఁ బెట్టు
చుక్కలు మోవఁ బెరికి సుతు (సూరుః) వద్ద వేదాలు
పుక్కటఁబెట్టెఁ గలశాపురహనుమంతుఁడు
[10–167

పుక్కిటి పురాణము
ఇక్కడి సుఖము నా కక్కడ సుఖంబని
ఎక్కడిదైనా నూరకేఁగి యేఁగి
గ్రక్కన శ్రీ తిరువేంకటపతిఁ గానక
పుక్కిటి పురాణమయిపోయెఁ గాలము
[5–48

పుక్కిలి బంటి
పుక్కిలి బంటియ నీతో పొందుల మాటలు నాకు
పిక్కటిల్లె వలపులు పెక్కులేల చాలురా
[18–8

పుచ్చకాయలఁ బరసిపోవు
పరగఁ బుచ్చకాయలఁ బరసిపోదు మంత్రము
గరిమ ముట్టంటు లేని ఘనమంత్రము
[6–153

పుచ్చకాయ లోర్చుట
పొంచి యేమిసేసి నాకు పుచ్చకాయ లోర్చఁగాక
యెంచి వేలఁ జూపితేను యికరము లోర్చున్
[14–131

పుచ్చిన పోక
తెచ్చుకోలు తాలిమల దిట్టతనము చీచీ
పుచ్చినపోకరా చీచీ పోయెఁగా మీకాలము
[11–3–66

పుటమెక్కు
పొలఁతులకాఁకనే పుటమెక్కె మనసు
చలివేఁడి జవ్వనము నందిఁ జిక్కె మనసు
[11–40

పుటమెగయు
కుటిల బహు దైత్యాంతకుఁడవు వెంకటరాయ
పుటమెగసితి జగంబుల యింటికాడ
[5–197

వడిగొని మనసిజ వాయువిసరఁగ
పొడవగు నెఱుకలు పుటమెగసె
[8–19

పుట్టఁగఁ బుట్టినవి
మునుపనె మొక్కులు మోచివచ్చితె తెక్కులు
పొసిగిసీవు పుట్టఁగఁ బుట్టినవే కదరా
[15–215

పుట్టఁగోచి
కొనల వెల్వడు పుట్టగోచియు నెరులు
బెనఁగొన్న నుసుదబ్బ పేఁదు డాకేల
[వ. యో. వి. 2–327

పుట్టచెండు చేయు
యీతఁడా వసుదేవుని యింటిలో నిధానము
చేతనే కంసునిఁ బుట్టచెండు సేసినాఁడు
[10-6

పుట్టచెండులు
తెల్లరేఁగి వీధులనుఁ గేరి పుట్టచెండులాడీ
బల్లిదుఁడు గదవమ్మ బాలకృష్ణుఁడు
[10-172

పుట్టుభోగి
పుట్టుభోగి జవరాలు పొలిఁతి యిది
వట్టెమంచముమీఁదటఁ బవళించే దేవుఁడు
[14-208

పుట్టెడు నీళ్లు
వగఁగొని లోన నప్పటినుండి సొంపు
డిగి కంటకంట పుట్టెడునీళ్ళు కార
[వ. యో. వి. 4-1010

పుడిసిళ్ళఁ జల్లు
పొడవులకుఁ బొడవైన పురుషోత్తమా
బిరుదు
పుడిసిళ్లఁ జల్లితివి పురుషోత్తమా
[7-49

పుణుఁగు కాపు
నేఁడె సుక్కురారము నెలఁతలాల
పోడిమి సేవసేయరే పుణుఁగుకాపు
[14-153

పుణ్యావాజన
పురుఁడువెళ్ళను మరి పుణ్యావాజన నేసిరి
మురిపేన గొల్లెతలు ముద్దాడిరి
[9-220

పుత్తెంచు
నీవెట్టితనమెంతునో నిన్నుఁ బుత్తెంచికట్టి
ఆ వెట్టితన మెంతునో అమ్మరో నేఁడు
[13-4

పునుకతల
పరగ పునుకతల పావనము సేసెమంటా
నిరతితోడ దినము పీట ముంచేము
[8-174

పురపు
వెరవెఱుంగని పురపు వింతలాగుల
యొరపు
మిరుమిట్లుగొను మేని మెరుపు
[4-20

పురవేదనలు
తరితీపువలనఁ జిత్తభ్రాంతి తగఁగలిగె
విరహంబువలనఁ బురవేదనలఁ గలిగె
[5-71

పురిగొను
వరులకై తే నిదే పాపముగాదా
పురిగొని నీవంతఁ బుణ్యమాయఁగాకా
[7-82

పురిగొని యిందుమీఁద పొంచి
విశ్వాసములేక
పెరుగఁగఁ బెరుగఁగ పెచ్చురేఁగఁగాని
[10-211

పొఁగిన శ్రీ వెంకటాద్రిపతి నన్నుఁ
గూడితివి
పోఁగువోఁగు బొందినట్టు పురిగొంట గాక
[17-369

పురుఁటి యింటి రక్ష
నేమపు శ్రీవెంకటాద్రి నిలయుఁడై
యున్నవాఁడే
యేమిటాను మా పురుఁటి యింటిరక్ష
[10-54

పురుఁడు
పుక్కిట నతులు నాతో పురుఁడుకు
రాఁగాను
దక్కెనా నీ పంతమదె తగఁజూచేవు
[17-409

పురుషామృగము
మిన్నక పురుషామృగముల వేఁటలు
పన్నక యాదేరు పడఁతులు భువిని
[9-6

పులకబియ్యము
పులకబియ్యాలఁ బొంగలిపెట్టి
బాలి వలపుల చన్నులను
[14-10

పులిగాయ
వినుకలి చదువుల సదలో వేమరు
మాఁగఁగఁ బెట్టిన
ఘనకర్మపు టొగరుడుగదు కమ్మర
పులిగాయై
[5-307

పులిగూడు దిను
పులిగూడు దిన్నవాని పొందొక్కఁచే
సేసెఁగాని
నలువంక లక్ష్మీనాథుఁ డితఁడే
[5-279

పులిజూజము
వొలిసి పులిజూజము వొడిఁగట్టు
కొని రాఁగా
అలరి నన్నాడించేవు అందగాఁడా
[13-167

పులిబోతు పొందిక
తిని పులిబోఁతు పొందిక నున్న లెక్క
గొనవింటిలోపల గుంఁడించు కొనుచు
[వ. యో. వి. 4-777

పులిమిపుచ్చు
త్రోయంగ మఱియు నందులకునిందులకుఁ
బోయెఁబొమ్మవి వారిఁ బులిమిపుచ్చుటయు
[వ. యో. వి. 6-280

అలవరి వారల నణకించినట్లు
పులిమిపుచ్చిన నిన్నుఁ బోనము నేఁడు
[వ. యో. వి. 7-1006

పులి మేలుకొన్న చందము
కుపితుఁడై పులి మేలుకొన్న చందమున
నపుడు వారలఁజూచి యంతంద కినిసి
[వ. యో. వి. 6-283

పులు కడిగిన ముత్తెము
మున్నే పులుకడిగిన ముత్తెమువంటి వాని
చన్నులపై కస్తూరేల సారె నంటించేవే
[18-525

పులు కడిగిన ముత్యము
ముంగిటఁ బులుకడిగిన ముత్యమువలె
నున్నాఁడు
కుంగని రాజసముతో కొండవంటిదేవుఁడు
[8-125

పులుగు దోషము
పులుగునెక్కినవాఁడే పులుఁగుదోషపురక్ష
బలు బాలుఁడైనవాఁడే బాలగ్రహ రక్ష
[10-54

పులు మానిసి
చిత్తములో నిన్నుఁ జింతించ నేరక
మత్తుడనై పులుమానిసినైతి
[5-19

పులు మేపు
చెలఁగి యధర్మము పుట్టింప నీకేల
సృష్టింపఁగ మరిపీకేల
పులులను లేళ్ళ నొక్క కదుపుగా
పులు మేపుదురటె మాధవుఁడా
[9-180

పువ్వక పూచు
అవ్వల మాటలాడఁగ నందుకె తా
మాటాడికె
పువ్వక పూచినట్టు పుల్లఁబారును
[17-28

పువ్వక పూచె నను
నవ్వకుండఁగానె వట్టి నవ్వు నవ్వే
రెవ్వరైన
పువ్వక పూచె ననేరు పోవయ్య రాక
[12-58

పువ్వు కంకటి
ఉంకించి యవ్వు డయ్యోనవరి పువ్వు
కంకటి మీఁదు దిగ్గన డిగ్గనుఱికి
[వ. యో. వి. 3-1010

**పువ్వున పుట్టిన పూప**

ఎవ్వరి నేమనలేవు యింతే నేసి నోపమి
పువ్వునఁబుట్టిన యట్టి పూఁపవంటివాడవు
[15-5

**పువ్వువంటిది వలపు**

యెవ్వ తానయిచ్చినదో యింతకు
నేరఁడు తొల్లి
పువ్వువంటిది వలపు పోనియ్యఁ గదరే
[17-154

## పూ

**పూఁచి నట్టుగు**

హత్తి శ్రీవెంకటేశు దాస్య మధీనము
జన్మము
పొత్తులనందుకు నది పూఁచినట్టయ్యీని
[9-95

**పూఁచి పెంచు**

పుట్టించినవాఁడవ పూఁచినన్నుఁ బెంచలేవా
కట్టఁగడ నమ్మని నాకడమే కాక
[8-6

**పూఁచి వాఁగు**

పొదలుఁ బూదండలవే పూఁచి వాఁగే
ఘంటలవే
యెదుటఁ దిరువీధుల నేఁసీ సేవించరో
[9-212

**పూఁచు**

నీ వోజగాదిరి నిన్నె అగనా
బూవపు సరసాలేల పూఁచ వచ్చేవూ
[9-209

**పూఁచుకొను**

కొంకి తిద్దేదేకాని గురియైన రతిదాఁకా
బొంకపు బూతుమాటలఁ బూచుకున్నది
[14-210

**పూచికొలుచు**

సర్వేశ్వరా నీతో సరియెవ్వరు
పూర్వపువారు చెప్పఁగా బూచికొలిచేఁగాని
[7-69

**పూచినట్టి సంపెంగ**

వున్నతినలమేల్మంగ నురముననుంచువేళ
పెన్నిధై పూచినట్టి సంపెంగవలెనుండెను
[8-165

**పూచిన తంగేడు**

పూచిన తంగేడువలెఁ బొలఁతినిలుచున్నది
కూచుండు మనరాదా కోరి నీవద్ద
[18-177

పూచినతంగేడువలె పొలఁతిదండనుండఁగ
యేచి కూచుండు మనవిదేమయ్యా
[15-23

**పూచినదేహము**

పూచిన యీ దేహము పువ్వుగాని
పిందె గాని
చేచేత నెవ్వరికిఁ జెప్పనోపఁ బ్రియము
[8-7

**పూజ కుండలు**

దొంతిఁబెట్టి వలపులు తోరపు బూజ
కుండలా
పంతాలు సంగడిఁ బారబండికండ్లా
[13-121

**పూజఫలము**

వాజి వాహనములట వాఁడిలేదట తొంటి
పూజఫలమిది వెలిత భోగమూఁ గాదో
[5-150

**పూజ్యము**

కొలిచి మాడలుకట్టు గుండలుఁ దూచి
నిలువ పూజ్యముగ నన్నియును జెల్లించి
[వ. యో. వి. 6-608

పూఁట కాఁపు

ఎట్టు గడియించెనమ్మ యీ వలపు
పుట్టించినటువంటి పూఁటకాఁపు మరుండు
[4–23

నుదుటవ్రాసిన వ్రాలు నూరేండ్లవ్రతము
పొదలు నా కర్మమే పూఁట కాఁపు
[5–294

పూఁట పూఁట

కలదింతె మాఁట కంకునియాఁట
తెలుసుకో నీలో నిదియె పూఁటపూఁట
[15–16

పూఁట పూఁట వరాలు

మేటిశ్రీవెంకటము మీఁద నొనఁగే విదివో
పూట పూఁట వరాలు పురుషోత్తమా
[7–47

పూఁటలు వడు

వలుమాఱు శపథముల్ పలికెడు నాతండు
పూఁటలు వడునటి పోటుకాఁడు
[సి. శ. 13

పూఁటవెట్టి

తోడికఁ దప్పించునిదె తోఁటి
కళావతిఁ బూఁట వెట్టియే
[శృం. శ. 44

పూఁటవెట్టు

కోపుల రాజులనెల్ల కొలిచి కొన్నాళ్లు మేను
చూపుడుఁ బూఁటవెట్టితి సొగిసి నేను
[10–142

ముంచి చిగురుమోవి నీమోవి మోఁపె
నని చెప్పి
పొంచి వసంతుని నీకుఁ బూఁట వెట్టినట్లు
[13–62

కాకరివై దూరేవు గక్కన విడెమీనంటా
పోకులఁబోక నీ వాపెఁ బూఁటవెట్టరాదా
[14–1–97

పూఁత కోకలు

వొకటిఁ గోరరు వొరులఁ గొలువరు
వొల్లరు బ్రహ్మాది పట్టములు
అకటా వీరల పరియనఁ బాపం
బాఱు మతంబుల పూఁతకోకలక
[5–239

పూఁత మాటలు

పూఁతమాటల సొలపు బొంకులనె దూరేవు
యీఁతలేని చల్లులాట యేమిసేసేవే
[12–195

పూదియలు గాదియలు

చుట్టుప్రోవులఁ గొలుచులఁ గూడఁబెట్టి
దిట్టకూళలకుఁ బూదియలు గాదియలు
[అ. మ. శ. 170

పూనీటి యెసరు

పూనిక నొక కల్వ ప్రోయి యమర్చి
పూనీటి యెసరునం బొలుపారుచున్న
[వ. యో. వి. 5–606

పూఁవలుఁ బిందెలగు

పూఁవల నవ్వులతోడి పొలతులఁ జూచి
చూచి
పూవలుఁ బిందెలునై పొల్లువోయఁదవము
[5–226

పూఁవలుఁ బిందెలు పుట్టు

పరమయోగములఁ బూఁవములఁ
బిందెలు పుట్టి
వరగె సురలనే వందిటయందు
[6–222

పూప కొడుకు

నీ పాదతీర్థమునెత్తి మోచె నొకఁడు
పూవకొడుకై యొకఁడు బొడ్డున బుట్టి
[8–76

పూపతలపోఁతలు

పూవ తలపోఁతలకు పుట్టినయిల్లని యేదో
పైపై నూర్పులు విలువఁగఁ జోచేదో
[7–184

పూప సంసారము
పూప సంసారము నమ్మి పుంగుడై యున్నాళ్ళదాఁకా
దాపులేక బ్రతికితి దానికేమి
[9-42

పూప సుఖము
పూపసుఖమూ నొల్లము పొంచి దుఃఖమూ నొల్లము
చేపట్టి బ్రహ్మానందము శ్రీ వెంక టేశుఁ డిచ్చెను
[9-197

పూపిందగు
వెదవడి పుత్తులు ప్రోత్రులే విత్తులు లోలో వెలులచిము
పొదిఁ గర్మపు పూమారదు పూపిం దయిన దిదే
[5-307

పూరిఁ గరచు
పోఁడిమితో భీతివాయ పూరి నోళ్ళఁ గరవరో
ఆఁడువార మనుకోరో అతఁడు దడవఁడు
[7-11

పూరి కరచు
కరణచోరఁగ నీకు సారెనాజ్ఞ వెట్టరాదు
సరిఁ బూరిగరవఁగ చంపరాదు
[5-326

పూరి గఱచు
పీడని కర్మము నీకు వెఱచి పూరిగఱచే
మీడనే ధర్మధార మాకింకనైనాఁ బట్టవో
[6-40

పూరిఁ గఱవఁజేయు
తఱచుగా రిపుల నుద్ధతి పింఛ పింఛ
గఱవనేయుచుఁ బూరి గఱవఁ జేయుచును
[అ. మ. క. 7117

పూరిజీవులు
ఊరకైతే నిన్నుఁగాన మొక కారణానగాని
పూరిజీవులము నీవు పురుషోత్తముఁడవు
[6-161

పూరి మేపు
పుట్టించిన హరి పూరిమేపునా
గట్టిగా రక్షించుఁగా కతఁడు
[5-320

పుట్టించిన దైవము పూరిమేపునా మమ్ముఁ
బట్టిన పూర్వకర్మపు పాసిపొయ్యీనా
[8-7

పూర్ణాహుతిఁ జేయు
యెడయక కౌశికుని యజ్ఞము గాచినమ్మ
అడరి రావణుని పూర్ణాహుతిగఁ జేసెను
[8-133

పూవక పూచు కావక కాచు
కతలు పూవకపూచె కావకకాచె
[14-214

పూవు
వలపే పూవఁగాను వాసనలు మానునా
[14-152

పూవు పిందెవలె
పూవు పిందెవలెఁ బొడమి వున్నవి
యేవల యీ రెండు నేకమే
[8-105

పూవుఁ బరపు
తిరువేంకటాచలాధీశ్వరుని కనుగిరుపు
తిరుణి కిటువంటి మెత్తని పూవుఁ బరపు
[4-20

పూవెంత ఫలమెంత
పూవెంత ఫలమెంత పురుషోత్తముఁడు నీ
భావమెరుఁగువాఁడె వరతత్వవేది
[11-68

పూసగుచ్చినట్టు
వాసితో నుండుచే మేలు వనితకు
పూసగుచ్చినటు తన్నుఁబొగడేదే మంచిది
[18-391

పూసగుచ్చినట్టు చెప్పు
పూసగుచ్చినట్టు నీకు బుద్ధులు నేఁజెప్పితేను
ఆసతో నామోవి మోవినందుకోనేవు
[17-564

పూసగుచ్చిన దారము
పూసగుచ్చినదారము పోనీఁడు తానన్నును
వాసితో వీరివారి వెనువెంట వలలఁ
దిరుగుట చాలదా
[17-449

పూసఁగుచ్చు
వాసికెక్కించి నీతో వాదులెల్లా మానేఁగాక
పూసగుచ్చి నీ గుణాలు పొగడరాదా
[13-46

పూసగొండి
వాసితోడి సిగ్గులు వన్నెకెక్క నన్నిటాను
పూసగొండి(?) సిగ్గులై తేఁ బోదిసేయరాదు
[18-445

పూసగొండి మాటలు
వాగరుదీపుగా నీవు వోరగండ్లఁజూచినా
మగటిమిఁ బూసగొండి మాటలెల్లా
నాడుదూ
[18-34

పూసవలెఁ గట్టుకొను
నేసవెట్టిన సతులు చేరి కొలిచే రింతే
పూసవలెఁ గట్టుకొని భోగించేరచే
[18-532

పూనుకొను వాసుకొను
పూసుక వాసుక వచ్చి పొందులు
నీతోఁ జెప్పి
వేసరించే కాఁగిటిలో వేడుకున్నదా
[17-506

## పె

పెంకులలో వాన
కోరి ముత్యపుఁజిప్పలఁ గురిసిన వానయు
సారె బెంకులలో వాన సరియౌనా
[6-44

పెంచువలె నలినలియగు
ఇల నిందటి నుతియించి పెంచువలె
నలినలి యైనది నా జిహ్వ
[5-56

పెంచెము
నించి శ్రీవెంకటేశుఁడు నీ కాఁగిటఁ
గూడినాను
పెంచె పుటురాన నిన్నుఁ బెట్టుకొనేఁగా
[13-130

పెంజమాటలు
అంగపుఁ జిటుఁజెమట లర్ఘ్యపాద్యా
చమనాలు
సంగతిఁ బెంజమాటలె జలకములు
[18-273

పెంట
యిరవై శ్రీ వెంకటేశ యిదె నన్ను
గూడితివి
పెరరేఁగిన రతులు పెంటలుగఁ జొచ్చుమ
[13-19

ఇంటికివచ్చినదాన నెగసక్కము సేసేనా
పెంటలుగాఁ గాఁగిటిలోఁ బెనఁగేఁగాక
[13-99

నంటుతోడి సరసాలు నాగవల్లి సోబనాలు
పెంటలైన సమరతి పెట్టినపేఁట
[15-199

జంటల నీచన్నులు జవ్వనపు చెన్నులు
అంటఁగాఁ బయ్యెద నేల అడ్డెము సేసేవే
వెంటనే కూడితివి శ్రీవెంకటేశుఁడనునేను
పెంటలుగ నిట్లానె పెనఁగఁగరాదా
[15-249

పెంట పట్టు సరసాలు
వొంటి నేనుండఁగాను వొడివట్టి పెనఁగేవు
కంటిఁగంటి గురుమ కతలేల
వుంటిమి నీ వన్నిటాను వొరవరి వొదువు
పెంటపట్టు సరసాలఁ బెనఁగనేల
[15-231

పెంటలగు
బెరవెసంపదలెల్ల పెంటలై శ్రీవెంకటాద్రి
తిరమై మించిన దేవదేవుని పెండ్లికిని
[8-21

మారుమో మయ్యేవదేమె మగువ
నీ మోము కళలు
పేరడై వొక్కచోటనె పెంటలయ్యీ
జుమ్మీ
[15-26

పెంట వెట్టుకొను
ఇంటవాన నేనుండఁగా యెరవునతమానీకు
పెంటవెట్టుక నావద్దఁ బ్రియాలు చల్లేవు
[15-269

పెండ్లి కట్నము
జాడతో వాయించరె పంచమహా
వాయిద్యాలు
యీడనె పెండ్లి కట్నాలియ్యరె యిద్దరికి
[15-55

పెండ్లికూతురు
పెచ్చువలపులఁ దానె పెండ్లికూతురై
వున్నది
[14-259

పెండ్లి విడెము
కిట్టి రుక్మిణీదేవిఁ గృష్ణుఁడు పెండ్లాడివచ్చె
పెట్టుడిందరికి నేఁడు పెండ్లివిడేలు
[15-55

పెండ్లి వీడేలు
మంతనపు మాఁటవాఁడు మరి
గుట్టుతోడి వాఁడు
వింతలేక తగఁ బెండ్లి వీడే లెట్టువెట్టెనే
[18-367

పెంపుడుఁ బేయ
పెలుచఁ గోవెలయన్నఁ బెంపుడుఁ బేయ
కెలయుగిరంబు మిక్కిలి వాతరట్టు
[వ. యో. వి. 5-1385

పెంపు సొంపు
సంపద మెరయుచు సంజీవి దెచ్చితి
పెంపును సొంపునుఁ బేర్కొన వశమా
[9-132

పెచ్చు
పెచ్చువలపులదానే పెండ్లికూతురై వున్నది
రచ్చనేసే వెందాఁక రావయ్య లోనికి
[14-259

పెచ్చుపెరుగు
అచ్చిగొండి నీవంటి నెలఁతనా నేను,
యింత
పెచ్చుపెరిగేవదేమె పిన్నదానవా
[4-105

యిరవై శ్రీవెంకటేశు హితుఁడై
యెప్పుడు బెచ్చు
పెరుగుచు నున్నవాఁడు పెద్ద
హనుమంతుఁడు
[10-158

పెచ్చురేగు
పురిగొని యందుమీఁద బొంచి
విశ్వాసము లేక
పెరుగఁగఁ బెరుగఁగ పెచ్చురేగీఁ గావి
[10-211

పెట్టనికోట
పెట్టనికోటిందరికిఁ బెండ్లి కొడుకు బొమ్మఁ
బెట్టిన సురలకెల్లఁ బెండ్లి కొడుకు
[12-185

ఇంత వాసిగలదానివేల నవ్వితివే ముందు
చెంతఁ బెట్టనికోటవై చెలఁగవద్దా
[13-239

పొలసి యాడెడిమాట సుమాళము మీఁది
పాట
పెలుచుఁ గామినులకుఁ బెట్టనికోట
[17–526

చుట్టును విలసిలుచుం దనుఁదానె
పెట్టనికోటయై పెంపొందుచుండ
[వ. యో. వి. 596

పెట్టుజెట్టు
వలపులు చవియంటా వంతులకుఁగొసరేవు
చెలి యీ విభుఁడు పెట్టుఁ జెట్టా నీకు
[13–97

నివ్వటిల్ల నీయంత నీ వెఱుఁగ వింతేసి
చివ్వన నౌకరి పెట్టుఁజెట్టవే యెపుడును
[

పెడకొడములు
పెట్టించె ఆసలను పెడకొడములఁ దన్ను
తిట్టించె నిజద్రవ్య దీనకులచేత
[5–127

పెడగంతలు దీయు
పెద్ద తెరవుండఁగాను పెడగంతులు దీసుక
పొద్దువోక యడవులఁ బుంగుడయ్యేరు
[9–94

పెడచెవుల మంత్రము
పెనఁగి పెదకఁబోతే పెడచెవుల మంత్రమై
వినవచ్చీ మాటలలో వీఁడివోహరి
[8–57

పెడచేతతో చేత
పెడచేతలో చేత బెరసి కొందరిఁ గొట్టె
అడరి దానవుల హనుమంతుఁడు
[9–13

పెడతటి గండఁడు
కాయపుఁ బెడతటి గండడు విధి
దనుఁగడతేర్చిన తన కడ కర్మములు
పోయి సంచితంబులఁ గలసినవి
పొదలుచుఁ గొండలపొడవై పెరుగు
[5–199

పెడతల
చేరి నిన్ను బూజించని చేయి
దంతెనపుఁ జేయి
తారి నీకు మొక్కనట్టి తలమే పెడతల
[7–216

పెడతలఁ బట్టించు
వడి నహంకృత విప్రవరుల నాలుకలు
పెడతలఁ బటించి భీతులై వారు
[వ. యో. వి. 2–1824

పెడఁబాపు
చలపట్టి కరిరాజు శరణంటే విచ్చేసి
కలుషముఁ బెడఁబాపి కాచినట్టు
[6–85

దురితము లణఁగించ దుఃఖములు
పెడఁబావ
గరిమఁ గేశవ నీవే కలవు నాకు
[9–162

పెడఁబాయు
సిగ్గులెల్లాఁ బెడఁబాసె చేరియెవ్వరునవ్వినా
యెగ్గుపట్టదు మనసు యెఱుకతోనే
[6–4

వంత నావల్లవచ్చిన వగపెల్లాఁ బెడఁబాయు
చింతదీర్చు కొంతగాక సిగ్గువదేదా
[14–61

చింతలెల్లఁ బెడబాసె చెక్కుచెయి
దియ్యవమ్మ
కాంతు డింటికి విచ్చేసె కడమదీరె
[17–113

పెడమర
పెడమరలుండఁగాను పేరునఁ బిలువకురా
వడిమురిపెములు గర్వపువారమూ
[17–155

పెడమరలించు
నిలిచిన నిలువుకు నిచ్చలు మొకచే
మలయని పతిఁ బెడమరలించెఁ గనక
[15–119

పెడమరలు
పెడమరలి అటుచూచి పెదవులనె
నినుఁ దిట్టి
వడఁతి మరలెను నీవు పైకొనినను
[15-124

పెడరేఁచు
దీవన మనియెడి తీరని యాస
రేపుమాపుఁ బెడరేఁచఁగా
తోపునేయఁగరాక దురితపు తరువుల
కాపదలకు లోనాయ బ్రదుకు
[5-153

పుట్టుచునే కన్నవారిఁ బుట్టినవారి నాసలఁ
బెట్టిపెట్టి దుఃఖములఁ బెడరేఁచనా
[5-202

ఆమని పంచేంద్రియాల నటు
పెడరేఁచు వాఁడు
నేమపుఁ బుత్రదారలై నిండుకుండుఁ గాక
[7-245

బడఁబడఁగదవో వో మనసా
పెడరేఁచి యతఁడే పెనఁగీఁ గాక
[8-126

పెడవాడఁ బెట్టు
వెట్ట సంసారమిది వెంకటేశుఁగొలువని
వట్టి మనుజుల పెడవాడఁ బెట్టుఁగాక
[5-119

పెదవుల వుడుకఅచు
తోరంపుఁ బెనుచేతుల మల్లచఱచి
దారుణలీలఁ బెదవుల వుడుకఅచి
[11-3-82

పెదవులెత్తి చదువు
తుద సూర్యమండలముతోడ
మోము దిప్పుకొంటా
పెదవులెత్తి చదివె పెద్ద హనుమంతుఁడు
[11-175

పెదవెత్తు
చదివియు ఫలమేది శాంతముగలుగుదాఁకా
పెదవెత్తి ఫలమేది ప్రియమాడు దాఁకను
[5-262

పెద్ద కొలువు
మొక్కుకువె నిన్నతఁడు మొగము
చూచిన దాఁక
గుక్కుచు నింతుల పెద్ద కొలువులోన
[15-260

పెద్దరికెము
పొద్దువోదా వలపులు పోగులు
వోసి వున్నదా
పెద్దరికేలకు నేల పిలిపించేనే
[14-69

వద్దనా విడువవు వాకిటఁ గూచుండీ నీ
పెద్దరికెలెల్లా నాతో పెంచి చెప్పేవు
[17-348

పెనకువ
చనవుగలిగిన యడల సరస మింతయి
నమరు
పెనకువలుగల యడల ప్రియములును
నమరు
[13-34

పెనగొను
పెనగొని భటులకుఁ బెట్టిన కొలఁదియు
వనులును గుర్తులు వంతములు
[7-188

పెనగొని వారల పేరులు మరచిరె
మనుజ కీటముల మరెవ్వఁ డెరుఁగు
[8-255

పెనగొన్న జంతువులుపెక్కులెన్నెగలవు
వనిగొన్న నీ దాస వరికరములే
[9-255

పెనగొన నాతనిపేరు నుడిగినను
తనకు మహానందము లేమరుదు
[10-174

పెనపరి
పెనపరి మాటలెల్లా పెదవిపై నూరి పూరి
తనివోని యధరామృతముపై నిలిచెను
[13–139

పెనపులఁ బెట్టు
యెనసె శ్రీవెంకటేశ యిటు నీ
వాదరించఁగా
పెనపులఁ బెట్టవుగా ప్రేమపు వలపులు
[15–7

పెరరేఁచు
నేరఁగలదొక్కటే నిశ్చల బ్రహ్మవిద్య
వారివారి యంతర్యామె వచ్చి పెరరేఁచీని
[6–184

చేకొని నీవు పెరరేఁచిన యీ చైతన్యము
పైకొని ఆ కర్మముల పాలుసేయఁదగునా
[8–55

అరుదుగ నంతర్యామగు దేవుఁడు
పొరిఁ బెరరేఁచుటె పొందేఁగాక
[8–75

తిరుగాఁ దమలో నుండే దేవుఁడు
పెర రేఁచఁగా
మేరతోనే జీవులెల్లా మెరసేరు వీరెవో
[8–243

కడుఁదమకము నీకు గమ్మి పెరరేఁచితేను
అడరి నాతో మాటలాడకుందువ
[17–563

పెరరేపకుఁడు
నిరతి నింద్రియాలకు నే వెఱవ నీ వాత్మఁ
బెరరేఁపకుఁడవై పెరిగితేఁజాలు
[5–228

జీవునికే కాలము శ్రీహరి చేరువ
బంధువుఁ డితఁడు
భావము లోపలి పెరరేవకుఁడై భక్తి
చేకొనును యీతఁడు
[7–158

పెరరేఁపణ
దైవమా నీ పెరరేఁపణ లివి
తప్పక వున్నవి జీవులకు
భావించి కాదని దొబ్బి దీకొనఁగ
బ్రహ్మాదులకైనను వసమా
[6–190

సాదింప రెండును జగత్తు మూలము
భేదించి యివి నీ పెరరేఁపణలు
[7–255

పెరరేఁపు
రతిఁ బెరరేఁపుల రంతుల యేఁపుల
గతిమాలితి వీఁక గావఁగదో
[5–141

నిలిచి శ్రీవెంకటేశ నీవే నాయెదలోనుండి.
మలసి పెరరేఁపుచు మన్నించేవు గాక
[6–38

పెరరేఁపులు
నిండిన మా కోరికలు నీ పెరరేఁపులే
వుండఁ జోటు నీకు నా వుల్లములోనే
[8–11

పెలుచ
నలుగడ నిందరు నవ్వేరు
పెలుచై తానేల బెదరీనే
[15–254

పెలచ మాటలు
వెలలేని సోయగపు విభుని చల్లనిరూపు
పెలచమాటలనే మరపించేరు సతులు
[4–173

పెలచమాటల రాసిఁ బెట్టనే కాని
తెలియునే మీకు నదృష్టకారణము
[వ. యో. వి. 5–177

పెలుచు
వలచిన సతిగాఁగా వడిగిందు పడెఁగాక
పెలుచు వేరొక్క తయితే పెను
అట్టు సేయదా
[14-127

పెలుచుఁదనము
చలము మానినఁ గాక సమ్మతింపించ
వచ్చునే
పెలుచుఁదనపు నీకుఁ బెనఁగె గాక
[15-241

పెల్లురేఁగు
పెల్లురేఁగి తాఁజేసే పెనుఁ గర్మబంధములే
మెల్లనే నానాఁటికి మేను గొప్పచేసును
[9-52

పెల్లెసగు
యెత్తఁబోయిన నిందిరేశుని యాజ్ఞ
నెత్తరాకున్నఁ బెల్లెసఁగు కోపమున
[వ. యో. వి. 7-134

# పే

పేఁట్లురాలు
గంధానఁబూసినపూఁత కడగి లప్పలుగట్టి
యిందుమూగెల మేల్మంగ కింపులాయను
కందుప శ్రీవెంకటేశ కౌఁగిటఁ బేఁట్లు రాలి
సందడి రతులలోన సంగతాయను
[13-144

పెనగొనె హారములు బేఁట్లురాలె గంధము
చెనకి యప్పటినేల సిగ్గురేఁచేవయ్యా
[18-362

పేళ్లగయు
అటమరి పెటపెటమని బేళ్లెగసి
చిటచిట రవములఁ జిరుత పొగలెగసి
[8-239

పేఁడు
పేఁడుచు మాటలెఁ బెరతేనె నీపైఁ
బోఁడి మాపె బూయగానె
వేఁడి విట్టూర్పుల వెనఁగారముల
మాఁడనేల నీకు మంకుగద్దా
[17-383

వాఁడివో నీరమణుఁడు వలసినట్టుసేయు నీ
పేఁడుకొని మాకు నింత పెనఁగ నేమిటికి
[17-404

పేఁడుకొను
వీఁడిగో నిలుచున్నాడు విజవగరములోన
పేఁడుకొన్న ప్రతాపానఁ బెద్ద
హనుమంతుఁడు
[9-230

పేఁడుకొనే మాచలము భేదమా తనకునాకు
పోఁడిమి తనకు నింత బుద్ధివచ్చిన దెవ్వతె
[13-246

వాఁడి మాటలాడేనా వచ్చి నన్నేల పొదిగి
పేఁడుకొని వలపు రేపించెఁజూడ నీవే
[18-277

పేనిపట్టు
నేనూ నీ దేవులనె నిండక వుండుట మేలు
పేనిపట్టి యిందుకేల పిలిచేవు నీవు
[13-128

మోనాననే గొసరినా మోహపుగద్దాతవికి
పేనిపట్టి వచ్చిగాని పిల్వరే వాని
[17-188

పేయ
పేయబొరఁగా యిల్లు బెంబడిఁ జొచ్చితిఁ
గాక
ఆయెడ నన్నేల తిట్టేవదే మోపె
[13-12

**పేరడి**

క్రూరత్వమునకు కుదువ యీ బ్రదుకు
పేరడి నేమిటి పెద్దలమయ్యా
[5–308

పేరటి మదములెల్ల పెనగొనఁగా నొరుల
వీరసించ కీదేహి యేల మానును
[16–1–8

కారుకాణ వేఁటికి తప్పులేని వాఁడవైతే
పేరడి నాచారములు పెంచేవు గాక
[17–323

ఆరయ రాజసపు వాఁడా నాలెన్ని పెట్టినాను
పేరడి నుండుటె కాని పెనగరాదు
[17–342

అనుమానము లేదని అన నీపెఁ బెట్టగాను
పెనచి నీ వామాట పేరడిఁ బెట్టేవు
[17–423

**పేరడి యగు**

మారుమోమయ్యేవదేమె మగువ
నీ మోముకళలు
పేరడై వొక్క-చోటనె పెంటలయ్యీఁ
జుమ్మీ
[15–26

**పేరనిపాలఁ దోడంటు........**

సారెఁ బ్రియముచెప్పినా నవతులనమ్ముదురా
పేరనిపాలఁదోడంటు బెట్టితేను పేరునా
[13–254

**పేరఁబెట్టు**

యీ రీతి నన్ను నేలె యింకాఁ గొనరితేను
పేరఁబెట్టితే పాలు పెరుగే కాదా
[13–241

పేరఁబెట్టితే వలపు పెరుగువంటిదె పో
కేరికాఁచఁబోతే విరిగిపోవుఁగాని
[14–59

**పేరించు**

పెనఁగఁగా మర్మాలు ప్రేమనెంతగరఁగెనో
తనిపి పేరింతునచే తరితీపుసిగ్గులా
[18–353

**పేరిన తేనె**

యీ రీతి వెదురుబియ్యమేరనో పేవా
పేరిన తేనెలు తెచ్చిపెట్టనో పేవా
[12–224

**పేరు**

సారెఁ బ్రియముచెప్పినా నవతులు
నమ్ముదురా
పేరనిపాలఁ దోదంటుపెట్టితేను పేరునా
[13–254

**పేరుకొను**

యీరీతి శ్రీవెంకటేశ యిట్టె నన్నుఁ
గూడితివి
పేరుకొని యిఁగ విన్ను ప్రియాన
మెప్పింతును
[13–26

**పేరుపడు**

నారదాది సనకసనందనాదులవలె
పేరుపడి నిన్నుఁబాడి పెద్దలైనట్టి
[6–24

**పేరుపు**

తొరలఁగాఁచినప్పుడు తోడంటుపెట్టి
నప్పుడు
పెరుగుఁ బాలును నొక్క-పేరుపునేగాదా
[15–222

**పేరుపెంపు**

ఊరులేని పొలమేర పేరుపెంపులేని
బ్రతుకు
గారవంబులేని ప్రియము కదియనేఁటికే
[12–55

**పేరుమాల్చు**

బింకపురాకాసుల పేరుమాల్చినవాఁడు
వంకలవంకలమేన వన్నెపెట్టువాఁడు
[4–156

పేరులువారు
ఆరూఢగతులనయ్యా కృష్ణయనుచు
పేరులువారి గంభీరవిక్రమములు
[అ. మ. క. 4188

పేరువాడు
చేరి కర్మములు నన్ను చెఱవట్టుకుండఁ గాను
పేరువాడివచ్చి విడిపించుకొంటివి
[5–300

బలవంతుఁడైనవాఁడు భయములిన్నిటిబాసి
గెలిచి పేరువాడుచుఁ గెరలీనటా
[8–34

పెక్కుదేవతలు పేరువాడె దరు
తక్కక ఘనలము తామే యనుచు
[9–59

పేరు వీఁపున వ్రాయు
పెనఁగకవుండవయ్యా పేరు నీ వీఁపున వ్రాసే
[13–216

పేరెమువాఁడు
తగఁబచ్చపదకంబు తళుకుల మెఱుఁగు
చిగి చన్నుగవచుట్టుఁ బేరెంటువాఁడు
[వ. యో. వి. 2–194

పేరెలువారు
పెలుచులంకముంగిట పేరెలువారెను తేరు
చెలఁగె దిగ్విజయపు శ్రీహరితేరు
[6–227

పేలరి
అలరి శ్రీవెంకటాద్రి నాటలాడనే మరగి
పేలరియై కడుపెచ్చువెరిగీనమ్మా
[8–17

యీలాగుల శ్రీవెంకటేశ ఆకెఁగూడితివి
పేలరియై జాజరాడఁ బిలిచీఁ బోవయ్యా
[17–172

పేలరిమాఁటలు
పేలరిమాఁటలాడిన ప్రియములై తోఁచును
[16–2–66

## పై

పైఁడికత
ఒక్కరికిఁ జెప్పరాదు పూఁకొనరాదు
పక్కననేమనినాను పైఁడికతవంటిరే
[13–235

పైఁడిగాదెలు
కానుకపైఁడిగాదెలకాఁడఁ దన నిజరూపు
ఆనుక వొడమూపేని అఖిలేశుఁడు
[9–222

పైఁడిబొద్దులు
ముద్దులవ్రేళ్ళతోడ మొరవంక యుంగరాల
నిద్దపుంజేతులపైఁడి బొద్దులతోడ
[4–1

పైఁడియము
కన్నునన్నలు నాకేగాదెఁ బోసుకుండితివా
పన్నిపైఁడియమ్ములిన్నీఁ జారవేసితివా
[17–499

పైఁడి వెండి యనుసులు
పాపపుణ్యా లిరువంక పైఁడి వెండి యనుసులు
పైపైగు త్తికె మేటిపై చనిగె
[9–178

పైకొనరు
అదరి శ్రీవెంకటేశ అట్టె నన్ను నేలితివి
బడిబడి నే మేలు పైకొనరాయను
[13–132

యియ్యెడ శ్రీవెంకటేశ యేలితి పదారువేల
నెయ్యాన నన్నుఁగూడితి నిలిచెఁ బైకొవరు
[15–9

పైతరవగు
మనసూ రోసితి మరులూ బాసితి
తనువేలో పైతరవాయ
[9–155

బాగుల నిన్నద్దలించబరవా బొమ్మలను
పొఁగిన యింతి కుచాలె పైతరవుగాక
[15–112

పైతరవు
దండినేఁ బైతరవా తగునా నీకెరవా
నిండుకొనివుండితేనె నీకు నగవా
[15–155

పైతరవుబత్తి
ఆతుమఁదలఁచేవారు అలుకలు చూవుదురా
పైతరవుబత్తిసేసి బదుకుటకాగా
[18–128

పైతరవుబదుకు
వాడిలితోలెనెమ్ముల వాడిగట్టేబదుకు
బడిఁ బుణ్యపాపాల పైతరవుబదుకు
[7–163

పైతరవువెట్టు
మోతఁ గాఁకలతోనే మోమువంచితి
నింతెపో
పైతరవువెట్టి తన్ను బలిమి సేసితినా
[15–96

వోరి నీవు సేసినందు కొల్లకవుంచేనంటే
భారపు నా జవ్వనము పైతరవువెట్టురా
[17–200

పైపచారాలు
సుదిసిపైవచారాలేచూచి సురతసుఖాన
పదఁతులఁ బొంది పొంది పరిణామించేను
[8–37

పైపై చవులు
నడిఁ బైపై వింతవింతచవులే వెదకుఁగాని
విడువని యాత్మకు వెగటిందులేదు
[11–20

పైపైఁ దోయు
మీ పాదాలేకొల్చి మీ యనుజ్ఞగొని దాని
పైపైఁ దోయుటగాక బలిమారాజ్ఞతో
[7–209

పైరులుచేయు
పంచేంద్రియములకే పైరులుసేసితిమి
అంచెలఁ బ్రాణులకిఁక నానాజ్ఞలేలయ్యా
[9–198

పైరువిత్తు
పాపపుపైరువిత్తిన పండిన పంటలలోన
రూపింపఁగ నిందు రుచియేమిగలదు
[5–49

పైరొప్పు
ఈ యింతితో విభుఁ డింపొందుననుచు
నేపునఁ గీరంబులేచి పైరొప్పె
[శృం. మం. 173

పైవచ్చు నైవచ్చు
బలువలతోడి పొందు పైవచ్చు నైవచ్చు
[17–536

## పొ

పొంగణచు
మచ్చికఁ బన్నీటను మారెవరుగాఁబోసి
కచ్చుపెట్టి మల్లెమొగ్గఁ గలయఁబెట్టి
మెచ్చుల మరువమున మింటినట్టి
పొంగణచి
ముచ్చట చిచ్చొకొనమూఁకుడుమూసి
[16–2–101

పొందికఁగల్గు
తెలివ నీతోడి పొందికగల్గువాఁడు
మఱియేల దేవసామ్రాజ్యంబు వెదకు
[వ. యో. వి. 2–59

పొందు అంటుకొను
అమరదో నీవు నేనూ నంటుకొన్న పొందులు
తమితో నా గర్వమింత తగదంటావూ [17-124

పొందులపని
చేకొలఁదిదాన నేను చిత్తము నొప్పించేనా
పైకొన్నవారి పొందుల పనిదీర్చుమనవే [17-561

పొక్కులు
ఈ చూపులు నీ తీపులు నీ నగవులు నీ తగవులు
నీ చొక్కులు నీ పొక్కులు నీ వెడె యలుకలును [5-65

పొగరు మగతనము
పొగరు మగతనానఁ బురుషోత్తముఁ డితఁడు
వెగటై యీతనిపాటి వెదకినలేరు [8-102

పొగరుముంపు
మొగముచూచి నాకు ముందట నిలుచుండఁగా
పొగరు ముంపున నిన్నుఁ బొమ్మందునా [17-590

పొగరుమూఁపుఁదనము
వెగటైన విషయాల వేడుకపడకుమవి
జిగురుఁ గండెలుసుమ్మీ చిత్తమా
పొగరు మూఁపుదనాలఁ బొరలకు మవియెల్ల
తగులు విరిపందేలదారివంటివి [16-1-12

పొగులు
ఎన్నఁడూ నెరగమయ్య యిటువంటి పనులు
నిన్ను నాపెఁ గంటిమయ్య నేర్పుల పొగల [14-92

పొఁజు
చిత్తమనే దళవాయి చింతలనే పొఁజువెట్టి
యిత్తలవిషయములు యెన్నికిచ్చిరి [5-313

పొట్ట పొంకఁబు
బుద్ధిహీనిన చింత బోనియూరికిఁ దెరువు
పొద్దువోవని వలపు పొట్ట పొంకంబు [11-3-30

పొట్టపొరుగు
చుట్టమైనయట్టివాడు సులభుఁడైనట్టివాఁడు
దట్టమై నాకిన్నిటాను తానేకదే
పొట్టఁ బొరుగుననుండి పొరచివెట్టంపి నేఁడు
గట్టిగా నింత కరుణ గలదుగా నాకు [17-149

పొట్టఁ బొరుగు చుట్టాలు భోజనసహాయులే
నెట్టన నీవై తే నిర్వాహకుఁడవు [7-72

పొట్టఁ బొరుగువారితో పురుఁడు నాకదియేల
యిట్టె నీవు నాకుఁ జనవిచ్చియుండగా [17-539

చుట్టరికమైనచోట చుట్టుకొను మొగమోట
పొట్టఁ బొరుగై తేను పొందుగలుగు [18-255

పొట్టు పొరలగు
వీఁగని నామరులిదె నీవు చుట్టుకొవనేల
ఆఁగి నేనే పొట్టపొరలయ్యేఁగాని [15-152

తడయక దేశమంతయుఁ ద్రవ్వికొనుచుఁ
బొడివోసికొని పొట్టుపొరతాచువేఁగి
[వ. యో. వి. 2-736

పొడకమ్ము
గడ్డపార మింగితే నాఁకలి దీరనా యీ
వొడ్డిభవముదన్ను వొడకమ్ముఁగాక [5-119

పొదలువెట్టు
పొదలువెట్టెడి పొగులు పొందువాసి
వాసిన దిగులు
పదఁతికి నిది యెల బరికించఁ బగలు
[4-20

పొదలువెట్టుచునున్న పొలతిభావముచెప్ప
తదఁబడె నాలిక తమకాన [4-106

పొడవుకు పొడవు
పొసఁగని మహిమల పొడవుకుఁ బొడవైన
దినకరకోటితేజమవు నీవు
[7-98

పొడవకుఁ బొడవగు పురుషోత్తముఁడిదె
బుడిబుడి మాచేతఁ బూజగొనె
[8-10

పొడవుకుఁ బొడవైన పురుషోత్తముఁడు
నేఁడు
అదరి తొట్టెలబాలుఁడాయనమ్మ [8-17

పొడవులకుఁ బొడవు
పొడవులకుఁ బొడవైన పురుషోత్తమా
బిరుదు
పుడిసిళ్ళఁ జల్లితివి పురుషోత్తమా
[7-49

పొడవెక్కించు
పుట్టించఁ బెంచఁగ పొడవెక్కించ
దేహాల
గట్టిగా మాఁటలాడించఁగదలించ
[7-85

పొడిఁబడి
అదె పొడిఁబడి పతి యసురుసురనఁగా
వదరి నేఁ బిలుచుట పాడియేనా
[17-156

పొడిఁబడు
వొడలోముకొనకుంటే వుపేంద్రుఁడు
రక్షించు
పొడిఁబడకుంటేనే పూర్ణభావమలరు
[8-152

పొడిబడు
పొలమెల్లాఁ దిరిగాడి పొడిఁబడనేవద్దు
కలఁకక గడ్డపార తవ్వవద్దు
[16-1-54

పొడిబడుకొను
అడియాసఁ దలిదండ్రులదె యిదే
యనుచుఁ
బొడిబడుకొనుచు నప్పురుసెల్లఁ గడపి
[వ. యో. వి. 3-141

పొడుపుడుకతలు
కానివేరా పొడుపుడుఁగతలు వొడువుమని
ఆనవెట్టి నన్నేల అడ్డగించేవు
[16-2-88

పొత్తర
పొదల పువ్వులుగోసి పొత్తరగట్టు
కుండఁగా
వెదచల్లుదురా నాపై వేసాలవాఁడా
[13-167

పొత్తుమీఁద సిసువు
పొసఁగఁ బొత్తులమీఁదఁ బురుఁటింటి
లోపల
సిసువై మహిమచూపె శ్రీకృష్ణుఁడు
[10-1

పొత్తులకాఁపు
యింతట విడిచేవా నన్నింద్రియాలఁ
గట్టివేసి
పొంతఁజూచేవిటు నాకుఁ బొత్తులకాఁపవుగా
[9-169

పొత్తులకూడు
ఉట్టిపై చెరలాట మూరఁబొత్తులకూడు
పట్టుచాలనికొమ్ము (మ్మ ?) బహు
నాయకము
[11-3-5

పొత్తులబదుకు
ఇందుకా కోరిపుట్టె యిట్టిబదుకు
పొందుల శ్రీహరితోడి పొత్తుల మా బదుకు
[7-163

పొత్తులమందు
బుద్దెరఁగక బాలుఁడై పొత్తులలో
నున్నపుడు
కొద్దిలేక తానెవ్వరిగురు తెరుఁగు
[8-268

పొత్తులమగఁడు
కొత్తలు నీచేఁతలు గోవిందరాజ
పొత్తులమగఁడవై భోగించేవిపుడు
[13-183

పొత్తులమగఁడవట పొరచికాఁపురమట
యిత్తల నాపై భక్తి యింకా నీకుఁ గలదా
[15-166

పొత్తులమగువ
పొత్తుల మగువలకుఁ బోవునా యింక
యిత్తలఁ గూడుండుదము యీడ కిచ్చే
రావే
[13-249

పొత్తుల సూత్రము
హత్తిన రేపల్లెలోని అంగనామణులకెల్ల
పొత్తుల సూత్రము మా బుద్ధులహరి
[17-343

పొదచాటుమృగము
ఎదురుచూచిచూచి మెలయించి
వెలయించి
పొదచాటుమృగమైపోయెఁ గాలము
[5-48

పొదపెట్టు
పోయిన ప్రాణంబు పొదపెట్టి తేరాదు
గతజలంబున నడ్డకట్టరాదు
[సం. క. 18

పొదరులాడు
పొదిగి మమ్ము రేఁచక పొపొ నీవు
పొదరులాడక నీవు పొపో నీవు
[17-291

పొదిగొను
పొదిగొని సంసారపుత్రదారలిల
వదలని నీ దాసవర్గములే
[7-283

పొదిగొని యడవుల వెదకి చూచితే
భూవరాహమని కంటిమి
చెదరక కొండల గుహల వెదకితే
శ్రీనరసింహుండున్నాఁడు
[9-81

అదనను శ్రీగురుదయానతిగలుగఁగ
పొదిగొని యివి తలపోయఁగవలసె
[10-96

అదిగో శ్రావణ బహుళాష్టమి నేఁడు
పొదిగొన్న రోహిణి సంపూర్ణము నేఁడు
[10-179

పొదివిచ్చుఁజేయు
పొదివి గొల్లలమూఁక పొదివిచ్చుఁజేయుఁ
డిదెవత్తు మీవెంటనే నింతనంత
[అ. మ. క. 2127

పొదుగుడువలపు
కదిసి నేనుండఁగానె కాఁగిటఁ గూడితివి
పొదుగుడు వలపుల పొదువేల
[15-231

పొద్దగు
కావిరింతయువిరిసె కందుసంధ్యకుఁ
బొద్దాయ
శ్రీవెంకటేశుని విచ్చేయుమనరే
[10-130

ఇందిరారమణుఁ దెచ్చియియ్యరో
మాకిటువలె
పొంది యీతనిఁ బూజించఁ బొద్దాయ
నిపుడు [11-135

పొద్దుగాని పొద్దు
అద్దో నాతో నీవు అలిగి యందుచేరిన
పొద్దుగాని పొద్దనక పొందురు నేనేరా
[13-30

పొద్దుపొడపుఁ గుంకు
భోగించవేళగద్దు పొద్దువొడపుఁ గుంకును
వేగమే హరిఁదలచ వేళలేదు
[5–292

పొద్దుపొద్దు
అద్దములోఁ దననీడ అంతటా మెరసినట్లు
పొద్దువొద్దు తనతోనే భోగాలెల్లా
[9–252

బొమ్మల జంకించఁగాని పొద్దుపొద్దు గాచుకుండి
సమ్మతించ నీ మనసు జట్టిగొంతును
[13–26

పొద్దుపోవు
కొలువువిరిసె నిదె గోవిందుఁడు పొద్దువోయ
వెలుపట నుక్కళాలు వేగుదాఁకానుండరో
[9–2–36

పొద్దుసేయు
నీకు నీకే తెలుసుకో నీ సుద్దులు
నీకుఁ బొద్దుసేసి నవ్వు నవ్వఁదగునా
[15–64

పొద్దొకవిధమయితోఁచు
పొద్దొకవిధమయితోఁచును భువినజ్ఞానాంబుధిలో
నద్దినదిది దెలియఁగరా దంబుదముల మెఱుఁగు
[6–133

పొనిగిపోవు
యెనసెను శ్రీవెంకటేశు డింతసేసినన్ను
పొనిగిపోయిన సుద్ది పోనియ్యఁగదరే
[17–154

చనవరులమానేము సంగడి నీతో గూచుండ
పొనిగిపోయిన సుద్ది పోనియ్యవు
[17–457

పొనుఁగుపడు
మనసులో మర్మమై మరలఁ బారుచునుండు
పొనుఁగువడ్డ మదము పోవఁగనేదు
[7–4

పొరచి కాఁపురము
పొత్తులమగఁడవట పొరచి కాఁపురమట
యిత్తల నాపై భక్తి యింకా నీకుఁగలదా
[15–166

పొరచి చేఁతలు
చెక్కు నొక్కు నొక్కి యిట్టి శ్రీవెంకటేశ్వర నిన్ను
చెక్కు చేతితోడనె తాసిగ్గువడ్డది
పుక్కిటివిదేలఁ గొంత పొరచి చేఁతలఁ గొంత
గక్కన నీకందియిచ్చీ కడమదొడమలు
[17–128

పొరచు
పొట్టఁబొరుగుననుండి పొరచివెట్టించి నేఁడు
గట్టిగా నింత గరుణ గలదు నాకు

పొరఁటు
నుడిగొను నప్పాలు నుకినప్పాలును
పొడిబెల్లముతోఁ బొరఁటుచును
[4–4

పొరపొచ్చెము
పొరపొచ్చెమెట్లుండు పొలయలుకలెట్లుండు
నెరపరికలెట్లుండు నెఱుకలెట్లుండు
[4–27

యీదెస నలమేల్మంగ వెనసితి వితవి
పోదితో నిటుగాకున్న పొరపొచ్చమెంచదా
[14–243

పొరయించు
కరఁగించి కరఁగించి కాఁగిట నిన్నుఁ
గూడఁగా
పొరయించవలదా పొందుల నేఁడు
[14–150

పొరయు
కరకమలమును కందువ గోపికలెల్లా
పొరసి నినుఁజూపుచే పుష్పయాగము
[13–60

పొరి
సరసపుమాట వేసారె నాడి తమనవ్వు
పొరి నీపై జల్లుచే పుష్పయాగము
[13–60

పొరుగగు
యేచిన బంధమిది మోక్షమిదియన
లేమయ్యే
పూచిన పంచేంద్రియాల పొరుగైతిమిదివో
[10–253

పొర్లుగిరుగులవారు
హరిమాయ కంసు మదమడఁచె నేఁడు
పొరుగిరుగులవా రుబ్బొంగిరి నేఁడు
[10–179

పొరుగుపొరచు
వరిగి యాపె నీకు బనులు సేయరాఁగాను
నరి నాకుఁజేయుమంటా సన్న సేసేవు
పొరుగు పొరచిగా నీ పొలతులకుఁ
జేయించు
యిరవు నాతో మాయలేల సేసేవిఁకను
[17–88

పొరుగుపొరచులు
తరుణి అప్పణిగొని తమకించి నాతోడ
యొరవుల నవ్వులు నీవేల నవ్వేవు
వరుసవంతులవారి వాసులగొంతరేఁచుక
పొరుగు పొరచులేల పుయ్యవచ్చేవు
[17–3

పొరుగుపోరచి
పొద్దున నీయింటికి నీపొందులు సేయ
వచ్చితే
సుద్దులు చెప్పఁగవచ్చీఁ జూడకా తాను
బుద్ధులెఱుఁగుదునంటా పొరుగుపోరచి
యింటా
ఉద్దండానఁ జన్నులంటీనో యక్కరో
వీఁడు
[13–96

పొరెవొడుచు
పావనమతిఁ బొరెవొడిచి పరమానందముఁ
బొందుచు
శ్రీవేంకటపతి మనమునఁ జింతించీ
నరమృగము
[5–210

పొలగూడు
దొడ్డమేఁకపొలగూడు దోమటి దొడికి
నాఁడు
గడ్డువయసగు బిడ్డగన్నవాఁడు
[4–43

దేవరొజ్జ లోకవంక దిక్కులతోఁ
బొలగూడు
దీవెనతో నారగించి తీపుమరగి
[6–70

పొలమురాజు
పొలమురాజై తిరిగీ బోయనాయఁడు
వెలయ మోటునమందే వేఁట బోయ
నాయఁడు
[5–285

పొలమురాజవు నీవు పురుషోత్తమా
పొలఁకువదే కంబమునఁ బురుషోత్తమా
[7–49

పొలమురాజులు
అందనే పొలమురాజులుండేటి పొలము
చెండివేసి మాకులెల్లా నెలగిన పొలము
[10–52

పొలయలుక
వరుస మోహపుఁ బసల వలలఁ
జిక్కి-తిఁగాని
గరువంపుఁ బొలయలుక గానలేనైతి
[5-30

కెఱలి కాంతలు నేనుఁగినిసినను
బొలయలుక
విఱిచి కలుపుదువు గాలి విషయబుద్ధి
[11-3-10

పొలయలుక కూటముల భోగి దానటుగాన
మలసి యొక్కొ-కవేళ మారుమొగమాయ
[11-3-39

పొలయలుకలు
అందమధికముసేయు నైక్యములు
పొందులధికముసేయుఁ బొలయలుకలు
[5-88

పొలయాట
చిందుల పాటల శిరి పొలయాటల
అందెల మోఁతల నాడె నదే [12-24

పొలసిపోవు
బలిమిసేయకురే పట్టి పెనఁగకురే
పొలసి పోవచ్చినాఁడు పోనియ్యగదరే
[17-154

పొలసులాడు
పొలసులాడకు నీవు పురుషోత్తమా
బులిసిలోఁగఁగనేల పురుషోత్తమా
[7-49

పొలియు
ఏ గతి నన్నుద్ధరించేవో యింతటిమీఁదట
మమ్ము
భోగపుఁ గోరికలచేఁ బొలిసెఁబోపనులు
[6-61

పొలివారించు
దొంతినున్న వలపులు తూరుపెత్తేవేళలకు
అంతలో పొలివారించె నది మెచ్చవలదా
[14-113

పొలివారు
వెలిధాన్యంబులు విషయపురాసులు
పొలివారేటివూరుపుగములు (?)
[11-3-113

పొంగుచుఁ దూరుపెత్తంగఁ బొలివారె
నివ్వెరగు
[17-442

పొలివోవు
పాపపు వసురము బందెలుమేయఁగ
పోపుల పుణ్యము పొలివోయ
[8-19

పొలిసిపోవు
అంది నిన్ను నొకమాటు హరి యని
నుడిగితే
పొందిన పాతకమెల్లాఁ బొలిసిపోయ
[6-51

పొల్ల
పువ్వులలోపలి పొల్ల పూఁచి చెప్పగలవా
[14-290

తెల్లనాయఁ గన్నులు తేనెగారెఁ గెమ్మోవి
వల్లెవాటుతో నున్నాఁడు వాఁడె చూడరే
పొల్లవద్దనుంటిరి పూనుకవచ్చితిరి
కల్లలు నిజమునందె కానవచ్చెనె
[15-243

బల్లిదుఁడవైతివి బతుకవయ్యా
పొల్లలేకుండా నిన్నుఁ బొగడేమయ్యా
[14-284

పొలకట్టు
బల్లిదుఁ డాతని మాని పరులవేఁడేదెల్లా
పొల్లకట్టు దంచి దంచి పోగుసేసుకొనుటా
[5-223

మొల్లమి గాలియొకటెముంచి తూరుపెత్తు
చోట
పొల్లకట్టు కడఁబడె పోగువడెగట్టివెల్లా
[10-267

పొల్లకట్టుదంచు
వులములో నెంచ నెంచ నుద్యోగములే పెక్కు
పొల్లకట్టు దంచ దంచఁ బోగులైనట్లు [10–80

పొల్లువోవు
పొల్లువోకే మేను నేఁడు భోగించకుండ లేదు
తల్లికడుపులోనుండి తానేమి భోగించెనో [9–139

పొల్లసేయు
పురసతుల మానములు పొల్లసేసినచేయి
తురగంబుఁ బరపేడి దొడ్డచేయి [11–3–122

పొల్లికట్టుదంచు
యెల్లధాన్యములు మా యింటిలో నుండఁగాను
పొల్లికట్టుదంచేమని బుద్ధి మాకేలా [8–190

పొల్లువోవు
పూఁవలనవ్వులతోడి పొలఁతులఁ జూచి చూచి
పూవలుఁ బిందెలునై పొల్లువోయఁ దవము [5–226

కెల్లరేఁగె దేహమంతే కిమ్ముల చుట్టరికాలు
పొల్లువోదెన్నఁడు భూమి పుట్టఁగాఁ బుట్టినది [7–256

తాఁట తూఁటలూ నెలతవచ్చినట్టే వత్తము
పాటించిన నా వలపు పండి పొల్లవోయ్యీనా [13–120

పొల్లైపోవు
నాఁటకమింతా నవ్వులకే
పూఁటకుఁ బూఁటకుఁ బొల్లైపోవు [11–44

## పో

పోఁకవెట్టు
యేరా వొదన్నమాన విల్లురికి నాతోను
మీరినవ్వేవు కోమటి మేనరికమా
వారము వజ్జమనక వాకిట నన్ను నాఁగేవు
పోరచి మావారు నీకుఁ బోఁకవెట్టిరా [16–2–38

పోక అందుకొను
మేటియైన విభునితో మేకులు చూవకువే
తేటవయసుల పూవుఁ దీగెవు నీవు
మాటువేసిమందులనూరి మగఁడు నవ్వులనే
చాటుకుఁ బోకందుకొని సమ్మతించవే [13–103

పోకుమని యాఁవరాదు పొమ్మని చెప్పఁగరాదు
పోకుమని యాఁవరాదు పొమ్మని చెప్పఁగరాదు
మీకు మీకే చూచుకొండు మీరే కనుండు [5–102

పోఁగు పోగు పొందినట్లు
పాఁగిన శ్రీవెంకటాద్రిపతి నన్నుగూడితివి
పోఁగు వోఁగుఁ బొందినట్లు పురిగొంటగాక [17–369

పోఁగెత్తు
చేవలఁబత్తిముదుగు చేనిముదుగూలేదు
వావిరిఁ బోఁగెత్తేటి వారివారి నేరుపు [6–90

**పోగులైన బ్రహ్మలు**
పోగులైన బ్రహ్మలను బొడ్డునఁ గన్న దైవము
శ్రీగలిగి భూపతైన శ్రీవేంకటదైవము
[7-137

**పోగువోయు**
పొద్దువోదా వలపులు పోగువోసివున్నావా
పెద్దరికేలకు నేల పిలిపించీనే
[14-69

**పోచిళ్ల**
అరయ నీ మనసుకు ననుమానమైతేను
పోరచి నీ పొరుగునఁ బోచిళ్ల చల్లరా
[17-212

**పోటిగుఱపుఁబస**
బూటకపు బుద్ధిగల పురుషోత్తమా
పోటిగుఱపుఁబసల పురుషోత్తమా
[7-49

**పోటిఁగోల**
కూటమిదియంతగల్లాగుట్టుననుండువు గాని
పోటిఁ గోలనాటితేనెపోకురా నీవు
[15-141

**పోటిదొర**
తీపు నీకామాఁటలైతె తిట్టించుకొందుగాని
పోపోనే నందుకోప పోటిదొరవౌదువు
[17-287

**పోటుగంటులు**
పోరిఁ గర్మముఁ బొడిచి పోటుగంటులఁ దూరి
మెరగొని తిరిగేరు యేకాంగవీరులు
[6-25

**పోటుపాటు**
నెలవై వుబ్బి సగ్గులే విచ్చలఁ బోటునఁ బాటు
బలువైన యానే బడబాగ్ని
[6-56

**పోడునఱకు**
పొత్తులపాపమనేటి పోడునఱికివేసి
చిత్తమనియెడు చేను చేనుగాదున్ని
[9-70

**పోతఁ జల్లాఱు**
నలువదియేండ్లపై నరసిన వనితలు
పోతఁజల్లాఱిన భోజనంబు
[శి. శ. 54

**పోతరించి కాతరించి పొరలు**
యేతులనందుఁ గొన్నాళ్లు యిందుఁ గొన్నాళ్లు దేహికి
పోతరించి కాతరించి పొరలనే పట్టెను
[8-106

**పోది**
యీ దెసఁ గూడితివి నీ వింతలో శ్రీవెంకటేశ
పోదిగా నాపెఁగూడె పొసఁగె నీపొందులు
[14-223

**పోదిసేయు**
తిమ్మిరెడ్డి మాకునిచ్చె దిష్టమైన పొలము
బొమ్మిరెడ్డి కప్పగించి పోదిసేసెఁ బొలము
[10-52

**పోదెక్కు**
ఆహారము పెట్టితేను అట్టే విడుచు భూతము
ఆహారానకుఁ బోదెక్కనట్టె ప్రాయము
[7-4

**పోదొబ్బు**
కనకముపై యాసకాదని పోదొబ్బితేనే
తనకు వేవేలు ఘోరతపముల ఫలము
[5-255

తొట్టిన పాపపుణ్యాలు తొల్లె నీ వంపులే
పుట్టిన మీ మాయలెల్లాఁ బోదొబ్బేమా
[8-246

పోపుల పుణ్యము
పాపపు వసురము బందెలుమేయఁగ
పోవుల పుణ్యము పొలివోయ
[8-19

పోయినదెల్లా పొల్లు
పోయినదెల్లా పొల్లుపూఁచినదొక్కటే కాక
కాయజకేళికి నింకఁ గదియరమ్మననే
[15-22

పోయినదే పోక
దాయలగాఁ జూడఁదలఁతురు తాము
పోయినదే పోక పొసఁగనే నవరు
[వ. యో. వి. 3-239

పోరచి
ధారుణి శ్రీవెంకటేశు దాసుల సంగతి నుండే
పోరచి నే జీవులైనఁ బుణ్యాలు గాకుందురా
[10-66

పోరచి నా మనసిది పుణ్యపాపాలకుఁ జర
మారుకొని విడిపించ మరియెవ్వరో
[10-202

కోరి నీమోహపుసతిగుబ్బలవలె నున్నవి
పోరచి నీ పెండ్లిలోని బూజకుండలు
[13-164

పొదుగఁగ నూరకున్న పోరచి కాఁకలు రేఁగు
అదన నీ పతిమతి ఆస యీడేరించవే
[13-225

పారెసారె నేనెంత సంపదలు గోరినాను
పోరచి నీ దేహమెకా భోగించేది
[16-1-35

వూరకే మా యింటిదాఁక నొంటి వచ్చినవాఁడవు
పోరచిపైయట్టె మళ్ళిపోదురా నీవు
[17-224

పోరచిగా మాఁటలాడి పులకలఁ జిగిరించి
ఆరితేరి జాముపోయ నంపుమన్నా నంపదే
[17-240

పోరచు
పోరచి వనిత మారుపొదిగేవు నన్ను నిట్టే
చేరి యాపె నిన్నుఁగూడి చెలఁగుదాఁకా
[7-57

నీరు బుగ్గవంటిది నిచ్చకొత్తలైనది
పోరచి పంచభూతాల పొరుగైనది
[9-60

పోరుకాడింపు
జగములఁ బొదమించు జలజసంభవుల
నగణితంబుగ బోరుకాడింపుచున్నా
[వ. యో. వి. 5-538

పోరులుపెట్టు
పుట్టించేవాఁడవు నీవే పోరులుపెట్టేవు నీవే
యెట్టు నేరుచుకొంటివిని నీ వినోదమా
[8-43

పోలించు
యేలినవాఁడవు నీవు యిటు నేఁ గొలిచినవాఁడ
పోలింపఁగఁ నీవే దేవుఁడవు భువి నే నొక జీవుఁడను
[7-280

పోలింప వివేకులకు పుణ్యమునుఁ బాపమును
వేలవేలనే వున్నవి వెదకరో జనులు
[8-104

మూలమని నుడిగితే ముంచి యెవ్వఁడు గాంచెను
పోలించ నెవ్వని నాభిఁ బుట్టె లోకాలు
[8-241

నాలిక వొక్కటే నీ నామము లనంతము
పోలించి నే నిన్నెటు పొగడేదయ్యా
[9-166

మేలురాయి నీ గుణము మెచ్చవచ్చును
పోలించ నీచేత పూఁట పూఁట కొత్తే
కాదా
[16-2-5

చాలు చాలునంత మాలో సత్యాలేల
పోలించి వింటేఁ గల్లలు పుట్టేఁదేసి
రాలవా
[17-407

**పోసపోవు**
పోసపోనివారయితె మయికి మయి సేతురు
వాసి మానాపతులనె వంచుకొంటేఁ జెల్లునా
[14-270

**పోసరించు**
పోసరించి యిందరు నీ పొందుల
భ్రమలఁబడి
పోసివున్నారదే తమ పతియైన హరిని
[8-160

ఆసపడి నే నిందులో అన్నియు నావనుచు
పోసరించి మాయలలోఁ బొరలెదనయ్యా
[8-260

పోసరించి వూరివారి పొందులు సేయించి
నీచే
బాసలు సేయించనేల పరచనేల
[13-128

పోసరించి నీ మోవి తీపులేకావా గొల్లెతల
వాసుల నోరూరించి వలలఁ బెట్టినవి
[13-173

యీసురేఁచుక దొడ్డహితవరివలెనే
పోసరించి నాకేల బుద్ధిచెప్పేవే
[14-87

సేసకును సేసచల్లఁ జేయికిఁ జేయిగలదు
పోసరించి నీ కాఁగిటఁ బొందెదే మేలు
[14-97

పోసరించివుంటే నన్ను పొందుగా
యింత సేసె
పాసితే విరహవేదనపాలు సేసెను
[17-191

**పోళమి**
పోళమిఁ దండ్రిగల పుత్రుని కంగదలేదు
మేలుగాఁ బండిన భూమికిఁ గరవులేదు
[7-20

**పోళిమి**
నాలి నాయెదుట నీవు నవ్వు నవ్వే వేమే
నిన్నుఁ
బోళిమితోఁ బొంది నన్నుఁ బొందెనంటాను
[15-99

మూలనున్నవారి మమ్ము ముంగిటవేసితివి.
పోళిమినాఁడు వారు నీ పొరుగవుటే
దోనమా
[17-175

## పౌ

**పౌఁజు**
పొడవు మీను టెక్కెము పూవుల
యమ్ములపొది
వెడలె మరుఁడు దండు విరహులపై
యెడయని వెన్నెలలు వెగయుఁ
బౌఁజులధూళి
యిడుమఁ జింతతో లోన నేమి సేసేవే
[17-349

బలిమి నీకుఁ గలిగితే పౌఁజులమీఁద
నురికి
వలసినట్టు మెరయవద్దనేనా నేను
[17-461

## ఫ

**ఫలాధరుఁడు**
వరుఁడు సీతకు ఫలాధరుఁడు మహోగ్రపు
శరుఁడు రాక్షస సంహారుఁడు వాఁడే
[6-219

## ప్ర

**ప్రతిపెట్టుకొను**

నీవే కావఁగ గర్తవు నేనే శరణాగతుఁడను
కైవసమగు నను ప్రతిపెట్టుక నా కథలు
యెంచనేలా అయ్యా
[7-280

**ప్రత్యక్షమే ప్రమాణము**

ప్రత్యక్షమే మాకుఁ బ్రమాణము
సత్యరూపజోలిదవ్వి జాలిఁబడనోపము
[10-122

**ప్రయాసాలు**

ఎందు వెదకనేల యే ప్రయాసాలు నేల
యిందే వున్నది బ్రదు కిహపరములకు
[9-161

**ప్రహరి దిరుగు**

పట్నమ్ములో వారు ప్రహరి దిరిగెదరు
[సు. శ. 1098

## ప్రా

**ప్రాణాచారులు**

గరుడగంభముకాడ కడుఁ బ్రాణాచారులకు
వరములొసఁగిని శ్రీవల్లభుఁడు
[9-222

**ప్రాణాచారులుపడు**

వరులఁ గొలిచివచ్చి ప్రాణాచారులుపడితే
సిరుల వరాలిచ్చేవు శ్రీవెంకటేశా
[8-128

**ప్రాణుఁడు**

తనువుఁ బ్రాణుఁడు రెండు తగిలి
గర్భమునందు
ఒనర నేకమై యుదయించి
[11-3-93

**ప్రామినుకు ఱెక్కలతేజి**

కలికి ప్రామినుకు ఱెక్కలు తేజినెక్కి
సలలిత శశిబింబ సహిత హైమాద్రి
[వ. యో. వి. 3-387

## ప్రి

**ప్రియపడు**

క్రియఁగూడె శ్రీవెంకటగిరిపతిమెచ్చితి
ప్రియపడేవిదెనీవు భేదమేమిగంటివే
[15-241

## ప్రు

**ప్రుంగుడు**

మెలుఁతదిగాదీ మేనిటు కాఁతల
కలవఱచిన నీయదేకాక
పులకజొంపములఁ బ్రుంగుడగుచు నీ
యలుకల చెమటలు కమ్ముడువోయె
[4-11

## ప్రే

**ప్రేరేఁచు**

ఆలరి శ్రీవెంకటేశుఁ డంతలో విచ్చేసి
కూడె
తలఁపు ప్రేరేఁచినట్టి దైవము నేమందమే
[15-136

## ప్రొ

**ప్రొద్దువంగడము**

ప్రొద్దువంగడమునఁ బొడమినయట్టి
ముద్దుల రాచూలి మురువు దీపింప
[వ. యో. వి. 3-2008

బంగారము కరఁగక వన్నెలేదు
కచ్చుపెట్టి బంగారము కరఁగక
వన్నెలేదు
అచ్చముగ వోరి నీవు అటువంటివాఁడవు
[13–8

బంగారువంటి
బంగారువంటిదాన పచ్చివిటుఁడవు నీవు
యెంగిలి నీమాటవింటి నేమినేతురా
[14–163

బంగించు
సంగడిఁ గూచుండి నీవు సణఁగులేల
రాల్చేవు
బంగించి యీతనిఁ దప్పుపట్టవే నీవు
[13–252

బంటివారు
యీవల వానగురిసి యేరెంత బంటివారినా
కావరపు జీవునకు గతు గతుకే
[6–33

బంటు
నా మర్మ మిట్టిది యిఁక నీ మర్మమాన
తీరా
యీ మేరఁ జూచినవారి కెంత బంటో
యిఁకను
[14–190

బంటుజీవుఁడు
యిట్టె యలమేలుమంగ నేలె
శ్రీవెంకటేశుఁడు
నెట్టన నీ బంటు జీవునికి మితిలేదయ్యా
[7–115

బంటుపంతము
బంటు బంటు పంతమేడ బాసలెచ్చరించ
నేల
వొంటిఁ జీఁకటి మోఁగువుండునా
యెందైనను
[15–38

బంటుబంటుగు
పాయని యర్థములకు బంటు బంటై
తిరుగక
ఆయతమై మోసపోనిదది యెఱుక
[11–3–164

బండగు
కొండదవ్వుట యెలుకగోరిపట్టుట దీన
బండాయ సంసారబంధము
[11–3–109

బండయి తిరుగు
పండిన పంటలు పరమాత్మ విడిచి
బండయి తిరిగిన బడలికలు
[5–24

బండవెవసాయము
పలుకంతల చేను బండవెవసాయము
బలిమిఁ దొక్కెఁ గుంటి వసురము
[9–175

బండారమునంబడు
బండారమునంబడిన లెక్కకు
పరుల చాడి చెప్పం జోటులేదు
[వై. వ. 5

బండారుముద్ర
మతించిన కౌస్తుభమణి నిలువుటద్దము
మితిలేని శ్రీవత్సముమించు బండారు
ముద్ర [15–299

బండికండ్లు
సరిపిఱుఁదే రెండు ఱంట బండికండ్లు
సరవితోఁ బాదాలు చాఁపునొగలు
[6–152

పన్నిద్దరు సూరియుల బండికండ్లతేరు
సన్నుతి శేషాద్రిదేవాసనపుఁదేరు
[7–5

బలు కులపర్వతాలె బండికండ్లైనతేరు
నలుదిక్కులంచుల వున్నతపుఁదేరు
[7–132

బండికండ్ల రవమదే బంగారుమెఱుఁగులవే
కొండవంటి రథమదే గొడుగులవే
[8-164

గరుడధ్వజముతోడ కనకపుగుఱ్ఱాలతోడ
వరపై యష్టదిక్కుల బండికండ్లతో
[9-221

బండికన్ను
బుద్ధిలేని బుద్ధితోడ పొందుసేసుకొని వట్టి
యెద్దుబండికంటి నీఁగేము
[11-3-7

బండికళ్లు
దొంతిబెట్టవలపులు తోరపుబూజకుండలా
పంతాలు సంగాడిఁ బారబండికండ్లా
[13-121

బండిబంటు
యిందరి పాలిటికి యీశ్వరుఁడ వేలికవు
పందలై యర్జును బండి బంటవైతివి
[5-298

బండుబండగు
దండి శ్రీవెంకటపతి దాడిముట్టె నదెయిదె
బండుబండై జజ్జిరించి పారరో దైతేయులు
[6-79

మెండుగ దేవుఁడు వీధి మెరసి యేతెంచీ వాఁడే
బండుబండై యసురలు పారరో దిక్కులకు
[8-164

ఎండచేత నీడచేత నెల్లనాఁడు నిట్లానే
బండుబండై యెందుఁ గడవల గానక
[11-3-24

బండు బండుసేయు
ఉండలేక నీవద్దనే వుసురంటిఁగాక యింత
బండుబండుసేసిన యీ ప్రాణమేలరా
[12-29

బండు బండై
బండుబండై పూరఁగల పనులెల్లాఁ జేసేము
యోడా(డొ?)తా నీదొతా నెఱఁగము
[10-126

బండి బాటఆగు
చెల్లెఁ జెల్లె నీవుసేసె చేఁతలెల్లాను నీ
పల్లదాలిన్నియు బండిబాటాయఁదగవు
[15-73

బండి బాటచేయు
దండిగా శ్రీవెంకటేశుదాసులై పరముతోవ
బండిబాటచేసినారు ప్రపన్నులు
[5-287

బండి బోయిఁడు
బండి విఱిచినట్టి పాతకమునఁ బెద్ద
బండి బోయిఁడవై పనిసేయవలసె
[5-180

పసులఁగాచుట యెట్టు బండిబోయిఁడవౌ టెట్టు
వెసనిన్నుదలఁచితే వెరగయ్యీ నాకు
[7-98

పని బండిబోయిఁడేడ బాణుని నరకుటేడ
వినఁ గత నీ మహిమ విష్ణుజగన్నాథా
[7-195

బండుజన్మములు
నిండిన జగములెల్లా నీ యాధీనము
బండుజన్మములవాఁడ భయమేమీ నెఱఁగ
[9-248

బండు సేయు
బండుసేయఁగ హరికిఁ బంతమా యటు గాదు
యెండ దాఁకక నీడ హితవెఱుఁగరాదు
[5-11

నిండు నా నడపుచూచి నెమలిదగ్గరివచ్చె
బండుసేసినారు సూచి పాయదు పాము
[12-172

బంతికూటివేళ
మంతనాననుండి తమకింతు నీ రాకకు
బంతికూటివేళ నీకు వారమిత్తును
[18-281

బంతికూడు
బట్టబయటి భోగాలు బంతికూటి భోజనాలు
పట్టితమవని యేరుపరచ నేమున్నది
[7-76

బంతికూటి సతులెల్లాఁ బలుమారు నేఁపగా
చింతతోఁ బళ్లెముమీఁద జెయి చాఁచ
దాయెను
[12-41

బంతిగట్టి నురిపెడి పసురము
అంతటను సర్వనరకాదిలోకాలుమెట్టితి
బంతిగట్టి నురిపెడి పసురమునై
[9-49

బంతిఁగట్టు
బంతిఁగట్టి నురిపేటి పసురము లెడనెడఁ
బొంత నొక్కొక్క గవుకవుచ్చుకొన్నట్టు
[10-201

యింతిని వద్దాఁ బెట్టుక యేల పిలిచీనె
నన్ను
బంతిఁగట్ట రతులేమి పసులదొడ్డే
[17-505

బంతిపెట్టు
వంతమాడి నీకు చెలి వగటులు చూపఁగాను
యెంతకైనా నీ వాపెతో నియ్యకోఁగాను
నంతలో సానివలె సమ్మతించేవారమింతే
బంతిఁబెట్టి మిమ్ము నొడఁబరచేవారమా
[14-134

యెంతలేదు నీ సణఁగు యేల వాడుకు
వచ్చేవు
బంతిఁబెట్టి వలపు పంచిపెట్టవచ్చునా
[15-193

బందమ(ము?) వెట్టించుకొను
వంచల నాసలచేత బందమ (ము ?)
వెట్టించుకొంటి
ముంచిన గుఱ్ఱమువంటి మూఢుఁడఁ
గావవే
[10-227

బందెదీరు
అందరికి నీ సేవలు హస్తగతాలై వున్నవి
బందెదీర నీకు మొక్క బ్రదుకుమని
[8-285

బందెమాన్యము
సరుస శ్రీవెంకటేశు శరణాగతులకును
పరగ మాయలదొడ్డి బందెమాన్యము
[7-217

బందెయెద్దుమోరు
బంగిలి కాంతలనెల్లా నంగతులెంచక నీవు
యెంగిలిసేసేవు మోవి యేశముగాను
వంగించ నీ నోరు బందెయెద్దుమోరాయ
[13-185

బందెలుతెచ్చు
పసురమువంటివాఁడ పాపపుబందెలుదెత్తు
శిసువువంటివాఁడ సిగ్గు నెగ్గు నెరగ

బందెలుమేయు
పాపము పసురము బందెలుమేయఁగ
పోవుల పుణ్యము పొలివోయ
[8-19

పసిమిఁ బాపమనేటి బందెలు మేసితిని
కసరి దేహము కట్టుగాడినుంటిని
[10-227

బందెలుపేయు
వేలె తన గురుతు లెస్సగా నెఱుఁగుదునా
వేళగాదన్నా బందెలు వేయవచ్చీని
[15-138

బిగివాయు

నగధరు శరణము నమ్మి యాచార్యుని
బిగివాయనిదే పరమ వైష్ణవము
[7-83

తెగని బంధువుఁడు దేవుఁడు
బిగివాయఁ డిహముఁ బరమునను
[7-238

తగిలేటి పురుషులు తమకపు కాంతలు
బిగివాయని(దీ?)ది బదుకెల్లా
[8-29

నిగిడి శ్రీవెంకటనిలయుఁ డితఁడు
బిగివాయని శ్రీపతి యితఁడు
[10-271

జిగిమించ నాలోన శ్రీవెంకటేశుఁడే
బిగివాయఁ డెన్నఁడును బదుకవో మనసా
[10-228

వెగటుగ నేమునేసే విన్నపమెందు
కెక్కును
బిగివాయకుండేవారి భాగ్యమింతేకాక
[15-175

మగవారికేఁటి మేలు మరతురు వేగిరమే
బిగివాయకుండఁగానె పరాకైతివిరా
[17-249

బిగివానివున్నవేళ పగచాటుదుము నిన్ను
మొగముచూచితేనె మొక్కుదుము
[17-595

తగిలి పీ కౌఁగిట తనిసిన మాకును
బిగివాయఁగ నిఁకఁ బనిలేదు
[18-28

నిగిడి శ్రీవెంకటేశ నే నలమేలుమంగను
బిగివాయ కేలితివి బదుకుటగాకా
[18-128

జిగి నిట్టిది మా కన్నె శ్రీవెంకటేశ
బిగివాయదు జోలి చూపకువయ్యా
యీపెకు
[18-257

బిగ్గన నవ్వు

సిగ్గులు ముదిరితే సెలవికి నవ్వువచ్చు
బిగ్గన నవ్వితేఁ గోపమువచ్చును
[17-438

బిగ్గనఁ బిగులు

ఇటు గరుడని నీవెక్కినను
పటపట దిక్కులు బిగ్గనఁ బిగిసె
[11-3-26

బిగ్గు

దగ్గరనె వున్నవారు తరుణులందరు నదే
బిగ్గనఁ దాఁ బైకొంచే పకపక నగరా
[17-283

బిచ్చన

యిచ్చకము నాకుఁజేసి యెంత నేనలిగి
నాను
బిచ్చనల నావద్దఁ బాయఁడే వీఁడు
[17-367

బిచ్చన కవితలు

పుచ్చినట్టి పండు బూఁజిలోననేవుండు
బిచ్చన కవితలు బాఁతిగావు యెందు
[7-260

బిచ్చన బంధాలు

పొచ్చములు నల్లనాఁటి పూఁట దీరదని
కొన్ని
బిచ్చనబంధాలువచ్చెఁ బాఁపగదవయ్య
[11-65

బిచ్చన రూపులు

బిచ్చన రూపులు వచ్చల కొలపులు
నిచ్చలు నిచ్చలు నెయ్యములు
[5-24

బచ్చన మాటలు
రచ్చరావికింద రంతులె చేసేవు
బచ్చన మాటల పవకాఁడ
[4-103

బచ్చనవాసినరూపు
పచ్చిపాలలోని వెన్న పరమాత్ముఁడు
బచ్చనవాసినరూపు పరమాత్ముఁడు
[5-235

బచ్చించు
ముచ్చట నేమడిగితే మెఱఁగు మాట
లాడేవు
బచ్చించి యాలనేరెడుఁబండులమ్మేవే
]13-206

బచ్చుచేతి వొరగల్లు
బచ్చుచేతి వొరగల్లు పరమాత్ముఁడు
యిచ్చకొలఁది వాఁడు వోయీ
పరమాత్ముఁడు
[5-235

బచ్చుబేరాలు
భారపు పైఁడికొండలో బచ్చుబేరా
లమరునా
[5-156

బచ్చెన
బచ్చెన మంచముదాఁకి పైఁబడితి
నీవుండేది
యచ్చట నెవ్వఁడెఱుఁగు నదే మోపె
[13-12

బచ్చెనదేహము
బచ్చెనదేహపు పైపొర సుఖమే
యిచ్చఁ బ్రపంచంబీనెడిని
[8-47

బచ్చెనరూపులు
బచ్చెనరూపులు పెక్కు వడెచ్చుల
వేసినట్లు
నిచ్చల నినుచున్నది నీ మాయ
[6-180

బటువుబిల్లపెట్టు
మొనపాదముచాఁచితె మొక్కేది తగవు
కాక
పెనఁగి అట్టె బటువుబిల్లపెట్టనేల
[13-178

బట్టగుత్తగు
బట్టగుత్తైనాపె నేఁడు పాయకవద్దనుండగా
యిట్టె శ్రీవెంకటనాథుఁ డిటు సేసెనే
[16-2-94

బట్టబయలు
నెట్టన గర్ణధారుఁడులేని జలనిధి నడిమి
యోడవంటిది
బట్టబయటనే పరమేశ్వర నీపై భక్తిలేని
వాని బతుకు
[7-86

బట్టబయటి ధనము
పట్టినవారి చేబిడ్డ పరమాత్ముఁడు
బట్టబయటి ధనము పరమాత్ముఁడు
[5-235

బట్టబయటి భోగాలు
బట్టబయటి భోగాలు బంతికూటి భోజనాలు
వట్టితమవని యేరుపరచ నేమున్నది
[7-76

బట్టబయలగు
వరున నేసుగమీఁదవాని సున్నంబడుగ
వచ్చునా నీకిట్లఁ గర్మమా
పరమపురుషోత్తముని భ్రమతఁబడి నీవిట్ల
బట్టబయలైతిగా కర్మమా
[5-187

బట్టబయలీఁదు
వెట్టికి వించేఁ జాలు వేగుదాఁకఁ జెప్పేఁ
దాను
బట్టబయలీఁదనోపఁ బదవే మా యింటికి
[17-161

బట్టబయలు
పలుశ్రుతుల గర్తలై పరగితే మేరలేదు
అల బట్టబయలు గర్తైతే నాధారములేదు
[5-310

పట్టిజాలిఁ దమతమవారలంటాఁ దలఁచుక
బట్టబయలే నానాభావాలఁ బొందుదురు
[8-227

కన్నదేఁటిదో విన్నదేఁటిదో కాఁగల
దిఁక నేదో
నన్నుంగానను నిన్నుంగానను నడుము
బట్టబయలు
[9-29

బట్టబయలు తగుళ్లు
పలుచుట్టరికములు బట్టబయలు తగుళ్లు
చెలఁగు నాచార్యసేవ జీవన్ముక్తి
[6-185

బట్టబయలు పందిలివెట్టు
బట్టబయలు పందిలివెట్టరుగాని చే
పట్టరు శ్రీవెంకటాద్రిపైనున్న హరిని
[8-160

బట్టబయలుసేయు
మట్టు మరి తమకపుమాఁటలనె నీవలపు
బట్టబయలె సేసేవు పండరంగివిఠలా
[16-2-27

బట్టబాయిట
వట్టి కాళింగునిఁ దోలి పాముకొల
దీర్చినాడు
బట్టబాయిటనే రేపల్లెవారికి
[6-57

పరగ యోనులు రోసి బట్టబాయిటవేసె
పొరిది యోనుల రోసి చొరక నేమానఁ
గాని
[7-242

ఇట్టె మమ్ము రక్షించుట యేమి దొడ్డ
నీకు నేఁడు
బట్టబాయిటనే నీవు పదిరూపులైతివి
[7-269

బట్టిబయలు
పట్టిన వ్రతము నీవే పరిపాలింతువుగాక
బట్టిబయలింతే నేను బలిమున్నదా
[11-158

బట్టువలె పొగడు
యిరవుగాదా నీ పంతము యిప్పుడు
నన్నుఁగూడి నందె
పొరసి నిన్ను బట్టువలెఁ బొగడఁగాక
[15-31

బడకరము
జతనము జతనము సర్వేశునగరిది
బతుకుఁదోవ యిదె బడకరము
[7-84

బడి
అడరి యెవ్వతో యింటికరిగేవేళ విభుని
వడిఁ జేపట్టి తీసితే వచ్చేనటే
బడి నే యరిగి యాకెఁ బచారించి
యానవెట్టి
కడు బలిమిఁ గూడినఁగాక వీఁడబ్బునటే
[13-165

బడిగండ్లు
బంతులనెదుటనున్న పడఁతుల చన్నులివి
కంతల నొడ్డిన బడిగండ్లు సుండి
[6-26

బడిఁగాచు
యెడయక శ్రీవెంకటేశ్వర నీవే
బడిఁగాచితివిదె బ్రదికితి నేను
[5-258

బడిఁదగులు
కోరిన నా కోరికలు కొనసాగకపోవు
బారిఁబడుచు కాలము దాఁబడిఁ దగులక
పోదు
[9-206

బడిదప్పితిరుగు
బడిదప్పి తిరిగేటి వడుచుల తమవారు
తడయక తెచ్చుక ఆదరించినట్టు
[6–5

బడిదప్పు
బడిదప్పెఁగదె దీని వలుకుఁ దేనియలు
తడఁబాటుతోడ చిత్తము దాఁచె నిపుడు
[4–13

బడిదప్పితే బంట్లు పరదేసులౌదురు
యడయక కూడుకుంటే హితులౌదురు
[7–107

బడిఁదిప్పు
యీడులేక శ్రీహరి నీ వుండెడి
యీ దేహపు నీ పరికరమూ
బాడిగఁ బంచేంద్రియములు పట్టుక
బడిఁ దిప్పెడి నీకే సెలవు
[9–103

బడినాడు
మేలుకొను నాయన్న మెల్లనే నీతోడి
బాలులదె పిలిచేరు బడినాడను
[9–254

బడినుండు
కడివోని జవ్వనము కలిమిలేమెఱుఁగునా
బడినుండి మిగుల రుణపడుచుఁగాక
[6–11

బడిపెట్టు
కోలగగ్గెరఁద్రోసి గుంజిళ్ళబెట్టి
పైలావుదొరుగంగ బడిపెట్టుపెట్టి
[అ. చ. 116

బడిబడి
కడుసంపదలును కాలముకొలఁదే
బడిబడిఁ జవులై ఫలియించు
[7–188

బడియు శ్రీవెంకటేశ్వరు దాసుఁడాయనా
బడిబడిఁ దుదఁ బరబ్రహ్మమే యతఁడు
[7–218

అడుగులు మూఁటనే యఖిలము గొలిచితి
బడిబడి నే రాచపగ సీఁగితి
[7–269

వుడిబడి కోర్కుల నొకసంసారము
బడిబడి యాసలఁ బరగీని
[7–270

విడువక సూక్ష్మపు వీనులు యివిగో
బడిబడి నాదబ్రహ్మము మోచె
[8–47

అడుగులు మూఁటలోకాలటు గొలచిన
వాఁడు
బడిబడి రేపల్లెఁ బారాడీని
[8–113

తడవి శ్రీవెంకటేశుదాసులు మమ్ముఁ
గాచిరి
బడిబడి నిత్యకర్మఫలము లెన్నటికో
[9–54

బడిబడిఁ గర్మముల పాఁజులు దీర్చరో
వెడమాయ పట్టణపువీధులు నేఁగీని
[9–97

యెడమీక శ్రీవెంకటేశ నేఁడు నన్ను
గాచె
బడిబడి నీ నామపఠన (నేఁడి) దిగో
[9–145

బడిబడి నానాటి బతుకు చెప్పుకోలేము
పొడలేటి యితరుల బోధించఁగలమా
[9–260

బడిబడిఁ దిరుగు
ఒడలొసగిన హరినొల్లక యితరుల
బడిబడిఁ దిరిగిన బంధములు
[5–24

ఎవ్వరి దూరఁగఁ జోటులేదు
మరి యేమనఁగల దిదివో తగవు
యివ్వల నందరి బడిబడిఁ దిరిగే
యీ కర్మముదే నేరమి
[9–107

బడిబడి దిరుగు
బడిబడి దిరిగా డీ బాలకృష్ణుఁడూ
యెడయని జాణగదె యీ బాలకృష్ణుఁడూ
[17–141

బడిబడిఁ బట్టు
వడినడవుల చింకవంటిది నా మనసు
బడిబడిఁ బట్టఁ బట్టఁ బారీఁగాన
[7–161

బడిబడి మొక్కు
బడిబడి మొక్కినాను పరాకై వున్నాఁడవు
[17–509

బడిబడివచ్చు
పక్కన మాయమైపోవు బడిబడినేవచ్చు
నెక్కొని కల్లందమో నిజమందమో
[9–270

బడిపనివాఁడు
పాయని సంసారానకు బడివ(వః) ని
వాఁడను
కాయపు భోగాల పూడిగపువాఁడను
[7–246

బడివాయఁడు
విఱువకిది వో శ్రీవెంకటేశ్వరుఁడు
బడివాయఁడు మా పాలిట నిలిచి
[8–10

బడివాయు
అడరి బాఁతిపడి యవని దేవతలు
బడివాయరు యజ్ఞభాగాలకు
[6–10

యెడయక శ్రీవెంకటేశ నీకు బంటనై
బడివాయ కిట్లా నే బ్రదుకుచే కలది
[6–197

శ్రీవెంకటేశుఁ డాత్మఁ జేకొనివుండినది
భావించకున్న నాతఁడు బడివాసీనా
[8–263

వసిచల్లమ్మె గొల్లవడుచా నీవె
వసివడి తిరిగేవు బడివాయక
[12–196

బడివాయకుండితేను పాయమే
కామధేనువు
యెడయని పతులకు నింతులకును
[13–148

అడుగరే చెలులాల అంతేసి నే నెరఁగ
బడివాయఁ డాసలకో పంతాలకునో
[14–132

తొడపై శ్రీసతిఁబెట్టి దొడ్డకొలువున్న నీకు
తడవినా పొందులింకాఁ దలపయ్యీనా
యెడయక శ్రీవెంకటేశ కూడినదాననై
బడివాయక నీయొద్ద బతికితిఁగాగ
[17–263

చిడిముడి జంకింతురు చేతికి లోనై నప్పుడు
బడివాయక పొందులు వరగేటి చోటను
[18–327

విడెమిచ్చి యింతలో శ్రీవెంకటేశ
కూడితివి
బడివాసివుండితేను బత్తివెలితయ్యీనా
[18–366

బతిమి
ప్రతినైన యతినైన వలలమాటలఁబెట్టి
బతిమి చెరుతురుగా బంధువులాల
[16–1–28

అతివమూచి కల్లలాడుమన్నా నాదేవు
బతిమిఁ బారాడుమన్నాఁ బారాదేవు
[16–2–75

బతిమివట్టు
సతమై యాపెతోఁగాని జట్టిగా నాతోఁగాని
బతిమివట్టినట్లాఁ బాయకుండేఁ జాలును
[16–2–61

కతకారి శ్రీవెంకటనాథ నన్నుఁగూడి
బతిమివట్టుకుండఁగా బాసకుగఁజెల్లునా
[16–2–69

బత్తిచేయు
మగనిపై బత్తిసేసి మంచిలోకాలెక్కేరట
తగుదండకొలవట్టి తత్వగతిగనేరట
[7–30

చిత్తజ గురుఁడవో శ్రీ నరసింహా
బత్తిసేసేరు మునులు పరికించవయ్యా
[10–292

బత్తిసేసినవారికి భవరోగవైద్యుఁడవు
హత్తి నుతించినవారి యానందమీవు
[9–219

బత్తేలు
వుంగిటిగాఁ గోపగింతు మొకమూరు
నవ్వుదుము
యెంగిలిమోవి బత్తేల నేలుకొన్నవారము
[12–182

బద్దితాడు
మననే నీ బద్దితాడు మరి గుణాలె జీవాళి
మొనసిన పుట్టుగే మూలమైన కరడి
[9–178.

బద్దు
యిద్దరి మొక్కటిగాఁగ నిన్నియు
నమరెఁగాక
పొద్దువోనిచోట చవివుట్టినా నీకు
గద్దరి శ్రీవెంకటేశ కౌఁగిట నన్నుఁ
గూడితి
బద్దుగాదు మెచ్చితి నా భాగ్యమింతేగాక
[17–337

బద్దులమాటలు
బద్దులమాటలాడి భ్రమయించి రేపల్లెలో
ముద్దులుచూపి వెన్నలు ముచ్చిలినట్లు
[9–25

బమ్మచారి
బగ్గన నంటివి నీవు బమ్మచారినంటాను
వెగ్గళించి వదారువేలు సతులుండగా
[14–229

బమ్మర
కమ్మి యక్రూరుఁడు దేఁగా కంసునిపై
నెక్కెఁ దేరు
బమ్మర పోదంతవక్త్రుపైఁ దోలెఁ దేరు
[10–35

బమ్మె
యిమ్ముల శ్రీవెంకటేశ యింతలోనె
కూడితిమి
వొమ్మెగా జాణతనాలోవోయి
[13–250

బయకాఁడు
చల్లచాడెలంటుకొని జాణతనాలాడీని
పల్లదపు గద్దరీఁడు బయకాఁడు
[13–134

బయకారాలు
నయమువనేఁ గొంత నవ్వులు నవ్వగఁ
బోతే
బయకారాలని వారే వచ్చిసేతురు
[17–534

బయకారించు
నయమున నా పతిని నా యింటికిరాకుండా
బయకారించితివిగా పదవమ్మా
[16–2–9

నయముచాలనిచోట నవ్వులు నవ్వఁగఁ
బోతే
బయకారించెననవా పక్కన నీవె
[17–553

బయలగు
కతగానట్టి మహిమ గానలేక వుండఁగాను
బతిమాలఁగానె యింత బయలాయఁగాని
[10–211

బయలీఁత
ప్రియముతో వావులేల పెనచీనే చెలులతో
బయలీఁత నగవుల బచ్చెనకాఁడు
[13–149

బయలీఁదు
నీ చెయ్యే మీఁదాయె నీకుఁ జెల్లురా నిన్ను
యేచి వలపుల బయలీదించనైతిరా
[17–331

బయలీఁదించు
బయలీఁదించకురే పలుమారు యీ
ప్రియునిపేర నిందరినిఁ బిలిచీఁ జెలియా
[4–177

బయలీఁదించనదివో ప్రాణులను
హరిమాయ
క్రియ తెలుసుకొనేటి కీలింతేకాని
[9-4

బయలుచిమ్ము
పాదమున నేనెట్టి బయలుచిమ్మిన నీవు
వాదుకువచ్చేవేమె వనితా
[15-43

బయలుతత్త్వము
పాదగు విష్ణుఁడుండఁగ బయలుతత్త్వ
మనేరు
లేదు జీవత్త్వమంతటా లేమలఁ
బొందుదురు
[8-33

బయలుపందిలిపెట్టు
నయమున నాయెదుట నన్నుఁ బేరుకొని
పాడి
బయలు పందిలివెట్టీ బావఁగారు
[17-355

బయలుపన్నిన వురులు
జిగి నిందుకుఁగాఁ బుట్టే చిత్తవికారములు
నిగుడుచు బయలువన్నినయట్టి వురులు
[6-203

బయలు ముడివేయు
యెగసక్కెనకు బయలేల ముడివేసేవే
[13-182

బయలు మొరంగు
బయలు మొరంగగు వరమమాయ యిది
నయమున లోనై నడతురుగాని
[7-2-67

బయలు పందిరిపెట్టు
బయలువందిరిపెట్టు పంకజోదరుని
నయమున నట్లు మన్ననెమినమ్మి
[అ. మ. శ. 4013

బయలువందిలి
వట్టరానిది మనసు బయలువందిలిచేఁత
చుట్టుకొన్నది కర్మము వట్టిదిగుట్టు
[7-115

బయలువందిలి కర్మబంధములు నీమాయ
నియమపుఁ బెనుగాలి నీ మాయ
[9-58

బయలు వందిలిపెట్టు
బయలు వందిలిపెట్టి వరగఁ జిత్తము
గలిగె
దయమాలి తిరుగ నాత్మజుఁ దొకఁడుఁ
గలిగె
[5-71

బయలు వందిలివెట్టు (ట్టె?)
బయలు వందిలివెట్టు (ట్టె?)
వనిలేని లంపటము
దయవిడువఁదొడఁగె
చిత్తములోని కాంక్ష
[11-3-103

బయలువాఁకు
భావించలే రెవ్వరును బయలువాఁకేరుగాని
నీవే గుఱుతు మాకు నీరజనాభా
[6-200

అన్నిటికి మూలమని హరినెంచరు
పన్నిన మాయలో వారు బయలువాఁకేరు
[7-27

బయలే వెలుఁగై తోఁచు
పలుమరు చీఁకటి చూఁడగ
బయలే వెలుఁగై తోచినయట్లు
అలయక తనలో చూపు చూచినను
అంతరంగమున హరిఁగనును
[6-137

బయలైపోవు
తేటల నాఁకలి దీరిన విమ్మట
పాటుకుఁ బాసే బయలైపోవు
[11-44

బయిరూపము
కగ్గుదేర నీవు మున్ను కట్టుకొన్న
బయిరూపము
వొగ్గి అడకపోవునా వోరుచుకో యిఁకను
[14-128

బరుబోఁకు

పుట్టుమాలిన బరుబోఁకివి నన్నుఁ
దిట్టినదే మోసి దిమ్మరిమాయ
[11-3-41

బలుదూరు

ముచ్చట కెవ్వరులేరు మోహమిది
బలుదూరు
యెచ్చట నెవ్వరులేరు యేఁటికే నాపేరు
[12-266

బలుము

పైకొని కాఁగిలించితే బలుములై తోఁచీని
[17-284

బలువుఁడు

నీవే బలవంతుఁడవో నీకంటేఁ గర్మము
బలువో
కైవసముగ నే నెంచి చూచితే
కర్మముకంటే బలువుఁడవు
[6-179

తక్కక మానితివట్టే దానుని యాధీనమై
నిక్కి నీ కింకరుఁడే నీకంటే బలువుఁడు
[7-215

ఎవ్వరి నేమనఁగల నెంత బలువుఁడ నేను
నవ్వుచు నీవే యిఁక నన్ను మన్నించ
వయ్యా
[7-246

బలువుఁడవందు మీఁద పనిగొననోపుదువు
చలివాసి మమ్మేల సోకిరివెట్టేవు
[15-223

పట్టి శ్రీవెంకటేశుఁడు బలువుఁడు
నన్నుఁగూడె
[15-256

బలుసుకొను

పదరక పురమున బలుసుకుండిఁగా
ముదముల పైపై ముంచేఁగాకా
[14-255

బహుదైవికము మించు

బాల లీలలు నటించి బహుదైవికము
మించె
పాలు వెన్నలు దొంగిలెఁ బరమమూర్తి
[8-112

## బా

బాజు

సాజపు శ్రీవెంకటేశు శరణమొక్కటేగతి
బాజుఁ గర్మమందొకటి బంధమోక్షములు
[6-78

బాడిగెమోయు

పంచేంద్రియములనే బాడిగె మోఁచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి
[10-227

బాఁతి

ఏమి బాఁతి నే నీకు యిటు నాకె దక్కితివి
దోమటి విందుకె పోనీ కొత్తనైతి నేను
[17-2

బాఁతిపడు

ఇంత బాఁతిపడేవానినేల మాకుఁ
దక్కరించ
చెంత నిదే వెన్న చిట్టిఁ జిట్టేఁదేడి వలపు
[13-180

బాయట

కాయము కొట్టఁగొననే ఘనవైకుంఠ
మున్నది
బాయట శ్రీవెంకటపతి వున్నాఁడు
[9-19

బాయట నూరక పారెటి గాలే
కాయములోపలఁ గలిగేది
[10-184

పట్టవగలై వున్నాఁడు బాయట నెందు
చూచిన
గట్టిగాఁ గాననివారికల్ల యింతే సుండీ
[10–244

బాయటి
పాయదే జంతువులైనాఁ బశుపక్షులకు
నైనా
బాయిటి గీముల గట్టుఁ బాటుబంధము
యేయెడ శ్రీవెంకటేశ యింత నీదాసుల
కైతే
[9–72

బాయిట
హేయ మిందే దుపాదేయ మిందేది
బాయిటనే హరి సర్వపరిపూర్ణుఁడు
[6–136

దాయ గాండ్లెవ్వరినైనా దప్పించుకొనే
వారే
బాయిటనున్నా నీ వాపన్నశరణ్యుఁడవు
[7–72

చేయివట్టితియ్యనే చేసన్న నీవు నేయ
బాయిట మమ్మెపుడూనుఁ బట్టవద్దు
[15–183

బాయిటనాడుతా నెంత పరువులు వెట్టితివో
యీయెడ బుసకొట్టేవు యిటువలెఁ గలదా
[17–332

బారలుచాఁచు
కోరికలూరక కొనలు సాగఁగా
బారలుచాఁచీఁ బ్రపంచము
[8–118

బారిఁబడు
కోరిన నా కోరికలు కొనసాగక పోవు
బారిఁబడుచు కాలము దాటీఁ
దగులకపోదు
[9–206

బారివిద్య
చెల్లుబడి నొక్కకొండ చేతఁబట్టి
యెత్తినాఁడు
బల్లిదుఁడు వాఁడెవో బారివిద్యవాఁడు
[61–1–22

బారివిద్యలు
పాపపుణ్యములు రెండు బారివిద్య
లుండఁగాను
కోపుల నాటలవారిఁగోరి చూచేము
[10–190

బాలకి
యీ లీల శ్రీవెంకటేశ యిటునన్నుఁ
గూడితివి
బాలకి నన్నిట్టే చేపట్టుదువుగాక
[14–17

బాలనాగాలు
శీలముతో వీరల చెట్లలు వట్టుటెల్లా
బాలనాగాలఁ దొడికిపట్టుట సుండీ
[6–26

బావఁగారు
బాపుబాపు జాణగదే బావఁగారు
కోవగించే నోపనంటేగోల బావఁగారు
[

బాసికము ఇచ్చు
నేసలువెట్టితేనేమె చేతులుముట్టితేనేమె
వాసల నామోము చూడవలెఁగా తానూ
వేసాలు నెరపనీవె వీడెపు మదమో
యేమో
బాసికము నీకిచ్చిన పని నాకేకాదా
[14–252

బాహిరపుబయట
దేహపుటాకాశపు నిట్టూర్పులు
బాహిరపు బయట నడఁగినయట్లు
అహా జీవుని జనన మరణములు అందే
పొడముచు నందడఁగు
[6–137

## బి

**బిందిచుట్టు**
కీవిపై బింది చుట్టినయట్టి మరుని
మావుచాయల చక్క మావుకుళ్లాయి
[అ. మ. క. 4945

**బిందెలనించు**
పెక్కు నీ వినయములు బిందెలునించే
నా పెకు
యిక్కడనే వుండవయ్య యేలనవ్వే
విఁకను
[17-389

**బిగువుకూడు**
తెగుదెంపులేమికి దీనగతే దిక్కు
బిగువుఁగూటికి వట్టి బీరమే తగవు
[6-63

**బిగ్గె**
బిగ్గె నే గాఁగిలించితే బెగడవేమిటా నీవు
యెగ్గులెంతెంచనివాఁడ వేమిటిచెప్పేది
[14-175

**బిడారించు**
కులుకుతావుల తమ్మికొలని భావమున
పొలుచు హంసక నాదములు బిడారించ
[అ. చ. 16

**బిత్తరపుటాసలు**
దాఁచిన నీచిత్తపు బిత్తరపుటాసలు నాపై
చాఁచి చాఁచి పలుమారు
చంపంజూచే వేలరా
[4-8

**బిత్తరికాఁడు**
వేగుదాఁకా జాగరాల పేసారితిమి
వాగపు బిత్తరికాఁడ వచ్చేనో రావో
[15-84

**బిత్తలు**
పొలఁతులనెడి మహా భూతాలు సోకిన
తలమొలలు విడి బిత్తలైయున్నారు
[9-67

**బిమ్మటిపొద్దు**
సమ్మతించు జీవుఁడా సంసార మొక
జాడగాదు
బిమ్మిటి పొద్దొకజాడ పెనచునింతే
[5-325

**బిరుదుకెక్కు**
ప్రియములింపులు బిరుదుకెక్కిన
నయము మీలో నాఁటినను
[12-30

**బిరుదుటెక్కెము**
బిరుదు టెక్కెములుగా బెక్కు
సంకీర్తనములు
హరిమీఁద విన్నవించె నన్నమయ్య
[16-1-23

**బిరుదుబంటు**
ముట్టిన ప్రతాపపు రాముని సేనలలోన
అట్టి బిరుదుబంటు శ్రీహనుమంతుఁడు
[8-138

**బిల్లఁగోట్లు**
గల్లుగల్లు మనఁగాను గజ్జెలు నందెలతోడ
బిల్లఁగోట్లాడీని పిన్న కృష్ణుఁడు
[10-172

## బీ

**బీగంబుచేయి**
బీగంబు చేయిచే బీగముల్ దెఱచి
లాగుగాఁ గుంచె కోలనులోన నిడిన
[ప. యో. వి. 4-1165

**బీరకాయచిక్కు**
ఎక్కడఁదీరవి యీ బీరకాయ
చిక్కుదా నితనిచేఁ దీరుటయెట్లు
[ప. యో. వి. 5-255

**బీరఁగాడు**
తనను వలచినట్టి తరుణి సూర్పనకను
పెనుముక్కుగోసిన బీరఁగాడే
[15-134

బుగ్గ
నిగ్గుగల ముత్యాలు నెలఁతలు చల్లఁగాను
యిగ్గలతో వారాశిఁ బోలితివి
[13–169

బుజ
చెలి చెమటలనాని చిత్తములో వలపులు
పులకలై మొలచెను బుజకలిగే
[17–442

బుజమెక్కించు
నీ వలమేలుమంగవు నిన్నుర
మెక్కించుకొంచే
భూవనితఁదెచ్చి బుజమెక్కించేవే
[13–193

బుడిబుడి
పొడవుకుఁ బొడవగు పురుషోత్తముఁడిదె
బుడిబుడి మాచేతఁ బూజగొనె
[8–10

బుడిబుడిమాయలు
బుడిబుడిమాయలఁ బొరలేటి దేహికి
కడవరాని బంధము కాంతలు
[9–72

బుడిబుడియేడ్పులు
ఇప్పుడు బుడిబుడియేడ్పు లేడ్చినను
దప్పునే యిది పెద్ద దయ్యంబుపట్టు
[వ. యో. వి. 3–234

బుడిబుడి సంగాతాలు
తడవేరు తగిలేరు తామే శ్రీవెంకటేశ
బుడిబుడి సంగాతాలఁ బొరల నే నోపను
[8–220

బుట్టటకొమ్ములు
చెక్కు చెమటగోరులఁ జిందుకుండా
మీటుచు
చక్కబుట్టట కొమ్ములు సాదించీని
[14–149

బులిసిలోఁగు
పొలసులాడకు నీవు పురుషోత్తమా
బులిసిలోఁగఁగ నేల పురుషోత్తమా
[7–49

బులుపు
తనివిమాలిన తలఁపు తడవోరుపనిబులుపు
అనువెఱుంగని కెలపు అడియాసమెలపు
[4–20
యెదుటనె వలపు యింటికాడ బులుపు
[15–215

బులుపుఁగోపము
నలువొందఁ జంద్రకిరణములు
మయివడిఁబొక్కె
బులుపుఁగోపము తోడఁబుట్టుఁ బగచేసె
[12–160

బువ్వానపెట్టు
అవ్వలిమోమైన మిమ్ము నాఁకలి
గొంటిరంటా
బువ్వానఁ బెట్టగనేల పొదుగనేల
[13–128

బువ్వాలబంతి
పలుకుల బువ్వాలబంతికి వచ్చేఁగాక
అలుకలమీద మాటలాడేదానా
[14–167

బువ్వాలు
కరజపు వినయాలు కాఁగిటిరతిబువ్వాలు
[14–166

బుసకొట్టులు
తొట్టిన పెంజెమటలతోడనె బుసకొట్టులు
పుట్టిపడఁ జూడరమ్మ వుగ్ర
హనుమంతుఁడు
[10–85

## బూ

**బూతాలపొంగలి**
బూతాల పొంగటికే పొదమిన పంటలెల్లా
కోతవేత చూచుకొని కోరుకొటారు
[9–175

**బూతుజన్మము**
భూతమై యడవిలోఁ బొక్కుచుఁ దా
నుండక యీ
బూతుజన్మమేల మోఁచె బుచ్చినప్రాణి
[5–202

**బూతుమాట**
కొంకితిట్టేరే కాని గురియైన రతిదాకా
పొంకపు బూతుమాటలఁ బాచుకొన్నది
[14–210

**బూతులసంసారము**
పొరలే గర్వమింతె బూతుల సంసారము
మరలి నే మూరకుంటె మానఁబొయ్యీనా
[10–197

**బూతో బండో**
పుట్టినదే నగ్నత్వము బూతో బండో
యెరఁగము
చిట్టంట్ల వాచవులగు జీవుల మ్రింగెదము
[9–51

**బూములదొక్కు**
బుద్దులు చెప్పఁగనోప బూములు
దొక్కఁగనోఁప
వొద్దనె పాయక నీతో నుండుటేగాని
[17–370

**బూవపు సరసాలు**
నీ వోజగాదిది నిన్నెఅగనా
బూవపు సరసాలేల పూఁచవచ్చేవూ
[17–3

**బూవము**
ఆవటించి పెండ్లాడి నలమేల్మంగను నేను
బూవాన నిద్దరి నెంత పొగడేరే మీరు
[18–145

## బె

**బెండుపడు**
పెక్కుమతములుచూచి బెండుపడ్డవారు
లేరా
వక్కన నన్నివిద్యలఁ బరగినవారు లేరా
[7–261

**బెండువంటివారు**
కొండలరాయఁడ మమ్ముఁగోరి
పుట్టించఁగా నీవు
బెండువంటివారము మా బిగువేఁటి బిగువు
[10–126

**బెందడివేయు**
సందడి బొక్కలో సందు సందులను
దందడిగొనఁగ బెందడివేయువారు
[వ. యో. వి. 7–454

**బెంబడి**
తావులఁ జూడఁగ తగిలివ కోర్కుల
బావరతుల బెంబడి మనసందు (?)
[11–19

పేయ చొరఁగానె యిల్లు బెంబడిఁ
బొచ్చితిఁగాక
ఆయెడ నన్నేల తిట్టేవదేమోపె
[13–12

చలము నీతో నేల సారె సారె నాపెకు
పలుకు బెంబడినే పచ్చినేసీని
[14–165

కోపగించ నీతో నేల కొసరుచు నాపెను
తీపుల బెంబడి నే దిమ్మరేఁచీని
[14–165

బెంబాడిచేఁతలు
పేరు నారాయణుఁడవు బెంబాడిచేతలు నీవి
నోరు మూసుకొన్నఁ బోదు నున్నని
నీ సుద్దులు
[6–162

పెక్కులునేర్చి నతఁడు బెంబాడిచేఁత
అతఁడు
దిక్కులఁ దన నేరాలు దిద్దుకోలేఁడా
[14–13

బెట్టిమాటలు
బెట్టిమాటలాఁడఁగాను ప్రియమేనో కాదో
యంటా
గుట్టున నూరకున్నదానఁ గోవమా ఇది
[18–9

పెనఁగినా నీతోను బెట్టిమాటలాడేనా
తనిసితి మాటలనే తమి యింకా రేఁచేవు
[18–19

బెడయు
బెడసి కూడు వేఁడైతే పెదవు లోరుచునా
జడిసీ దగుపాపైతేఁ జవిపుట్టుగాక
[13–81

బెరయు
పెనఁగులాడినవేళ బెరసిన చెమటల
పనుపడి నీ తమికిఁ బదనాయను
[13–132

బెల్లపుమాఁటలు
బెల్లపుమాఁటల చెల్లపిళ్ళరాయఁడా నీకు
జెల్లునయ్య యేమైన చెల్లపిళ్ళరాయఁడా
[16–2–80

బెల్లించు
కల్లలు పచరించి కడపట మనల
బెల్లించి యిది దక్కఁ బెనఁగఁజూచెదరు
[వ. యో. వి. 4–1190

యెల్లకాంతలుండినాను యేల నీవు
మెచ్చేవు
బెల్లించకువయ్య రేని ప్రియాలేల చెప్పేవు
[14–228

బెళకు
యిరవయిన శ్రీవెంకటేశ నినుఁ
గొలువఁగా
పెరిగి నానందంబు బెళకులిఁకలేవు
[9–33

పలుకనేరదుగాని భావములోనిచేఁత
బెళకకుండా నట్టెపెట్టుకొన్నది
[14–210

బెళకు నాలుక
బెళకు నాలుకకు నీపేరువచ్చితేఁజాలు
పలికినవన్నియు పరమవేదములే
[10–128

## బే

బేటాడు
వాటమై మిగుల విద్వత్కదంబముల
బేటాడు నారాజు పేరోలగంబు
[వ. యో. వి. 5–220

బేడలుగాఁజేయు
వోడక పిడికిలించి వుగ్రదైత్యుల తలలు
బేడలుగాఁ జేసినాఁడు పెద్దహనుమంతుఁడు
[7–116

బేరి జోకొట్టు
తలఁచుక తలఁచుక తా నేఁ డెవ్వరితోను
బెళకుప్రియాలుచెప్పి బేరిజోకొట్టీనే
[17–244

బేలుచేయు
యేలితివి శ్రీవెంకటేశ యిన్నిటా నీకెను
బేలుఁజేయవద్దుగాని ప్రేమనించవచ్చును
[13–142

**బేలుఁడు**

నాలికె కారు రుచులు నలినలిఁ దెలుపు
నీ మాయ
బేలుఁడై విరక్తుఁడై బిక్షమెత్తించు
నీ మాయ
[8-237

**బేలుదనము**

యీ లీల శ్రీవెంకటాద్రిమీఁదనే
యిందరికిని బొడచూపితివి
బేలుదనంబులనెంచిచూడ పసిబిడ్డలు
చేసేటి పనులివియా
[8-277

**బేసబెల్లి**

ఆసలేల మానుఁ దన ఆఁకలిలో నుండఁ
గాను
బేసబెల్లి దేహముతోఁ బెరుగుఁగాక
[10-61

బేసబెల్లి యెంగిలైన పెదవినంజుడునోరఁ
దీసితీసి సారెసారెఁ దిన్నవారము
[11-2-19

నసుపున నీ వింతేసి నవ్వులు నవ్వినదాఁక
అనవుగా మాడలాడె నాపె సాదించి
పెనఁగేటి యిటువంటి బేసబెల్లివారికేకా
వెనకముందరికెల్లా వెలవెట్టువలపు
[14-52

యీసురేఁచనేఁటికి యిందరిలోపలనిన్ను
వాసిదెచ్చుకొని యెంత వంచఁజూతురో
రాసికెక్కితివి తొల్లె రచ్చకూ నెక్కితివి
బేసబెల్లి నాకోపము పెంచ నిఁక వొద్దురా
[17-58

బేసబెల్లి కాఁగిటి బిగువుకు నే నోప
రేసులతో నవ్వు నవ్వే వాసులే మెచ్చు
[17-333

సేసలువెట్టేవేళ చేతనెంత పెనఁగినా
బేసబెల్లి పంతాల బీరమాడఁజెల్లదూ
[18-222

ఆసలుగలిగితేనే అంటుకొను వేడుకలు
బేసబెల్లి ( ? ) వేడుకలఁ బ్రియములేదు
[18-445

**బేసబెల్లితనము**

బేసబెల్లితనమున బ్రియాన నిచ్చకమాడి
మూసి దైన్యపుఁజేతుల మొక్కులింతే
కాక
[7-250

ఆసలుచూపి మాటాడి ఆసవెట్టి సన్నసేసి
బేసబెల్లితనమునఁ బెనఁగేవపునే
[13-4

బేసబెల్లితనమున పెనగులాఁడగ మిమ్ము
తోసుకవచ్చి యడ్డము తూర నాకేలా
[13-128

## బొ

**బొట్టులమెకము**

బొట్టులమెకముసేసే బోయనాయఁడు
పట్టపునెమలిచుంగు బలుబోయనాయఁడు
[5-285

**బొడుకలు**

లెక్కించ నితనికైన లెంకలకు బొడుకల
కొక్కట విధినిషేధా లూహింపలేవు
[7-277

**బొడ్డుతామెర**

దనుజాంతకు బొడ్డుతామెరకాదా
జననకారణము సర్వమునకు
[10-133

**బొద్దు**

ముద్దులవ్రేళ్ళతోడ మొరవంకయుంగరాల
నిద్దపుం జేతుల పైఁడి బొద్దులతోడ
[4-1

**బొమముడివెట్టుకొను**

జగడాఁగయ్యెకూడ సందిటనిటికి
మొగము జొత్తిల బొమముడి వెట్టుకొనుచు
[వ. యో. వి. 4–1250

**బొమముళ్లు**

నగవుల సుడివడె నభోంతరంబుల
పొగలెగసెను పెనుబొమముళ్ళ
[8–239

**బొమ్మంచుమోవి**

పులకజొంపాలతోడ బొమ్మంచు మోవితోడ
కొలచి నందె కొలచి కొంకనేటికే
[15–117

**బొమ్మచారి**

పొలఁతికి బాసయిచ్చి బొమ్మచారివై వుండఁగ
చెలి పేరొకతెవచ్చి చేయివట్టీని
[14–66

బాల బొమ్మచారై యుండె పగలెల్లా సాధించె
నీ లీలలు దలఁచి నీకుగానె
[15–300

**బొమ్మజంకెనలు**

యిమ్మల శ్రీవెంకటేశుఁ డిరవుగా నిన్ను నేలే
బొమ్మ జంకెనల నెంత పొందుచూపేవే
[18–522

**బొమ్మఁబెట్టు**

మహి నా పుట్టుగులకే మరి బొమ్మఁ బెట్టినాఁడ
విహితమిందుకు నేది విధి చెప్పవయ్యా
[9–22

**బొమ్మముడిజంకెన**

పూఁచిన యొఱపుల బొమ్మముడిజంకెనల
లోఁచకువే మనసు చిల్లులువోయాని
[4–8

**బొమ్మముడిఁబెట్టు**

పువ్వువంటియాన ముడుపుగఁ గట్టుకొంటిగాకఁ
నివ్వటిల్లు బొమ్మముడినీపైఁ బెట్టితినా
[18–386

**బొమ్మరపోవు**

బొమ్మరపోవఁడు పూతఁకిఁ బొరిగొన
అమ్మరో గయ్యాళి శిశువు
[4–151

**బొమ్మరవోవు**

బొమ్మరవోయి వేల్పుల మూఁకవేల్పుఁ
గమ్మరిఁబిలిచి యక్కజము చూచితివె
[వ. యో. వి. 519

**బొమ్మరిండ్లాట**

తనయాడు చెలులును దాను ప్రేమమున
నెనసి యొక్కెడ బొమ్మరిండ్లాటలనుచు
[వ. యో. వి. 5–598

**బొమ్మల జంకించు**

పొట్టఁ బొరుగుననుండి బొమ్మల జంకింతురు
గుట్టుతోడ నూరకైనాఁ గొసరుదురు
[18–405

పచ్చి నీగుణములకు పరిణామించుటగాక
కెచ్చురేఁగి బొమ్మల జంకించవచ్చునా
[15–15

దేవులనై యుండిన మందెమేళాన నూరకే
పూవుల నీవువేసితే బొమ్మల జంకింతునా
[18–276

బొమ్మల జంకించనోప పొరిఁజెక్కు నొక్కనోప
యెమ్మె నీరతులఁజొక్కి యిట్టుండేనేను
[17–396

**బొమ్మలపెండెము**

మగువపాదమున బొమ్మల పెండెమున్నది
నిగనిగ మనీనదే నీ విచ్చినదా
[18–436

బొమ్మలు ముడిపెట్టు
మొక్కలాన బొమ్మలు ముడిపెట్టుకోకువే
చక్కని నీమోమునకు సాజమేమేలు
[18-493

బొమ్మపెట్టు
అగణితాయుష్మంతుఁడై యక్షకలిమి
నగుచుండ మృత్యువునకు బొమ్మపెట్టు
[ప. యో. వి. 2-748

## భ

భంగపెట్టు
కుంగకలమేలుమంగఁగూడి
శ్రీవెంకటేశుఁడు
భంగపెట్టీ దైతేయులు పారరో
దిక్కులకు
[8-164

పరకామినులను భంగపెట్టినదె
హిరణ్యకశిపుఁడిదివో దేవా
[10-36

భవనాసి పొంతవాఁడు
భవనాసి పొంతవాఁడు భావించఁ
దెల్లనివాఁడు
యివల శ్రీవెంకటాద్రి నిరవైనాఁడు
[7-274

భవనాశియేరు
నడుమఁజెమట భవనాశియేరు మీకునచ్చె
అడియాలముగ లోలోనందెఁగా మీవలపు
[14-141

## భా

భారకుఁడు
దైవమే భారకుఁడు ధరణి రక్షించుటకు
భావింప నరులచేత పనిలేదు
[9-164

భారపెట్టు
భారపెట్టి దేహమెల్లా బడిలించినయాస
పారిమమ్మేఁచితి వింతబదుకవోయాసా
[11-161

భావరతి
శ్రీవెంకటేశుఁడ నన్నుచేకొని కూడితివిట్టె
భావరతి నాపెనుఁ జెప్పకు మంటిఁగాకా
[17-473

## భు

భుజవేయు
కోపులఁ బుణ్యములెల్ల గోవిందుని
కిచ్చితిమి
పాపల స్వర్గముత్రోవ భుజవేయరో
[6-145

భుజములు మూఁడగు
పూఁచి భుజములు మూఁడై
పొరలి వుండుటగాని
చాఁచిన కరము మీకే సన్నసేసీని
[17-575

## భే

భేశాన
బలువైన గడియలువాపి భేశాన
తలుపులు దెఱచి య త్తటిలోనికరిగి
[ప. యో. వి. 4-1167

## భో

**భోఁసేయు**

యింటనె భోఁసేసేవేళ యెంగిలి
ముట్టవచ్చేవు [17–268

**ప్రళయకాలము** (continued)

ప్రళయకాలమునాఁడు బ్రహ్మాండకోట్లు
సొలవక నీ కుక్షి చొచ్చినట్లు
[11–83

## బ్ర

**బ్రహ్మాండకోట్లు**

పెక్కు బ్రహ్మాండకోట్లు పెక్కు
బ్రహ్మకోట్లు
పెక్కు రుద్రకోట్లును పెక్కు యింద్రులు
[7–265

## భ్ర

**భ్రమఁబడు**

పచ్చవి కనకముపై భ్రమఁబడెమనసు
చిచ్చువంటి విషయాల శివమెత్తెమనసు
[11–40

## మ

**మంక**

చెల్లఁబోనాహారముల చిక్కువడితేనేమి
మల్లాడి దిద్దవచ్చేవు మంకవానీవు
[17–158

**మంకుఁ గామక్రోధాలు**

మనసునఁబుట్టిన మంకుఁ గామక్రోధాలు
వనిలేవు తనకంటెఁ బాపమంటదు
[7–54

**మంకులు తీరు**

ఇంతనేలగుట్టు యిన్నియు బయటఁబడె
మంకులెల్లఁదీరెనిఁక మానరాదు పొందులు
[14–53

**మంకు విడిపించు**

చనవులిచ్చినను సమతు సేసియిటు
పెనగి మంకు విడిపించితివి
[15–180

**మంగలాన జాజులువేచు**

సంగతెఱగవు నీ జాణనందువు
మంగలాన జాజులు వేమారు వేఁచేవు
[12–4

**మంచముకింద నూయి**

మఱివిచారించఁబోతే మంచము
కిందే నూయి
మెఱయఁగ హరిఁగొల్చి మించరో జనులు
[10–135

వుండివుండి కిందుమీఁదు వుపమఁ
జింతించుకొంటి
వుండఁబో మంచముకింద నొక నూయి
[5–242

**మంచముపై జాగరాలు**

ముంచుకొంటె వలపులు మొగచాటవుగ
మంచముపై జాగరాలు మరి మేలయ్యా
[17–64

**మంచము వంచు**

ముంగిటనేపాలుఁగాలి మూలఁదోఁటంటు
వెట్టఁగా
సంగతిగానప్పుడే మంచము వంచేవు
[14–198

**మంచమెక్కు**

సుద్దులెల్లఁ జెప్పిచెప్పి చొక్కుఁ
బెట్టుచునాతో
పొద్దున మంచమెక్కితే పొందుకాయనా
[15–229

నేఁడన్నుఁగైకొని నేరమిందేదే
యీదెసఁ దనమంచ మెక్కనైతినా
[15-32

మంచముకింద నుయ్యి
మరల విచారించితే మంచము
కిందే నుయ్యి
శిరుల హరివారైరి శివాదులు
[9-280

మంచముకిందె నూయి
మఱి నా సుద్దులు యెంచఁగ నెంచఁగ
మంచముకిందె నూయి
గుఱి నీ కథలివి వినఁబోతే నీవే
కొండలఁ గోటానఁగోట్లు
[9-84

మంచానకువచ్చు
మనసు పట్టఁగలేక మరియేల పారలేవు
చనవు నేనుక నా మంచమునకు రారాదా
[14-206

మంచిమణఁగు
వుదటుమీఁది నణఁగు వొద్దికతోడి
గొణఁగు
మదరాగమీపతికి మంచిమణఁగు
[17-526

మంచు విచ్చినట్టు
ఘనుఁడు శ్రీవేంకటేశుఁగని
శరణన్న జాలు
వెనకపాపాలు మంచు విచ్చినట్టు విచ్చురే
[6-140

మంటఁగలసిపోవు
కలుషబుద్ధులఁ బ్రజ్ఞగలదింతయును
మంటఁ
గలసిపోవుట పూర్వకర్మ విశేషం
[11-3-47

మంటఁజేసినబొమ్మ
మంటఁజేసినబొమ్మ మనికి సంసారంబు
రెంటికినిగాని నీరిడికొలువు బ్రదుకు
[11-3-38

మంటమారితనము
బంటువలెఁ దా వాకిటఁ బవళించి
వుండఁగాను
మంటమారితనమున మాటలాడనైతి
[17-582

మంటికి
అందిన శ్రీవేంకటేశుఁ డంతరాత్మఁ
దొక్కఁడింతే
మందలించి కొలువరు మంటికా
మీ జ్ఞానము
[8-65

మంటివంకబతుకు
మంటివంకబతుకు తా మదియించి
మురిసేను
యింటి ముంగిటనేవుండి యిహీ నేను
[7-279

మండాటము
నెలవినవ్వులతోడఁ జింతలేలయ్యా
చెలఁగి మా మండాటాలు చేకొనరాదా
[18-309
వట్టి మండాటములేల వద్దనేలా
[17-537

మండాటాలు
కోమలిమన్నన నీది కోరికలెల్లా నీవి
వేమరు మండాటాల లింకలేలయ్యా
[17-96

మండాడుకొను
యిప్పుడే నా కరములు వేన చెప్పుకొని
మండాడుకొనియెద నది యెట్లంటేని
[వై. వ. 11

మండెమురాయఁడు
మానక శ్రీవేంకటేశ మండెము
రాయఁడవై
పూని నన్ను మన్నించి పొందేవు నరహరి
[13-229

**మంతనాననుండు**
చింతలెల్లా నుడిగితే శ్రీపతియందే వుండు
మంతనాన నుండితేను మరి నాతఁడే
[8-152

**మంతనానబిల్చు**
సంతతజ్ఞానాన నీ సాకార మున్నదందురు
మంతనానఁబిల్తు నొకమాట వినఁబడదు
[8-210

**మంతుకునెక్కు**
మంతుకు నెక్కినమతి సమస్తమును
యింతయు శ్రీవెంకటేశు మహిమలే
[7-111

వంతము రిప్పించేది భావము గరఁగించేది
మంతుకునెక్కిన తన మంచిగుణమే
[18-240

**మంతుకుఁ బుట్టించు**
చింతలిఁక నేలా శ్రీపతిగలుగఁగాను
మంతుకుఁ బుట్టించి తానె మనువుఁగాక
[10-226

**మంతుకెక్కు**
మంతుకెక్కిన ద్రౌపదీ మాన
రక్షకుఁడీతఁడు
చెంతనే వృద్ధవృపాలి చింతామణి యీతఁడు
[11-231

చింతించ రక్షించిన శ్రీవెంకటేశుఁడు
మంతుకెక్కెనిఁక మతకములేల
[9-273

**మందటూడు**
మందానిలుఁడు యెంత మందటాడినా నేమి
అందరిలోఁ దనపొందు లబ్బెగా నాకు
[18-270

**మందడిసాని**
మందడిసానుల కమ్మనిమోముఁ
దమ్ములకు
చెందిన తుమ్మిదవో మా శ్రీకృష్ణుఁడు
[17-343

**మందపిలివుండు**
పట్టరాని విషముల పాముఁదెచ్చి తలకిందఁ
బెట్టుకొన్నా నది మందపిలి వుండేనా
[5-119

**మందపురాక్షసులు**
యిందుబో శ్రీవెంకటేశ యిట్టె
నీ దాసులుగాక
మందపు రాక్షసులాడే మతము నడతురు
[8-33

**మందమిరియాలు**
మందమిరియాలువో నీ మాటలు
సిందలకుగునివో నీ సీటులు
[15-116

**మందలించు**
మందలించినకాఁగిట మర్మములెల్లా
యున్నవి
యెందునైనా నీ సిరులే యేమి గొరతయ్యా
[14-34

కందువవనులు సేయఁగలవు నీవేమైనా
అందాలు నేసుకరాను ఆపెగలదు
పొందులుచూచి మిమ్ము పొగడనేము
గలము
మందలించినగవయ్య మతియాలకడదు
[13-69

**మందలో గొంగ**
వెంటరాకుమని కృష్ణు వెరపించి యశోద
వొంటిమందలో గొంగవున్నాఁడనె
[10-258

**మందునూరు**
నేరుపుగలిగితేఁ జాలు నీవేనేను
దూరి మాటాడనోప మందులిట్టినూరకోరా
[17-365

**మందెమేలములు**
మానవెన్నటికిని మందెమేలములు
[శు. శ. 951

మందెమేలము

మన్నించి యెంతగూడినా మందెమేలము
చెల్లునా
మున్నిటిసుద్దులు నేడు మొనసేతురా
[18–27

మేలిమిచ్చినమందె మేలంబుమాని
తాలిమితోడ నాతని చిత్తమెఱఁగి
[ప. యో. వి. 5–1777

కౌమరప్రాయము దొరఁకొనికూడిమాడి
మమతఁజాయకయున్న మందెమేలమున
[ప. యో. వి. 4–990

మందెమేళము

మంచముపైఁ దలపోతు మందెమేళ
మనియన
కంచముకూడర్పింతుఁ గాదననేర
[7–89

ఇందుకుఁగా నెవ్వరూ మరేమిసేసేరు
మందె మేళమోపకున్న మరియాల
మెక్కేను
[14–211

మందెమేళము నీతో మాటలాడిమిగాక
కందువ మన్నన చాలు కలకాలమెల్లను
[12–1

మాపుదాఁకా నినుఁగొల్చి మందెమేళమే
కంటే
దావగు వీ దాసుల శేషత్వమొక్కఁడు
[7–249

మంతనములాడినట్టి మందెమేళముననె
పంతములే నీయడకు బచరించితి
[17–17

యేలికవని వెఱవక మందెమేళమున
వేవే లవరాధంబులుఁ
జేసితినోచున్ కొనవె శ్రీవెంకటేశ్వరా
[వై. వ. 36

నీ కొలువునేసి నీ పాదములకుమ్రొక్కఁగా
మందెమేళ
మయ్యెడునో యంతట నింతటనుండి
సేవింపుదును
[వై. వ. 16

నీకుమొక్కఁన మందెమేళము నేనొక
కొండనేసుక
లోకముల దేవతలకెల్లను లోను
వెలిగానైతి
[6–35

మందెమేళాలు

పొందుల శ్రీవెంకటేశ భోగించితివినన్ను
మందెమేళాలాడే నింతె మరియేమిసేసేరా
[17–1

మక్కళించు

పక్కన నిన్నుదగ్గరివంతపుమాటలెల్ల
మక్కళించియాడ నీతో మరచితిని
[17–18

మక్కువేయు

గుక్కక నా దీమసము గోడవంటిది
యెంతని
మక్కువేసే తానేచూచి మమ్ముఁగాచీఁ
గాకా
[18–261

మగఁడులేని మనువు

మక్కువ మగఁడులేని మనువు గలుగునా
లెక్కించి యంతర్యామివిలేవి
నే నున్నాఁడనా
[6–130

మగఁడులేని సింగారములు

పరమాత్మునికిఁగాని తపంబులు
పాతాళముల విధానములు
మరుగురునికిఁగాని పూవుల పూజలు
మగఁడులేని సింగారములు
[7–1

మగటిమి
నగి శ్రీవేంకటేశుఁడు నన్నుగూడె యింతలో
మగటిమినింత మన్నించుమనవె
[15-262

మగపాడియగు
ఒఱపులు నంత మా కుదుటులుం గఱపి
మఱియు నెంచుట యెల్ల మగపాడి యగునె
[అ. మ. క. 2653

మగుడి మగుడి
జగడాలన్నియుఁ దేరె పతి నీతో పంతమాయ
మగుడి మగుడి నీతో మాటలింకనా
[14-300

మచ్చముపట్టు[=గుర్తించు]
అలరులు ముడిచేనంటేఁ దాఁలోగిని
మలసి వాడుఁజూపుల మచ్చముపట్టేనా
[17-361

మచ్చికె
మచ్చికె విన్నుఁజూచితే మంచానకుఁ దీసేవు
[17-536

మచ్చుమేపులసిరులు
చచ్చేటి దాకమాయ సరిఁబుట్టే దాక మాయ
మచ్చుమేపులసిరులు మాయలో మాయ
[7-224

మచ్చుమేపులు
మెఱయించే చన్నులే మించుఁబెట్లు గుండ్లుసుండి
మెఱుఁగు మోవులే మచ్చుమేపులుసుండి
[5-319

మజ్జాత
మాతో నింకానా మజ్జాతాయను మాకు
చేతికి లోనైన మీఁద జెప్పవలెనా
[14-151

మజ్జాతి
నవమై శ్రీవేంకటేశ నాకె మజ్జాతిగాక
వివిరి వేరొక్కతె నీతోఁ బొందుసేసునా
[17-347

యెనసితివి శ్రీవేంకటేశ నన్నింతేసిగాను
చనవరులకును మజ్జాతియాయ నిపుడు
[14-197

మటుమాయము
కటకటా కర్మమా కాలములో మర్మమా
మాట మాయైపోతివంటూ మదినమ్మి వుంటిఁగా
[6-155

మటుమాయములు
మటమాయములఁ దనమగువపసిఁడిసిరు
చిటిపొటి యలుకలఁ జిలికించఁగా
[5-178

మటుమాయపుచవి
నటించు చవలపు నాటకగలనే
మటమాయపు చవి మానేనా
[10-69

మటుమాయలబండి
మంకుదిమ్మరియట మాయలబండి
డొంకువోయిన టకటొంకుసంకటము
[వ. యో. వి. 4-745

మట్టినచోటెు మట్టు
నెట్టిన శ్రీవేంకటేశ్వర నీతో గూడఁగ జగములు
మట్టినచోటే మటే మనుజులమిదెనేము
[9-51

మట్టుపడు
వొఱలి బంధించవద్దు వున్నతి శ్రీవేంకటేశు
మఱఁగుచొచ్చి మఱచి మట్టుపడవలెఁ గాన(క?)
[10-72

మట్టుపడకిటు నూరుమారులైనా నారగించు
ఇట్టె యిందరిలోన నిన్నాళ్లును
[11-3-56

మట్టుపడి యొకచోట మ(నః)సెందు నిలువదు
యిట్టి చెంచలుఁడ నాకు నెన్నఁడో నిశ్చయమే
[11-66

ఒరసి దుర్గుణముల మానిన నా చిత్తము
మరలి మించిగుణాన మట్టుపడీనా
[71-50

వనివడి యెట్లా నీ భక్తి యిచ్చేవో నా
మనసు చంచలమెట్టు మట్టుపడీవో
[7-93

మగవాఁడవంచు మీఁద మట్టుపడనోపుదువు
తగవులు మమ్మేల యిత్తరి నడిగేవు
[15-223

మట్టుపెట్టు

నూటికైన నీ నామము నుడుగఁగ వశమా
మాటలు నీ సెలవుగా మట్టుపెట్టు టెంతే
[7-29

వొగి నీ వెండైనఁబోతే వొరుచుకుండఁగ లేను
మగఁడవు నీ గుణాలు మట్టుపెట్టలేను
[17-399

మట్టుమీరు

గుట్టుతో శ్రీవెంకటేశుఁ గొలువఁగా నన్నతఁడు
మట్టుమీరఁ బదవిచ్చి మన్నించఁగాను
[10-53

మట్టుమీఱు

అట్టయితే నా యంతర్యామి వేలెత్తివయ్యా
మట్టుమీఱి ముక్తియాస మానవటవయ్యా
[7-220

మట్టుమీఱు పుష్పమయతోరణములు
కట్టకట్టినగతి నొప్పుచుండు
[వ. యో. వి. 5-15

మట్టుమీఱక లోకసమ్మతముగాఁగ
గుట్టుతోఁడుత మెలఁగినఁ గోటిసేయు
[సీ. శ. 16

మట్టుమేర

ఎదురులేక చరింతురెట్టైనా శ్రీవైష్ణవులు
మదించి నేనుగులకు మట్టుమేరవున్నారా
[9-112

మట్టులేదు

కొట్టఁగొనకెక్కించుఁ గోరి మొదలికి దించు
మట్టులేదింతింతిని మరియు నీ మాయ
[9-251

మట్టులేని మంత్రము

పుట్టిన జన్మము పావనమైతే
మట్టులేని తిరుమంత్రము దొరకు
[9-21

మట్టులేని వయసు

చుట్టాలఁజేరి చూచి సుద్దులవావులుగంటి
మట్టులేని వయసుతో మదముగంటి
[7-22

మట్టువడు

ఏమిసేసినఁ గపటికి హితవుగాదు
మాఱుమలసినఁ బనులెల్ల మట్టువడును
[సీ. శ. 76

మత్తుఁడై యున్నఁ గార్యంబు మట్టువడదు
వలసి యొల్లమిసేయంగవలదు పతికి
[సీ. శ. 51

మట్టె

మంచి నడపులకును మట్టెలేమాటు
[13-242

మడవగప్పు
నిడుదవాఱుగఁజేసి నీరునిండార
మడవగప్పుచు దండ మడవ విప్పుచును
[ద. యో. వి. 4–546

మడిదున్నుకొని బ్రదుకు
పైపైనె దేహంపుఁ బల్లెలోనఁగిన నరక
కూపముల మడిదున్నుకొని బ్రదుకవలసె
[11–2–27

మడుగులు గలంచు
అడుగరానిదడిగే వాసలు నేసేవు
మడుగులు గలంచేటి మాటలాదేవు
[4–128

మడుగులుబ్బు
కలవే శ్రీవెంకటేశ కూడితివి వయోమద
మెలమి మడుగులుబ్బె నెంత బంటు
యీఁకను
[14–190

మతకరి
యితవై శ్రీవెంకటేశ యింతి నిట్టె
కూడితివి
మతకరి కరితీపు మరియేలయ్యా
[14–157

మతిచింత
అతను సంపదకంటెన సదా చెలిరూపు
మతిచింతచేత వేమరు నలఁగెఁగాక
[4–7

మతివారు
ఇతరుల దూరనేల యెవ్వరూ నేమిసేతురు
మతివారూఁ దమపంటి మనుజులేకాక
[6–174

మత్తాయిగొను
యెక్కడిని నానాఁటికి మదమెంతైనా
నజ్ఞానమున
యెక్కడి నీ సంసారమె హరి యెదుటనే
మత్తాయిగొన్నట్లు
[8–88

మదనమెత్తించు
బిత్తిగలవానివలె పట్టి యాకు మడిచిచ్చి
యిత్తల మదనమెత్తించి యెమ్మెచూపేవు
[17–228

మదనమెత్తు
సన్నపుఁ జెమట నొసలఁ బొడమ
గన్నులు దేలగిలగఁ జొక్కుచు
మిన్నక మదనమెత్తెననుచు మెలుఁత
తమ్ముల ముమియున
[4–50

మదరసము
కన్నుల తేటల కప్పురమాకుల
సన్నపు నిట్టూర్పు సంపెంగల
చిన్ని నెరిఁగురుల చీఁకటిమాకుల
వన్నె మదరసము వడిసేఁ జెలియా
[15–230

మదరాగము
కాతరపు మాటలాడి కన్నుల
కెంపెక్కించేవు
యీ తరుణి మదరాగమిది యెమ్మెలనరా
[17–447

మధ్యాన్నము
యిచ్చట శ్రీవెంకటేశుఁ డింత సేసికూడె
నింకా
మచ్చికతో రమ్మనవే మధ్యాన్న
మెక్కను
[14–64

మనవార్తి
మనవార్తి నానాఁటిమాయ చూపెట్టు
కుండితే
జనించి తనకు విజ్ఞాన సిద్ధియగుట
[7–272

మనవి చనవులు
ఆనుక భాష్యకారులు అట్టెమీరుఁ
జేయరాదా
మానక విన్నపము మా మనవి చనవులు
[8–267

మనవి సనవులు
మునుకొని ధ్యానించువారు మును
లెందరైనాఁ గలరట
వినయపు నా మనవి సనవులకు
వేళలెపుడు గలిగీనో
[7–67

మనసరి
అంత మనసరివని ఆడెనా నిన్ను
చింతించే వీయాలననే సిగ్గు కింతేకాక
[16–2–60

మనసుకొట్టఁగొౕన
మనసు కొట్టఁగొౕననే మరిదైవమున్నాఁడు
చెనకి యిఁకనెన్నడు సేయరు పుణ్యములు
[9–19

మనసుదవ్వి కనుఁగొను
సూటిగా గురుఁడు మాకుఁజూపె కర్మము
గాటపుమనసు దవ్వికనుఁగొంటి మిదివో
[10–137

మనసునఁదాగినపాలు
మనసునఁ దాగినపాలివి మదిఁగల
కోరికలిన్నియు
యినుమున నిగిరినసీళ్లు యిల నాహారములు
[6–133

మనసుపెట్టు
అందాకె మనసు పెట్టినటువంటి కౌఁగిలి
కిందటనేవాఁడి మిగిలినదె గాకా
[7–51

మనసు పేద
ఆవతియఁగదవే అందుకే
కాచుకున్నాఁడను
వూనుక నీవెంత నేర్పరివైనా భువి
మనసు పేదను నేను
[7–67

మనసు, మర్మము (జంటమాటలు)
చెవకే వీమాటలకు చేయిచాచ కేలమాను
మనసు మర్మముగొన్న మదిరాక్షి
[17–19

మనసువచ్చు
జాడ నీ మనసువస్తే సరుగఁ గరుణింతువు,
వోడక శ్రీవెంకటేశ వున్నసుద్దులేఁటికి
[9–174

మనికితము
మగువకు నేడుగా మనికితమెల్లఁబాసె
వెగటువోనీమిటికి విచ్చేయగాను
[17–129

మనికితపడు
వెంగన నిమ్మపంటను వేసేలవేసితినంటా
కంగి మనికితపడి కరఁగీఁజెలి
[13–221

మనికొలుచు
తిరువెంకటాచలాధిపునిఁగని మనికొలుచు
వెరవుచేతనెకాని విడవదీబాధ
[5–142

మనుఁగాపు
వినవయ్య యిదివో శ్రీవెంకటేశ నా మనవి
మనుఁగాఁపుజేసితివి మన్నించవయ్య
[10–208

మనువు
తనువునకుఁగలిగె వంతతమైన తిమ్మటలు
మనువునకుఁ గలిగె నామని వికారములు
[5–84

మనోవ్యభిచారము
యెక్కడసిద్ధించు బ్రహ్మచర్యము
యెదుటనే కాంతలఁ జూచినవేళను
చక్కఁగా మనోవ్యభిచారంబునఁ
జలియించుంగాక
[6–190

మన్నమగఁడు
నన్నపుఁ జల్లనిగాలి జాలిరేఁచఁ
బగవాఁడ
మన్నమగఁడు సేసిన మతకముగాక
[16–2–49

మమతరేఁచు
కాయముపై మోఁచి పెట్టెఁ గట్టివేసిన
బొమ్మలు
మాయలై దినదినము మమతరేఁచీని
[9-63

మయిలలు మణఁగులు
మదిలో చింతలు మయిలలు మణఁగులు
వదలవు నీ పని వద్దనకా
[7-241

మరఁగు
చేరి శ్రీవెంకటేశు సేవించుకుండఁగవలె
గారవాన సదా మరుఁగవలెను
[8-228

భేదాభేదములేదు పెక్కు మరఁగులులేవు
ఆదినంత్యములును ముక్తాత్మలొక్కచే
[10-43

మరఁగుచొచ్చు
నిరతి శ్రీవెంకటేశ నీ మరఁగు
చొచ్చి నేఁడు
గురునియానతిచేతఁ గొంకులెల్లబాసె
[8-8

ఏమిసేయఁగలవాఁడ నిదివో నేను
నీమరఁగుచొచ్చితిఁగా నీ చిత్తమిఁకను
[8-200

యిచ్చల శ్రీవెంకటేశ యిహపరమెల్లా
నీవు
చొచ్చితిమి నీమరఁగు సూదివెంట దారమై
[9-32

నిక్క శ్రీవెంకటేశ్వర నీ మరఁగు నేఁ
జొచ్చితి
యెక్కువఁ దానిటమీఁద నెందుకు
దాఁగినో
[9-139

మరఁగులు
మనుజులూరకే తాము మరఁగులంటా
నుందురు
యెనసి దేవుఁడు సేసె నిందరికిమాయ
[8-238

మరఁగులుసేయు
అంతరాత్మవై నీవు అటుమరఁగులుసేయ
నింతనె నినుఁదెలిసేయంతవాఁడనా
[11-158

మరఁగువారు
కలిగిన శరణాగత వజ్రపంజర
వలసగు నీ మరఁగువారమయ్యా
[9-146

మరగాళ్లు
వున్నతి నీకడకు రాకున్న కాళ్లు మరగాళ్లు
సన్నుతిసేయనిజిహ్వ పరిసుపజిహ్వ
[7-216

మరగించుకొను
సరసనైదులశలింద్ల జవ్వనపు గొల్లెతల
మరగించుకొన్నవాఁడు మఱి
యీ విట్ఠలుఁడు
[6-217

మరణదెసలు
యెందరకో మరణదెసలచే నిల
సంయోగ దుఃఖితులు
యెందరకో జన్మరోగముల నెక్కువ
భయమందేటివారు
[6-138

మరపగు
వలరాజుతూపు సంజావడినెక్క మనసు
మలసి రతిసుఖాల మరపాయ మనసు
[11-40

మరపు
గరిమెల శ్రీవెంకటపతి మాకును
మరిపెను వైష్ణవమార్గమదే
[11-139

మరవఁడా పుట్టువులు మరణములుఁ
బ్రాణులకు
వఱవఁడా గంగఁ దన పాదకమలమున
[5–68

మరలుచ
యిరవుగ శ్రీవెంకటేశుఁడ నీ మాయ
మరలుచ నీవే సమర్థుడవు
[7–162

మరిగెంతైనా
జ్ఞానము నేనెఱఁగ నజ్ఞానము నే నెఱఁగను
మానను విషయములు మరిగెంతైనా
[6–2

మరుచిలుకులు
దిట్టైనయది యెవ్వతర నీ యధరమందు
కొట్టగొన మరు చిలుకలొత్తినది
[12–158

మరుతేరు
యింతుల మనోవీథినేఁగి మరుతేరి మీఁద
నంతటా రతిప్రియుఁ డటుగాన
[5–249

మరునాఁటి చవులు
నందడించి మరునాఁటి చవులకే
కూడపెట్టు
పొంది మింగిన కళ్ళ పులుసరమెంచఁడు
[8–206

మరుపాయాలు
కడుఁ బోరా దీతఁడే కారణమందరికి
తడవి మరుపాయలఁ దగులఁ
జోటేదయ్యా
[8–264

మరువు
పాయమనియెడి మహాపాతకుఁడు
తమఁదెచ్చి
మాయంపుసుఖమువకు మరువఁగాను
[5–211

మరుపెట్టు
తరుచయ్యిన పాతక మరుపెట్టక
నరకము చూపెఁబో నా వ్రాఁత
[5–136

మరుసాము
పురుటుఁదమకమున నోపిక కలిగితేను
పెండుటి మరుసామున కియ్యకొనరాదా
[14–125

మర్యాదసేయు
ఐన మున్నొకటి మర్యాదసేసితికి
నీ నగంబులఁబోలు నేడు కోడియల
[అ. మ. ర. 6621

మఱఁగుచొచ్చు
యే వుపాయమునులేక యీతని మఱఁగు
చొచ్చి
దేవుఁ డంతర్యామియని తేజముఁ
బొందితిమి
[8–30

చిక్కి నింద్రియములకు చిక్కను
బంధములకు
చొక్కిహరి నీ మఱఁగుచొచ్చితిఁజాలు
[9–171

వొౌఱలి బంధించవద్దు వున్నతి
శ్రీవెంకటేశ
మఱఁగుచొచ్చి మఱచి మట్టువడవలెను
గాన(క ?)
[10–72

సిరుల వేదాలు నిన్నుఁ జెప్పఁగా వినీని
మరగి మఱఁగుచొచ్చే మమ్ముఁగావవే
[6–73

మఱఁగున బదుకు
ధరలోన నీవు దయదలఁచి నన్నేలుకోగా
వరగు నీ మఱఁగున బదుకుదుఁగాక
[7–250

మఱచుంట
ఆఁకట నాసేలమాను అన్నిటాను
యిందరికి
మాఁకువడి త త్తరము మఱచుంటెఁగాక
[11-3-75

మఱపు
సోదించి చూడఁబోతే చూచి మఱపు
వో దేవదేవ మించెనోహో నీ మాయ
[7-119

మఱపుట
అతిశయముగఁ గర్మినై తిని నీ
మతము నా కొకయింత మఱపవా
[5-17

మఱపేమాట
యెదురులేమికిఁ దనకే దైనఁ దలఁపిది
మదమత్తునకుఁ దనమఱపేమాట
[6-63

మఱఁగుఁజొచ్చు
విఱిగి భూస్థలి నుండ వెఱచి దేవతల
మఱుగుఁజొచ్చెనో దాని మహిమ
యెట్టిదియొ
[వ. యో. వి. 3-723

మఱ్ఱిమానిపంట
కలిమి కామినితోడ కారుకమ్మిన పంట
మలయుచుఁ దమలోన మఱ్ఱిమానిపంట
[11-47

మలకలమాటలు
నెలత నీకు నటు నేర్పిన నేర్పుల
మలకలమాటలు మఱచితివా

మలకల సొమ్ములు
కలకలమను పాదకమలముల
మలకలసొమ్ములమ్మడి నొప్పుమిగుల
[వ. యో. వి. 5-1476

మలఁగు
పరుస చెమటలు మేనజావఁగాను
నిరతపు నిట్టూరుపు నిగుడగాను
నరిఁగరఁగి జవ్వాది జారగాను
చొరసి మలఁగు మీదనున్నాడు దేవుఁడు
[15-93

అనవడి చూడఁగాను అద్దె మలఁగు
పై బండి
నీ సుద్దులే చెప్పేవు నీకేడ వలపు
[13-227

మలగువేయు
సెలవు నీ కాపెసేసి చేతులు నీమీఁదఁ
జాఁచి
అలసి వందున్నఁదాపె అది యేఁటిదో
మలఁగు నీకువేసి మరి తానూ నందొరగి
యెలమి నూరకే వున్నదిది యేఁటిదో
[15-186

మలగు
పానుపుపై నాకె వెలుపల మలుగుపై నీవు
పూనివున్న మీకు నేము బుద్ధిచెప్పఁ
గలమా
[15-65

యెదుటనున్నదిగాక యెడసినదిగాక
వాదిగి మలగుపై నొరిగినదివో
[17-245

మంచముపైనుండి యాపె మలగుపై
నొరగుతా
యించుకంతగోర నూదె నేటికోగాని
[17-205

మలయగొళ్లు
కలితవ్రజములు ముక్కాలుసేయజాలి
మలయగొళ్ళకుమారు మలయచన్దోయి
[ఉ. క. 8254

**మలసి సొలసి మన్నించు**
యెలమి శ్రీవెంకటేశ యిటు నిన్నుఁ గొలువఁగా
మలసి సొలసి నన్ను మన్నించె నీమాయ
[9-251

**మలసుకొను**
మాటలు నీ వాడేవంటా మలసుకొన్నాఁ దతఁడు
[14-101

**మల్లడు**
తొల్లిటిదానసె తొడమీఁదఁ బండుండఁగ
మల్లడియంతదవ్వు నీ మనసెట్టువారెరా
[17-249

**మల్లాడు**
మల్లాడి తనదాసుల మతిలోఁ దా నుదయించి
తెల్లవారించేవాఁడు దేవుఁడు
[11-42

తగుమోహసలిలంబు దాఁట మతిలేదుగన
మగుడఁబడి భవముతో మల్లాడువలసె
[11-3-92

**మళ్లవేసుకొను**
మతిలోని నాయంకే మళ్ళవేసికొని కొంత
వెతదీర్చుకొంటగాక వేగిరించేదా
[14-61

# మా

**మాఁకు**
కాఁకలుచల్లేటివాఁడు కందువదీర్చేఁడు సుమ్మీ
మాఁకువలె మేనెల్లా మఱపింతును
[13-6

**మాఁకుపడు**
యేఁకట శ్రీవెంకటేశ యితవాయఁగదరా
మాఁకువడ మరుడింతమరపెనోకాక
[17-222

**మాఁగు**
దాఁగక శ్రీవెంకటేశ దగ్గరైన దవ్వయిన
మాఁగి నిన్ను దలపోసే మనసే గుఱుతు
[10-8

**మాఁట**
మాఁట నీతో నాడితివి మనసు దెలిసితిని
యేఁటికి నన్నుఁ బిలిచేవేరా నీవు
[17-377

మాఁటచెప్పెద జీవుడా మారుమాఁట లేఁటికి జీవుడా
నాఁటకంబుల పంచేంద్రియముల నమ్మకువో వో జీవుడా
[16-3

**మాఁటుపట్టు**
నెలసు విల్లువిఱిచి సీతఁ బెండ్లియాడునాడు
పలికి బొంకని మాఁటపట్టు నాకు నిమ్మీ
[15-21

**మాకుపడు**
మానినుల పొందులేల మాకుపడివుండవేల
[15-159

**మాగఁబెట్టు**
కాఁగిటిలోపలి మేలుకడఁగి భోగించక
మాఁగబెట్టి వూరకుంటే మంకుదీరదు
[18-317

**మాచరపు**
అదనాయ శ్రీవెంకటాధిప మాచరపదొ
యెదుట నిన్నటి మాపే యియ్యకొంటి వయ్యా
[9-195

**మాటుమందు**
మరఁగి నాపొందె నీకు మాటుమందు
నరున విద్దెమును సతులమె కామా
[13-146

చే ముట్టిచ్చే మాటుమందు చెనకుల నాతో
పొందు
[14–196

మాలుగలుపు
చాలనొవ్విసేయునట్టి జన్మమేమి
మరణమే జ
మాలుగలిపి దొరతనంబుమాన్పి
టింతచాలదా
[5–200

మాటపట్టు
మనుజాధినాథుఁడు మాటవట్టుడిగి
తనసీమయంతయుఁ దానెకైకొనియె
[ప. యో. వి. 6–731

మగువకు నీవిచ్చిన మాటవట్టు దలఁచుకో
తగిన చుట్టరికము దలఁచుకో
[18–72

మాటమాట జగడాలు
మలసేయప్పటివేళ మాటమాట జగడాలు
అలిగి లేచిపోయితే నందుకేమి
[14–206

మాటయిచ్చుకొను
మటి యెవ్వతెకీ పొద్దుమాట
యిచ్చుకున్నాఁడవో
యెఱుఁగక నీకు వీడెమియ్యవచ్చునా
[18–352

మాటలతో మూఁటలు
చేనివంటల కొల్చులు చెప్పరాని చెద్దులు
మానమానవిచింతలు మాటలతో మూఁటలు
[4–33

మాటు
అతివ పీ యంగములె అతను
ఏపుమాటు
తతి నొకటి కొకటికిని దైవమేసేసె
[13–1

మాటుమందు
అటువంటి సతిఁగాని యాదరించవు
మటుమాయముల మాటుమందులే నీకు
[13–82

మాడమాడ పంతములు
యీడ కేతించి శ్రీవెంకటేశ నన్నుఁ
గూడితివి
మాడమాడ పంతములు మరియు రారాదా
[14–206

మాడుపు టిల్లు
మా మాటవినక నీవు మాడుపుటింటిలో
చొచ్చి
కామించి శ్రీవెంకటేశుఁగనికూడితి
[17–581

మాడలుకట్టు గుండులు
కొలిచి మాడలుకట్టు గుండులఁ దూఁచి
నిలువ పూజ్యముగ నన్నియును జెల్లించి
[ప. యో. వి. 607

మానడవళ్లి
వానరెడి దినభోగములు పూరేటి
చనుఁబాలు
మానుకొను మానడవళ్ళి ముద్దులు
మీ కివివో [5–270

మానము
చేవట్టి మానాలుచూడ చెట్టెక్కించివేళలు
కాపించే గొల్లెతలఁగాని నీవు లోఁగవు
[14–209

మానాపతి
ఎటిఁగివుందువుగాని యిందరివలెఁ జూడక
మరువరానియట్టి మానాపతిసుమ్మీ
[15–248

కాఁగిటఁగూడేవారి కనురెప్పలే మరఁగు
వీఁగకు వేకూడెను శ్రీవెంకటేశుఁడు
మాఁగిన మోవి నీవంటి మానపతులేకదా
రాఁగవై యీతనిఁ బొంది రవ్వకెక్కిన
వారు [14–186

మానావతి అయి నా మనసు సోదింతురా
అనుకొని మెచ్చఁదగవేఁగాక
[14–106

పోసపోనివారయితె మయికి మయి
నేతురు
వాని మానాపతులనె వంచుకొం౦ఁటేఁ జెల్లునా
[14–270

వూరక మానావతినై వోజదప్పకుండఁగాని
దేరీతి చేసినదిది యియ్యకొంటగాక
[17–506

మానాపతులు
ఉమ్మడి మానాపతులు వోరుచుకుందురు
గాక
దిమ్మరి మగవారితో దీకొనఁగఁ జెల్లునా
[17–398

వూరివారినెల్లా నంతా వోరి కలయఁ
గొంటివో
వారించి మానాపతులు వాడనుం౦ఁటే నేరమా
[17–175

మానిబొమ్మ
తేనెపూసి నీవిట్లాఁ దిప్పఁగానే తిరిగేటి
మానిబొమ్మఁ జుమ్మీ నా మతిలోని
దైవమా
[5–189

మానిమీఁది తపసి
నానామార్గముల నాఁటుకొను నొక యోగి
మానిమీఁది తపసి సామాన్యుఁడా యోగి
[6–125

మానిమొదలఁ బోసిన నీరు
మోదముతో నొకమాని మొదలఁబోసిన
నీరు
పాదుకొని కొనకెక్కి ఫలించుఁగాక
[10–59

మానివోడ
మానివోడనమ్మి వొక్క మనుజుఁడు
వార్ధిదాఁటి
నానార్థములఁగూర్చి నటించఁగాను
[5–254

మానివోడనమ్ము
మానివోడనమ్మొకఁడు మహాజలధిదాఁటి
నానార్థములుగూర్చి నటియించీని
[10–124

మానిసిదిండ్లమొత్తు
మానిసిదిండ్లమొత్తు నెఱమంటల
పిల్లలకత్తి వేల్పుపెన్
బోనపుముద్ద నిద్దముల పొల్పు దొలంకెడు
సంకుఁగల్గు
[శ్రీ. 16

మానుపడు
మానుపడి తనపొందు మానితినా తొల్లిటద్దె
కానుకియ్యనా నేఁడు కడనుండి నేను
[15–125

మానువంటివారు
శ్రీనాథ నీవు మాకు జీవమయివుండఁగాను
మానువంటివారము మా మననేటి మనసు
[10–126

మాపటిచేఁతలు
ఆ వనికి బెట్టుగానన్న దీవించేవు
మాపటి చేతలకె మచ్చిక చల్లేవు
[4–128

మాపుదాఁకా
యేపున శ్రీవెంకటేశునిటులఁ
బూజించినట్టు
మాపుదాఁకా నితరుల మనసురాదు
[10–250

మాపుదాఁకా నలిగెలు మహిమలు లేవా
శ్రీపతిదాసులై యంత చెల్లదుగాక
[8–134

పాపము నెరుఁగుదు బంధము నెరుఁగుదు
మాపుదాఁకా నివి నేను మానలేఁ గాని
[10–195

మాపుదాఁకా మాను
కోపగించుకొనుటింతె కొంకక లోకాలు
నేము
మాపుదాఁకా మానుమంటే మానఁ
బొయ్యీనా
[10–197

మాపుదాఁకా వెదకు
లోపల తా నూరకుంటే లోకమెల్లాఁ
జరియించుట
మాపుదాఁకా వెదకినా మఱిలేదు తెఱఁగు
[7–7

మాపునిద్దుర
కైపుగ నింతటఁ గామవికారము
మాపు నిద్దురల మంపులె కలది
[10–70

మాపురేపు
ఓపితేఁ దానే తగిలి వోపకున్నఁ దానే
మాని
మాపు రేపు నలయించే మాయ మాకేలా
[8–190

మాపురేపుముంచు
తేపలేని సముద్రము తెఱఁగున
కర్మమెల్లా
మాపు రేపు ముంచఁజొచ్చె మతిలోని
ధైర్యము
[8–32

మాయదారి మాటలు
మాయదారి మాటలేల మరుఁగున నున్న
యాపె
చాయల నీ మోహపుగతిగదా
[15–284

మాయను
వేదములు చదువుతా విశ్వమెల్లాఁ
గల్ల నేరు
ఆ దెస తాము పుట్టుండి అదియును
మాయ నేరు
[8–33

మారిమసంగు
మేరలు దప్పిన శత్రుల
మారి మసంగుటలు మొరదు
మరియాద యగున్
[శేఫ. 43

మారుఁబేరు
నా మగని కౌఁగిటిలో ననిచేజక్కవలవి
ప్రేమమున మారుఁబేరు పెట్టుదురటే
[13–56

మారుకు మారాడు
మారుకు మారాడేటి మందవారము మేము
కోరికినాటేటి చల్లకోరో చల్లా
[4–109

మారుకు మారు
పరమున నిహమున వెంట వెంటనే
పాయని బంధువుఁ డీతఁడు
ధరఁ దనుఁ దలఁచిన మారుకు మారై
తారకించును యీతడు
[7–158

తప్పక చూచీవాఁడె తరుణి నీ మోము
దిక్కు
చొప్పుగా మారుకుమారు చూతువంటాను
[13–224

కాఁగె నిట్టూర్పులై గాలి మారుకుమారు
ఈఁగి చేసినదై వమెఱుఁగఁడా చేత
[4–141

మారుకొను
పోరచి నా మనసిది పుణ్యపాపాలకుఁ జర
మారుకొని విడిపించ మరియెవ్వరో
[10–202

**మారుత్తరము**
మంతుకెక్కినవద్దముడి మారుత్తరా
లియ్యవిదే
[14-243

**మారుదైవములు**
మారుదైవములులేరు మరి నన్ను
గావ నిన్నుఁ
బేరుకొని శరణంటిఁ బెడఁబాపుమాయ
[7-213

**మారుమలయు**
తతి నలమేలుమంగపతి శ్రీవెంకటేశ్వర
మతకాన నువ్వవారు మాఱుమల సేరు
[7-27

సుదతి సింగారాలు చూడరమ్మ చెలులాల
మదనుబలాల మారుమలయవలెను
[13-166

చేనన్న సేసినందుకు సెలవియ్యవలెఁగాక
మానటీనివలె మారుమలయనేల
[14-96

వేసినట్టే వేసి నీతో వేడుకపడుఁదుఁగాక
మానచేలవలె నీతో మారుమలపేనా
[14-105

**మారుముద్ర**
మారుముద్రగాని మంచిమాడకు
వొట్టములేల
కారుకాణగొ హరి తానె రక్షించుఁగాక
[6-1-25

**మారుమొగమగు**
అలుగుచు గొంత మారుమొగమై
యటుచూచిన దర్పణంబునన్
[శృం. శ. 64

పొలయలుక కూటముల ఖోగి దానటుగాన
మలసి యొక్కొకవేళ మారుమొగమాయ
[11-3-39

**మారుమోము**
మతకాన మీరెంత మారుమోములై
యుండిన
రతిఁగూడకుంటే రాగలోచనలతోడను
[14-1

**మార్పులాడు**
అంగలించి శ్రీవెంకటాధిప నీవుగూడితివి
పుంగరములాకెవేళ్ళ నొగిమార్పులాడెను
[14-174

**మాలతనము**
మాలతనమువంటిది మతిఁ దగులు
గామము
అలరి ముట్టువంటిది అంటుఁ గ్రోధము
[6-211

**మాలుగలపు**
మనసొకటి కోరికలు మాలగలపుచు (?)
నుండు
తవిసితే నదియ పరతత్త్వమై నిలుచు
[9-137

**మాలుగలయు**
మాయపుటాసల మాలుగలసె మది
యేయెడ శుద్దేనో యెరఁగమిఁక
[10-187

**మాలుగొను**
తేలింపఁ గన్నుల యాపె తీపులమాటల
యాపె
లోలునిగాఁ జేసె నిన్ను లోకమెరఁగ
మాలుగొనివున్నాఁడవు మదమెత్తి
వున్నాడవు
అలరి మా విన్నపము లాలకించేవా
[15-287

**మాలెమీఁద పరుపు**
మేలుదెలియ కతికాముకుండవై
మీఁదెఱఁగక తిరిగేవు
మాలెమీఁద పరుపెందాఁకా నీమచ్చిక
విడువఁగలేవు
[5-126

మాసటీఁడు
చేసన్న నేసినందుకు చెలివియ్యవలెఁగాక
మాసటీనివలె మారు మలయనేల
[14-96

మాను
పొంచి గర్భమున మాను పొదిగివుండిన నాఁడు
యెంచుకొని ముచ్చటాడ నెవ్వరున్నారు
[8-268

## మి

మింగినకళ్లపులుసరము
సందడించి మరునాఁటి చవులకే కూడపెట్టు
పొంది మింగినకళ్ళపులుసరమెంచఁడు
[8-206

మించుఁబెట్లు గుండ్లు
మెఱయించే చన్నులే మించుఁబెట్లు గుట్లుసుండి
మెఱఁగు మోవులే మచ్చుమేపులుసుండి
[5-319

మింటికట్లు
మింటికట్లు దెగనేసి యంటిపగసాదించి
దంట రాకుమారుఁడు తా నీ కూరుఁడా
[6-226

మింటితాపలుతుంచు
తొడికి మింటితాపలు తుంచి దూప (?) దాఁకినమ్మ
జలధి మరుదేశాల జలమింకించె
[8-133

మింటిపొడవు
మింటిపొడవైనట్టి మించుఁ గిరీటంబదె
జంటలవెలుఁగు శంఖచక్రాలవె [5-75

మిండతుమ్మెద
తమ్మిపూవుఁ గొలనిలో తరుణులుం దాము మింద
తుమ్మెద లీఁదులాడంగ దొంగిచూచి
[4-2

మిటమిట నెండగాయు
మటిమూడ మిట్టాడు మానిసిలేక
మెఱయు వేఁడిమి మిటమిట నెండగాయ
[వ. యో. వి. 7-276

మిటిమిటిపడు
మెలిగొన్న శిఖలంత మిటిమిటిపడఁగ
విడుసాగిలగ మెడల్ నిక్కించి బిగువు
[వ. యో. వి. 2-1542
మెడజాఱఁ జుట్టు చెర్వివ శిఖాశాఖ
మెడలపై నొకయింత మిటిమిటిపడఁగ
[అ. మ. క. 4766

మిట్టిపడు
ఆట్టెకాదా తనమోహమందరు నెరఁగవద్దా
మిట్టిపడి యిందుకే మెచ్చితిఁగా నేను
[17-375

ఇట్టునట్టు మిట్టిపడ నించుకంతేలేదు —వీఁపు
పట్టగట్టమోఁపు మోఁచిపాటువడ్డలేదు
[11-2-29

ఇట్టునట్టు మిట్టిపడ యించుకంతాలేదు —వీఁపు
బట్టగట్ట మోపుమోఁచి పాటువడ్డాలేదు
[5-55

మిడిగుడ్లు
నిడుపమీసాలతోడా నిట్టూరుపులతోడ
మిడిగుడ్లతోఁ దెల్లని మేనితోడ
[7-44

మిడిమూలము
మిడిమూలపు నీ మెచ్చు మేలు మేలు కైకొంటి
వడినోవ నన్నుఁబోవువచ్చి కాఁగిలించేవు
[14-192

మితి, మేర
మించి కాఁగిటఁగూడిన మితిలేదు
మేరలేదు
యించుక గుట్టుననున్న యెరవెలేదు
[7-15

మితిలేని విత్తులు
మితిలేని విత్తులెన్ని మేదినిపైఁ జల్లినాను
తతితో వి త్తినవే తగఁబండును
[7-26

మితివెట్టు
యేకొని భూరేణువులు మితివెట్టఁగరాదట
శ్రీకాంతుఁడ నీ మహిమ చెప్పిచూపవశమా
[7-28

మినుకంత
చను నోటఁబెట్టండు చను గ్రోలకున్న
మినుకంతయుగైన మ్రింగఁడేడువఁడు
[వ. యో. వి. 2-386

మినుకారునెరులు
కనిసర్వగీర్వాణ కామినీమణులు
మినుకారునెరుల తుమ్మెదల వేడించు
[వ. యో. వి. 5-558

మినుకుల దినములు
తనిసితి మిన్నిటి తగులేలో
మినుకుల దినముల మెచ్చేమయ్యా
[9-155

మినుకు విజ్ఞానము
తనయంతరంగపుటద్దము మాసితే నది
మినుకు విజ్ఞానాన మెరుఁగిచ్చుటగాక
[11-79

మిన్నుజలము
అడుగుకింద లోకమెల్ల నడఁచ దలఁచి
గుఱుతుమీర
పొడవులెరిగి మిన్నుజలము పొడిచితెచ్చె
నీతఁడు
[11-3-112

మిన్నునూయి చేఁతాటఁ జేదు
మిన్నునూయి చేఁతాట జేఁది
మెచ్చు మింగు నొక యోగి
వెన్ననన్నముగనూరి పీఁగు నొక యోగి
[6-125

మిన్నునేలఁగూడు
కన్నుల వేంకటపతిఁగన్న తెరువు
మిన్నునేలఁగూడిన మీఁదితెరువు
[5-147

మిన్నునేల నేకమగు
దిందుపడి దేవతల దేవునికి శరణు
అంది మిన్నునేల నేకమై నతనికి శరణు
[9-85

మిన్నునేల నేకము
మిన్నునేల నేకముగా మించిన వాలయెత్తి
సన్నుతిగా వలకేలుచాఁచినవాఁడు
[10-158

మిన్నునేలా నొక్కటగు
మిన్నునేలా నొక్కటైన మేటితేరు
కన్నులపండువయిన శ్రీకాంతునితేరు
[6-227

మిన్నుముట్టఁ బెరుగు
మొలచి పిన్నై మిన్నుముట్టఁబెరిగిన
వాఁడే
తొలఁగఁదో నేటి ముట్టు దోషపురక్ష
[10-54

మిన్నుముట్టు
అట్టె గరుడధ్వజమటు మిన్నుముట్టితేను
కిట్టి దనుజాల కపకీర్తి తుదముట్టెను
[8-92

ఇలనుండి మిన్నుముట్టే యింద్రజాలము
వాఁడు
తలద్రుంచి బ్రదికించు తుక్కులవాఁడు
[11-57

**మిన్నుమోయు**
కదలె కదలె నదె గరుడధ్వజుని తేరు
అదె మిన్ను మోచిన నీలాద్రివలెను
[10–55

**మిన్నులంటారు**
చించుక మిన్నులంటారే చింకలను
జండిగట్టి
వంచుకొనే మన్ను నవి వసమయ్యీనా
[5–119

**మిన్నులతోడరాయు**
దూరంబు చనక శార్దూలంబు డిగ్గి
తోరమై మిన్నులతోడ రాయుచును
[వ. యో. వి. 2–766

**మిన్నులపొడవు**
మించిన కోరికలివి మిన్నుల పొడవులు
కొంచపు దేహము దనకొలఁదిగాదు
[9–249

**మిన్నులమీఁదికిఁబోవు**
మన్నున బుట్టిన కాయము మన్నున
నణఁగెటి దింతే
మిన్నులమీఁదికిఁబోవదు మెరయుచు
నెంతైనా
[9–115

**మిన్నులుముట్టు**
ధరణివంపెట్టఁ బ్రతిధ్వనులు మిన్నులు
ముట్ట
సిరపెత్తె నలి నరసింహదేవుఁడు
[6–228

అడరె నద్దేవుని కోపాగ్నులు బెడిదపు
మిడుఁగురులతోడుత మిన్నులుముట్టె
[11–218

కడు నిసుమంతలు కన్నుల చూపులు
ముడుఁగక మిన్నులు ముట్టెడిని
[8–47

**మిన్నులుమోయు**
దట్టముగఁ బారావతములు మిన్నులు
మోవ
కొట్టఁగొనకెక్కెవా కూడికూడి
[11–3–89

తూరుపునం బొడిచె జందురుఁడు
మిన్నుల మోవ
పాఱుతెంచె విరహుల బందికాఁడు
[శృం. సం. 4–16

మించులదురగము మిన్నులుమోవఁగ
నుంచలఁ గురుచలనాడఁగను
[11–2–30

**మిన్నులుమోవ**
వంచెను శిరసుమీఁద వాలుగాఁ దనతోఁక
పెంచెను మిన్నులుమోవ పెనుదేహము
[9–12

**మిన్నులుమోవచూచు**
నులిచి తావాలము మిన్నులుమోవఁ
జాఁచినాఁడు
జలధి దాఁటఁగ జంగచాఁచినాఁడు
[9–230

**మిఱుఁజూపులు**
మిఱుఁజూపులు మాఁకేయఁగ
మఱఁదలనం బెద్దజాలు మహిలోఁ గృష్ణా
[రేఫ. ఆ. 103

**మిఱ్ఱుపల్లములు**
మిఱ్ఱుపల్లములకుఁదెచ్చి మెఱసి
భూతజాలములకుఁ
దొట్టఁ వెసలు గొలచినట్టి దోసమేల
పాయుమా
[5–113

# మీ

మీఁజేయి

వీడెమియ్యరాఁగాను వెలఁదిని నన్నచేసి
కూడఁగూడ మీఁజేతులు గోరనెత్తవా
[13-123

సుదతి నీకు నొసగే సోబనపక్షంతలు
అదన నీవు మీఁజేత నందుకొంటివి
[14-19

మీఁదటు

పుట్టుభోగి జవరాలు పొలఁతి యిది
పట్టిమంచముమీఁదటఁ బవళించే దెపుడు
[14-208

మీఁదబెత్తు

యెమ్మెలు నెరవఁగాను యియ్యకేలు
సేయరాదు
వుమ్మడిమీఁద బెత్తులు వూహించవమ్మా
[14-135

మీఁదనుండు దొడ్డలెల్ల సన్నములెల్లా
నందులుగారు
మించిన జల్లియొకటి మీఁదనుండు
దొడ్డలెల్ల
చంచుల సన్నములెల్లా నందులఁగారు
[10-267

మీఁదమిక్కిలి

రానికి మీఁదమిక్కిలి రాకాసితనుబున్నారు
మోసమోక యేలుకో నీ మోహమునను
[14-262

మీఁదమీఁదఁ జవులు

మేటి వెంకటేశుఁ బాసి మీఁద మీఁదఁ
జవులంటా
నాటకపు తెరువుల నడిచేము
[11-3-28

మీఁదమీఁదవుండు

తాలిమి చక్కనగాని తమక మెంతైనాఁ
గద్దు
మేలమాడవయ్యా చెలి మీఁద మీఁద
నున్నది
[17-298

మీఁదుదెలియు

మించు సంసారము చొచ్చి మీఁదు
దెలియనివాఁడ
నంచ నీవంతర్యామివని మొక్కేనా
[8-108

మీఁదుయెత్తు

యెత్తినది మీఁదు దనకె మేనుఁ
బ్రాయమును
మొత్తమి నా కేఁకమీఁద మోనమె మేలు
[15-61

మీఁదెత్తు

పాటించి నీ భావము పట్టవశమూ తలఁచి
మేటి నా మనసు నీకు మీఁదెత్తుటింతే
[7-29

గుట్టున నా చన్నులు నీకు మీఁదెత్తినవే
కావా
బెట్టుగాఁ బెనఁగి చేతఁబట్టేవుగాక
[18-364

దేహము భోగించి దించిన విషయము
లిహాలమీఁదెత్తి నివి గొన్ని
[9-93

తనువు లంపటానకు తగమీఁదెత్తితి మిదె
వొనరి నీ వూడిగాన కొదిగేదెట్టు
[8-176

తెరమఱుంగున నొక్కెతకు మీఁదెత్తిన
మోవి
యిరవుగ నీ కది యెంగిలికాదా
[7-51

ఉత్తలపు విరహాన నుడుకుచు వయసు మీ
దెత్తినదినతి నీకు విందుకొరకా
[12-53

కొండలవంటి చన్నులు కొనసాగి
పెరుగఁగా
మెండగు వయసు నీకు మీఁదెత్తుకున్నది
[18-286

మీఁదెఱగు
మేలు దెలియ కతికాముకుండవై
మీఁదెఱఁగక తిరిగేవు
మాలెమీద వరువెందాఁకా నీ మచ్చిక
విడువఁగ లేవు [5-126

మీగడగట్టు
సోగలై మొనజూపు చూపుల వలపు
మీగడ గట్టించు మెఱుగు జెక్కులును
[ఉ. క. ద్వి. 385

మీనుమీసము
మినమినమను మీను మీసంబుఁ దెగడు
వసిఁడివన్నియ ముంజి పచ్చని గోఁచి
[ప. యో. వి. 4-939

మీసలపై తేనె
మ్రుగ్గు వెట్టిన పిండి మొనపియట్లకురాదు
మీసలపై తేనె మ్రింగరాదు
[వి. శ. 71

మీసలు దీఁటుకొను
కరముల మీసలొక్కటఁ దీటికొనుచు
బెరయంగఁ గరణాలఁ బిలువుఁడటన్న
[ప. యో. వి. 6-211

మీసలు డిద్దికొను
కాలవర్ణములతోఁ గాలకూటంబు
జ్వాలలఁబోలు మీసలు డిద్దికొనుచు
[అ. మ. క. ద్వి. 3620

మీసలు దిద్దికొను
కొలువ మీసలు దిద్దికొనుచు నేత్రముల
జలజల నిప్పుల జడియుప్పతిలఁగ
[అ. మ. క. ద్వి. 3073

మీసాలమీఁది తేనె
తీపువలెనే వుండు దప్పుఁ బదార్థాలు
మేపుగొంచే మీసాలమీఁది తేనెను
[7-6

మీసాలు నివురు
మీసాలు నివురుచు మిడిగ్రుడ్లుద్రిప్పి
నాసయాడించి కర్ణములు నిక్కించి
[ఉ. క. ద్వి. 1467

మీసాలు వడివెట్టు
ఉలుకుసూర్పులుమించి హుంకరింపుచును
వలకేల మీసాలు వడివెట్టుకొనుచు
[ఉ. క. ద్వి. 385

## ము

ముంగారుముంపు
మునిమునినవ్వుల ముంగారుముంపులు
వనినాడుఁ జెమట వానలు
[15-230

ముంగిట నిధానము
దొంగిలివెన్నలుఁ బాలుదొటికేటి వీచేయి
ముంగిట నిధానమున్న మోసపోయీనా
[4-39

ముంగిట నిధానములు
ముంగిట నిధానములు ములుగంగ
బొమ్మలతో
వంగడి గొల్లెతలెల్ల జడియఁగాను
[4-30

ముంగిటనుండు
యెన్నిటి కుత్తరమిచ్చే యేపనిసేసి
మెప్పించే
మున్నిటి కర్మములకు ముంగిట
నున్నాఁడను [7-258

ముంగిటవేయు
చిత్తమెల్లా దక్కఁగొనె సిగ్గులు
ముంగిటవేసె
వత్తివలె దేహమెల్లా వాడఁబారెను
[12–28

బంగారు పతిమవంటి పడఁతినీ మైఁదీఁగ
ముంగిటవేయక యిట్టె ముయ్యవేతరుణి
[4–123

ముంగిటి నిధానము
ముంగిటి నిధానమై ముదితవో కొనగానె
అంగలించి మాటలాడవదేమయ్యా
[15–23

ఇంగితమెఱిఁగి వెంకటేశుఁడిదే
కన్నులకు
ముంగిటి నిధానమైన మూలభూతమదే
[5–75

ముంగిటి పసిడికుంభములు
అంగడికెత్తినట్టి దెవ్వెలంగన
ముఖాంబుజములు
ముంగిటి పసిడికుంభములు ముద్దుల
కుచయుగంబు
[5–1

ముంగిటి ముత్యము
ముద్దుగారే యశోద ముంగిటి
ముత్యము వీఁడు
తిద్దరాని మహిమల దేవికి సుతుడు
[9–288

ముంగై మురాలు
ముంగైమురాలును నవే మొలకతారును
నదె
బంగారు నిగ్గులవన్నె వచ్చుబట్టదే
[5–75

ముంచారము
ముందరనె యెనసెటి శిరముల
ముంచారము ముగడపఁగ వసమా
[16–2–112

ముంచిగాచు
మూలమని నుడిగితే ముంచి యెవ్వఁడు
గాచెను
పోలించ వెవ్వని నాభిఁబుట్టె లోకాలు
[8–241

ముంచిన
ముంచిన నారాయణమూర్తులే యీ
జగమెల్ల
అంచిత నామములే యీ యక్షరాలెల్ల
[5–327

ముంచిన మాఁటలు
ముంచినమాఁటలే మోహపుఘంటలు
మంచి యధరములే మచ్చులవి
[9–6

ముంచిన మాయ
యెంచిచూచితేఁ గల వీ పంచమహా
భూతాలే
ముంచిన నీమాయ తుద మొదలే లేదు
[7–80

ముంచిన వేడుక
ముంచిన వేడుకతోడ మొక్కుటగాక
కంచములో పలికూడ కాలఁదన్నేఁటికే
[5–322

ముంచి నవ్వు
మొగమునేఁ జూచితేను ముంచి నీవు
నవ్వితివి
[15–157

ముంచి వుండు
వాఁడివో ప్రతాప సుగ్రీవ నరసింహుఁడట్టె
మూఁడుమూర్తు లొకరూపై ముంచి
వున్నాఁడు
[8–234

ముంచివెట్టిచేయు
ముంగిటి క్షేత్రాలంటి ముంచి వెట్టి
సేయఁగంటి
అంగపు వన్నెచూచి అంతరాత్మఁగంటి
[7–22

ముంచి సిరులందు
దిక్కుల యజ్ఞాలుచేసి దివిజులయ్యేరట
మొక్కి విప్రుల వర్చించి ముంచి సిరులందేరట
[7-30

ముంచు
ముంచివొత్తిన చన్నుల ముద్రలు వొత్తినాఁడింతే
అందల శ్రీవెంకటేశు ననకునీవు
[14-5

వంచల పీతాంబరు శరణాగతి
ముంచిన యజ్ఞానమునకు దీపము
[9-275

ముంచిన నీచేఁతలకు మోహించినదాననై
పొంచి వుడిగేలు సేసి పొలసెనన్ను
[14-126

సిగ్గులు సెలవినంటే శ్రీవెంకటేశు ముంచవే
[14-119

మొగముచూచిన దానముంచి నే రావించేనా
జిగిఁ దాను చెప్పినట్టు నే సేఁగాక
[13-99

చిగురందిచ్చితిఁగాక చేగోరు దాఁకించితినా
మొగమోటనుంటిఁగాక ముంచికైకునా
[14-80

ముంచు
తానువంటిది మనను తప్పులు నీకా లేవు
మూసిన ముత్యాలవలె ముంచీని నవ్వులు
[14-66

మంచివాఁడవవుదువు మమ్ముఁ దడవకు చాలు
ముంచి నీకు నే పొద్దు మొక్కేము నేము
[17-371

ముంచుకొను
కొండలవంటి పనులు కోరి ముంచుకొంటే నూర
కుండి కైకొననివాఁడే యోగీంద్రుఁడు
[6-117

ముంగిటి దేహికిఁ గర్మములు ముంచుకొనుఁగాక
రంగుగ శ్రీపతిఁ గొలిచి రతికెక్కినా
]10-186

ముంజు
గొల్లముంజ రాచజడ్డుకోరి బుద్ధుడైన సిగ్గు,
బొల్లిగుబ్బపు నూఁగురొచ్చులమానునా
[13-198

ముంజీతము
చుట్టరిక మెంచేవారిచోటికి వల్లిదండ్రివి
ముట్టి కొలిచినవారి ముంజీతమవు
[9-219

ముంజేతి కంకణము
పద్మనాభా నీకై మ్రొక్కనెత్తిన కేలి
నమస్కారంబు ముంజేతికంకణంబు
[వై. వ. మా. గీ. 10

చొప్పుగా నీ పాదాలు సోఁకినవారికెల్లా
కప్పమైన ముంజేతికంకణమవె 'కావా
[15-201

ముంజేతి చిలుక
చెలరేఁగే ముంజేతి చిలుకవో వలపు
నిలువున నూరువందేటి మొలకవో వలపు
[13-212

ముంటికొనవాదులడిచేనా
నేఁడు గొతలా తననేరుపులివి
వాఁడివెట్టి ముంటికొనవాదులడిచేనా
[14-298

ముంటివాఁడి
అంటిముట్టినే పరనమాడఁగానా కొనగోరి
ముంటివాఁడి సోఁకకుండా మొక్కవచ్చి నితఁడు [17-535

ముందరవెనుకలగు
వలచి తిరువేంకటేశ్వరునిం బొంది
సమరుని
తలఁపులన్నియును ముందరవెనుకలాయె
[4-49

ముందరిపీడెము
యెందరు సతులు నీ కెట్టైనా నుందురుగాక
ముందరి పీడెము నది మోహము నది
[13-27

ముందువెనక అగు
పొదిగి కలసెఁ దానె పూఁచి నీవు నవ్వేవు
ముదమునఁ బనులెల్లా ముందువెనకాయెనె
[15-2

ముందువెనకలు
ఎందరు గలిగిన నితనిలోనే
ముందు వెనకలను ముఖ్యం బితఁడే
[9-265

ముందువెనకెంచు
అందెనంటె మోక్షము హరిదాసులవల్లను
ముందువెనకెంచితేను మూలమే హరి
[10-221

ముందువెనకలెంచు
ముందువెనుకలెంచని మొక్కవీఁడా తాను
[14-159

ముకెము
ముకెమై వుభయకర్మములు
బంధహేతువని
ప్రకటించి వేదాంతపఠనమే యెక్కుడు
[10-188

ముక్కపోవు
తక్కక పరస్త్రీలఁ దలఁచి మనసుబుద్ధి
మొక్కుపోయె మాకు నేఁటి ముందటి
పుణ్యాలు
[11-16

చక్కని నీవదనము చందురికంటే మేలు
ముక్కపోయినది నీ మోవి యింతెపో
[15-92

తక్కక పరస్త్రీలఁ దలఁచి మనసుబుద్ధి
ముక్కపోయె మాకు నేఁటి ముందరి
పుణ్యములు
[6-61

ముక్కవోవు
నిక్కె నా విరహము నీకు మేలై తేఁ జాలు
మొక్కవోయి నా మోహములోన
వొక్కరికైన నెలవు వున్నదిగా
యీ బతుకు
[17-255

ముక్కునకోపము
అయ్యో యేమే తనకు నేనంటే నెంత
నదర మే
కొయ్యగదే ముక్కుననే కోపమున్నది
[17-248

దూరఁబోతే గోపము దొరకు ముక్కున
నుండు
[17-168

ముక్కున నూరుపుమోయు
ముక్కున నూరుపుమోచి ముంచి
పుణ్యపాపాల
కక్కసానఁ జిక్కి తమ్ముఁ గానఁ డింతే
కాక
[8-78

ముక్కునూర్పుగాలి
మునుకొని వెదకితే ముక్కునూర్పు
గాలికొన
వెనవెనకఁ దిరిగీ వీఁడివో హరి.
[8-57

ముక్కున నూర్పులు
కానఁగల యీ ప్రపంచమెల్లా కలయో
యిది నిజమో
కానరాని యీ ముక్కున నూర్పుల
కాలముఁ గొలిచేటి కుంచములు
[9-29

ముక్కనబంటి
వెక్కెన్నగతి చిన్నలు నీతలనే వేగినచే
ముక్కనబంటి భోగించే మగుడువా నీవు
[14-201

ముక్కుమీద వేలు
ముక్కుమీఁద వేలిడుక మోనమున
నేనుండితే
దక్కె సిగ్గుల మునిఁగీ తాఁదానే
[14-36

ముక్కుమోమెఱుఁగు
ముక్కుమోమెఱుఁగక మోమోటపడక
మొక్కలీఁడను చందమున విడనాడ
[అ. మ. క. ద్వి. 2351

ముక్కుమోవ మొక్కులు
గక్కనఁ దాఁ గూడగాను కాదు కూడ
దంటినా
ముక్కుమోవసాగి లేలమొక్కెనె తాను
[17-208

ముక్కువాతనుండు
యెనసి ప్రాణవాయువు లివి సొమ్మని
నమ్మితి
మొనసిలోను వెలినై ముక్కువాతనున్నవి
[8-41

ముగుదు
నెక్కెన్న రతిచిన్నలు వీతలనే వేగెనచే
ముక్కన్నబంటి భోగించే ముగుదువా
పీవు
[14-201

ముగురువేల్పులదండ
నగుఁబాటులైన జననమరణములేల
ముగురు వేల్పులదండ మొనచూపరాదా
[7-181

ముగ్గులుపెట్టు
పిక్కటిల్లు నవ్వులవేపెట్టె ముగ్గులు
యెక్కడ వరాకుపీకు యీకెఁజాడరాదా
[18-484

ముచ్చిమిగూడు
తీరని వేడుకతో తిరుమంగయాళువారి
ఆరడి ముచ్చిమిగూటి కాసపడ్డవాఁడు
[11-3-55

ముచ్చిమీదరు
అచ్చపు శ్రీవెంకటేశ అట్టె నన్నుఁ
గూడితివి
ముచ్చిమిదీరినమీఁద మొక్కులేల
యిఁకను
[17-551

ముచ్చిమినుతులు
ముచ్చుఁగన్నతల్లి మూలకొదిగినట్లు
ముచ్చిమినుతులేల మొక్కరో హరికి
[7-260

ముచ్చిమిపొద్దు
చెలిచుక్కలన్ని కోరికలతోడ చిత్తము
నీ కిచ్చుకుండఁగా
పొలసి ముచ్చిమి పొద్దున నెడ పూఁబోడిఁ
బిలిచేవయ్యా
[16-2-106

ముచ్చో చిచ్చో
రచ్చమాని చింతకిందురాఁపుల
కూటమిపొందు
ముచ్చోచిచ్చో మూఢులాల
[5-102

ముట్టంటు
యిదె దైవమిదె గురుఁడెట్టని
యెరిఁగేమయ్య
మొదల నానాయోని ముట్టంటువారము
[10-258

వరగఁ బుచ్చకాయలఁ బరసిపోదు
మంత్రము
గరిమ ముట్టంటులేని ఘనమంత్రము
[6-153

కంతుని ముట్టంటుగలసె మదిలో
యెంతటి శుద్దినో యెరఁగమిఁక
[10-187

ముట్టంటుపడు
కాంచనము అంటువడినఁగలదా
అందు నింద్యము
పెంచు ముట్టంటువడినఁ బెక్కువ
దూష్యముగాక
[7–211

ముట్టిచేత మొక్కు
ముట్టిచేతమొక్కలేదు ముందటనే
వుండఁగాను
బట్టబయలుపాఁకేరు బహుశర్మవిధుల
[6–23

ముట్టుకోలుగొను
పన్నికాళియల నంపద ముట్టుకోలు
గొన్న నిగ్గులసోనఁ గురియులేఁదొడలు
[వ. యో. వి. 291

ముట్టుదోషము
మొలచి పిన్నై మిన్ను ముట్టఁ
బెరిగినవాఁడే
తొలఁగఁదోసేటి ముట్టుదోషపురక్ష
[10–54

ముట్టుపడు
పట్టియుఁ బట్టఁగరాని పాయములో
మర్మము
ముట్టుపడ్డ పతిమీఁది మోహమిదిగో
[15–126

ముట్టుపడు
అచ్యుతుఁడు జనించె నద్దమరేతిరికాడ
ముచ్చిమి రాకాసుల ముట్టువడిరి
[10–20

ముట్టుపాఁత
ముట్టుపాఁతవలె మురిగినదేహము
గుట్టునదాఁచితిఁ గొన్నాళ్లు
[11–2–17

ముట్టుపెంచు
కంచుఁబెంచు నొక్కగతి నదికితేముట్టు
పెంచువలెనే చూచు పెరుమాళ్ల వాని
[7–260

ముట్టువారి ముట్టుకొను
గోడనెక్కిచూచేవు గొబ్బునదగ్గరిరావు
ఆడనుండె యెడమాట లాడించేవు
వీడెపు నీమోవిచూపి వికవికనవ్వేవు
కూడిముట్టువారి ముట్టుకొన్నవానివలెను
[15–19

ముట్టుసేయు
ముట్టుసేయుచోటనే మూలమూల
సారెసారెఁ
బుట్టి పుట్టి యాబదలఁ బొందువారము
[11–2–19

ముడికాఁడు
వొక్కమాట విన్నంటె వూరివారిపైఁ
జుట్టేవు
మిక్కిలి ముడికాఁడవు మేలురా నీవు
[17–187

ముడికారి
ముడికారి నటలేలెముదితా
ముడి నీ సిరసునఁ గొమ్ముకి యిదెకదరా
[15–72

ముడిగిన మంత్రము
మునికొని వేదముల ముడిగినమంత్రము
కొననాలికలలోఁ గుదురై నిలిచె
[8–10

ముడిచివేయు
వుడివోక వనములో వుప్పైన విరులు నే
ముడిచివేసినంతనే ముట్టరా దాయను
[6–80

అన్నియు నాయందేకంటి విన్నటివాఁడా
నే
మున్నె నా భావములతో ముడిచివేసినది
[9–90

ముడిదీరు
కడుగుట్టు నేఁజేసితే కాఁగిలించుకొంటి
విట్టె
ముడిదీరె నిటమీఁద మొక్కేనిదే
[17–63

ముడియ
అడఁచి దాచివున్నది అందే
బ్రహ్మానందము
విడువరో యీ ముడియ వెలయఁ
జేపట్టరో
[11–180

ముడుపు కొంగునఁగట్టు
ముడుపుకొంగునఁగట్టి మూలమూలల
వదకే
వెడమతినై నేవెర్రుండనైతి [5–19

ముడుపుగట్టు
పువ్వువంటియాస ముడుపుగఁ
గట్టుకొంటిఁగాక
నివ్వటిల్లు బొమ్మముడి నీపైఁబెట్టితినా
[18–868

మునుఁగుడువడు
ముంచిన బంధములలో మునుఁ
గుడువడక తా
నంచల విడఁదన్నుట యెఱుక
[11–3–164

ముత్తెపుఁజిప్పల నీరు
ముత్తెపుఁ జిప్పల నీరు మున్నిటివలె
మండునా
ముత్తెములై బలిసి లోమొనపుఁగాక
[6–139

ముత్యాలకుచ్చులు
గరుడధ్వజమదే ఘంటారము లవే
సౌరిదిముత్యాల కుచ్చులనవే
[8–164

ముదిమాటలు
ముందర వీరీతి ముదమాటలాడితి
యెందఱఁ జెఱపెనో యీకొంపచెఱుపు
[వ. యో. వి. 4–1397

ముదిసితే
దనికుఁడై ఫలమేది ధర్మము సేయుదాఁకా
వనిమాలిముదిసితే పానేనా భవము
[5–262

ముదుర వుంగరము
కడువేగ ముదుర వుంగరమెయంపి మరు
కడివోనిబాగాలఁ గాఁచనేల
[16–2–47

ముదుల
వట్టి యాకతాలుచెప్పి వద్దికిదగ్గరేవిదె
అట్టె వుండరాద అన్నినయ్యాఁగాని
తట్టి ఆతని ముదలతచ్చాన గాఁబోలు నిది
నట్టనడుమనె యేఁటినాటకమె నీవు
[15–242

ముదలకించు
నేరమెల్లఁదీర నేడు నిన్ను ముదల
కించితి
బోరనోవ నీతోను బోవయ్య చాలును
[17–516

మున్నిటి తనమాటలు ముదులకించిరావే
[13–215

ముద్దులదెచ్చు
అనతి మరఁగువాఁడ వన్నిటానీవు
మోసపోక నానాపె ముద్దులదేరాదా
[14–197

ముదుసు
మోహంబెన్నడు ముదుసునయ్యా
దాహంబెన్నడు తలఁగునయ్యా
[16-1–18

ముదుసేది
జవ్వనము మోఁచేదియునరి
ముదుసేసెకాని
తవ్వికట్టుకొనేదేది దాఁచేదేది
[7–87

ముద్దరాలు
వొద్దనె శ్రీవెంకటేశుఁ డొగిఁ గూడు
కొఱఁగమే
ముద్దరాలనేఁడు నీమోహమెంచరాదే
[13–42

మూసిన ముత్యాలవంటి ముద్దరాండ్లము
యీసరిబేసిక్కినీతో నెదురాడఁగలమా
[14–207

ముద్దుగారు
వన్నెల నీ కోపమింతవద్దు నీకు నీయాన
కన్నుల నవ్వుల ముద్దుగారిని బాలుఁడు
[5–57

ముద్దుగునియు
తల్లిదండ్రిగలవాఁడు తప్పులేమైనఁజేసి
తల్లితో ముద్దుగునిసి తప్పించినట్టు
[9–160

ఆడుతాఁబాడుతా నీతో నట్టె
ముద్దు గునుసుతా
వోడక నీదండచేరి వున్నారమయ్యా
[9–101

ముద్దుగునిసొడు
మున్ను యశోదవద్దను ముద్దుగొని
సాడితివి
వన్ని రేవల్లెవీధులఁ బారాడితివి
[8–179

ముద్దుచేయు
మూలఁబడనీకతెచ్చి ముద్దుసేసి కావఁగాను
మేలెరుఁగు బుధులెల్ల మెత్తురువో
నిన్నును [11–32

ముద్దులాఁడు
రారా చిన్నన్నా రారోరి చిన్నవాఁడ
రార ముద్దులాఁడ రారోరి బాలకృష్ణ
[16–2–82

ముద్రకర్తలు
పంచేంద్రియములనేఁ బారఁదోలే వాఁడనా
మంచి నీవుపెట్టినట్టి ముద్రకర్తలు
[8–26

ముద్రమానుసులు
మునుపని విషయముల ముద్ర.
మానుసులఁగా
నునుతిచివి నామీఁద నొకటొకటినే
[6–62

ముద్రమోయు
నేలనే నీముద్ర మోచి నేనేఁటి వాఁడనైనా
పేలరి జగముతోనఁ బెద్దనైతి నిదివో
[9–160

ముద్రలుమోయు
పారవేసిన పుల్లాకుబండికలై మించినట్లు
కోరి నీముద్రలు మోచి కొండగొంటినిదివో
[9–177

ముద్రవెట్టు
పొంచి నీవేడ నేనేడ బుజముల ముద్రవెట్టి
సంచితమై నేసినట్టి సంబంధమేకాక
[10–185

మావంటివారితోడ నూఁటాడువలదని
మోవిమీఁద నెవ్వతైనా ముద్రవెట్టెను
[16–2–32

మునిమాఁపె
మునిమాఁపె పఱతెంచి ముంగిటువలావ
వనులకు మమునొడఁ బఱుచు నీపదుచు
[అ. మ. క. ద్వి. 808

మునివాఁడు
అనుక శ్రీవెంకటేశ అతుమ
నీ వుండఁగాను
మోనాన నీకు మొక్కేటి మునివాఁడనేను
[7–108

మునుకొను
మునుకొని ధ్యానించువారు మును
లెందరైనాఁ గలరట
వినయపు నా మనవి వనవులకు
వేళలెపుడు గలిగీనో
[7–67

మునుకొన్న చూపులకు మొదలైనవునికె
అనిశము కతలెల్ల నాలకించేవునికి
[10–25

మునుకొన్న గామములై ముందర
నుండేవాఁడు
కొనవాలుక మీఁదటి గోవిందుఁడే పో
[10-11

మునుకొన్న ముదములు మోపుల
కొలఁదులు
పెనఁగిన లోభాలు పెనువాములు
[11-11

మునుకొని మనోవేగమునవచ్చె హరి
తేరు
తనరారుకోటి చంద్రప్రభలతో
[9-223

మునుపు వెనక
దాసునిఁగా శ్రీవెంకటేశుఁడు
దయఁజూచెను నను నీ వేళ
మోసములన్నియును దేరెను మునుపు
వెనక యేదో
[8-254

మునుపు వెనుకలు
యెనసినకలలోని దిదియొక్కలోకము
మునుపువెనక లివే మూఁడులోకములు
[10-47

మునుమిడు
మూడుధామంబుల మొనసినిల్చుచును
మూడుగుణంబుల మునుమిడిదాఁటి
[వ. యో. వి. 390

మునుము
యెక్కడఁ బిల (చి?) నా నేమనీ పలికి
మొక్కన మన్నంచు మునుముగను
[8-141

మున్నిటి
మున్నించి శ్రీవెంకటేశ మరిగి
నన్నే నేలితి
మున్నిటి నీ కోరికలు ముంచి నిజమాయెను
[17-67

మున్నిటి తనమాటలు మొదలకించిరావే
అన్నిటా తనసన్నలు అడిగిరావే
[13-215

మున్నిటి జన్మము
పున్నతపు సంపదల నోలలాడేయట్టివాఁడు
మున్నిటి జన్మాన నీకు మొక్కినవాఁడు
హరి
[5-236

మున్నిటి వెనకలు
యిన్నిటా శ్రీవెంకటేశ యిటు
నన్నుఁగూడితివి
మున్నిటి వెనకల యీ ముచ్చటలే
యిఁకను
[17-368

మున్ను పిన్నెలుఁగు
మున్నుపిన్నెలుఁగక ముదితతోఁగూడి
కన్నుగానని రీతిఁ కప్పెను బొరలు
[వ. యో. వి. 2-1133

ముప్పదిరెండువేళలు
పాడేము నేము పరమాత్మ నిన్నును
వేడుక ముప్పదిరెండు వేళాల రాగాలను
[9-178

ముప్పిరి
ముప్పిరిపువ్వులు నీకు ముడుచుకో
నంపెనమ్మ
చెప్పవే యాపెయుఁ దానుఁ జేకొని
మిగిలెనా
[13-55

పిప్పియైన నీ మేని పెక్కులాగు
టటుచూచి
ముప్పిరి గళలంటితే మోసమా యిది
[13-43

ముప్పిరిఁగొను
తప్పక బంధములను తగిలించే కోరికె
ముప్పిరిఁ గొనేటి మోక్షమునకు లేదా
[8-139

ముప్పిరిగొను
అప్పుడు కొంకణుఁ డంతరంగమున
ముప్పిరిగొను మోదమున వెఱగంది
[ప. యో. వి. 2–776

ముప్పిరివడ్డి
అప్పుదనమీఁద మోచి అదె
యెన్నాళ్లవుండే
ముప్పిరివడ్డి వారక మూలనుండినాఁ బోదు
[5–330

ముమ్మఱుఁబలుకు
మాఱాగకు చేకొను ము
మ్మఱుఁబలికినను ఱాలుమానుగ గృష్ణా
[రేఫ. ఱ. 101

ముయి
పోసపోనివారయితె ముయికిమయి నేతురు
వాసిమానావతులనె వంచుకొంటేఁ జెల్లునా
[14–270

మొక్కలాన ముయికిని ముయివంటిది
వలపు
యిక్కడనే కానవచ్చె నేమినేతురా
[14–163

ముయికిము
వుంచపు గోరితాఁకులె వుంకువ బొమ్ములు
ముంచిన వలుసోఁకులె ముయికిముయి
యెంచగ శ్రీవెంకటేశ యిందిర
కూటములు
కంచపుఁ బెండ్లిమాకు కలిగెఁగా నేడు
[15–129

ముయిముచ్చటు
ముట్టితేనే ముయిముచ్చటలూ
అట్టునేయనా నాఅడిదానవా
[15–208

ముయ్యంచు చంచలము
అయ్యో నా నేరమికే అట్టె యేమనివగతు
ముయ్యంచు చంచలాన మోసపోతిఁగాక
[8–39

ముయ్యంచు మనసు
అయ్యోపోయం బ్రాయముఁ గాలము
ముయ్యంచు మనసున నే మోహమతినైతి
[5–121

ముయ్యఁజూచు
పయ్యెదచెరఁగు జారఁ బచ్చి
నేఁతలిన్నియును
ముయ్యఁజూచీ నిటువంటి
మోహమెందుగలదా
[12–327

ముయ్యకమూయు
తొయ్యవి భారపుఁ దురు మమరె
ముయ్యకమూసిన మురిపమున
[4–148

ముయ్యాడువాకు
ముప్పిరిగొన్నసతులు ముయ్యాడు
వా రున్నారు
తప్పులు నిన్నుఁ బట్టేటిదానను నే
బ్రియమా
[14–220

మురికిడొక్క
యెంచి నూరేండ్లమీఁద యెప్పుడో
మరణము
ముంచి యిట్టే మోచినదె మురికిడొక్క
[8–86

మురిపేనఁగాచు
మురిపేనకరిఁగాచి మొసలి దుంచినవాఁడు
అరుదైన ప్రతాపపు ఆదినారాయణుఁడు
[9–234

మురియఁగొట్టు
మూడువర్ణంబుల ముదమారనొసఁగి
మూడు తాపంబుల మురియఁగొట్టుచును
[వ. యో. వి. 392

ముట్టుఁబాలమంతు
వెట్టివారిఁ తెలుపుట వేవేలు సుకృతము
ముట్టుఁ బాలమంకేకాని ముందుగాన
దైవమా [8–37

వెట్టిదెలిసి మరియు వేఁదురు
దవ్వేము నేము
ముట్టుఁబాలమంకువాఁడ మూలమా శరణు
[8-177

ములములమూఁగు
ముఃముల మూఁగుచు మొనయ
కొక్కెరలఁ
గెరలంగఁ జేయుచుఁ గ్రీడఁగరంగు
[చక్ర. మం. 31

ములుచు
చేయి నాపై వేయబోతే శ్రీవెంకటపతికి
యీయెడ గైదండ యిచ్చేవిది మేలే
పాయక శ్రీవెంకటపతియే నన్నునుఁగూడె
చాయ యెఱగనియట్టి సతియెపో ములుచు
[17-174

ములుచేఁగ
కలికి నీ కన్నులు కడుసోగలు
మొలక. చన్నులె ములుచేఁగలు
[13-155

మువ్వంక
మువ్వంక వేదములను ముద్దు
మాఁటలాడనేర్చె
యెవ్వరుఁ గొంతనేర్ప నేఁటికే వీనికి
[7-153

నవ్వుచు నీ శరణాగతి నమ్మిన
మువ్వంక శుకాదిమునులే కాక
[9-264

మువ్వంకఁ గర్మాలు
అవ్వలి దేహభోగములట్టే కర్మములౌను
మువ్వంకఁ గర్మాలు లోకములై
చెందును
[7-112

మువ్వంక వలపులు
నివ్వెరదై వున్నాఁడవు నే మెంతపిలిచినా
మువ్వంకవలపులు ముంచకుండీనా
[15-200

మువ్వరజాము
అగపడ్డందుకు మేని అడియాలములు గురి
మొగమేది రమ్మనవే మువ్వర
జామెక్కెను [14-64

ముసగనలు
కొసరకు యాతఁడె గొబ్బునఁగూడినదాక
ముసగసల యాకతముల మీలోన
[15-260

ముసిపితోడగు
పసిగొని యింద్రియాల బంటై వుండు
నొకవేళ
ముసిపితోడై వానకు మొక్కవేళ
[6-97

ముసిపి నరుఁడు
పొసఁగ మానుగ నన్ను బుట్టించితేఁ
బొగదేవా
ముసిపినరుఁ జేయఁగా మొరయాదేఁగాక
[6-135

ముసిపు
కుంటెనలు విసుపై కోరికలు ముసిపై
అంటఁగాక వున్నదాననా వెట్టనేఁటికే
[15-109

ముసిమిచెప్పు
కసరి సవతులు మొగాలు ముడుచు
కొన్నాను
ముసిమిచెప్పి నవ్వించి మొక్కుదునేను
[18-377

ముసిముసినవ్వులు
కొసరి నివ్వింతలోనె కోపగించేనా
ముసిముసి నవ్వులెల్లా ముచ్చటలె కావా
[17-529

ముసుఁగుపాలుసేయు
వాలి తిరుగునట్టి దైత్యవరుల
మోహవతులనెల్ల
మూలమూలఁ ద్రోసె ముసుఁగుపాలు
సేసె సీతఁడు [11-3-112

మూఁకగట్టు
సతులెల్లా మూఁకగట్టి సంగడి
నిలుచుండగా
సతమై కరఁగవద్దా సారెకు నీవు
[16-2-85

మూఁకగమికాఁడు
మూఁకగమికాఁడ నేను మొక్కెఁద
శ్రీవెంకటేశ
యేఁకటారఁ గడపేవా నెంచుకో
మాపొఁజు
[6-64

మూఁకలు మూఁకలుగట్టు
మునరికోనేటిదండ మూఁకలు
మూఁకలుగట్టి
విసిగి ప్రాణులు విన్నవించేరు గానవే
[11-83

మూఁకొను
వొప్పుగా నందరి పూర్పు లొక్కటైనందుకు గురి
కప్పురమదే కాక కస్తూరిగా మూఁకొనరా
[7-233

మూఁడేమాటలు
మూఁడేమాటలు మూఁడుమూండ్లు
తొమ్మిది
వేఁడుకొని చదువరో వేదాంతరహస్యము
[6-233

మూఁతిగిరుపు
మోవమూఁతి గిరిపితే మూఁడు
లోకాలు నిలిచె
మోవిఁబార నవ్వితేనే ముగిసే రసురలు
[6-156

మూఁపులు మూడగు
బొదలుచువచ్చి మూఁపులు మూడగాఁగ
నదె పిల్చెదరు మాటలాడవే తండ్రి
[వ. యో. వి. 3-202

మూకొను
సారెకుఁ బువ్వులబంతి సరసుఁడు
మూకొనఁగ
చేరి నతియాలమెచ్చెఁ జెప్పరమ్మ
[18-529

మూపునఁ గట్టినచద్ది
యేపున నానవిడిచి యేరువడి వుండేను
మూపునఁ గట్టిన చద్దై మోఁపించును
[7-6

మూపులు మూఁడు అగు
యెవ్వరైనాపెను నేఁడిటు పేరుకొంటెఁ
జాలు
అవ్వల మూపులు మూఁడు అవుదువు నీవు
[17-417

మూరటు బారటు
తోరణములేదో వెల్లా
మూఁరట బారట ముంచిన లతల
[11-3-53

మూరుకొను
తొలుత నే వలచిన తొయ్యలినేని
మలసి నిన్నుఁగాదని మారుకొనవచ్చునా
[13-178

మూలనిధానము
మూల నిధానముగని ముందుగానఁ
దొకయోగి
నేల దలకిందుసేసి నిక్కినొకయోగి
[6-125

మూలమూలచొచ్చు
యేలమి శ్రీవెంకటేశుఁ దేవుమీర
జొచ్చితేమ
ములిగి దైత్యసతులు మూలమూల
చొచ్చిరి
[8-92

మూవంకఁ దమకము
కావిరిలో నీవెంకకఁ కదేరఁజూచినాను
మూవంకఁ దమకమే ముంచీనాను
[17-573

మూవంకలు
శ్రీవెంకటాద్రిమీఁదఁ జెలఁగి
నాతఁడికఁడే
మూవంకల మముఁగాచె మొక్కితి
మాతనికి [10-47

మూవంకలుమెట్టు
కైవసముగాఁగాని కరగి మెచ్చితిఁగాని
మూవంకలు మెట్టితేనె మొక్కలినేను
[15-3

మూవంకవీఁగు
నీ వింక యలుగుదురా నివ్వెరగుతో
నుందురా
మూవంక వీఁగీవాఁడె మొక్కుదువో
యంటాను [13-224

మూవరుస
మూవరుస నిత్యులును ముక్తులును
గొలువఁగా
యీవలనేఁగివచ్చి నిందిరానాధుఁడు
[10-31

మూశినముత్తెము
కేశవ నారాయణ కృష్ణా గోవింద
ముకుంద
మూశిన ముత్తెమువలె మొక్కేము నీకు
[7-131

మూసినగర్భము
ఆసలి వెఱఁగము అలమట లెఱఁగము
మూసినగర్భమే మును సుఖము
[7-231

మూసినదే కీలు
వేసరితేనేలేదు విచారించితేఁ గద్దు
మూసినదే కీలు మంచి వివేకులకు
[9-239

మూసిన ముత్తెము
దాసితోఁ బెండ్లాడేవాఁడు వట్టి తరితీపులేల
మూసిన ముత్తెమైవా మోముచూచుఁగాక
[18-455

మూసిన ముత్తెమువలె ముంగిట
నిలుచున్నదీ
ఆసపడ్డచెలితో మాటాడవయ్యా
[18-298

మూసిన ముత్యము
మూసిన ముత్యమువలె ముంగిటికి
వచ్చితివి
యీసులు నీతోనేల యింకానేడ సుద్దులు
[17-75

మూపినమేను
పుట్టినచోటంటినా ఆది భూతములనెలవు
నెట్టున మూసినమేను నిఖిల హేయ
మయము
[10-41

# మె

మెంగ
ఏల పురుఁడువెట్టుక యింతసేసేవు నన్ను
మేలిమివాఁడవు నీవు మెంగ దాననేను
[13-93

మెంగతనము
అంగళ్ళముంగిళ్ళ వల్లారు ముద్దుమాసేవు
మెంగతనాలు నీసొమ్ము మేలుగా నీవు
[14-162

మెచ్చు మెచ్చకుంటే మాను
మెచ్చు మెచ్చకుంటే మాను మించి నే నాడకమాన
అచ్చపు నీ సూత్రధారి నవధారుదేవ
[5-150

మెట్టిన సంసారము
మెట్టిన సంసారము మెదిగినపాటే చాలు
తొట్టి కన్నవారినెల్ల దూర నోపమిందుకు
[8-7

మెట్టిపట్టుకొను
యెట్టుండినా నీవే నన్ను వీడేరించు కొంత గాక
మెట్టి పట్టుకొని నిన్ను మెప్పించఁగలనా
[18-30

మెట్టుకొను
మెట్టుకొని నీవు నా మెఱుఁగుఁ బయ్యెద చెఱఁగు
పట్టేవు నీకు నీ పరిణామమా
[4-38

మెట్లేయు
మెలఁగి పరశురాము మెట్లేసిన బాణము
తళతళ మెరసేని తలరోయ సురలు
[10-283

మెడగట్టు
మేనవాఁడ వటుగాన మెడ గొనిపించె
తానె అలమేలుమంగ తమకమేలా
[13-202

మెడగుదియ
కొసరి కర్మపు మెడగుదియ మోఁచితిని
పమరమువంటివాఁడఁ బాలించవే
[40-227

మెడచుట్టు
మేరతో పంచేంద్రియములు మెడచుట్టక పోవు
మేరీతుల సంసారము గెలువఁగ నెదురు బడిని బలిమి (ని) కనేదయ్యా
[9-206

మెడదేవళ్లయెత్తు
హత్తి తన్నొలకపోఁగా నంతరియెడ దేవళ్ళ
యెత్తి పాదాలందుఁ జూపె నితఁడు విట్ఠలుఁడు
[6-217

మెడఁబూను
వేళతో నిద్దిరించుచు విరక్తునివలె నుండు
మేలుకొన్నవేళ నన్నిమెడఁ బూనును
[8-77

మెడఁబెట్టు
కనకాంబరముగట్టి కౌస్తుభము మెడఁబెట్టి
వెను వెంట శ్రీపతి సేవించుచుండగా
[9-234

మెడలఁ బాగలువేయు
గోవిందుఁడు దాడివచ్చె గునుకుచుఁ బారరో
కావుమని మెడలఁ బాగలువేయరో
[7-11

మెడవట్టినూకు
ఉడుగనియ్యని మోహముబ్బి పరమార్థములు
మెడవట్టినూకె నేమిటికింక నెఱుక
[11-3-115

మెఱకు
మెరమీర దాని నీతో మెఱకేలఁ నిన్ను
గారవించగా యాడోకతలేల
[17-60

మెత్తులువేయు
అందపు నీమోవి తేనెలానియనియెవ్వతో
అందుపెఁ గెంపులు నించెనదె చూడుమా
పొందులన దెవ్వరికి పొరని నీవయ్యకుండా
కందువమెత్తులుదేయుగతి నువ్వే విభుడా
[15-135

మెరమెరలు
రేకేపో రిచ్చలెల్లా నీ
మేలే మేలేపో మెరమెరలు
[4-110

మెరయు
చనవే మెరతుఁగాని సాధింవనోవ
[14-8

మెరుఁగువెట్టు
అద్దము మెరుఁగు వెట్టినవి గోర
నంటితేను
గద్దించేవిది యేమే కలికి [15-43

మెఱమెచ్చులు
తతి నామాపు వీగుండె తమిఁగరఁగించఁ
జొమ్మి
మెఱమెచ్చులకు మితిమీరళ వున్న
దానను [18-11

మెలుపు
వెలయఁగ విరహపువేళ వాఁడెక్కుఁ
గాళ
మెలపువఁగదిసితే మెత్తవేకాదా
[7-56

మెలుపులేని చిచ్చు
మెలపులేని చిచ్చు మీఁద మిక్కిలిగొంత
నిలుపులేదు పట్టి నిలువఁగరాదు
[11-3-40

మెత్తిని
మేలే జాణవౌదువు మెత్తివే నిన్ను
[13-207

## మే

మేకు
ఏల బుద్దులు చెప్పేరే యింతలో వాకు
మేలిమి విభునితోడ మేకులేలే
[14-3

మగువల మేకులకు మట్టుపడే వారెకాక
జగములోఁ గాదనేటి జాణలెవ్వరు
[17-16

నేసెటి నీ మేకులకు నెలవుల నవ్వులకు
ఆసపడ్డవారము మా కలకేఁటికి
[17-43

జక్కవపులుగులు నీ చన్నులకు నోడినాను
పెక్కు దేశములనెల్లాఁ బేరుపడెఁగా
నిక్కి తుమ్మిదలు నీ నెరుల కెనరాకున్నా
మిక్కిలి మొరసెన నేమేకులై నాఁ గగ్గెఁగా
[18-130

మేటియైన విభునితో మేకులుచూపకువే
తేటవయసుల పూవుఁ దీగెవు నీవు
[13-103

మేకులుజేయు
మెండు తుమ్మెదలతో మేకులుజేయు
పుండరీకములన పూఁబోణలైవో
[అ. మ. క. 6237

మేకులునేయు
మెచ్చినట్టివాఁడవు మేకులు నేసినేసి
యిచ్చగించి కలయగ నింతనేరవా
[17-111

యీమేర శ్రీవెంకటేశ యిద్దరి మమ్ముఁ
గూడితి
కామించి మేకులునేయఁ గలిగెఁగా నీకు
[17-482

మేకునేయు
మేనవారి పిన్నదాని మేకుపేసి
యింటిలోనఁ
దోసుకొంటి వెఱఁగవా దుండగీఁడ
[12-284

వెన్నెలలు షేఁడనుచు విసీరించుకొనె నాపై
కన్నుల నవ్వులు చల్లి కాఁకరేఁచేను
పన్నిపురిసిన యందుపై నుదుకు చల్లినట్లు
యెన్నమాతో మేకునేనే ఏఁళ నేలనయ్య
[15-33

అచ్చపు శ్రీవెంకటేశ అన్నిటాను
విన్నుఁగూడి
మెచ్చినదె మేలాయ మేకుపేయవలెనా
[17–159

మేకొను
సాకిరి చంకదుద్దు శరణార్తి రెండునేల
మేకొని యీమాటవింటె మెత్తురా
విన్నను
[10–203

మెఱసి కూచుండగానె మేకొనుకూటములు
[14–211

మేఘపు పుష్పాలు
మేకొని విపే నిండు మేఘవర్ణుఁడవు గాన
నీకు మేఘపు పుష్పాలే వన్నీరుకాపు
[7–46

మేఘముల వికారములు
భావించి మాధవుపై లేనితలఁపులు
మేఘముల వికారములు
శ్రీవెంకటపతి కరుణకలిగితే జీవుల
కివియే వినోదములు
[7–1

మేటాన మేట్లు
మాటులేవి మాటుదెచ్చి మరఁగు
వెట్టుకవట్టె
మేటావ మేట్లవలె మెరవేము
[11–3–7

మేడలకు మాడుగులు
మిగుల నున్నతములగు మేడలను
మాడుగులు
మితిలేని దివ్యతవనులున్న గృహములను
వొగినొరఁగు పెరుమాళ్ళ వునికిపట్టయి
వెలయు
దిగువ తిరుపతి గడవఁగాను
[5–130

మేడెపు వలపు - మెత్తని పరపు
మేడెపు వలపిదివో మెత్తని పరపిదివో
వాడిక నీమేలు నాపై వంచవయ్యా
[17–136

మేడెపు వరములు
యీడనె మాబోంట్లకు విరవై కోనేటిదండ
మేడెపు వరములెల్ల మెచ్చి యిచ్చినట్లు
[11–41

మేడెపు సంసారము
మేడెపు సంసారములో మించిన
నిద్ర తెలుపు
వేఁకల బంధువుఁడు శ్రీ వేంకటేశుఁడే
[8–140

మేడెము
తగులనాడినవాఁడు తప్పు దిద్దుకొననేలే
నిగిడి మేడెము చొచ్చి నేఁ గావవీనా
[14–2

మేదకపు కొయ్య
వాదు నీతోఁబెట్టుకొంటే వాదవారిపైఁ
బెట్టేవు
మేదకపు కొయ్యవవుదు మేలురా నీవు.
[17–187

మేదరింటి లంజ
మేదరింటి లంజవోయి మేదినీశుఁ
దగులఁగ
గోదిలికు లిటలెల్లఁ గుల్లిపయట్టు
[11–2–31

మేనపడుచు
నయావఁ బందెమువేసి నడుమ
మేనపడుచు
ప్రియవది విన్ను విట్టె పెండ్లాడెను
[13–177

మేనవాఁడు
మన్నించి నన్నునిట్టె మరఁదల రమ్మనేవు
యెన్నటి మేనవాఁడవేరా నీవు
[16–2–99

పూని పిలువఁగ నొల్లక పోయిన
మేనవాఁడ ననీ మేలే
[16-2-113

మేనవాఁడ వటుగాన వెండగట్టు కొనిపించె
తానె అలమేలుమంగ తమక మేల
[13-202

మేనవారి పడుచు
సోయగమై తనమోము చూచినట్టి మోహించి
పాయకుండ మేనవారి పడుచనా నేను
[16-2-89

మేనవావి
నారాయణుఁడు భువివరుఁడు దాఁ గాఁగానే
మేరఁ బాండవు లెచ్చిరి మేనవావిని
[8-258

మేలుమేలు యిదియేమి మేనవావిబలువా
యీలీల నన్నుఁగూడె నింతేవాలు
[15-105

మేఁటి నన్నుమెచ్చఁబోయి మేనవావి చుట్టుకొంటే
మేఁటవెట్టి దమకము యేమిసేతురా
[17-455

మేనిపచ్చి
యెవ్వతో కాఁగిటి నీ యీ మేనిపచ్చి చూచి
యివ్వల నీకాఁగిలి నీకెక్కె నిపుడు
[15-77

మేనువత్తివలె అగు
వాడు మోవిపంచుకొనె వత్తివలె నాయమేను
చూడరాదా అపె చిక్కె చుణుకనెమనసు
[13-106

మేయికొను
పాపకర్మునిఁదెచ్చి పరమియ్యఁదలఁచిన
మేపులకేపోక మేయికొనీనా
[5-194

మేరమీరు
చేరి బ్రహ్మాదులెల్లను సేవలుసేయఁగాను
మేరమీరిన శిరుల మేడలోనున్నాఁడు
[7-121

మేఁకములాడు
మేఁకములాడీ వద్దంటే మిక్కిలి గొల్లెతలతో
అలకించి వినవమ్మ యశోదమ్మా
[10-161

మేలుకట్టు
మించు నానామేఘముల మేలుకట్లతేరు
చంచుల నక్షత్రాల కుచ్చులతేరు
[7-5

మేలుకుమేలు
చేకొని శ్రీవెంకటేశ జిగినన్నుఁ గూడితివి
యాకడ మేలుకుమేలు వెంతేసి కాఁగలదో
[14-32

మేలుబంతి
నేరుచుకొంటివే మేలు నేఁడే యింతేసి
మేరమీరి సేసినదే మేలు బంతిగాదా
[13-191

మేలులేదు తీలులేదు
మేలులేదు తీలులేదు మించీనిదే హరిమాయ
కాలమందే హరిఁగంటి కైవల్యమొకటే
[6-78

మేలొకటి తీలొకటి
చుట్టి వరిగురుమతో జొన్నగింజ
నరిమూఁగు
తెట్టెలై మేలొకటికి తీలొకటికాయ
[8-14

మేసులు
మేసుల శ్రీవెంకటేశ మీదన్యమే
వుండఁగా
వానిఁ బరులఁ గొలవనే వడిఁగోరి జీవుఁడు
[6-103

మేసుల నీ లాంఛనాలు మించి నన్ను
దూషించె
సాసించి శత్రువును సంహరింపవే
[11-159

## మై

మైలసంత
ముచ్చిక కర్మమనేటి మైల సంతలలోన
వెచ్చపు కర్మధనము విలువచేసి
[5-178

## మొ

మొకదాకిరి
చిన్నకన్న సుద్దులెల్లా చెల్లఁ రిసేనేనంటే
కన్నుల జంకించి చూచి కాఁటాళించేవు
అన్నీ నీమొకదాకిరి నాతుమలో పెట్టుకొంటే
ఉన్ని వెలఁదుల నాకు చిరునవ్వయి మించెను
[111-21

కపట మెఱఁగనా కతలు చెప్పితిఁగాక
నెపమున వావులు నే నీకుఁ జెప్పేనా
కపురు మొకదాకిరి గడించ నీకువచ్చునా
యిపుడిట్టే నీకు దాయెన పెట్టేనా
[17-577

మొకబంగము
వక్కన మీ లోన మొకబంగాలు
వాసినదాకా
వెక్కసపు పీ వఱఁగు వినవలెగా
[17-483

మొకమజ్జనము
కనుదెరవు నాతండ్రి కమలాప్తుఁ
డుదయించె
వనిత మొకమజ్జనము వడిఁ దెచ్చెను
[9-254

మొకమాయకాఁడు
ముచ్చుల నీ విటువంటి మొకమాయ
కాఁడనేత
యిచ్చలోన నేము తొల్లె యెరగమైతిమిరా
[17-18

మొకమిచ్చులు
వొకటొకటికి నీవు వొరపెటి దానవు
మొక మిచ్చులాడనే మొరలె యాతనివి
[17-5

మొకమోడించు
గద్దరి శ్రీవెంకటేశ గబ్బినైన నన్నుఁ
జూడు
ముద్దుమోము యిచ్చి కూడి మొక
మోడిచితివి
[17-338

మొకమోడు
నాకు మొకమోడి యూకెవనుపేల
దాఁచేవు
జోకతోడ మాటలాడి సోదించరాదా
[18-373

వొకపనివాఁడనై పూని ముద్రధారినైతి
మొకమోడి యిందుకే గోమువనేలు
నన్నును [6-2

మొక్కపోవు

తెగి మురాసురుజాడ తెలియఁగా వరకుఁను
మొగిసి పోటుకుఁబోయి మొక్కబోయినా
[7–74

మొక్కలము

మొక్కలము విడిచి నే ముచ్చట లాడుకోఁగాను
వెక్కసపు వెంగెమని వేరెతలఁచేవూ
[17–423

మునుపుఁ జెప్పంపకున్నా మొక్కలాన విచ్చేవచ్చి
చనవు చేకొనుచే చాలదా మాకు
[17–197

దక్కె నీకుఁ బంతము తగిలినప్పుడె నేము
మొక్కోతి మిట్టి నీతో మొక్కలము లొల్లము
[13–61

మొక్కలాన నీకుదక్కి మోసపోయి వున్న నన్ను
తొక్కేవు నాకాలు వట్టి దూరవ్వటి వలెనా
[17–384

మొక్కలాడు

మున్నాడి యొక్కరొక్కరు మొక్కలాదే రవ్వటిని
కన్నచో గోళ్లదాఁకినే కడువాఁడి పొద్దు
[14–176

మొక్కవీఁడు

మూందువెవళ లెంచని మొక్కవీఁడాతను
[14–159

మొక్కశీఁడు

మోవిచూపే గమ్మటి మొక్కశీఁడువీఁడు
దేవుఁడుగదవే వీఁడు తీపులరేఁచీని
[17–162

మొగచాటు

ముంచుకొంటే వలపులు మొగచాటవును
మంచముపై జాగరాలు మరి యేలయ్యా
[17–64

విడువక వవ్వితేను మొగచాటగును
[13–31

చిగురు చిత్తముతోనె విన్ను నంటఁగాను
మొగచాటైరతులెల్ల మొనమాచెఁగా
[17–48

వొక్కమాఁటె సారెసారె నొట్టుకొని చవిగొంటే
మొక్కలానఁ బంచరాద మొగచాటుగాదా
[13–241

చక్కెర యేదుగానైతే చవి మొగచాటు గాదా
వొక్కమారే యింతగద్దా వూరకుండ వయ్యా
[13–108

మొగచాటు లేదాయె ముచ్చటలెల్లఁ దీరె
సొగసి నీవు మొగము చూడఁగాను
[17–129

దగ్గరితె దవ్వులనుంటెఁ జవి
[15–1

మొగదాకిరి

మేలములాడఁగఁబోతే మీఁదఁ జెయి వేయవలె
నాలి మొగదాకిరైతే నాయంత నే మందవలె
[13–5

మొగమాయకాఁడు

ఎంత మొగమాయకాఁడవే ముందు నిన్ను
వంతము నెరవబోయి పైకొంటె నేను
[17–63

ఎంత మొగమాయకాఁడో యేమోకాని
యింతులార వెరగైతి మీఁకనేమోకాని
[15–147

మొగమిచ్చ
విగువుఁ గొనగోళ్ళను బిరుదులే
తొలఁకిని
మొగమిచ్చకుఁ జేతులు మొక్కఁగాని
[13-88

మొగమిచ్చలాఁడి
మొగమిచ్చలాఁడిగాన మోహములు
చల్లీని
జిగి నిన్నెంత మీఁటినాఁ జెల్లునయ్య
ఆపెకు [18-487

మొగమిచ్చలు
మొగమిచ్చలు నెరప ముసిముసి
నవ్వులు నవ్వ
తగవులఁ బెట్ట నీకు తతివచ్చేనే
[17-522

మొగమొగాలు
తగవేల నీ మంచితనానకే మెచ్చుకొంటా
మొగమొగాలెదుట నే మొక్కుకొంటఁగాక
[17-369

మొగమెఱక
అందులో మొగమెఱకై యున్నవాని
ముందర నిలిచి నెమ్మోము వీక్షించి
[వ. యో. వి. 4-1271

మొగమాటకాఁడు
మొగమాటకాఁడు మోనాన నుండక
పెగడి ఆ వేఁటికి బెట్టినె
[15-254

మొగమోటలు
తగిలేరు పొగిలేరు దైన్యమే చూపేరు
మొగమాటలను నేను మోసపోవ నోపను
[8-220

మొగమోడు
కమ్మటి నిచ్చకమ్ములు నెరపుడు
కైవసము గావలె ననుచు
వుమ్మడి నీ గుణాలు వొగడుదు వూరక
మొగమోడుదు వనుచు
[7-62

దక్కఁగొన మాలోని తన భోగములాల
మొక్కితిమి మాకుఁ గొంత మొగమోడరో
[6-40

మొగసాల వాకిలి
మెఱవెట్టెదము మీకు మొగసాల వాకిటను
మఱఁగు చొచ్చితి మీకు మము గావరో
[5-331

మొగసిరిరక్ష
సిరిమగఁడే మొగసిరి రక్ష
మరుగురుఁడే మా మర్మపు రక్ష
[10-54

మొగుడ
తరుణి కుచములను తామర మొగుడలు
విరిపేనోయని వెరపునను
[4-17

మొత్తమి
యెత్తిన మీఁదను దనకె మేనుఁ
బ్రాయమును
మొత్తమి నా కిఁకమీఁద మోనమెచాలు
[15-61

మొత్తిమోఁదు
తుత్తుమురుగ దైత్యుల దనుజుల నవి
మొత్తిమీఁది చలమునఁ జెలఁగి
[11-3-78

మొదలవెనక మొక్కు
పొదలి శ్రీవెంకటేశ పొంది నీ కరుణచేత
మొదల వెనక నీకే మొక్కేమయ్యా
[9-257

మొదలారి
నీవెకా చెప్పఁ జూప నీవె నీవెకా
శ్రీవిభు ప్రతినిధివి నేన మొదలారి
[5-158

మొదలివేల్పు
మొదలివేల్పు మా మొఱ యాలించవె
యెదుటఁగావు మము నిదివో దేవా
[10-36

మొదలెంచు
పట్టి మొదలెంచితేను బ్రహ్మఁ గన్న
తండ్రితఁడు
ముట్టున వింతటివారు మరి వేరి
[8–102

మొనగోరివాఁత
మోఁత నీటిలోని యీఁత
మూఁపునఁ బుట్టిన మేఁత
మూఁతిమీఁది కత్తికోఁత మొనగోరివాఁత
[12–274

మొనగోరు
గునిసి మమ్మిద్దరినిఁ గూరిచితి వాపె నీపై
మొనగోరు మోపినదె మొదలాయెనా
[15–268

మొనగోరూఁదు
అక్కున శ్రీవెంకటేశు అలమేల్మంగను
నేను
మొక్కితిఁగాక రతుల మొనగోరూఁదితినా
[18–386

మొనచూపు
మొనచూపవలసితే ముంచి నీకు నెదిరించి
చెనకెటి వారిపై నే చేఁతసేయరాదా
[17–461

మోహాంధకారముపై మొనచూపేనని
పోయి
సాహసములేకనే జడిసితిని
[8–265

వగఁబాటులైన జనన మరణములేల
ముగురు వేల్పులదండ మొనచూపరాదా
[7–181

మొనచేసుకొను
యింతనేవే దయగలవాఁడవు
యెప్పుడు నే నిర్దయుఁడను
చెంతల నన్నొక మొనసేసుక నాచేఁత
లెంచనేలా అయ్యా
[7–280

మొనపు
మొనపి సిగ్గులను మొగ్గులు వెట్టీ
చెనకేటి చెక్కు చేతలను
[14–10

మొనయు
చనవులకు గుఱి మిగుల సవిగెలు
మెరయుటలు
మొనయ పొందులకు గుఱి మొగమోటలే
[13–35

మొనవాఁడి
కొలచిన వారికి కొంగు పైఁడి
ములిగినవారికి మొనవాఁడి
[7–197

ముప్పెఁజేయు
వదినెవ్వతో నిన్ను వాకట్టుగట్టుక యింత
ముడిపెట్టి విడిచి ముప్పెఁ జేసెఁగాక
[17–563

మొయిలచ్చన
మెచ్చితే వెంకటేశ మొయిలచ్చన
చూపె నాపె
యెచ్చి లోలోనే కూడితి రిద్దరూను జాణవే
[13–109

మొయిలులేని వానజల్లు
లలిమీరి యన్యోన్య విలాసములు
భోగములు
వలవని మొయిలులేని వానజల్లు
[6–203

మొరఁగులాడు
అక్కరతో నాతఁడె ఆదరించి నన్నుఁ
గూడె
మొక్కనై తినంటా నేల మొరఁగు లాదేరే
[17–314

మొరపెట్టు
కాలముసు వీటఁబోయె కర్మమును
దెగదాయ
మూలనుండి యెవ్వరికి మొరపెట్టేను
[9–34

మొరవంక
ముద్దుల వ్రేళ్ళతోడ మొరవంక
యుంగరాల
నిద్దపుం జేతుల పైఁడి బొద్దులతోడ
[4-1

మొఱపెటు
యీ రీతి శ్రీవెంకటేశ యెదలో
నీ వుండఁగాను
బీరాన నీకే మొఱపెట్టు నొకవేళ
[6-97

మొలచు
మొలచి నాలుగు యుగముల రాజులు
ఘనులు
కలకాలము గొని కడగన్న మందు
[5-140

మొలపూసలు
చుక్కలు మొలపూసలు సూర్య
చంద్రులు కన్నులు
దిక్కులు చేతు లెండలు దివ్యాయుధాలు
[7-9

చుక్కలు మొలపూసలు సుద్దులవాడి
రోమాలు
వుక్కుమీరెఁ జూడరమ్మ వుగ్ర
హనుమంతుఁడు
[10-85

మొలవఁగఁబెట్టు
మునుపేయిజగమెల్లా నీవు
మొలవఁగఁ బెట్టినవి
వెనుకొని నేను నీవాఁడనే యని
విన్నవించనేల
[10-105

మొల్లపూఁచినరీతి
సేవించి మొల్లపూఁచినరీతి మేని
తీవలు గరుపార ధృతిభీతు లగుచు
[వ. యో. వి. 2-1747

మొల్లమి
మొల్లమి నీ విటబుద్ధి మునుపనె కలిగితె
వొల్లనె దొంతనాన నుండవచ్చుఁగా
[14-251

## మో

మోఁచు
వున్నతి తోడుత నిన్ను మోఁచుటకు
వున్నారు గరుడుఁడు శేషుఁడు నీకు
అన్నిటాను నీ కౌఁగిటి లోపల నలరీ
నలమేల్మంగ
[7-67

మోఁచివచ్చు
రేఁచిన జనన మరణములు రెంటికిదీనేసి
మోఁచి వచ్చితే విజ్ఞానమెరఁగఁగ
మొదలికిఁ గొనకును
యెదయేదయ్యా [9-206

మోఁటు
ఏఁటికి దగ్గరేవయ్యా యిదేమినీవు
మోఁటునందానఁ జన్ను మొనలుదాఁకీనె
[14-194

మోఁపుల కొలఁది
మునుల జడలవిగో మోఁపుల కొలఁదులు
యిన చంద్రాదుల నెక్కువ గెలిచెను
[10-36

మోకదాకు
మంకువాననేదుఁగాని మనసు
మోకదాకిరి (?)
కొంకక యేమి సేసినాఁ గోపగించనమ్మా
[18-312

మోకాలు ఇచ్చలజూచు
చరి వేసుకొంటా నే నీ చెక్కునొక్కఁగాఁ
జూచి
సారెఁదమ మోకాలిచ్చల జూచేరు
[17-124

మోకాళ్ళబంటి
వేడుకవాల మాకాళవీధితోఁ బెనచినాఁడు
యేడు జలధులు చేసె నిదె మోకాళ్ళబంటి
[7-116

మోక్షమరచేతిది
మక్కువ భాగవతాభిమానము గలవారి
కక్కరలేని మోక్ష మరచేతిది
[9-106

మోచిదించు
మనుపనె భూమిదన్ను మోచి
దించకుంటే మేలు
వెనుకొన్న కోపము విడిచితే మేలు
[9-158

మోచివచ్చు
హెచ్చి మోచివచ్చితేను యెక్కడి
గొడపయందు
యిచ్చట నిశ్చలబుద్ధి యెందూఁనే గానదు
[8-168

మోటుపెట్టు
మాటకు మోటాడఁబోతే మరియెన్నైనా
గలవు
మోటుపెట్టి నేము నీకు మొక్కేదే మేలు
[14-91

మోదరలాడు
మొత్తి మోదరలాడి మొనసి గుండెలకు
నెత్తుర దిగఁదన్ని నీపెల్లఁ జెఱచి
[వ. యా. వి. 6-289

మోన
వే విన్నుఁ గోవగించితే నీవు నివ్వితి
వందుకు
మోవాన నంతలోననే మొక్కేనిదే
[17-63

ఆన వెట్టుకోఁగాని అన్నిటా జాణను నేను
మోవాన నీ పాదాలు మొక్కే యందురు
[17-47

మోనము [= మౌనము]
మోనాన నుందానవేమే మునివైతివా
మేనులు సోఁకిన మందెమేళమైనలేదా
[17-254

మొగమాటకాఁడు మోనాన నుండక
బెగడి ఆనేఁటికి బెట్టీనే
[15-254

పూని నిన్ను నుతియించి భోగియాయ
నొకఁడు
మోనమున నిన్నుదిట్టి మోక్షమందె
నొకఁడు
[10-8

పూని యాతనిఁగొలిచి భువినేజాతైనాను
మోనమునఁ బొందేటి మోక్షము నొకటే
[10-42

ముక్కుమీద వేలిడుక మోనమున
నే నుండితే
దక్కి సిగ్గుః మునిగీలేఁ దానే
[14-36

తానె వొట్టువెట్టుకొని తరుణి యాతడిచ్చిన
కానుక కప్పురమెల్ల కడఁబారఁ జల్లెను
మోనమున దప్పిగొనె మించి మీరైన
విడెము
ఆనవెట్టి యిచ్చి యిట్టె ఆకు మడిచియ్యరే
[17-256

దూరనేను పారలేదు దొమ్మినన్నుఁ
జేయరేమ
మోరతోపుఁ దనముల మోనమే మేలు
[15-61

మోనాన
లోనికిఁదీసి నిన్నింతిలోను వేమకొనఁగాను
మోనాననే నుంటివట మొక్కుదాకను
[17-144

వట్టి మోనాలిఁక నేల వాఁడె సరసములాడీ
వట్టిన చలముమాని వలుకవమ్మా
[17–133

తానె నీ వేడనున్నా వెదకి తోడితెమ్మనఁగ
మోనాన వచ్చితి వింతె ముం దెరుఁగుదునా
[17–180

తానె యెరఁగదా తనలాగు
మోనాన నే నొక్కమారు మొక్కితేనె
చాలునే [17–99

మోనాన నేఁ గొసరి నా మోహము
గద్దాతనికి
పేనివట్టి వచ్చీఁగాని పిల్వరే వాని
[17–188

మోనాన శ్రీవెంకటేశ మొక్కి నీ
దాసుఁడఁగగా
అవిన విన్నియుఁ దరిహార మయ్యీఁగాక
[9–147

ఆనుక శ్రీవెంకటేశ ఆతుమ నీవుండఁగాను
మోనాన నీకు మొక్కేటి మునివాఁడనేను
[7–108

మోనాన నుండు
మోనాననుండుత గాక మోహపు నీ
మాటలకు
దానికె నే మారాడితేఁ దమకించేవా
[17–123

మోనానమొక్కు
మోనాన నూరకె నీకు మొక్కేఁగాన
కానికలు సారెవేమి కప్పమంపే నీకును
[17–108

మోపు
యీయెడ శ్రీవెంకటేశ యేలితివి నన్ను నీవు
మోయరాని నేను నీకు మోవని పిఁగేను
[5–316

మోపుగట్టు
యెమిటికే బిగువు యింకానా తగవు
మోముచూచి నవ్వితేనే మోపుగట్టేవా
[15–237

జ్ఞానినైతిననే గర్వాచారపు వాఁడఁగాను
కానక నీపై మోపుగట్టనోపను
[7–108

మోపుచు
యేపున నింతటివారి కెక్కుడైన దైవమవు
మోపుచు ధర్మరాజుకు మొక్కు లెట్టయ్యా
[8–76

మోపుమోచి మలుగు
దీపనాగ్నిగల దిష్టము యీ మేను
మోపుమోచి నేము మలిగేది యరుదా
[10–39

మోపులుగట్టు
మోవరాని దూరులెల్లా మోపులుఁగట్టగాను
వేవేగ విన్నియు మన విభుడు మోఁచీనా
[16–2–70

మోపెట్టు
తీవ్రుల విలునారితిండి మోపెట్టి
పూవుఁ దూపుల యంత పొంచవెట్టఁగట్టి
[శృం. మం. 171

మోయని మోపు
ఆయము రెంటికి నన్నపానములు
మోయని మోఁపిది మలుగఁగనేలా
[6–147

మోరతోపు
కోరికఁ దనబ్రదుకు గురువాక్యాధీనమైతే
మోరతోపులేని నిత్యముక్తుఁడు దానే
[7–226

మోరతోపుఁ దనము
దూరలేను పోరలేను దొమ్మి దన్నుఁ
జేయలేను
మోరతోపుఁ దనముల మోనమే చాలు
[15–61

మోరతోపుఁ దనములు మొగములో
నుండఁగాను
యీరీతి సాకిరడుగ నితనేలా
[17–517

మోరతోపై వుండు
చేయం నాతనిముద్ర చెల్లుబడి నుండఁగా
మోరతోపై వున్నవాఁడే ముందు
వెట్టివాఁడు
[5–238

మోరతోఁపులు
తలనెత్తుకొన నీకుఁ దరమె యింతేల
తొలఁగరా యీ మోరతోఁపు లేమిటికి
[వ. యో. వి. 4–958

మోరుఁడు
అబుగన తాఁ బట్టిన వ్రతముండఁగ
నన్యమతము చేపట్టెనను
నటనల నెందుననుఁ బొందక జీవుఁడు
నడుమనె మోరుఁడైనట్లు
[6–22

మోలంచు సేయు
జిగిమోవులని చెంత చిగురులనాని
మొగరైనఁ గావని మోలంచుచేసి
[అ. మ. క. 2446

మోలము
వాఁడివో కంటిరటరే వన్నెలవాడు
పైడిమోలము కటారు వరుజాలవాడు
[13–116

మోపరాచిమోపు
మోపరాచి మోపయి ములుగనియ్యడీ
మమ్ము
చేవ సంసారముపైఁ జిమ్మిరేఁచీని
[9–63

మోపచెంచు
ముద్దుముద్దునేసి నిన్ను మోవఁజెంచె
మీకల్లి
[15–73

మోవనాడు
మోవనాడి యిందరూను మొక్కఁగాన
వింటిఁగాక
చేవచేరి నాఁటదైతే చిమ్మి రేఁచకుండునా
[17–420

దేవుఁడంటాఁ దనమీఁద తెగి సొలపు
మాటల
మోవనాడలేక యింత మొక్కితిఁగాని
[12–144

మోవిగిరుపు
నీ విన్నిటా నేర్పరివి నే నింతేసి నేరను
మోవిగిరిపేనింతే మంచి యేమినేనేరా
[17–1

మోవిరసము
రతిలో శ్రీవెంకటేశ దగ్గరి కూడితివాకె
రతిసలనెను మోవిరస మియ్యవమ్మా
[17–157

మోనలేనిది
మోనలేనిది నీ సంకల్పితము మొక్కే
మిములకు శ్రీవెంకటేశా
ఆసపడనితరుల నాకు నిదే యానయని
నీ దాసులమై యున్నారమమ్మా
[7–105

## య

యవ్వనము
యవ్వన మదమున నెఱయును కోరిక
కొవ్వున నణఁగదు కొంతైనా
[5–179

## యో

యోగపట్టెము
చిలుకు గోళ్ళతోడ సెలవి నవ్వులతోడ
బలు జిహ్వతోడ యోగపట్టెముతోడ
[7–44

రంటడు
రంట దెప్పదింద్రియాల రవ్వైతేఁ గావవేవో
అంటిన శ్రీవెంకటాద్రి ఆడమూలమా
[6-66

రంట దెప్పరపు రచన
రంట దెప్పరపు రచన మా బదుకు
జంటల శ్రీపతి శరణమె నిజము
[10-184

రంటికి వచ్చుట
ఎవ్వరికిఁ దెలుసు నీ యిట్టి మాయలు
రవ్వలుగాఁ జూడఁబోతే రంటికిని వత్తువూ
[17-465

రంటు
పతిబాసి వున్నదాన బలు విరహపువేళ
యితవంటా విరులు నాకేల యిచ్చేరే
రతిరాజు నమ్ములివి రంటదెప్పరపువేళ
తతుకున నాటుఁజేసుగవిశన నాదరే
[17-221

రండు
రండూ నేరుతువే రమణి నీవు
వెండిపైఁడి వుంగరాలు వేలనే పెట్టితివే
[14-26

వుందేది వొక్కటె యింట
వందేది వొక్కటెవద్ద
రండును నడపేవు నీ రాజసమున
[14-38

ఎవ్వరి కెవ్వరి చుట్టాలేమి
బూమెలు నేసేవు
రవ్వలనాఁడు బుద్దులు రండూ రెండే
[14-273

బీరమాడి బెళకేవు పెనఁగి తలవంచేవు
ఔరా నీపొందు లెందుకైనా వచ్చును
మారుమలసేనప్పటి మరి రండూ నడపేవు
నేడతు వన్నిపనులు నే నెఱఁగఁగాని
[15-268

రంతు కెక్కు-
వంతగాఁజు మిక్కిలి నీ వననజూఁడు
రంతుకెక్కె మతంగ పర్వత పవనజూఁడు
[10-273

రంతుచేయు
వింతగాఁగ నొకబంతి విజిచె నప్పటినంటా
రంతునేసే రవివో రచ్చలు నిండి
[6-65

రంపపు
రంపపు వేంకటరమణుని కథవిన
నింపగు వారికి నిదె ధనము
[5-42

రంభారూళ్లు నేయు
మమ్ము నింవాక రంభారూళ్లనేసి
లెమ్మన్న లేవక లీల నాకింక
[వ. యో. వి. 4-1011

రక్తగుండాలు
జగములో రాక్షసుల సంహారముగ నేసె
నిగిడి రక్తగుండాలు నిండనేసెను
[6-107

రచన
మతకాన మీరెంత మారుమోములై
యుండిన
రతిఁ గూడకుండేరా రచనలతోడను
[14-1

రచనల నిన్నిట రసికుఁడవు
యిచట విన్నపంబిదె నేసెదను
[14-7

యీ రతి శ్రీవెంకటేశ యెననితివిటునన్ను
నీ రచనకు నవ్వితే నీకేల కలఁగా
[14-45

ఎచటనుండి వచ్చితి వెదురుచూచితి నీకు
రచన మన్నించి నన్ను రవ్వగాఁ జేసితివి
[14-217

రచనకాఁడు
రుచులైన నీ మాఁటలె రూఢి కెక్కించెను మమ్ము
రచనకాడవో పండరంగినాథా [17-127

రచ్చకెక్కు
తచ్చి చూచేది కన్నుల దాసుల మీఁదికరుణ
రచ్చకెక్కెఁ గలశాపురము హనుమంతుఁడు [8-232

అచ్చపు శ్రీవెంకటేశుఁ డన్నిటాను నన్నునేలె
రచ్చకెక్కె నిఁకతాను రాకుండీనా [14-2

రచ్చకొట్టము
యిటె కై కొనఁబోవుటే రీతిరచ్చ
కొట్టమై నా యున్న కొలువుకూటంబు [వ. యో. వి. 3-1340

రచ్చఁబడు
రాఁగా రాఁగా వలపు రచ్చబడీని [14-27

రచ్చఁబడ్డ వలపులు రమణ నణఁగునా
తచ్చి కప్పూరిపూసితే దాఁగునా వాసనా [18-80

రచ్చఁబడి వలపులు రాఁపాయ మీఁతలఁపులు
వచ్చివేసి ఇఁక నవ్వఁ బాడిగాదు మీకు [18-345

రచ్చరావి
రచ్చరావికింద రంతులె చేసేవు
బచ్చన మాటల పసకాడ [4-103

రచ్చలఁబడు
రచ్చలఁబడె మాగుట్టు రమణుల చేఁతబెట్టు
అచ్చమై యిందుకుఁ బరిహారమేదో కాని [9-243

రచ్చలసుద్దులు
సమ్మతించె నామతిఁ జవియై నా(నీ?)కథలె
సమ్మతించ నెక్కడిదో రచ్చలసుద్దులు [5-220

రచ్చవేయు
చేఁగదేరఁ గూడితివి శ్రీవెంకటేశ నన్ను
రాఁగిన నీ పొందులెల్ల రచ్చవేసేదానవా [17-276

రట్టుకెక్కు
రట్టుకెక్కె దొరనౌటే నెట్టన మాఁటోతప్పు
యిట్టె కావు కావకుండు మిది వోతప్పు [10-208

రతికెక్కు
ఆవలఁ గొందఱు కర్మమది బ్రహ్మమందురు
రావణాదు లవివేసి రతికెక్కిరా [6-67

ఇతరమేదియు లేదు యెఱఁగమింతేకాని
రతికెక్కె పనులెల్లా రామచంద్రుఁడే పో [10-11

ఇతఁడు తారక బ్రహ్మమీశుఁడు సర్వేశ్వరుఁడు
రతికెక్కఁ గొలిచిన రక్షించు నితఁడు [10-159

ముంగిటి దేహికిఁ గర్మములు ముంచుకొనఁగాక
రంగుగ శ్రీపతిఁగొలిచి రతికెక్కెనా [10-186

రతికెక్కఁ గొలిచితే రచనలెల్లా నీడేరు
అతి రాజసాన నుండే నంటినవ్వేనా [18-365

రపము
వుపరతి సమరతి నుండు నొక్కవలపు
యెపుడూనుఁ దలపోతలేక వలపు
రపమై శ్రీవెంకటేశ రతి నన్నుఁగూడితివి
వుపమించిచూడ నింతా నొక్కటేవలపు
[71-7

రపమున నన్నిటు రమ్మని పిలువఁగ
అపుడే నేనోవ ననవా
[71-418

రవ్వచేయు
ఎవ్వరి నేర్పులఁ జెప్పనిందు నేది
రవ్వచేయక జీవుల రక్షించవయ్యా
[7-53

రవ్వపడు
రాతిరొక్క లోకము రవ్వపడెఁ గలలోన
ఘాతలఁ బగలొక్క లోకము వేగితే
[6-163

రవ్వలకెక్కు
రాతిరి పనులాతఁడు రవ్వల కెక్కినతఁడు
భీతిలేక ఆసలెల్లాఁ బెట్టుకోఁడా
[14-13

రవ్వైన
రవ్వైనవాఁడవుగాదా రాజువుగాదా మున్నే
అవ్వల నెంచిచూచితే నందుకునుఁ దగవా
[14-244

## రా

రాఁగ
కతగా శ్రీవెంకటేశుఁ గలసి
మెప్పించితేను
రతులలో నిదెంతటి రాఁగ యందురు
[17-534

రాఁగఁజేయు
రంతుల వేనేమన్నా రాఁగఁజేసి దూరవద్దు
[13-22

రాఁగతనము
రవ్వగాఁదా దూరఁగాను రాఁగతనాఁ
దిట్టక
అవ్వల సిగ్గువడితె ఆనలవునటె
[16-2-39

రాఁగినమూర్ఛలు
రతి పరవశములు రాఁగిన మూర్ఛలు
నుండి
మతిలోఁ దప్పించుక మనుదురుగాని
[5-319

రాఁగు
వేఁగదేరఁగూడితివి శ్రీవెంకటేశ నన్ను
రాఁగిన నీ పొందులెల్ల రచ్చవేసేదానా
[17-276

వుమ్మ చెమటలఁ దోఁగెను విరహాఁతల
రాఁగె
యిమ్ముల నన్నీడకంపె నెఱఁగమరి
[17-312

రాఁపువారు
ఎవ్వరితోనైనాఁ జేయుమీ మాయలు
రవ్వలఁబెట్టగవేము రాఁపువారమా
[15-204

రాఁపుసేయు
నీ పలుకులెల్లా వింటి నీవు వేఁడుకొననేల
రాఁపుసేయ కిపు డిట్టే రావయ్య లోనికి
[14-41

రాకపోక
తోరమైన ఆసలుబ్బి తోవగానిపించదాయ
కోరి రాకపోకచేత కొల్లఁబోయఁ గాలము
[5-128

రాకాఁ బోకా
రాకాఁ బోకా నాతో నింతేసి రంతులేలా
నీవు నీకె చుట్టరికములు నెరపేవు
[16-2-14

**రాకొట్టు**

పైకొన్నవాఁడవుగాన పడఁతి రాకొట్టు గొట్టి
కైకొని నీ మాటల వంకలు దిద్దనేలా [13-202

**రాగాకు**

కన్నులు దిప్పుచు కర్ణములు గదల
సన్నల రాగాకు చౌకళింపుచు [6-93

**రాగిదేలించు**

సాగిన సభలోన నన్ను నేసినంతలో
రాగి దేలించేవు వందరంగివికలా [16-2-27

**రాచబలిమి**

కొంత గొంత కోపించిన కొంగుపట్టి నాతోను
వంతులు సేసేవు నీకు రాచబలిమా

**రాచబలుపు**

ఆఁగి వెట్టఁబోలేను అప్పుడే తాగదెపెట్టి
రాఁగతనాన నున్నాఁడు రాచబలుపమ్మా [6-165

**రాచయీవి**

దేవ నీ విచ్చిన మేను తెగి రోయ నెంతవాఁడ
కావించి రాచయీవికిఁ గడమున్నదా [10-243

**రాచవెట్టి**

శ్రీపతి యీ సంసారము సేయకుండ నెంతవాఁడ
మాపుదాఁకా రాచవెట్టి మానవచ్చునా [10-248

**రాచనలిగెలవారు**

బలిమి చూపఁగరాదు వంతపు మగవారికి
వలరాచనలిగెలవారు సుమ్మీ వీరు [17-526

**రాచాజ్ఞ**

నీకడ నిన్నే కొలిచి నీ యప్పణదెచ్చి వాని
బైకొని చోఁపుటగాక బలిమా రాచాజ్ఞతో [7-209

రాచాజ్ఞ మరలించ రాజే కర్త గాన
యేచి నీకు శరణంటి నిది మానుపవే [7-213

హరి నీ మాయలకు నే నడ్డముచెప్పే వాఁడనా
అరిదైన దదియు రాచాజ్ఞ గనక [8-26

**రాట్నపుగుండ్ర**

రపణపు భవములు రాట్నపు గుండ్రలు
చపలపు బుద్ధులు జలనిధులు [8-50

ధరలోనఁ బుట్టి పుట్టి తగవచ్చి నందేవచ్చి
వరుస రాట్నపు గుండ్రవలె నైతిని [9-49

**రాట్నపుగుండ్రలు**

కోటానఁ గోట్లాయ కోరికలు జన్మములు
కూటువగూడి రాట్నపుగుండ్ర లైనారయ్యా [7-32

గొనకొన్న రాట్నపు గుండ్రల కరణిఁ
బని బూని ఘనకర్మపరతంత్రులగుచు [వ. యో. వి. 465

**రాట్నపుఁ జెవులు**

నిన్నుఁ జూడని కన్నులు నీచులవలకన్నులు
చిన్ని నీ కథలు వినని చెవులు రాట్నపుఁ జెవులు [7-216

**రాడకాడే పొడచూపు**

ఏడనుందురో తాము యెన్నికపోఁజులు దాఁటి
రాడకాడే పొడచూపేరాహా మేలు [6-124

రాణివాసమగు
మన్నన సంపదరాశి మదనుని పుట్టినిల్లు
వన్నెతో నీకు రాణివాసమాయెను
[13-3

రాణివాసము
• ధర శ్రీవేంకటేశ నీ తావెల్లా రాణివాసాలే
యిరవై మమ్మునేలితి వేదుగాను నతుల
[13-95

రాణివాసాలు
రాని పోని మూలలను రాణివాసాలున్నారు
తానకమై మారుకొనేదావ నీకుఁ బ్రియమా
[14-220

రాతనార ఒలచు
ఆసపడ నీవె తాను అంబుధులు పేరఁబెట్టు
కోసి రాత నారొలిచి కూరిమి లింకేఁటికే
[14-298

రాతవేయు
చిక్కని తేనె చాదె చివ్వన రాతవేసితే
అక్కడ జోరునఁ గారె యశోదమ్మా
[10-161

రాతికిఁ బ్రాణంబుఁ దెచ్చు
వేషుకనిడి చేసి పిఁసనిజోలఁ
బాడుచు రాతికిఁ బ్రాణంబుఁ దెచ్చి
[వ. యో. వి. 3-1845

రాతిగుండె
అతఁడు భక్తసులభుఁ డచ్యుతుఁడు
రాతిగుండెవాఁడుగాఁడు రంతుమానఁ
డిఁకను
[8-99

కాంతుఁడ నే నెంతాడినా గక్కదలవు నీవు
యెంత రాతిగుండెవాఁడ వేమిచెప్పేది
[14-175

రాతిరిపనులు
రాతిఁపనులాతఁడు రవ్వలకెక్కినతఁడు
భీతిలేక ఆనలెల్లాఁ బెట్టుకోలేఁడా
[14-13

రాపుబీరము
రాఁగదవే యిఁక నేల రాపుబీరాలు
మాఁగిన మోవితేనెకు మరిగిన దానవు
[13-120

రాపుపిలికాళగను
తూపువేత నంటితేనే తుత్తుమురై
పారు నురు
రాపుపిలికాళగంటే రణభీతి గొందురు
[8-186

రామరాజ్యము
మచ్చరము లేకున్నను మనసే
రామరాజ్యము
వచ్చినట్టి వచ్చితేమ వలపే చవి
[7-128

రాయడించు
రాయడించే చోటుగాదు
రతికెక్కినప్పుడైనా
చాయఁకుఁ దెచ్చుకో మాట చవులైన
యప్పుడు
[14-93

రాకలఁ బోకలనట్టిగా రాయడించి
కొవరాఁగ
మైకొని లోఁగాకున్న మగతనమేది
[15-172

రారాఁపు
సారె వెంగమాడేవు చలమున విడియేమే
రారాఁపై నీకడకు రాకుండేను
[15-99

రాలరి
పాలసముద్రము బలిమిఁ దచ్చికొని
రాలరి దేవత లమృతముకు
[6-10

రావలయుట
ఆవల సురతభోగ మనుభవింపఁబోయి
రావలయుటగాక రచనేమి గలదు
[5-92

రావిమానిచేని పొలము
మంచి గురుతైన రావిమానిచేని పొలము
వంచిన గుబ్బముఁదోలే వయ్యాళిపొలము
[10–52

రావిమానిజిగురు
యే వేళగుణమో యెడతెగని కర్మాలు
రావిమానిజిగురై పూరక యంటీని
[6–105

రావిమానిపువ్వులు
రతులలో మాటలు రావిమానిపువ్వులు
తతి విరహపుకాఁక తాటిమానినీడ
[7–34

రాసికినెక్కు
రాసికినెక్కిన శ్రీవెంకటగిరి రమణుఁడ
నీ వుపదేశమిది
యీళ వరాత్పర తనిసితిమిందే యిఁక
నొకటి గోర నెడమేదయ్య
[10–76

రాసికినెక్కఁగ శ్రీవెంకటేశ రక్షించితి
విప్పుడు నన్ను
వాసితోడనే నిన్ను దగులుదును వసలక
పాపాలఁ గలవనుచు
[7–62

రాసికెక్కు
రాసికెక్కె నీ వింతటి రాజసపు దైవమవు
దాసుల మాకెల్ల దక్కితివయ్యా
[8–76

రాసికెక్క (క్కు ?) కోదండ రచన
విద్యాగురువ
వాసితో మరలు నిను వడి మెచ్చేరయ్యా
[9–15

రాసికెక్కె మునులకు రచ్చైన పొలము
వేసరక వాఁగేటి వేగిలైన పొలము
[10–52

వేసపెట్టిరాజు వలచినదే దేవులంద్రురు
రాసికెక్కె నీ బొమ్మ రక్షించుకోవయ్య
[14–155

వేసరక నన్నును శ్రీవెంకటేశ్వరుఁడు
గూడె
రాసికెక్కె నీ వలపు రవ్వ మానుమనవే
[17–561

వేసపెట్టి ఇప్పుడెంత సిగ్గుతో
నే నుండినాము
రాసికెక్కె నీ కౌఁగిలే రవ్వనేనును
[18–117

రాసికెక్కె నన్నుఁగూడె రతి
శ్రీవెంకటేశుఁడు
యీ నరవుల మేలుయెంచ వనమటవే
[18–247

రాసిచేయు
ఆసపడి వచ్చినట్టి అతిథి బలురాజుకు
రాసిసేసి యేమిచ్చిన రతికెక్కెని
[7–250

రాసియెత్తుదీయు
వన్నెకుఁ బెట్టినసొమ్ము వడిరాసి
యెత్తుదీవె
మున్నిటివె వెనకాయ ముచ్చటా
దొఁగదు
[6–4

రాసివడు
వలపెల్లా రాసివడే వనిత వేఁడుకోనీవి
చలమేల సాదించేవు చవవియ్యవయ్యా
[18–324

## రి

రిత్తకురిత్త
రిత్తకురిత్తయి యీ రెంటి నడుమనుజిక్కి
కత్తెరపు రొంపిలోని కంబమైతిఁగాక
[10–44

రివ్వ
జవ్వనపువాఁడ వానలు నే వెరఁగవా
రివ్వలుగ నెందాక రేఁచేము నిన్నును
[17–102

# రు

రుణపఱుచు
కడిచోని జవ్వనము కలిమిలేమెఱుఁగునా
బడినుండి మిగుల రుణపఱుచుగాక
[6-11

రుత్తయధరము
వొత్తి నారాయణ నామ ముచ్చరించే
నోరను
రుత్త యధరవుఁదోలు రుచిగొనేదా
[6-115

రుత్తవారు
యీదేరించి నా గురుఁడు యీ దిరేశుఁ
జూపెఁగాక
యీడనె రిత్తవారి మీ రెంతెంత సేయరు
[16-53

రుత్తవోవు
చిత్తమె చిమ్మిరేఁగితే సిగ్గమె మెగ్గమె
రుత్తవోని వేడుకల రుచిగన్నవారికి
[16-2-66

# రూ

రూకెత్తు పుత్తడి
యోగులదాసి నీ యొడలి సొమ్ముల్ల
భోగుగా రూకెత్తు పుత్తడి లేదు
[వ. యో. వి. 4-1290

# రె

రెంటదెప్పరలు
ఏమని వొడఁబరచే వింకా నన్ను
అముక రెంట దెప్పరాలాయఁబో వలపులు
[13-213

రెంటము
రేఁగాము పేరిటి రెంటముగట్టి
భోగిపేరి తీగాకు పొనగజుట్టుచును
[16-2-117

రెండుచేయు
వెన్నడిని కొండాపాము వెవ రెండు
చేసినాఁడు
వన్నికంసుని మదము ఖండించినాఁడు
[8-235

రెక్కల గుజ్జుము
దిక్కులు సాదించి తనదేవుల వండఁ
బెట్టుక
రెక్కల గుజ్జుముపై పేరెము దోలీని
[15-160

రెట్టి
వట్టి బ్రహ్మోదుబాధలు పాపిన దేవుఁ
డితఁడు
రెట్టిగా వేదము లుద్ధరించె నితఁడు
[8-195

రెప్పల మరఁగు
రెప్పల మరఁగదె రేపును మాపును
యిప్పుడె తోచీనిదివో కీలు
[9-89

రెప్పార్పక
ఆ వేల్పు వేల్పు రెప్పార్పక మఱియు
సేవించి యందునం జిక్కి చొక్కుచును
[వ. యో. వి. 2-1523

రెప్పార్పక చూచు
అనుచు నంతంత రెప్పార్పకచూచి
యనియె నా వైద్యుతో నావరాంతకుఁడు
[వ. యో. వి. 6-138

# రే

రేకల సెలయేరు
సైకపు పీల్నాద్రినుండి జలజల బారేటి
రేకల సెలయేరులరీతి నున్నదదివో
[6–50

రేఖరేఖ పందెము
ఒత్తి విన్నవించలేము ఓడితేను
నీకు నాకు
రిత్తమాటవద్దు రేఖరేఖ పందెమా
[4–165

రేపటిచేఁత
నిన్నటిదినము శత నిమిషమై తోఁచీని
కన్నుల రేపటిచేఁత కానఁగరాదు
[7–154

రేపుమాపు
ఆపె యెరుఁగును వీ వన్నియూ
నెరుగుదువు
రేపుమాపు నే నెచ్చరించే నా విభుఁడ
[16–2–47

గడుసు లేమియు నెఱుంగని రాజు చెవుల
బిడుకలు విఱిచి రేపును మాపువచ్చి
[ప. యో. ఎ. 3–1247

రేపుమాపువలె
రేపుమాపువలె రెట్టించి వున్నవి
యేపొద్దు నీ రెండు నేకమే
[8–105

రేయిఁబగలుగఁ జేయు
రేయిఁబగలుగఁజేసి రేపల్లెఁ బెరుగఁ
జొచ్చె
ఆయెడ నావులగాచ్చె నాదిమూలము
[8–112

రేవగలు
నీవు నేసిన బాసలు నీ వెరఁగవా
రేవగలు నెట్టు వేసరించేము విన్నను
[17–102

రేసు
ఆసల నిద్దరికిని ఆశఁదే గురుతుగాక
రేసులు పుట్టించి యాలరేఁచేవే మమ్మును
[17–148

రేసు తిమ్మటలు
రెక్కలుగల పక్షి రేసు తిమ్మటలేకాని
చక్క వైకుంఠాన కెగయు సత్తువలేదు
[6–89

రేసులు
రేసులొక కొన్ని మీరిన రుచులు నొక
కొన్ని
యాసువఁ గడించితిమి యిమఁదఁ
జోటేవో
[7–173

రేసువడు
చొప్పుగా నీ కెదురులుచూచిచూచి వాకిటను
రెప్పల ముయ్యగలేక రేసువడితి
[14–25

రేసువెన్నెల
రేసు వెన్నెలయెండ కోరిచెఁగా నాతమవు
ఆపల నా ప్రాణవిభుఁ డాతపిఁబాపి
[16–52

రేసె
రెప్పలెత్తి చూడనేర్చె రేసెఁ జంద్రునందు
పగలు
గొప్ప సూర్యునందు నింకఁ గొత్త నేర్పుఁ
నేఁటికే
[7–153

## రొ

**రొంపికంబము**
నిన్నుఁ గైకొనరాదు నెంతఁ బొమ్మనరాదు
అన్నిటా రొంపికంబమవై నీ వున్నాఁడవు
[14-179

**రొప్పు**
దనుజాంతకుని సేన దగ్గరి నడవఁజొచ్చె
చొచ్చి రొప్పవో తేరు సుమంతుఁడా
[10-2

**రొమ్మునఁ గుంపటి**
మగివాఁడు చెనకఁగా మాటలాడ
కుండితేను
ముగుదా అది రొమ్మునఁ గుంపటేగాక
[18-393

**రొమ్ముపసులు**
కరిముల పల్లవ కంఠపాశములు
గురుకుచంబులు కాముకుల రొమ్ముపసులు
[వ. యో. వి. 4-198

**రొయ్యకొవ్వు**
వొల్లనె సంసారములో నూరకెగర్వించేవు
చెల్లఁబో రొయ్య కొవ్వేలె జీవుఁడా
[16-1-14

## రో

**రోఁకటిపాటు**
రొక్కమైన నా పొందులు
రోఁకటఁబాడిరిగా
[16-2-33

**రోఁకలివంటి వాఁడు**
రోఁకలివంటివాఁడ రోటిలోనిపోటుకు
యేఁకట నన్నేటువలె నేలితివి దైవమా
[10-23

**రోఁతల వీడుబట్టు**
తలఁపుల రోఁత రోఁతల వీడుబట్టు
పొలుపొందు నిజభోగముల వీడికోలు
[వ. యో. వి. 2-1041

## ఱ

**ఱట్టడి**
ఱట్టడివి నిన్నాపె యాఱికి సేయ నోపునా
వట్టిన వ్రతముతోడి బలిమేకాక
[14-146

**ఱట్టడిది**
చెంతల నీ చెక్కునొక్కి సేవలు నేఁ
జేయఁబోతే
ఏంత ఱట్టడిదియని యెట్టుండునో
[13-14

**ఱట్టు**
నెట్టిన మూఁడు గన్నుల నిలిచిన చక్రమా
ఱట్టుగా మన్నించవే మెఱయుచు చక్రమా
[8-282

**ఱట్టుకెక్కు**
ఱట్టుకెక్కె దాసుల మరవక రక్షించే నీవు
గుట్టుతో మమ్ము వహించుకొనకుండేవా
[8-269

**ఱట్టుపెట్టు**
జాతినాతిఁజేసి వాని
ఱట్టు పెట్టువానిచేత
[శ్రీ. 8

## ఱె

**ఱెట్టించు**
చెప్పకచెప్పిన చెలి విన్నపములు
చెప్పల తుదలనె ఱెట్టించె
[17-100

లచ్చిగొండి
లచ్చిగొండి నీ వంటి నెలతనా నేను యింత
పెచ్చుపెరిగే వదేమె పిన్నదానవా
[4-105

లచ్చెనవెట్టు
చక్కని నీ దేహమంటి సారెసారె నెవ్వతో
అక్కడ రేకలు నించె నది యెవ్వతో
గక్కన వేరొకతెకుఁ గాఁగిలి
నీ వియ్యకుండా
లెక్కన లచ్చెనవెట్టే లీలసుమ్మీ విభుఁడు
[15-735

జాతిగా మాతోడుతను పరసమాడకు మని
చేతుల నెవ్వతైనా లచ్చెన వెట్టెనో
[16-232

లజ్జబండ
పాలుమాలిచి లజ్జబండనిజేసి
గేలిఁ బెట్టుచుఁ గేరికేరి నవ్వుచును
[అ. మ. క. 5290

లప్ప
ఇప్పుడే యేల పెనఁగే వీకెతో నీవు
లప్పల కప్రమిచ్చి యలపుదీర్చవయ్యా
[13-143

లప్పలుకట్టు
గందానఁబూసిన పూఁతకడిగి లప్పలుకట్టి
యిందుముఖిలమేల్మంగ కింపులాయను
[13-144

లయకాఁడు
ప్రియముతో మంచమెక్కి పిలువని
పేరంటము
లయకాఁడుగదవే తొలఁగు బావఁగారు
[17-355

లక్షోపలక్ష
చేతులివియు రెండే చేష్టలు లక్షోపలక్ష
యీతల హరిఁ బూజించ నిచ్చలేదు
[7-227

## లా

లాగుల బంధుఁడు
బాలుఁడై ముద్దుచూపు ప్రాణమై
లోననుండు
యీలాగుల బంధుఁడీతదే పో విష్ణుఁడు
[7-183

లాచి
లలిఁగొప్పె గొప్పెగాని లాచి మోము
చిన్నఁబోయె
బలిమి చూపఁగ నీతోఁ బంతగ త్తెనా
[17-118

లాచు
చేచేత శ్రీవెంకటేశ చెలి యలమేల్మంగ
లాచినట్లనెమించె లావణ్యాలు
[14-264

లక్కవంటి మదితోడ లాచుకవుండిన నాతో
మక్కువలు చల్లిచల్లి మంతన మాడితివి
[17-109

లాడిఁబడు
పంచేంద్రియములనే బాడిగె మోఁచితిని
లంచపు సంసారమనే లాడిఁబడితి
[10-227

లాతు
లాతుగాఁ బవారు వేసి లాయాలు నీ నరెల్లా
యీతల నింకాఁగూర్చు మేమగాను సతుల
[13-95

లాయపు పౌఁజు
యీయెడ శ్రీవెంకటేశ యిటు నన్నుఁ
గూడితివి
లాయపుటింతుల పౌఁజులనుఁ
గూర్చవయ్య [14-276

లాయు
లాసిన శ్రీవెంకటేశు లాగులెల్లఁ గనుగొని
యీనడమదీర వురమెక్కనైతివా
[15-32

లావరి
ఇంకాఁ జదువవయ్య యిటువంటివి
లంకెలాయ నీ విద్య లావరివినైతివి
[14-275

కలసి నే నుండఁగానె కమ్మి రతికిఁదీసేవు
లలి శ్రీవెంకటేశుఁడ లావరివోయి
[15-225

లావుదిగు
ఈవల నావల నేచేటి యానల
లావుదిగుటె పో లాభము [11-3-68

లాసి
చేసేనంటేఁ గలవు నేనానేనవనులు
లాసి తగిలించుకొంటే లంపటాలంటు
[11-186

లీ

లీలారవిందము
నీవు మన్నించేటి యట్టి నెలఁతలకెల్లాను
తావుల లీలారవిందమవె కావా
[15-201

లూ

లూటిబెట్టు
లోకములోపల లూటిబెట్టు-ఇది
కైకొని హరి యెరఁగవుగా నీవు
[11-2-22

లూటిసేయు
రమణఁ గంసాది యసురలు లూటి
సేయఁగాఁగా
తమిఁ గృష్ణావతార మిందరి కైతివి
[6-160

దక్కె నీకుఁ జాలదా తగు రుకుమిణి నీవు
వెక్కసాన లూటిసేసి వేసుకొన్నది
[15-25

లె

లెంకతనము
పక్కము నేఁ జొచ్చినది నీ లెంకతనము
చక్క నా జీవనము నీ శరణాగతి
[10-113

లెక్కపొక్కలు
బొక్కస భండారములు వాని లెక్క
పొక్కలు మఱియు మున్నుగ నగరికిని
[వ. యో. వి. 3-1074

లెక్కలేని యప్పు
చిక్కువడ్డపనికిఁ జేసినదే చేఁత
లెక్కలేని యప్పునకు లేమే కలిమి
[6-63

లెక్కలేని వరములు
లెక్కలేని వరములు లీలతో మా కిచ్చితివి
యిక్కడ నేపొద్దు మాయింట నుండవయ్య
[10-46

లే

లేఁత
లేఁ బన్నీటికిని లేఁతా చెలిచెమట
లోలిఁ బూఁబానుపున నుడికెఁ గాక
[4-7

లేఁత నవ్వు
ఎంత వలచితివయ్యా యింతికి
చెంతనుండే లేఁతనవ్వే నేసపాలుగావా
[7-56

లేసుపెదవులు
ఆసపడ్డ సతితో మాటాడితే దోసముగాదు
లేసుపెదవులు గదలించవయ్యా
[18-309

# లో

**లోఁగొను**

నా తప్పు లోఁగొనవే నన్నుఁ గావవే దేవ
చేఁతలిన్నిఁజేసె నిన్నుఁజేరి శరణంటిని
[5-252

ఎదురుమాటలాడితి నీకు యీ తప్పులు లోఁగొను నీవు
పదరఁగఁదగదు నీకు పంతములిచ్చితిఁ గావఁగదే
[7-65

దండముపెట్టుట నాది తప్పు లోఁగొనుట నీది
నిండి నీవెప్పుడు దయానిధివిగాన
[7-199

రామా దయాపరసీమా అయోధ్యపుర
ధామా మావంటివారి తప్పులు లోఁగొనవే
[8-94

**లోఁచు**

యేమి శ్రీవేంకటేశుఁడిక నేల లోఁచీనె
చెలఁగి తనబాసలు చెల్లించేఁగాక
[

పూఁచిన యెఱపుల బొమ్మముడిజుంకెనల
లోఁచకువే మనసు చిల్లులువోయీని
[4-8

వాలుకరెప్పలు నీపైవంచి నేనెంతలోఁచినా
తాలిమె చూపుదుగాక తత్తరించేవా
[17-45

**లోకదిమ్మరి**

తిరుపద్ధ పెనులోకదిమ్మరివి నీకు నేను
అరితేరి నేఁడు నీకు నానెక్కైతిరా
[13-10

**లోకబండడు**

యోనిగంతుడనై పుట్టి యోనికి మగ్నుండనైతి
పూని లోకబండడనే బుద్దెరిగినా
[2-19

**లోకశరీరి**

మొందులేని యట్టివుండు నెంచిచూచితే దేవుఁడు
చెంది లోకశరీరియై చెలరేఁగీని
[7-110

**లోకాలకు పొడవు**

పొలించి లోకాలకెల్ల పొడవైన దేవుఁడవు
బాలుఁడవై రేపల్లెలోఁ బారాడనేలయ్యా
[8-90

**లోకలోడిమాట**

లోకలోడిమాటగాదు లోను వెలి నొక్కటె
ఆకె నీడకె తేవయ్య నవ్వుఁగాము లెంచను
[17-68

**లోచూపు వెలిచూపు**

లోకమంతా నిండె లోచూపు వెలిచూపు
శ్రీకాంతుఁడై తోఁచె చిక్కినవి యేలా
[10-228

**లోన**

చేచేత పేఁడుకొమ్మని చెక్క వాకు నొక్కుమని
యే చదువులోనుండెనో యీ వోజలు
[13-33

**లోనా వెలిని**

లోకపరిపూర్ణుఁడవై లోనా వెలి నుండఁగాను
చేకొని పూవులఁ బండ్లు జిదిమితని
[5-252

లోనిల్లు
లోనై నీకు నుండఁగాను లోనింటికిఁ బిలిచేవు
[14-220

లోనుచూచు
సోహంను వెలిఁజూచే చూపులోను చూచుచే
ఆహా దేవకఁఁదనందే తాఁగనుట
[10-68

లోనునుచు
వెలిఁ బోచిన బుద్ధి వేగమె లోనునిచి
చలిమున చంచలముడిగియుంచుటే సమాధిలక్షణము
[10-90

లోమొనపు
ముత్తెపుఁజిప్పల నీరు మున్నిటివలె నుండునా
ముత్తెములై బలిసి లోమొనపుఁగాక
[6-139

లోవారు
ఆతఁడు నీవు నొక్కటైతే నౌదురుగాక
యేటన మమ్మంటకు నేమెవ్వరిలోవారము
[13-22

లోవెలుతులు
లోవెలుతులన్నియును లోఁగొన్నయందాఁక
వేవేగ బంధములు వీడునందాఁకా
[5-152

## వ

వంకగాలము
కుత్తికె మరు శంఖము కురులు వంకగాలాలు
కొత్త నీకు నాకుఁ బొందుగూడునటవే
[15-81

వంకదిద్దు
మలయుచు పసిఁడి బిమ్మన గ్రోవివట్టి
వలకేల గణికలో వంక దిద్దును
[శృ. శ. 302

వంకలుదిద్దు
తలఁగాకిటి తఁచితివేని
గలయంగ నేటి వంకలు దిద్దఁగలవు
[అ. మ. శ. 2396

వంకలొత్తు
కడఁ నడుమంత్రాన గతిఁ బ్రవదచిన
నెలకొని వంకలొత్త నీవే నేరుతువు
[8-18

నమపుల వంకలొత్త నడమ నేమున్నారము
చినికేవు తరితీపు చెల్లు నీకు నింకను
[14-27

వంక వంక తెరువులు
కింకపు కిసరుచేత కిడైన దేహము
వంక వంక తెరువుల వడి నేసి
[5-208

వంగి మొక్కు
బడిగొన్న ఆపెగోడి జగడపువేళ నిన్ను
వడి నా కాలు దాఁకినా వంగి మొక్కనైతిని
[18-42

వంగులిచ్చు
రంగగు శ్రీవెంకటాద్రిరాముని దేవికిచ్చితి
వంగులియ్యక మొక్కంత హనుమంత
[7-15

వంచు
వెలయ శ్రీవెంకటేశ వేమారు నన్నుఁ గూడితి
వలపుబడి యెంత వంచితివో అయ్య
[13-31

మంచివాఁడె నా విభుఁడు మగువలాల
వంచుకోవలసి తానె వలపించెఁగాక
[14-225

వంచుకొను
కలసితే నీవితని గద్దించే వెవ్వతవే
వలసినప్పుడు నీవూ వంచుకోరాదా
[14-199

వండఁదరగు
కొండలంతలై కుప్పలు వడియెను
వండఁదరగు రావణుతలలయి (లు?)
[10-17

వండవండనట్లు
అండనే శ్రీవెంకటేశుఁ డంతర్యామైవుండి
వండవండనట్లుగ(?) వన్నెకెక్కించినది
[7-256

వంతఁబడు
వట్టియాసఁ బొరలేది వంతఁబడి తిరిగేది
యెట్టు వేగించఁగవచ్చునేమందము స్వా
[10-247

వంతుకుఁజెప్పు
చింతించి చింతించి శ్రీవెంకటేశ్వరు
వంతుకుఁజెప్పిన హరివాక్యమే యెక్కుడు
[10-188

వంతులు వాసులు
ఇంతి జవ్వన వనాన నిన్నియునెలకొనెను
వంతుల వాసులతోడ వలరాజ పౌఁజులు
[7-52

వంతువాఁడు
బలువైన నీ వరమపదము గోరేనంటే
వలనైన నీ తోడి వంతువాఁడనా
[7-102

వంతు వాసి
అంతటనెవ్వికాచు నా పన్నంధుఁడు హరి
వంతుకు వాసికి నతనివాఁడనంటేఁజాలు
[10-201

వంపెట్టు
ధరణి వంపెట్టఁ బ్రతిధ్వనులు మిన్నులు
ముట్ట
పిరవెత్తె నలి నరసింహ దేవుఁడు
[6-228

వంబు
వసంతకాలము దప్పివంబుగావఁగానేమి
కసిగాఁపై యెలయించి కలయఁగానేమి
[15-66

బింబాధరుఁడాతఁడు పికవాణివినేను
యింబడర నిద్దరికి నేఁటిపొందు లేదే
వంబులేక అందుకెపో వైపుగ మాధ
వుఁడనే
పంబిన పేరు ధరించెఁ బక్కన నీవిభుఁడు
[15-281

వకవకలగు
వకవకలై యింత వ్రతము దక్కినను
సుకము దక్కక పోమెః జూచితేయనుచు
[వ. యో. వి. 4-829

వక్కణించు
నిక్కి యెవ్వరిని బేర్కొని పిలిచిన
నీ నామములై తోఁచీని
వక్కణించఁగా సకలశబ్దములు వాచ్యుఁడ
వటుగాన [10-103

మొక్కలపుఁజేతలేల మొగమోట
మదియేల
వక్కణించి నీవేమన్నా వద్దనేనా నేను
[17-454

వగరించు
అంసి తమవారితో నవి యెల్లాఁజెప్పు
కొంటా
దరినుండె వగరించి తమకింపుచుండును
[8-227

వచ్చినట్టె వచ్చు
మచ్చరము లేకున్నను మనసే రామ
రాజ్యము
వచ్చినట్టె వచ్చితేను వ.పే చవి
[7-128

వజ్జంబో వారంబో
వజ్జంబో వారంబో వారి పొజంబో
వెజ్జుఁజూపంచరు వేల్పులకిను
[వ. యో వి. 3-232

వజ్రపంజరాలు
అంచసితని కైదువులమరిన హస్తములు
పంచల మాకిట్టే వజ్ర పంజరాలవుఁగాక
[6-101

వట్టఁగట్లు
ధృతిహీనులకు నెల్లదిక్కయి కాతువుగాక
వ్రతము చెల్లిన నింక వట్టఁగట్లా
[5-183

వట్టిజోలి
చెంప నీతో సిగ్గువడి చేరువ నిలుచున్నది
యెందాఁకా వట్టిజోలి యిఁక నాతివయ్యా
[14-29

వట్టివావులు సేయు
వారు వీరనుచు వట్టివావులు సేసుకలేని
పేరు పెట్టుకొని లోలోఁ బిరువీకులయ్యేము
[11-3-7

వట్టువోవు
గుట్టునజడియరు కొంకుచు మెరయరు
వట్టువోరు తమ వంపులకు [15-214

వడఁగు
దగ్గరి రాదంటాను తరుణినేఁటిద్దేవు
సిగ్గులు వడఁగవద్దా చిన్నదానికి
[13-91

వడచల్లు చూపుకాఁడు
కడుముత్యపుఁబేరులె కట్టఁబడ్డె మెడనిండ
వడచల్లుచూపుకాఁడ వచ్చేవా రావా
[4-106

వడచల్లుమేను
వడచల్లుమేనితో వసివాడుఁజూపుల
నిడువాలుఁ గను సొంపు నీకే తెలుసును
[4-164

వడదాఁకు
గడనకొలకుఁజిక్కి కాముకవిద్యలఁజిక్కి
నిడివినేమైనాఁగను నిక్కినిక్కి
ఒడలి గుణముతోడ నుడుటు విద్యలఁజాల
వడదాఁకి బడలనివాఁడువో వైష్ణవుఁడు
[5-59

సూరిజల్లోకవంక చొరసిచోట్లుచొచ్చి
వారబియ్యమెత్తి యెత్తివడదాఁకి
[6-70

వడదీరు
దోసాలగావుగద మాతోటిపొందులివి శ్రీవి
వాసుఁడా మా చేఁతలను వడదీరునా
[12-264

వడదేర్చు
పొదకట్టి తన కరంబుల మేనునిమిరి
వడదేర్చి లాలించి వరదుఁడై పలికె
[వ. యో. వి. 2-922

వడఁబడు
ముదివడి యింద్రియముల కింకరుఁడై
వడఁబడనిదెపో వైష్ణవము [5-230

వడఁబడి పరులిండ్ల వాకిలిగాచే నేను
వడినాలో హరియున్న వాకిలి గాచేను
[7-206

నడుమ రెంటికిని నా మేను
వడఁబడె యెందలి వాడనో నేను
[9-53

వడవడ వడకు
వడవడ వడఁకుచు వాతెఱ మిగులఁ
దడుపుచు మాటలు దడఁబాటు గొనఁగ
[వ. యో. వి. 4-1309

వడినెక్కు
వలరాజు తూపునంజు వడినెక్కె మనసు
మలసి రతిసుఖాల మరపాయ మనసు
[11-40

వడిఁబెట్టు
నీ మాట మీరేనా నీవే నేఁగానా
వాములాయవలపులు వడిఁబెట్టకింకను
[18-19

వడియఁగట్టు
యీడనె శ్రీవెంకటేశ యెనసితి మిద్దరము
వాడిక వలపులింక వడియఁగట్టుదునా
[14-281

వడియు
వనిత చెక్కులవెంట వడిసే జవ్వాదినే
మినుకై నీ మేనెల్లా మెఱుఁగాయను
[13-132

వడుగు
నంగడి కూచున్నాఁడు చనవెల్లా నిచ్చినాడు
యెంగిలెమో వడిగివి యేమిందునే
[17-232

వడ్డికిఁబారు
వనితల తలపులు వడ్డికిఁబారీ నీమీఁద
యెనయుమెక్కుడనైనా యేడుగాను నతుల
[13-95

వలచిన వలపులు వడ్డికిఁబారీ
తలుపు తెరవవే తరుణి యిఁక
[15-276

వడ్డిరెచ్చుకొను
వలనైన చిరునవ్వు వడ్డిరెచ్చుకొనేవచే
వెలయ నీవెంత నవ్వించివా నగవు
[18-361

వత్తికి నూనెఁగొలదై
హత్తిన పుణ్యము బాపము నప్పటి
సుఖములకొఅకే
వత్తికి నూనెకుఁ గొలదై వడిఁజనె
దివసములు
[5-118

వత్తిలోపలి నూనె
వత్తిలోపలి నూనెవంటిది జీవనము
విత్తు మీఁదటిపొల్లు విధము దేహంబు
[11-3-116

వత్తివలె పైఁబడు
బత్తినాకుఁ గలనంటాఁ బాయవు నీ వాపెకు
హత్తిన చెలిచేఁజెప్పె యంపవామాఁటా
వత్తివలెఁ బైఁబడేవు వద్దివనవు పేసుక
ఉత్తరమీరా యిందుకూరకుండేఁగాని
[17-379

వదనముచేర్చు
యెదుటను శ్రీ వెంకటేశ్వరు నామము
వదనము చేర్చుట వైష్ణవము

వదరుఁదనము
చదురులాడి యాఁటఁడు సారెకు నేరుతు
నంటా
వదరుఁదనములనె వాదించెనే
[14-260

వదరు మాటలు
• అదనఁ బార్వతీదేవి కతఁడే నీ మంత్ర
మిచ్చె
వదరు మాటల మాయా వచనా లేమిటికి
[9-204

వన్నెకుఁదెచ్చు
అన్నిటా శ్రీ వెంకటేశ అలమేల్
మంగను నేను
వన్నెకుఁదెచ్చుకోమాట వహికెక్కినపుడు
[14-93

వన్నెచెడు
ఆసలవియెడితాళ్ల నంటఁగట్టుక విధికి
నప్పగించితివిగదె కర్మమా
వాని విడిచితిమి నీ వారమైతిమి మమ్ము
వన్నెచెడనీకు వో కర్మమా
[5-187

వయ్యాళి
నీటున వయ్యాళివోయి నీవురాగా నదెచెలి
కోటకొమ్మనొరగుండి గొబ్బునఁజూచీ
[15-277

సతికి నీ మెద రతిసాముసేసే కంబము
ప్రతిలేని వయ్యాళి బయలు నీవు
[15-299

వయ్యాళి పొలము
మంచిగురుతైన రావిమాని చేనిపొలము
వంచిన గుజ్జుముఁదోలే వయ్యాళి పొలము
[10-52

వరతఁగలపు చింతపండు
వారిఁగేశవు నొల్లనిబదుకులు
వరతఁగలపు చింతపండు
గోవిందునికతలు మొక్కని మొక్కులు
గోడలేవి పెనుచిత్రములు
[7–1

వరతఁగొట్టు
కడుఁ గోవపుభూతము కాయమెల్లా
మఱపించె
వడిన జ్ఞానపుచేరు వరతఁగొట్టె
[8–64

వరతఁబోవు
వరతఁబోవుట్టి వడిసంసారవు
తెరఁదగిలి ఈఁదుగునాఁడు
[11–2–49

వరతవచ్చు
వాటమై వరదవచ్చె వనితకోరికలు
యీటువెట్టుకొన నేము యెవ్వరిఁబోలుదుము
[14–121

వరతిపాలు
విరతి రామునిచేత నిమిషములోననే
వరములన్నియు నెందో వరతిపాలాయ
[9–75

వరములకొటారగు
వరములు కొటారుగా వక్కణించి
పెంచేకొండ
వరగు లక్ష్మీకాంతు సోదనపుఁగొండ
[9–182

వరుసల్లవద్ది
పొరుగాపెపై వలపు పూసేవు నామీఁద
వరుసలవద్ది కాపె వచ్చుదాఁకాను
[7–57

వలగొనఁదిరుగు
వలగొనఁ దిరుగుచు వాలము వినరుచు
నిలిచి గుఱ్ఱమటు నేర్పులు చూపఁగ
[6–93

వలగొను
సులభానఁగలరు సొరిది దేవతలు
వలగొను పాపము వారించలేరు
[10–215

వలప
యీకడ శ్రీవెంకటేశ యేకమైతి మిద్దరము
నాకు దోసములేదని వలపలీవయ్యా
[

వలపుఁదేనె
వలెనను వారిదే వైష్ణవము ఇది
వలపుఁదేనె వో వైష్ణవము
[5–230

వలపుపూయు
పొరుగాపెపై వలపుపూసేవు నామీఁద
వరుసలవద్ది కాపె వచ్చుదాఁకాను
[7–57

వలఁబెట్టు
వాసుల సంసారమున వలఁబెట్టీ నీమాయ
గాసిఁబడి యిఁకనెట్టు గడచే నీమాయ
[10–67

తొడరిన హృదయమే తోడిదొంగయై
వడిగొని తన్ను వలబెట్టగాను
[11–3–96

ఆసచూపి నీవు నాకు నప్పటి సన్నసేసేవు
వాపితోనుండిన వారి వలఁబెట్టవలెనా
[17–587

యీడ నీకుఁ జెవిలోన నేకాంతము
చెప్పితిమి
వాడు మోవి చవిగొని వలఁబెట్టేవూ
[18–398

వలయపుఁగత్తి
వలమురి నెఱనాఁడి వలయపుగత్తి
బలసి చూపట్టెడు పాణి యుగ్మమును
[వ. యో. వి. 2–901

వలలఁబెట్టు
వలచిన వారినింత వలలఁ బెట్టగఁబోతే
అలరి యెంతపకీర్తి యనరా లోకులు
[17-481

వలవనిజోలి
వలవనిజోలే యింతాను వడినిదిగాక
యేమిచేసినను
సులభమిందునే తొల్లిటి వారలు
చూరలు గానిరదే మోక్షంబు
[8-101

వలనగంపలమోపు
వలప గంపల మోపువలె లంపటము
మోఁచి
తలఁకుచుఁ బారలేక దాఁగినయట్లు
[5-137

వలసినొల్లములు
అద్దమరాతిరిదాఁకా నందునిందు
నుండివచ్చి
వద్దువోరా నీకువింత వలసినొల్లములు
[12-1

వలిపిరిగాలి
వలిపిరిగాలితో వలి మీటిమీటి
బలువిడి వానయంపాజాలమైన
[వ. యో. వి. 4-609

వలెనను
తలఁచినచోటను తానే వున్నాఁడు
వలెననువారి కైవసమెపుడు [8-141

వలెవలెనను
బలిమి నిన్నుఁబట్టగ పావట చెవరెఁగాక
వలెవలెనవి నీతో వాదులకు వచ్చెనా
[17-316

వల్ల
ఇంక నెంతగాఁగలదో యింతివల్లనీకు
[14-203

వల్లడివలపుకాఁడు
చాల్లెపుఁ జుల్లే నీకుఁ జుట్టఁబెట్టె నింతవడి
వల్లడి వలపుకాఁడ వచ్చేవో రావో
[4-106

వల్లెగావేసుకొను
చల్లని వసలనీత పాగుతఁ గొండలోన
వల్లెగా వేసుకొన్న వాలముతోడ
[8-144

వల్లెతాడు
చల్లలమ్మ నేరిచిన జాణ గొల్లెతలకెల్ల
వల్లెతాడు మా చిన్న వానుదేవుఁడు
[17-343

వల్లెతాళ్లు
తెంచఁగరాని వల్లెతాళ్ల తెలివిపడని
లేఁత నవ్వులు
మంచితనములోని నొవ్వులు మాటలలోని
మాటలు
[5-1

అల్లంతనుండి తన కందరాని తెంకాయలు
వల్లెతాళ్లవేసి వంచీనమ్మా
[10-161

వల్లెవాట్లు
వల్లెవాట్లతోడ వడిఁ బెద్దకన్నుల
చల్లఁజూపులబోయ జవరాలు
[4-118

వల్లెవేయు
వల్లెవేసి కోడెలను వంచుకొనేయట్టి నీకు
చెల్లనెంత నీవు చేఁతచేసినా మమ్మ
[13-92

నారలు నాలివాలిచి నమ్మికలఁదాదు వేఁడి
ఘోరచని వల్లెవేసే పొట్టివాఁడవు
[13-93

బాలకృష్ణ బోయిఁడా వనుల వల్లెవేయరా
వాలుఁజూపుల మమ్మేల వల్లెవేసెవు
[17-346

వసంతమాడు
నిక్కి దేవుళ్లు ముత్యాలు నీపై
వసంతమాడఁగా
చుక్కలలో చంద్రుఁడవై చూపట్టితివి
[3-169

పసయగు

పసగాని పెక్కు దేవతలఁ గొలుచుకంటె
సుసరాన హరివారై సుఖియించరో
[9-279

పెనఁగర్మ మొకవంక విజ్ఞాన మొకవంక
పసగావు రెంటి బలవంతములను
[9-281

యెత్తుకొన్న వేఁకమై యెవ్వరికి పసగాఁడు
హత్తిచూత వెరతు మీ యారడి బాలునికి
[10-237

పసిదప్పు

వావాత నీవనెటి పసిదప్పి కైకొంటి
భూవిభుఁడు నీ వనెటి పురుషార్థము
[10-200

పసులమూఁక

పసులమూఁక మోవఁగఁ బసవేయఁగ
పసముగాని దెటువలె నౌనో
[5-122

పళకాడు

శ్రీవెంకటేశుఁడే చిత్తగించి నన్నేలెఁగా
వావాత నింద్రియాలు పళకాడినా
[9-128

పళకు

పైకొని శ్రీవెంకటేశు బంటుకు పళకులేదు
నైజమైన హరిభక్తి సహజమింతే
[7-54

పళకులాడు

ఏఁటి మాటలాడేవే యెందాఁకా నీవు వోరి
వాఁటముగ యిట్టే పట్టి పళకులాడకురా
[13-230

పళకువేయు

కొందరు నరకమందు కొంత పళకువేసేరు
కొందరు స్వర్గము వారు కొంత పళకు వేసేరు
[9-41

పళచుకొను

పలుమారు వచ్చేఁదానే పనిలేనివరాకు
పళచుకొన్నది తానే పట్టిభీతి
[8-225

పళావళి

ఎంత చనివిచ్చితివి యీపెకు నీవు
పంతులకు పట్టిపళావళ్ల వేసేనిపుడు
[13-174

పళుకు

పళుకు కోవనివాడు వచ్చి పూఁటపడవేల
పొలిసినంత తపంత మందరాదా
[16-1-30

పళుకువేయు

పట్టిభక్తి నీ మీఁద పళుకువేసి నిన్ను
బట్టితెచ్చి మతిలోనఁ బెట్టుకొంటిని
[8-49

యింత ప్రీతో నవ్వేటి యింతి నీ కొకతె యేది
పంతగా నీపై పళుకువేయఁగాక
[17-368

## పా

పాండ్లెక్కు

పాపి నీపై మచ్చరము పండ్లఁ బెట్టుకుండితేను
మోవావ పాండ్లెక్కి నీ మోవిమీఁద నిండెను [14-221

పాఁకసేయు

యెంతపడైనాఁగూడే వేమినేరుచుకొంటివి
పంతవంటి సిగ్గేటికి పాఁకపేసేవు
[14-81

వాఁటమగు
తలఁచినతలఁపులు దైవారి లోలోన
వలచిన వలపులు వాఁటమాయను
[18-329

వాఁటము
ఏటిదో నీచి త్తము నే మెఱుఁగమయ్య
వాటమైన వెల్లవిరి వారమయ్యా
[14-154

మాఁటలు దేలించ నేర్చుమగువా
నీకు నిప్పుడు
యేఁటికె నా విభునితో నేకాంతము
వాఁటమై నా పతి వొందువద్దన్నా మానవు
గాఁటాన నీ కింతయేలె గామిడితనాలు
[16-3

వాఁటమైన వలపులే వానిరేఁచెఁగాక నన్ను
వేఁటపెట్టి నిన్నునింత వేసరింతునా
[17-460

వాఁటాలు సేయు
పాయక కూడె నితఁడు పంతముగొనుచే
మేలు
వాయఁబోతే కొనగోరు వాఁటాలు సేసేని
[14-137

వాఁడిమీదవాఁడి
చెలువుఁడు వీఁడె చేకొను నేఁడె
వలరాజు తూపులివి వాఁడిమీఁదవాఁడి
[15-16

వాకట్టు
కదుమక వచ్చేటి బలురోగపుఁ
గుక్కలు నుసిగొలిపి
వదలక మురిసిన మురిమే వాకట్టుగఁగట్టి
[5-201

బూ(పూ?)తకిఁ జంపినవాఁడే బూతకి
వాకట్టురత్ష
పాతాళానఁ గూర్మమైన పతిగుంత దోషరక్ష
[10-54

వాకట్టుకట్టుకొను
వడినెవ్వతో నిన్ను వాకట్టుగట్టుక యింత
ముడిపెట్టివిడిచి తా మొప్పెఁజేసెఁగాక
[17-563

వాకము
యాఁకట శ్రీవెంకటేశ అలమేల్మంగను
వేసు
వాకముగాఁగూడితివి వడి నిదేనేర్పు
[18-133

వాకిటగొల్ల
వామనమూర్తికి వాకిటగొల్లను
సోమార్కనేత్రుని సొరిది లెంకను
[5-271

వాకిట తంగెటిజున్ను
వన్నెల మాటల వాకిటి తంగెటి
జున్నుకు వడగాలి సోఁకినది
[12-353

వాకుచ్చి ఆడు
నాకుఁగా వేరొకరు విన్నవము సేసేరా నీకు
వాకుచ్చి నేనే ఆడవలెఁగాక
[8-167

వాకుచ్చు
కైకొన్నకొలది కర్మము వాకుచ్చి
తనతోనే వగవగనేలా
[10-220

పైకొని యే పొద్దు నే పానుపుపై
నుండఁగాను
వాకుచ్చి పేరునాఁ బిలవకుమీ నీవు
[13-211

వాకుచ్చి నీతో నేమ పక్కఁణగా
మాటాడఁగా
నీకు దేవులైనవారు నిన్నేమందురో
[18-302

వాకుఁదెరపులు
వాకుఁ దెరపులు వన్నెలు లోకాలఁ
గూకులు వత్తులు నో గోవిందా
[5-8

వాకుదోసము
యీ కడ శ్రీవెంకటేశ యేకమైతి మిద్దరము
వాకుదోసము లేదని వలపలీవయ్యా
[17-543

వాకుననాడు
వాకున నాడినయట్టి వట్టి వల్లదాలనెల్ల
దాకొని పొరయనంటె తప్పులేలేవు
[7-54

వాకునవెళ్లనాడుట
వాకున వెళ్ళనాడైనా వడిఁ
దీర్చుకొనేనంటే
యీ కడ నా మొగమోట మింతేపేసె
నెన్నును
[17-200

వాకునిష్ఠూరము
యేకతాన నాపెతోనె యేమన్నా
నందువుగానె
వాకునిష్ఠూరములేల వద్దువద్దు యీడను
[17-392

వాకునిష్ఠూరాలు
నీకె తెలుసు నాపెకు వీకంచేఁ దెలుసు
వాకు నిష్ఠూరాల మీలో వంతువెట్టేవారమా
[14-134

వాకులుపోకులు
యేగతాల సమకూడె నియ్యకోళ్లే మనకు
వాకుల పోకులుపోక వావిగూడెను
[14-32

వాకులేనివరము
రాకపోకలచేత రాగిన పెనుఁబండు
వాకులేనివరము వలవనితలపు
[11-3-5

వాకొలుపు
కాకిజున్ను జున్నులంటా గంపెఁడేసి
తినిపించి
వాకొలిపి బాలలెల్ల వాపోవఁగా
[6-167

వాతైవచ్చు
ఆకసపుఁ జంద్రునికి నానవడఁగానేమి
వాతైరాని పతికి వలవఁగానేమి
[15-66

వాగము
సోగల శ్రీవెంకటేశు సురతి సింగారము
వాగమై యమరెఁగాన వన్నెలెల్లనమరె
[15-90

వాగియ
వాగియ బిగువింతవవలి దాఁటించి
రాగేలు బిగియించి రవళిదేయనుచు
[వ. యో. వి. 2-674

వాగేలు
అన్నిటఁదేజి యీడఁగ దేవుఁడు
తిన్నఁగ వాగేలు దిప్పేవాడే
[6-93

వాచకపుమాటలు
అందమై వాచకపు మాటలాడేవు
సారె నాపె
పొందులం జదివించు నా పుస్తకములు
నిన్ను [3-65

వాచవిచవులు
వాచవిచవులు చూచె వంటశాల చోటేదో
ఆ చాయనేవుండు నాదిమూలము
[7-184

వాటుఁబరువు
వాటు బరువునవచ్చె వనిత వీకడకును
ఆఁటదాని యగ్గలిక అటు గూడవయ్యా
[18-379

వాడఁబారు
వొద్ద నీ కెపుడాతఁ డుండవలె నాతనికి
వద్దనఁగ రావనుచు వాడఁబారేవు
[12-202

వాడమగువల విందు
వోడఁ డెందరికినైనా పుత్తరువె చెప్పేని
వాడ మగువలవిందు వానికేమె
[16-2-31

**వాడిక**

యేడో వున్న శ్రీవెంకటేశుఁడే
యింటికివచ్చె
ఆడికో వాడికో అంగన నీకు
[14-1

**వాడికగు**

వేడుకకత్తెయైనది వెక్కసాన నవ్వఁగాక
వాడికైన యిల్లాలికి వరుసా యిది
[18-323

**వాడికచేయు**

యేడతపము నాకేడజపము నే
వాడికఁజేయఁగ నీకు వచ్చినదేమి
[6-74

**వాడికె**

వాడికె నొండొరులము వలచిన వలపులే
కోడి మెరుకలు సేసికొనవచ్చేరు
[14-14

**వాడుదేరు**

యేదో (?) బాయిటఁబారే యీఁగ
సయితమును
వాడుదేర నడపుల వాలివాలి
[9-179

వాడుదేరఁ బూజించవలెఁ గమ్మఁ
బువ్వులివె
పీడెమిడె కొలువుకు విచ్చేయవయ్యా
[9-195

వట్టి వెతలఁబడి వాడుదేరేము
ఎట్టు సేసినను జేయు మిందిరారమణా
[11-2-55

బలిమినేఁ జేయఁగాని వంతమాడి
విన్నవిట్టె
వలపించి నీమోము వాడుదేర్తును
[13-26

పేద దాఁచుకుండెనోయి విందాఁకాను
వాడుదేరె నీవు తనవద్ద నుండఁగాను
[17-91

**వాతరట్టు**

పెలుచఁగోవెల యన్నఁ బెంపుడుఁబేయ
కెలయు గీరంబు మిక్కిలి వాతరట్టు
[ప. యో. వి. 5-1386

**వాతులుమోయు**

వాతులు మోవఁగవలెనని వెదకిన
పూతల నిన్నియు భోగములే
[9-192

చేతులు చాఁచితివి చెలియపై నీ వప్పుడు
కాతరాలు రేఁచితి నా కాయములోన
యీతలఁ జెక్కునొక్కగా యియ్యకొంటి
నే నన్నియు
వాతులు మోవఁగఁబొంగె వాసులెల్ల
నాకుమ
[17-81

**వాదడచు**

వేడుక పదేముగాక వెంగెమాదేమానిన్ను
వాడలో నాపెతో నేము వాదడిచేమా
[13-18

**వాదడు**

వాదడుతుఁ జెలులతో పడి నీవు బొంకవని
నాదెస చూడకుండితే నమ్మకుండుదు
[18-37

**వాదడువు**

తీపులువుట్టించి యెవ్వరేమనినఁ దెలిపి
వాదడువ నేమిటికి
శ్రీపతిఁ గొలిచితి చేరె సంపదలు
జిగినతఁడే మా రక్షకుఁడు
[8-117

ఆపె నన్ననాడఁగా నే నాపెతో
వాదడువఁగ
యేపున వినేవు నీకు యేమిగూడెరా
[17-250

అక్కడ పూరకుందువా ఆనలు
పెట్టేవుగాక
యిక్కడ వాదడువ మాకెవ్వరు ఇంక
[17-503

వాదుదేర్చు
దేవరవిని వాదు దేర్పంగవలయు
నావుఁడు విని మౌని నాయకో త్తముఁడు
[వ. యో. వి. 8–149

వానగుంటలు
వడి పరసాన నాతో వానగుంటలాడఁగాను
బెడిదమై చెయివట్టి పెనఁగుదుము
[13–201

పైపై దొరలతోడి వంతాలకు నేమివని
ఆ వరాకై వానగుంట లాడుకొనేఁగాక
[13–247

వానచేతకములు
వాన చేతకములవలె నాయ మనసు
గోనెఁబట్టిన బింక గుణమాయ మనసు
[11–3–125

వానవదను
మత్తిలి శాంతమనే మంచి వాన వదనున
విత్తుదురు హరిభక్తి వివేకులు
[9–70

వాబిలిమి
ఏ బాసకియ్యకొనేవే యిప్పుడు నీవు
వాబిలిమిమాటల వాదుకోవఁగాని
[13–181

వాము (క్రి)
ఏమిచెప్పేది నీనేర్పు యెంతవాఁడవ
వామి వలపొక్క మాచె వారవట్టేవా
[13–91

వాములకొలఁది
అడుకులు చక్కిలాలు అనవాలు మురుగులు
వడవప్పు మొదలుగా వాములు కొలఁదులు
[10–27

వాములగు
వాములాయ నిరువదియొక వావులు
యేమని తెలిసెనో యీ దేహి
[5–244

వాములువెట్టు
వాదుల యీ సుద్దులెల్ల వాములువెట్టఁగాను
కాదని మన విభుఁడు గాదెలఁబోసీనా
[16–2–70

వాయకవాను
కాయజకేలికి కాలి సన్నగోర
వాయక వానేవు వగకాడ
[17–424

వాయఁబోవు
పాయక కూడె నితఁడు వంతముగొనుటే
మేలు
వాయఁబోతే కొనగోరు వాఁటాలు సేసేని
[14–137

వాయిదకాండ్రు
కరమర్థి వాయిదకాండ్ర ముంగలిని
బిరుదు కాళియల చేఁబెల్లు నాదింప
[వ. యో. వి. 7–1141

వాయిదము
వాయిదాలు వాయించేరు వాకిటికిరాఁబోలు
యీ యింతిఁజేపట్టినాఁ డింతలోనట
[17–403

వాయు
చేసినదెల్లా నేపై చెలి చేసినది చేఁత
వాసినవి కొనగోరి వాఁతలునివి
[14–53

వాయెత్తియేడ్చు
కోయిల జవరాలు క్రోల్చినరీతి
వాయెత్తి యా కీరవాణి యేడ్చుటయు
[వ. యో. వి. 3–363

వారకము
వారిధివంటిది యీవలపే కాదా
వారకము నీకు నాకు వలపే కాదా
[13–199

వారపట్టు
నీరువట్టుగొవి భూమి నీళ్లెల్లావారవట్టి
కేరికేరి నగవయ్య కృష్ణభట్లూ
[6–70

ఏమిచెప్పేది నీనేర్పు యెంతవాఁడవు
వామి వలపొక్కమాచే వారవట్టేవా
[13–91

వారబియ్యము
సూరిభల్లొకవంక చౌరనిచోట్ల చొచ్చి
వారబియ్య మెత్తియెత్తి వడఁదాకి
[6–70

వారముచేయు
వారము నేసేమనుచు వడినింటివారమెల్లా
ఊరలు పాశాలు దొంతిఁ గూడఁబెట్టితే
[6–165

వారము వజ్జమనక
వారము వజ్జమనక వాకిట నన్నునాఁడేవు
భోరచి మావారు నీకుఁ బోకవెట్టిరా
[16–2–38

వారలువట్టు
వలసినపాలు వారలు వట్టుచు
కులికి నవ్వీ గోవిందుఁడు
[8–142

భారపు వుట్ల పాలుఁ బెరుగులు
వారలు వట్టినవాఁడా వీఁడు
[10–289

కారేటిజున్నులు గడ్డపెరుగులు
వారలు వట్టేటి కైపులును
[14–51

వారవట్టు
అక్కలాల చూడుఁడందరును
నిక్కి వారవట్టీ నేఁడు గృష్ణుఁడు
[8–149

వారవట్టీఁ బాలువంచి గోవిందుఁడు
గోరగిరేరదే గొల్లెతలు
[8–162

కడఁగి శ్రీవెంకటేశ కలసితి వీఁకనేము
వడియని మోవితేనె వారవట్టు వారము
[14–131

వాలాయించు
ఏల నాతో బొంకవచ్చే వెఱఁగనాలొల్లి
వాలాయించి మాకు మంచివాడవే
యెప్పుడును
[13–33

మేలేమి కీదేమి మించిన రూపమె
వాలాయించి తెలిసినవానికి
[16–1–48

వాలుకరెప్పలు
వాలుక రెప్పలువంచి వడి నేఁ గొసరితివి
తాలిమిలేక పీపైఁ దమకించితి

వాలుఁగొప్పు
వంచిన శిరసుకు వాలుఁగొప్పే మాటు
[13–242

వాలుమగఁటిమి
ఆలికై విల్లువిటిచి వాలికై యమ్ము వేసిన
వాలు మగఁటిమిగలవాఁడా వీఁడు
[6–226

వాలు మిక్కిళ్లకు నిలుచుట
ఆలాగు వాఁడనేనని చిలుక జోదుల
వాలు తిరుమిక్కిళ్ళకు వడినిచ్చేవా
[13–181

వావాత
వావాత మీగురుఁడాడే వాక్యము
నీ యాధీనము
పావనమైన నీ పలుకెల్లా సత్యము
[8–147

వావాత శ్రీవెంకటాద్రి వరములిచ్చీఁ గనక
యేవల దాతలలోన నితఁడేదొడ్డ
[9–122

శ్రీవెంకటేశుఁడే చిత్తగించి నన్నేలెఁగా
వావాత వింద్రియాలు వశకాడినా
[9–128

శ్రీవల్లభుఁ డతఁడు సేసినట్లానవును
వావాత ననుభవించినవార మింతేసేము
[9–164

వావాత నింతటివాఁడు వరములీలేఁడా
వోవఁ గొలగానేదే వోటికింతేకాక (?)
[10–123

వావాత నీ వనెటి వసిదవ్వి కైకొంటి
భూవిభుఁడు నీ వనెటి పురుషార్థము
[10–200

శ్రీవెంకటేశు కృపచేత నింతేకాని
వావాత నివి గైవశములుగావు
[11–29

భావించి శ్రీవెంకటేశ పడఁతుల కెల్లాను
వావాత నమ్మితివిగా వయసులనీవు
[13–107

వావాతనూఁకొనుట
నీవే యెరుఁగుదువు నిన్నాతడు పిలువగ
వావాత నూఁకొనవు వద్దు చలమమ్మా
[17–176

వావాతిమాటలు
జీవునికిని దండెవేసినవాఁడవు నీవు
వావాతి మాటలే నీపై వన్నెవదాలు
[9–178

వావాదము
వట్టిస్వతంత్ర మిందులేదు వావాద
మిందులేదు
గుట్టుదెలియక లోలో గునిసేరు వీరివో
[8–243

వలుమంచి మాటలనె భ్రమఁబడ నోవ
నాకు
అలర నీతో వావాదమయినా మేలు
[19–333

వావాదు
నీ వేమిసేతువు నన్ను నీవు మోహించు
మంటివా
వావాదు నెంచేది నా వలసింతేకాక
[18–193

వావిగాదను
వలపించి పిమ్మట వావి గాదనుట
పొలుచునే నీయట్టి పురుషోత్తమునకు
[అ. మ. క. 2365

వావిరినిండానవ్వు
నీవెంత గోపగించి నేరుపుతోఁదిట్టినాను
వావిరినిండా నవ్వు వచ్చీనె నాకు
[17–573

వావివర్తన
అవల వారులఁ జెడనాడఁగు వినివిని
చేవమీరి యెవ్వరిని జెడనాడక
కోవిదు శ్రీవెంకటేశుఁ గొలిచి పెద్దలకృప
వావివర్తన గలవాఁడు వోవైష్ణవుఁడు
[5–59

తతితోడ వావివర్తన దలంచిన
వెలుపు దెలుపుదువుగా విషయబుద్ధి
[11–3–10

వావివర్తనలు
అన్నిటాదైవముఁ దమ్ము నందురు
నెరుఁగుదురు
యెన్నుక వావివర్తన లెరుఁగుదురు
[8–214

చుట్టపు సంబంధాలు జోలి వావివర్తనలు
దిట్టతనములెల్ల యీ దేహముతోడివే
[10–235

వావులెంచు
వడినెన్నైనాఁగలవు వావు లెంచి
చూచుకొంటే
గడియించే పదార్థాలు కలవెన్నైనా
[8–227

వాసికత్తె
మిక్కిలి వానికత్తెవు మించి
వోరుచునాతఁడు
వాకట్టైతిరిఁక నీపై నోలవేసీనా
[17-448

వాసికినెక్కించు
దానధర్మములకెల్లా దరిదాపుమీరె కాన
వాసికి నెక్కించరాదా వసుధఁగోమమ్మును
[8-267

వాసిదప్పు
చేసేటిసేఁతకు గురి శ్రీవిభుఁడేకాని
వాసిదప్పి హీనుల సేవలు సేయనోపము
[10-13

వాసిపట్లు
తనకై తే నవ్వులు తగ మాకై తే రేసులు
వనితలకెల్లా నివి వాసిపట్లుగాని
[18-251

వాసిరేఁచు
వున్నతి శ్రీవెంకటేశ వొద్దికై తి మిద్దరము
వన్నెకొనె వాసిరేఁచే వంతములేమిటికే
[15-234

చేరి నన్నుఁ బ్రమించి నా చిత్తము
చూడవలసి
వారివీరిఁ జూపి నాకు వాసిరేఁచేవు
[17-281

వాసివంతు
వాసివంతు విడిచినవాఁడే యోగి యీ
అసలెల్లా విడిచిన అతఁడేయోగి
[5-109

వాసివట్టము
వాసి వట్టముకొరకు వదలి దినములచేతఁ
బాసిపోయినవెనక వరమేడవరము
[11-2-25

వాసీవంతూ
చేసినట్టే నేసుఁగాక చింత మాకేలా
వాసీవంతూ నాతనిదే వట్టి జాలియెల్లా
[8-91

వాసును
ఏమిసేసినా నీ రుణమెట్టు వాసును
కామిత ఫలద వో కరుణానిధి
[5-300

వాసులుచూచు
వలచినదాన నేను మరి వాసులు
చూడఁగనేల యెదపున్
బిలిచినఁ బిల్వకుండిననుఁ బెంపున
గొల్వులు వేయుచుండినన్
[శృం. శ. 94

వాసులు నెరపు
వసముగానిసతితో వాసులేల నెరపేవే
కసుగాటువలపుల కాయవు నీవు
[13-103

వాసులేల నెరపేవు వచ్చివచ్చి నాముందర
నీ సుద్దులు మాకెల్ల నేఁడుగొత్తలా
[17-110

వాసులు వంతులు
వాసులు నెఱఁగము వంతులు నెఱఁగము
వేసటవుట్టని విధమే సుఖము
[17-231

వాసులును వంతులును వనితలవి
వేసరని వోరుపులు విభునివి
[18-458

## వ్రా

వ్రాలాకు
తాను వచ్చేననునో యీతరి నన్ను
నమ్మమనో
పూని తన వ్రాలాకు పుత్తెంచెనా
[15-54

వ్రాలువెట్టు
వసువడగా 'శివాత్పర తరంనాస్తి'
యని వ్రాలు వెట్టుండయనుచుఁ బెట్టింప
[ప. యో. వి. 8-1447

# వి

విందులకుడుపు
విందుల కుడుపులు విష్ణుకీర్తనము
చందపు వైకుంఠ సంభ్రమము
[9-275

విందులువెట్టు
విరివిగ నింద్రియ విషయభోగముల
విందులు వెట్టును యీతఁడు
వుడుగకఁ జిత్రపు రూపుల దేహపు
టుడుగరలిచ్చును యీతఁడు
[7-158

వికవికనవ్వు
పీదెపు నే మోవిచూపి వికవిక నవ్వేవు
[15-19

తాలిమితో నూరకున్నఁ దలవంచు
కొందువని
వేలు ముక్కుపై మోఁపి వికవికనవ్వేను
[17-395

విచుపట్టు
విడిచినఁ గడతెంచి వేవేఁగొల్లి
విడివట్టు నడునందు విచుపట్టువొచ్చి
[అ. మ. క. 498

విచ్చనవిడి
విడువరాని ధర్మవిదుల పురుషులను
విడిచి గోపికలు విచ్చనవిడి
[5-218

శ్రీపతి దిక్కయి కావఁగ మరియునుఁ
జేరవి సంపద లింకనేవి
చాపల బుద్ధుల నది నమ్మక విచ్చనవిడి
నోములు చెప్పుదురు
[8-117

అచ్చుటఁగవక దైత్యు డాహారపుమొగము
విచ్చనవిడిఁ జెలఁగు విజయ నారసింహా
[8-154

విచ్చనవిడినటు కౌరవు లెదుటను
విశ్వరూపు చూపినయపుడు
యిచ్చల నిను నమ్మఁగలేకేకా
యింద్రజాల మనిరి
[9-37

విచ్చనవిడినె యాడీవీఁడె కృష్ణుఁడు
వొచ్చములేనివాఁడు వుద్దగిరి కృష్ణుఁడు
[10-172

వేవేగ నాతఁడు నన్ను విచ్చనవిడిఁ
గూడెను
[17-353

విచ్చనవిళ్లు
కుచ్చి కాఁగిలించుకోఁగా కుచములు
నాటెవంటే
మచ్చుటాడే యింతులకు మొదలేవి
యిచ్చకుడ శ్రీవెంకటేశ నన్నుఁ గూడితివి
విచ్చనవిళ్లలోన విన్నపించనేది
[17-97

విచ్చనవిళ్లైన వేడుక చేఁతలు చవి
కొచ్చికొచ్చి కొసరేటి కూరిమి చవి
[18-475

విచ్చనవీడు
నిచ్చలు రతివేళల నేరుపు మరతురా
విచ్చనవీడైనచోట వేఁగుదురా
[18-110

విచ్చనవీళ్లు
ఇచ్చిన కాఁగిళ్లగురి యిద్దరి తమకములు
విచ్చనవీళ్ళకు గురి వింతరతులు
[14-64

విచ్చిచెప్పు
విచ్చి చెప్పఁగాని తనవింత చక్కఁ
దనమెల్ల
వచ్చి నా చూపులోనే వదరనేలె
[14-79

విచ్చిచెప్పె నిది నీకు వివరముగా నేఁడు
నెచ్చెలి నిన్నటికిని నేనే గురినుమ్మీ
[14-249

విజనగరము
వెలసి శ్రీవెంకటాద్రి విజనగరములోన
తలకొనెఁ బుణ్యపాదతలుఁడు వాఁడే
[6-219

నిరతి శ్రీవెంకటాద్రిని విజనగరములో
నరిది వరములిచ్చి నందరికి నితఁడా
[6-223

వీఁ డిగో నిలుచున్నాఁడు విజనగరములోన
పేఁడుకొన్న ప్రతాపానఁ పెద్ద
హనుమంతుఁడు
[9-230

విజయపట్టము
వేవేగమరలి రాఘవా వచ్చి
విజయపట్టమేలి రాఘవా
[16-1-1

విటతనము
చెలి నిన్ను బుజ్జగించి చెనకి నవ్వఁగాఁగా
యిలపై నీ విటతన మెన్నికకెక్కె
[15-167

విడిదల
యెదురుచూచితి నీకు నింతులచేఁ
జెప్పంపితి
వెదకితి నీ వుండేటి విడిదలను
[14-17

వదఁతి పయ్యదలోని పాలిండ్లు నీకు నిట్టె
విడిదలసేసె నిందు విచ్చేయవయ్య
[14-21

విడిదిండ్లు
వెలఁదుల కౌఁగిళ్లు విడిదిండ్లవంటివి
చలముల నీ రతులు పలిపేవేళ
[7-58

విడుగరయగు
పతిన మీ బాధలెల్ల ప్రజలాల యిప్పుడిట్టె
విడుగరాయె మీరు వెరపకుఁడిఁకను
[16-1-32

విడుజోడువాఁడు
విన్నవించేవాఁడనా విడుజోడువాఁడనా
అన్నిటా శరణు చొచ్చినట్టి జీవికి
[7-258

విడువముడువఁబట్టు
వేవేలు బంధములు విడువముడువఁబట్టె
దైవమా విన్నెట్టు తగిలేమయ్యా
[8-46

విడెమొక్కటుగు
అందపు శ్రీవెంకటేశ అలమేలు
మంగ వేమ
యింద విడెమొక్కటైతి మిఁకనేల అలుక
[13-210

విత
యితరులేమీ నెఱఁగ రిద్దరును నవ్వుకోఁగా
వితగాని మీ పనులు వెల్లవిరులాయను
[14-19

విత్తుమీఁదటి పొల్లు
వత్తిలోపలి నూనెవంటిదీ జీవనము
విత్తుమీఁదటి పొల్లువిధము దేహంబు
[11-3-116

వినికి
విన్నవినికెల్లానేఁడు వేడుకలే కదవే
[14-191(?)

[ఈ సంకీర్తన సంఖ్య తప్పుగా అచ్చు
వేశారు—ఇది —14-187]

వినుకులకొన
విని యాలకించినాను వినకట్టె మావినాను
వినుకుల కొనసెల్లా విష్ణుఁ డొక్కఁడే
[9-91

వినుకలిమర్మము
చూచేటి చూపులకును సూటియైన
మొదలేదో
యేచి వినుకలి మర్మమెందు దాఁకీనో
[7-184

వినుకులు
కొలమాలెను నిజమంతయు
కొండలకేగెను సత్యము
మఱుగయిపోయెను వినుకులు
మతిమాలెను తెలివి
[5-63

కన్నుల నేఁ జూచేదెల్లా కమలాక్ష
నీ పాదాలే
విన్న వినుకులెల్లా విష్ణుఁడ నీ కథలే
[6-201

వినోదకాఁడు
వినోదకాఁడవౌదువు విఠలేశ్వరా
వినుతించ నెట్టువచ్చు విఠలేశ్వరా
[10-171

విన్నవినుకు
మన్నన సతులు మీరు మాటలిట్టె
యాడఁగాను
విన్న వినుకులమెచ్చి విఱ్ఱవీఁగినదివో
[17-575

వియ్యపువిందు
యింతలో శ్రీవెంకటేశుఁ డితఁ డిదె
నన్నుఁగూడె
వింతగా విందు చెప్పరే వియ్యపు విందు
[15-213

విరజవోడ
తిరముగ నల్లదివిందెచ్చిన యర్థమిదివో
విరజవోడరేవున వెళ్లినర్థము
[6-3

విరవిరవీఁగు
ఎరవు ల తపముల నెంతైనా
విరవిరవీఁగుట వృథావృథా
[11-3-18

విరవిర వెంటఁబడు
దరిదాపు యితఁడేకాతగా వెనుక వేసుకో
విరవిరఁ దాపాలు నా వెంటఁ బడినాను
[9-128

విరసపుజాలి
పరమాత్మ నిన్నుఁగొల్చి బ్రదికేము
విరసపు జాలిఁజిక్కి వెతఁబడనోపము
[8-220

విరికాడు
వగల శ్రీవెంకటేశ్వరు మాయలీవలపు
తగులు విరికాని (?) వలెఁ దగిలించు
వలపు [9-111

విరివికాఁడు
విరులు నాపై జల్లి విట్టలేశుఁడు కడు
విరివికాఁడు గదవే విట్ఠలేశుఁడు
[17-70

విరివిగొను
పరిపూర్ణమగు తుంగభద్రా తటమునందు
విరివిగొన్నాఁడు శ్రీవెంకటేశ్వరుఁడు
[10-165

విరివోటు
ఇద్దరిమనసులు నేకమైనఁగా
కొద్దిక విరివోటాఁకరీనా
[17-156

విరుద్వాసుపర్ణ
నిండిన యీ జీవులు నీవేయన వెఱుకను
దండనే బద్దులు విరుద్వాసుపర్ణ వున్నట్టుగాన
[6-121

విరులైనా కోయకరావు
చెట్టుమీఁది విరులైనా చేతులఁ
గోయకరావు
అట్టె వోరి నీవు అటువంటివాఁడవు
[13-8

విఱువీఁగు
నిండెను నా కోరికలు నిముషు వారిధులై
వెండి బంగారాలతోడ విఱువీఁగవయ్యా
[10-241

విఱ్ఱవీఁగు
వంతపు శ్రీవెంకటేశ భావములనేచొక్కి-
వింత సంతసాల విఱ్ఱవీఁగు కొంటగాకా
[17-554

విశ్వకుటుంబి
యెసఁగ శ్రీవెంకటేశుఁడితఁడే
విశ్వకుటుంబి
పసగా వరములిచ్చి భావించినట్లు
[7-109

విసుగు
గరగరక లన్నియును కలసినందాఁకా
విరసంబు లన్నియును విసుగునందాకా
[5-152

యిన్నియు ననుభవించి యిఁక
నొల్లనంటేఁబోదు
విన్నపాలు సేసి నాతో విసుగఁ జోచేవి
[7-285

వినువు (క్రి)
రసములు చిందీనదె రమణుఁడు మాటలనే
వినువక ఆదరించి వినఁగదవే
[13-103

వినువు
మలసి తనతోను మాటలాడకుందునా
వెలసిన విరహపు వినుపింతెకాక
[15-76

## వీ

వీఁకకువచ్చు
కాఁకలఁ బొందిననేఁ గాఁగిలింతుఁగాక మా
వీఁకకు రాఁదనకేలే వేడుకకాఁడు
[17-508

వీటిఁబుచ్చు
పోటుమీరిన యసురపురము
లన్నియుఁ జొచ్చి
వీటిబుచ్చి దుమ్ములుగా వేసినవాఁడు
[4-43

వీటిఁబోవు
తిన్ననై యెవ్వరిచేతి తిట్టుదాకినా విధమో
విన్ననై విజ్ఞానమెల్లా వీటిఁబోయఁ దుదిని
[6-105

ఏఁటినేను యేఁటిబుద్ది యెక్కడిమాయ
వీటిబొయ్యే వెట్టిఁగాను వివేకిఁగాను
[8-98

కాలమును వీటిఁబోయె
కర్మమును దెగదాయ
మూలనుండి యెవ్వరికి మొరవెట్టేను
[9-34

వీడనిగంటు
యెగ్గుపట్టేటిదానవు యేలరమ్మంటివే
ముందు
వొగ్గి వీడనిగంటలై యుండఁగరాదా
[13-239

వీడుకూళ్లు
వియ్యాలుది వీడుకూళ్ల వేమాఱు
గుడువ నీవే
వొయ్యనె తనకులోనై వుండేఁగాని
[17-147

వీడుజోడాడు
తెలివొందు నొంటిముత్తియపు వెన్నెలలు
వెలఁది నవ్వులతోడ వీడుజోడాడ
[ప. యో. వి. 3-971

వెలఁగును గోవంబు వీడుజోడాడ
మఱియు వారలఁజూచి మనుజేశుఁడనియె
[ప. యో. వి. 3-1296

వీడుదోడాడు
వెడవెడని తమ్ములము వీడు దోడాడ మన
సడరీని తలఁవ వెఱపయ్యాని
[4-98

పీడుదోడులాడుకొను
వేమరుఁ దొడలెక్కఁక పీడుదోడు
లాడుకొంటా
ప్రేమమునఁ గౌఁగిళ్ళఁ బెనగుకొంటా
[11-216

పీడుదోళ్లాడు
వెల్లివిరి నవ్వఁగాను పీడుదోళ్ళాడకున్న
చల్లేటి వలపులేవి సడలింతేకాక
[13-11

పీడుపడు
ఆడినదెలా నీవట అందులోఁ
దప్పులున్నవా
పీడుపట్టతలఁపుతో వెరచేఁగాక
[8-6

పీడుఁబట్టు
చూడఁజూడఁ గొత్తలాయ
చుట్టమొకఁడు లేఁడాయ
పీడుఁబట్టు అలుచాయ వేడుక
బడివోయను
[5-128

వెనక మునుపులకు పీడుఁబట్టు జననము
కొన మొదలునుఁ దానే గురియాయనాత్మ
[7-152

నెట్టన నైదుగురికి నేము డాగు వెట్టేము
చుట్టిచుట్టి పీడుఁబట్టు చూసివున్నది
[9-198

పీడువడు
కూడిమాడి పొందుసేసి
కొనరఁగ వచ్చుఁగాని
పీడువడ్డ విరహాన వేఁగరాదు
[18-440

పీడువెట్టు
కాయకపు గాడిదెకు కవణమువెట్టి మరి
పీయపు చుట్టాలెల్ల పీడువెట్టరో
[9-172

పీడెపుటాలి
మచ్చిక నాపె నీతోను మారుమాఁట
లాడఁగాను
తచ్చన నీడెపుటాలి దాఁకెననీగాక
[16-2-60

పీదిపీది మెఱయు
సేదదేర నిపుడును శ్రీవెంకటాద్రిమీఁద
పీదిపీది మెరసేటి విష్ణుని నెఱఁగరా
[9-246

పీధులేగించు
పాడరె సోబనాలు పైపైనె పేరఁటాండ్లు
యీడాడనక పీధులేఁగించారే
[15-55

పీనులపండుగ
వింటిమి నీ నామములను పీనుల
పండుగగాను
అంటిన మోక్షముత్రోవ అడుగనేమిటికి
[10-243

వేమరు నాలకించఁగా పీనుల
పండుగలాయ
[15-87

పీనులవిందు
అంటున నయ్యోగి నాథు గానంబు
వింటివె పీనుల విందులయ్యెడిని
[వ. యో. వి. 3-2195

పీనులు చల్లఁగా విను
పూని నీ భావము పొందుగాఁ జెప్పఁగా
పీనులు చల్లఁగా వినుటే కాకా
[7-71

పీనులుమెట్టు
కన్నులు మిన్నులుదాఁకీ కాయమీఁద
వునఁ (ంద ?) గానే
తిన్నని పీనులుమెట్టీ దిక్కులనెల్ల
[10-118

వీనులొగ్గివిను
వీనులొగ్గి వినఁబోతే విశ్వమెల్లాఁ దగులు
అనుక సహవాసాన నంటుకొనుఁ దగులు
[6-204

వీపుపట్టుగట్టు
ఇట్టునట్టు మిట్టిపడ నించుకంతాలేదు వీపు
పట్టగట్ట మోఁపుమోఁచి పాటువడ్డలేదు
[11-2-29

వీపుబట్టుగట్టు
ఇట్టునట్టు మిట్టిపడ్డ యించుకంతాలేదు వీఁపు
బట్టగట్ట మోపుమోఁచి పాటుపడ్డాలేదు
[5-55

వీయపుచుట్టాలు
కాయకపు గాడిదెకు కవణములెట్టి మరి
వీయపుచుట్టాలెల్ల వీడులెట్టరో
[9-172

వీరిడి
నెవ్వున శ్రీవెంకటేశ నేనూ నీవూ నొక్కటే
యివ్వుడే వీరిడి మరుఁడింత నేనేఁగాని
[13-2

నీవే మంచివాఁడవయ్య నేనే వీరిడిఁగాని

వీరిడిఁజేయు
అవునయ్యా దొరకాదు వన్నిటావీవు
వివరముతోడి నన్ను వీరిడిఁజేసేవు
[14-81

వీఱిడితనము
మీఱివచ్చినపనికి మీరెసాక్షి
వీఱిడితనము నాకు వీసమంతానున్నదా
[13-74

వీసమంతమఱచు
గాసిలకచూచితేఁ జీఁకటైనా వెలుగౌఁగాని
వీసమంత మఱచినా వెలుఁగైనాఁ జీఁకటే
[8-201

వీసమంతాఁజోటు
అనలకుఁ జోటుగద్దు అంతరంగాన నెంతైనా
వీసమంతాఁ జోటులేదు విరతికిని
[5-292

వీసరపోవు
ఆసలనాసల హరినెఱగక చెడి
వీసరపోయిన వెఱ్ఱులను
[5-144

# వె

వెంగము
పొదిగి నీచేఁతలెల్ల పొగడుతా నుండఁగాను
వెదకివెదకి యాదే వెంగమనేవు
[14-108

వెంగెమాడు
ఇంత నీ సొమ్ముగాదా యెరవున్నదా
వింతవారివలె నేము వెంగమాడేమా
[14-300

వెంగెమాడఁ బనిలేదు వేవేలైనా నాతని
సంగడిఁ గూచుండితేనే సాధించుటా
[17-89

వెంచు
పాయమెంత వెంచినాను ప్రాణము నీ కొప్పగించి
కాయముతో బదికేది ఘనత నీదేకదా
[17-198

వెకలి
వెకలి శ్రీవెంకటాద్రి విభుఁడిట్టె కూడఁగాను
యెకసక్కెలేలాదేవె యేమే నీవు
[17-5

వెకలిసంసారము
సకల పుణ్యపాపాల సంధిజన్మములవారు
వెకలి సంసారాలకే వేడుకపడేరు
[7-27

వెక్కసి
మొక్కలాన గాఁగిలించి మోవి
ముద్రలు వెట్టేవు
వెక్కసా శ్రీవెంకటగోవిందుఁడు నీకు
[14-97

వెక్కసీఁడు
వెక్కలు వారగోళ్ళఁ జించి చెండాడిన
యట్టి
వెక్కసీఁడు వీఁడివో వీర నారసింహుఁడు
[10-162

వెగట్లాడు
మగవారి చేఁతలకు మానినులైనవారు
వెగట్లాడకుండరు వేమైనాను
[13-19

వెగ్గంబులాడు
ఒకతోఁటలో నిలిఁచున్న మాయక్క
వెకలియై తనుఁజూచి వెగ్గంబులాడి
[వ. యో. వి. 4-1496

వెగ్గళించు
దగ్గరనున్నాతఁడు తానె యెరుఁగును
వెగ్గళించకురె మీరు విచారించెనన్నియు
[17-145

నిగ్గుల రాజసమో నీవోళ్ళగుణమో
వెగ్గళించి పిలుపఁగ వినియును వినవూ
[17-169

వెచ్చఁజేయు
ఒలుపువో పెడిఁబాసివుండనియ్యనిది తమ
వెలుపువో దేహంబు వెచ్చఁజేసినది
[4-159

వెచ్చనిండ్లు
వచ్చుడా లెక్కడఁదెత్తు పట్టుచీర
లేడఁదెత్తు
వెచ్చనిండ్లేడఁదెత్తు వెంటవెంటను
[11-30

వెచ్చనూర్పు
వెచ్చనూర్పు నీకేలే వెరపులింకానేలే
కుచ్చినేనూఁ గౌఁగిలించుకొనేఁగాని రావే
[13-249

వెచ్చపువలపు
వలదువోరి వెచ్చపువలపు నీదెల్లాను
వలుమారునిట్ల నాపైఁ బూయవల(లెః)నా
[12-277

వెచ్చపెట్టు
ఇప్పుడేలే బ్రహ్మదేవుఁడిట్టే వుండఁగ
మీఁదటి
వొప్పగు బ్రహ్మపట్టము వొకరికి
వెచ్చపెట్టి
అప్పటి మూఁడుమూర్తులయందులో
నీతని సరి
చెప్పఁబొయ్యేరిమాట చెల్లునా లోకులకు
[6-18

కలపుట్టుగు బదుకు కాంతలకు వెచ్చపెట్టి
వలసి నేఁడెట్టు నీ వారమయ్యేము
[10-2

వెచ్చములు
అన్నియు నొకమాటే యనుభవింపఁగఁ
జేసి
కొన్ని వెచ్చము లొనఁగూడించి
[5-110

వెచ్చసచ్చములు
వెచ్చసచ్చములకు వెడవెడయైన
నచ్చపలాక్షిలో యనుఁగువోవిడిచి
[వ. యో. వి. 4-73

వెచ్చిచేఁతలు
బద్దులో నిజమోకావి పచ్చి వెచ్చిచేఁతలు
వొద్దికతో బండుబండై వున్నాఁడట
[17-183

వెచ్చివేవు
బలిమినే వలపులవదను చల్లఁగానే
వలుమారు నీమేను వచ్చియాయను
యెలమి నీతో నాపె యిచ్చకము లాడఁగాను
వెలయ నీమాట వెచ్చివేవదాయను
[13-801

వెచ్చివేవని
వద్దు నాతో వెచ్చివేవని మాయలు
[16-2-23

వెట్టి
వట్టరావి తమకాన పానుపునుండి చెలి
వెట్టనుండఁగా జల్లేవు వెడనవ్వులు
[14-50

వట్టిసిగ్గు లేక నేల వనితల యెదుటను
వెట్టదీర నేము తెరవేతు మా యిద్దరికి
[14-58

కలికిచూపులు నీకుఁ గలువరేకులెకాక
వెపినుండి యింతలోనే వెట్టలయ్యీనా
[14-158

యీ కడ చంద్రుఁడు వెట్టా యేలితివి నన్నిట్టే
[14-280

నా మోవి యదుగకుర నానలేదు కడునెండె
వేమరు నీవల్లనైన వెట్టలివి
[15-152

విరులపైఁ జల్లిరె వెట్టఁబొరలున్నవాఁడు
[15-266

వెట్టకాయము
దట్టపుటానల నేఁ దాల్చితినటనా
వెట్టకాయము మోవ వెలిచేనా
[5-111

వెట్టఁగాఁగు
వట్టకురా నీవు మమ్ము బలుమారు నీ చేతుల
వెట్టఁగాఁగినది మేను విరహానను
[17-593

వెట్టతావి
వెట్టతావులులేవు విరిదరిపెంటా
దిట్టగుబ్బెతనాన తెరగే తెరంగు
[ఉ. క. 850

వెట్టదీరు
వెట్టదీరఁగ సురటి విసరితి నాతనికి
చిట్టకాన కింకానేమి సేయుమనేరే
[17-314

వెట్టసంసారము
వెట్టసంసారమిది వెంకటేశుఁ గొలువవి
వట్టి మనుజుల పెదవాడఁబెట్టుగాక
[5-119

వెట్టి
కట్టుకవున్నాఁడదె కానెగా యెవ్వతో చీర
వెట్టికి నాపైఁగొంగు వేయవచ్చీని
[13-48

వొట్టువెట్టుకొనఁగాన వూరకున్నది చెలియ
వెట్టికి మాటలాడక వేఁడుకోవయ్య
[17-391

వెట్టికిఁజేయు
వాదమేల పారెసారె వతి ముక్తిలేదంటా
వేదాంత శ్రవణము వెట్టికిఁజేసేరా
[6-120

ఏదెస మోక్షములేదు యెవ్వరికి వనేరు మీ
వేదాంత శ్రవణము వెట్టికిఁజేసేరా
[8-65

వెట్టికూటమి
వెట్టికూటములుచాలు వేంకటేశ యిదె విన్న
బెట్టుగాఁగా నలుకలఁ బెట్టఁగదా యిఁకను
[12-50

వెట్టికొలుచు
యిట్టె యీతని యిందరితోసరి
వెట్టికొలుచుచే పెమవెట్టి
[9-269

వెట్టిగొను
కానిలేనిబంట్లఁ దేరకొంట్లు వెట్టిగొనఁగ
దానికి నీ కూరకుండ ధర్మమా సర్వేశ్వరా
[6-36

నన్నుల వెట్టిగొనేటి సంసారబంధము నీకు
మున్నె కిందువడితిమి ముంచి
దయఁజూడవో
[6-40

వెట్టిచేయించు
ఏల వెట్టి సేయించే విందున నీకేమివచ్చె
కాలముఁ గర్మముచేతఁ గప్పేవు లోకులను
[9-25

వెట్టిచేయు
వేయివేలై వేగుదాఁక వెట్టిచేసి యలసితి
వోయయ్య కొంతైన వూరడించవలదా
[10-207

వెట్టిఁజేయు
వెదకి యాసలకెల్లా వెట్టియుఁ
జేతుమయ్యా
మదిమది నే నీ మాయకులోనయ్యా
[9-16

వెట్టిదినము
చేరువ నీ సేవ నాచేతులపై నుండఁగాను
తీరవి కర్మపు వెట్టిదినమూ లేదు
[9-242

వెట్టిదేహాలు
పుట్టేటివెన్నిలేవు పోయేటివెన్నిలేవు
వెట్టి దేహాలు మోచిన వెదజీవులు
[8-9

వెట్టిబంట్లు
పుట్టుగందరికొకటే భూమిలో యేలికలును
వెట్టిబంట్లుఁ గొందరై వీఁగుదురింతే
[8-14

వెట్టిమాన్యము
శ్రీరమణుని నిత్యసేవకులకుఁ దొల్లె
వేరులేని కర్మముల వెట్టిమాన్యము
[7-277

వెట్టివానిచేతిరాయి
పీలిన యీ యాసా వెట్టివాని చేతిరాయి
చాలునింక హరినిట్టే శరణను జీవుఁడా
[6-157

వెట్టివేములు
వట్టి జాలింకేల దేవతలాల మునులాల
వెట్టివేములు మానెను వెరవకుఁ డికను
[16-1-32

వెట్టిసంసారబంధాలు
వెట్టి సంసారబంధాలు వెంటవెంట
నేలవచ్చీ
యిట్టె యెవ్వరివాఁడ నిందులోన నేను
[9-209

వెడకర్మములు
వెఱవఁగ నేఁటికి వెడకర్మములకు
కఱకుల హరి నీ కల్పితమివియే
[10-265

వెడకర్మాలు
వెడకర్మాలు వోసితే విష్ణుని
సాన్నిధ్యమబ్బు
కడునాస లొల్లకుంటే కలఁడాతఁడు
[8-152

వెడచింత
జిగి నీ ధ్యానము చింతలు మాన్పఁగ
వెగటున మాకిఁక వెడచింతేఁటికి
[9-152

వెడచీఁకటి
వెలుపలివెలుఁగే చూడఁగ లోపలి
వెడచీఁకటి గాననియట్లు
అలరి ప్రపంచజ్ఞానికిఁ దనలో నాత్మ
జ్ఞానము గనరాదు
[6-137

వెడచేఁత
వేగిలేచి నేఁజేసే వెడచేఁత నీచేఁత
ఆగడపు మాటాడిన నది నీమాటే
[9-282

వెడఁజారు
విరుల పానుపుమీఁద వెడఁజారుఁగొ
బయ్యదతో
పరుసఁ బండిన పతి చందము దెలియదు
[15-149

వెడజీవులు
పుట్టేటి వెన్నిలేవు పోయేటి వెన్నిలేవు
వెట్టి దేహాలు మోచిన వెడజీవులు
[8-9

వెడదేహము
వెడదేహము మోఁచి విరతిఁ బొందేనంటే
అడియాసలేకావి యగపడదు
[10-120

వెడబుద్ధి
వెడబుద్ధిఁ దిరిగేను వెఱ్ఱిని శ్రీవెంకటేశ
విడువక అజ్ఞాని నన్ను విడిపించుకొనవే
[6-5

విరసాన వెరవను విష్ణుమాయను నీ
గొరబైన వెడబుద్ధి గొలువదు వోరా
[10-110

చీఁకటి వానిసమీఁద చీఁదర గొనగనేల
మాఁకువంటి వెడబుద్ధి మాన దిదేమయ్యా
[11-27

వెడమతి
ముదువు కొంగునఁగట్టి మూలమూలల
వెదకే
వెడమతినై వే వెఱ్ఱుండనైతి
[5-19

వెడమనసు
మరలని యాశామయ మీ చిత్తము
విరతి యెన్నఁడిఁక వెడమనసా
[11-26

వెడమాయ
వెలుపను విడువదు వెడమాయలఁబడి
కొలఁతయుఁ దీరదు కొంతైనా
[5-179

వెడవి వైకుంఠమిచ్చుఁ జేటులేని
వరమిచ్చు
వెడమాయఁ బెడఁబాపు విష్ణుఁడితఁడే
[6-9

బడిబడిఁ గర్మముల పాఁజులఁ దీర్చరో
వెడమాయ పట్టణపు వీధులనేఁగివి
[9-97

అంతరంగమే యాత్మజ్ఞానము
వింతగు వెలుపల వెడమాయ
[9-273

వెడమాయపుసరకు
కడుఁ జంచలములనే గాలిచాప లెత్తినాఁడ
వెడమాయపు సరకు వెలకియ్యరో
[9-35

వెడమోముకూటమి
కడునొవ్వనాడి వెంకట విభునికి నీవే
వెడమోము కూటముల వెలపించుకొనేవు
[4-139

వెడయలుక
ఈ చూపులు నీ తీపులు నీ నగవులు
నీ తగవులు
నీ చొక్కులు నీ పొక్కులు
నీ వెడ యలుకలును
[5-65

అడియాసలనె వక్కమైన సోయగపు
వెడయలుకల మంచి వేఁడివేఁటి రుచులు
[12-25

వెడయాసలు
ఈ కాంతలు నీ ద్రవ్యము లీ కన్నులు
వెడయాసలు
యీ కోరికె లీ తలఁపులు యిచ్చే వుండెనా
[11-3-13

వెడయెండ
వెన్నెల చంద్రునందు వెడయెండ
సూర్యునందు
కన్నుల లోకమువారు గన్నదేకొల్లి
[10-5

వెదలంపటము
వెన వెనకఁ దిరుగు వెదలంపటమై
కనకపు టావల కర్మములు
[9-207

వెదవెంట్రుక
వెదవెంట్రుక దూరేటి పీనులవాఁడ వింతే
కదలేనికబ్దము లొక్కట వినేను
[7-193

వెద్దువెట్టు
యితలై పనిసేసేటి యింటి పసురమునకు
వెతదీరఁ బాలార్చి వెద్దువెట్టఁ దగదా
[5-237

వొద్దిన కైలాసమేలే వుమావతిఁ గడుపులో
వెద్దువెట్టి పెంచేవాఁడు వీరితోవాఁడా
[9-56

యితవై పనిసేసేటి యింటి పసురమునకు
వెతదీరఁ బాలార్చి వెద్దువెట్టఁ దగదా
[10-207

చీమగుట్టెనని తనచెక్కుటఁ గన్నీరుజార
వేమరు వాపోయేవాని వెద్దువెట్టరే
[11-2-20

అద్దపుఁ దెవుపుల నటునిటు చుట్టాలు
వెద్దువెట్టుచు నిన్ను వేఁచేరు
[11-3-23

వెద్దువెట్టి కూడెనిదె వేంకటేశుఁ డింతలను
గొద్దువోని వరముల గోవిందరాజా
[12-141

వెద్దువెట్టి నాటలకు పిచ్చేనేనని నన్ను
వద్దములాడకురే యమ్మలాల
[12-344

వెద్దువెట్టి నే నిన్ను వేడుకతోఁ
గొనరఁగా
అద్దాలువచ్చి వాకంటే వంతచుట్టమా
[16-2-52

గద్దము పట్టకురా కాఁగిట నించకురా
యెద్దనె నీమాటకు నే నెదురాడేనా
వెద్దువెట్టి యిట శ్రీవేంకటేశ కూడితివి
దొడ్డదొరపైన నిన్ను దూరుకెక్కించీనా
[17-241

వెద్దువెట్టి మమ్ము నేఁడు వేఁడుకొన
నిలువచ్చి
అద్దము లాపెకు వచ్చేవప్పటి నీవు
[17-287

వెద్దువెట్టి చెక్కునొక్కి వేఁడుకోఁగా
నీతోను
వొద్దించుకోరాదుగా వువిదకును
[18-18

వెతఁబడు
పరమాత్మ నిన్నుఁగొల్చి బ్రదికేము
విరసపుఁ జాటఁజిక్కి వెతఁబడనోపము
[8-220

వెద
వెదపీదని తురుము విడువ ముడువఁబట్టి
హృదయమేమౌనో పతికెంతకపుడె
[15-34

వెదవడు
వెదపడి పుత్రులు పౌత్రులే విత్తులు
లోలో మొలచియు
పొదిఁగర్మపు పూమారదు పూపిందయిన
దిదే
[5-307

వెదవెట్టు
వెదవెట్టి లోకములో వేదములన్నియు
మంచి
పదములు సేసి పాడి పావనము సేసెను
[8-183

వెనక ముందు తలపోయు
మగుపలు వద్దనుండె మఱుతువన్నివేషులు
తగిలి వెనకముందు తలపోసేవా
[15-176

వెనకముందెఱుఁగు
మోహంబుచే వెనక ముందెఱుఁగలేక తమ
దేహసుఖముల మరిగి తిరిగేకుగాక
[5–151

వెనకవేసుకొను
గారవాన నన్ను వెనకవేసుకొన్న ఫలము
చేరి నన్ను బుణ్యునిఁగాఁ జేయవలెనె
[8–59

దరిదాపు యితఁడే కాతగ వెనుకవేసుకో
విరవిరఁ బాపాలు నా వెంటఁబడినాను
[9–128

వెనవెనక
మునుకొని వెదకితే ముక్కునూర్పు గాలికొన
వెనవెనకఁ దిరిగి వీఁడివో హరి
[8–57

వెనవెనకఁదిరుగు
వెనవెనకఁ దిరుగు వెడలంపటమై
కనకపుటానల కర్మములు
[9–207

వెనుకొను
వెనుకొని యడ్డమురావె శ్రీవెంకటేశ్వర
అనుభవించే కర్మముల వేమున్నవో
[7–78

ఘనకర్మంబులు గడచినపుడువో
వెనుకొను భవములు విడిచేది
[7–177

తను భోగంబులఁ దనిపిన పిమ్మట
వెనుకొని హరిఁ దడవేవంటే
[11–26

వెనుబలము
వెనుబలమైననుఁ గావఁగవేరే విష్ణుఁ డొకఁడెకాక
అనుమానములన్నియు నుడిగితిని అలపితి నిఁకనేను
[8–254

దోమటి నింద్రియాలెకా తోడుపీడమై నన్ను
వేమరు భోగించఁజేసి వెనుబలమైనది
[8–288

అనయము శ్రీవెంకటాద్రి దేవునిబంటు
వెనుబలమై యున్నాఁడు విట్ఠలములోవను
[9–12

వెన్నగరికట్టు
గడలిమీఁగడల నల్గడలను బాల
కదలితాకులవెన్న గరికట్టుదావి
[అ. మ. క. 267

వెన్నడించు
వెన్నడించి సూడువచ్చే విష్ణుమాయవీకు నేము
యిన్నిటాఁ బంతమిచ్చేము యింకఁ గావరో [6–40

గాసిబంధమేల మానుఁ గ్రాముఁడు లోనుండఁగాను
వేసట సంసారమై వెన్నడించుఁగాక
[10–61

వెన్నతిన్నె
మున్నీరు తరుమగ మొగిమైనవెన్న
తిన్నెయోయననొప్పు తెలిపీఠినడుమ
[అ. మ. క. 276

వెన్నతోకలుగు
అన్నిమంత్రములు నిందే యావహించెను
వెన్నతో నాకుఁగలిగె వేంకటేశు మంత్రము [11–143

వెన్నతోడఁబెట్టు
తోయఁదోయఁ దల్లి వెన్నతోడఁబెట్టె ముచ్చిములు [15–73

వెన్నతోనిడు
మున్నుగా జనని యా మ్రుచ్చిలు విద్య
వెన్నతో నిడినదే వివరించిచూడ
[వ. యో. వి. 5–1386

వెన్నతోపెంచు
వెన్నతోఁబెంచే దేవుఁడు వివేకమిచ్చే దేవుఁడు
యెన్నని పొగడవచ్చు యీతఁడే మా దేవుఁడు
[11-201

వెన్నతోబెట్టు
వెన్నతోఁబెట్టినో వివరింపననుచు
[అ. మ. క. 5233

వెన్నదీసినచల్ల
విన్నవంటి చేఁతలు నేఁడు మాకునున్నవా
వెన్నదీసినట్టిచల్ల వేఁడ నెట్టివారము
[14-131

వెన్ననూరు
మిన్నునూయి చేఁతాటఁజేది మెచ్చు మింగునొకయోగి
వెన్న సన్నముగనూరి వీఁగునొకయోగి
[6-125

వెన్నబువ్వలు
మంచి వెన్నబువ్వ లిపుడు మలని యారగించనేర్చె
వంచితముగ శ్రీవెంకటాద్రిమీఁదను
[7-153

వెన్నముచ్చిమి
జనవేషమేడ పారిజాతము దెచ్చినదేడ
తవి వెన్నముచ్చిమేడ దైవికమేడ
[7-195

వెన్నుతరటు
ఒటుపైన జడవిరహులు వెన్నుతరటు
కొటువవ్వు వరభుజంగుల గుండెదిగులు
[వ. యో వి. 4-195

వెన్నెలనవ్వులు
వేయి చేతులతోడ వెన్నెల నవ్వులతోడ
చాయలదేరేటి శంఖచక్రాలతోడ
[10-157

వెన్నెలమాయలు
యిన్నిట శ్రీవెంకటేశు దాసునికి
వెన్నెల మాయలు విడివడిపోవు
[11-44

వెన్నెలమొలక
అలరి కప్పురకాపు అవధరించేవేళ
మొలచిన వెన్నెల మొలకయై యుండెను
[8-165

వెన్నెలరసము
బలసిన చిలుపాలు పంచదార గుప్పఁగాను
అలరు వెన్నెల రసమందించి నట్లుండెను
[9-10

వెన్నెలరేకు
కన్నుల నొకకెనిన్ను కాఁతాళించి తిట్టితేను
వెన్నెలరేకు నవ్వులు వెదచల్లేవు
[14-131

వెన్నెలరేణువు
కన్నులు దెలవక కమల బాంధవుఁడు
వెన్నెలరేణువు వెలయదిదే
[5-81

వెన్నెలలో అల్లు నేరేళ్లు
అవల వెన్నెలలో అల్లు నేరేళ్లంతే
నివిరి నిన్నటి వునికి నేఁటికిఁగలదా
[5-274

వెన్నెల వేసంగిమొగ్గ
కన్నె కలువలజాతి కనుమోడ్చినదిమీఁద
వెన్నెల వేసంగిమొగ్గ వికసించెఁగదవె
[4-149

వెరఁజాడు
రోలఁ గట్టువడ్డవాఁడు రోఁకలి వట్టినవాఁడు.
వేళలేదు వెన్నలెల్ల వెరఁజాడేరు
[8-178

వెరఁజా
వలపించి వెరఁజాకోవలయునుగాలి
గలనాడె తూర్పెత్తఁగాఁ దగుఁగాక
[వ. యో. వి. 4-783

వెరబొమ్మలు
వసుధలోఁ బురుషుల వనితల రూపులు
వెసమాయ యంత్రపు వెరబొమ్మలు
[6-203

వెరపులఁబడు
తీగె సంసారమత్తులు తెలియక వీరివలె
వేగినంతా నయ్యేమంటే వెఱపులఁ
బడవు (?)
[8-119

వెర్రుండు
మురుపు కొంగునఁగటి మూలమూలల
వెదకే
వెడమతినైనే వెర్రుండనైతి
[5-19

వెఱచీని
విడువ మనవో రోలు విడువమనవో వేగ
విడువమనవోతల్లి వెఱచీని బాలుఁడు
[5-57

వెఱఁజందు
ఎన్నఁడు గొల్లెతలయిందు వేమారుఁ
జొచ్చి
వెన్నలుఁ బాలును వెఱఁజందు
[5-57

వెఱఁజు
మెఱని యట్టుగమీఁది చక్కిలాలు
వెఱఁజి కైకొనె వీఁడెకదె
[10-288

వెఱివెఱాటాడు
వెంగలి యఖినిదించే
వెఱివెఱాటాడుఁగాని
అంగవించునా వివేకమప్పుడే లోకులకు
[11-94

వెట్టితనము
నీ వెట్టితనమెంతునో నిన్నుఁ
బుత్తెంచినట్టి
ఆ వెట్టితనమెంతువో అమ్మరోనేఁడు
[13-4

వెట్టిదవ్వించు
ఇంకానోదైవమా యేల వెట్టిదవ్వించేవు
కొంకితెంచి ముడిగొంటే కుఱుచేకాదా
[8-175

వెట్టిదవ్వు
దేహమేమిసేయును దేహము
లోపలనున్న
దాహపుటాసలు వెట్టిదవ్వఁగాను
[10-53

వెట్టిదవ్వుట
ఈహె శ్రీహరిఁగంటే యింతలేదుగా వట్టి
దాహపుటాసల వెట్టిదవ్వు టింతేకాక
[6-69

వెలపరచు
యెలమి శ్రీవెంకటేశుఁ దేడనుండె
నన్నుఁగూడె
వెలపరచఁగరాదు వేడుకలే నిండెను
[14-296

వెలపెట్టు
తోడునీడ సతులెల్లా తోలుబొమ్మలెకాక
వేడుక కూటములకు వెలపెట్టేవా
[14-212

వెలవెట్టు
వెనుకొన్న చవులెల్లా వెలవెట్టేవునికి
గునిసి మేల్కనుటకు గురియైనవునికి
[10-25

వెలసేయు
చెలఁగి యేలబొంకేవు సిగ్గులేలపెంచేవు
వెలినుండే రతులెల్లా వెలసేసేవా
[14-30

వెలితెర
కన్నుల చూపులు గాలపు చిలుకులు
వెన్నెలనవ్వులే వెలితెరలు
[9-6

వెలిఁబడు
వెలిఁబడ్డ యింద్రియాల వెలియ
లోనికిఁబిల్చి
కొలువులు సేయించుకొనరాదా
[8-217

వెలుఁగుపెట్టు
కామక్రోధాదులనే కలుపు దవ్వివేసి
వేమరు వైరాగ్యమనే వెలుఁగుపెట్టి
[9-70

వెలుచు
జంటలఁ జెల్లించుకొన్న సరసపుచనవులే
వెంటవెంట వచ్చివచ్చి వెలుచుకొనేరు
[14-14

మాటలు వెలుచుక ఆమర్మాలెత్తేవాననా
తాటించి కప్పుక వచ్చేదానఁగాకా
[15-264

వెలుపుల
ఏల వేగిరించేవు యింటిపనిగద్దు నాకు
గోలవై వెలుపుల అరఁగుపై నుండవయ్య
[17-273

వెలుమ
వేగునంతానేల జాలి వెలుమజోలి
సోగకన్నుల నాతవిఁ జూడఁగరాదా
[13-101

వెలువకువచ్చు
కనకము కనకమే కడునిను మినుమే
వెనక పటిఁమాగితే వెలువకురాదు
[8-119

వెల్లవిరి
వెల్లవిరినది యెంతవిచారించ నిదియెంత
యిల్లు ముంగిలొక్కరిది యెరవు
వొక్కరిది
[6-92

పెల్లుగా నారదాదులు పేరుకొని నుతించఁగా
వెల్లవిరిఁ గొలువై వేసుకనున్నాఁడు
[7-121

వెల్లవిరై హరినీవు విషయాల జిక్కించితే
యిల్లిదే నిన్నుఁదలఁచి యిటు దూరేనేను
[7-221

అల్లుకొనెఁ గర్మములు అక్కడికి
నిక్కడికి
వెల్లవిరాయను మాయ వెనకాముందు
[7-256

వెల్లవిరై తిరిగేరు వేరులేదిద్దరికిని
పెల్లుగ యశోదవద్దఁ బెట్టరే యీ బాలుల
[8-4

తల్లియునితఁడే తండ్రియు నితఁడే
వెల్లవిరై యిఁక విడువకురో
[8-28

వెల్లవిరై యెదుట శ్రీవెంకటేశుఁ
డుండఁగాను
బల్లిదుఁ డితనిఁబాసే భ్రమ మాకేలా
[8-190

యెల్లగా నీకు మోహించు చెక్కుడు
తగవునేసి
వెల్లవిరి నాపె నీవు వీధులనేఁగితివి
[8-198

యిల్లిదె నేఁటి పెద్దలు యెవ్వరో
దైవములంటా
వెల్లవిరివిగానింకా వెదకేరు
[9-94

యెల్లగాఁ గైలాస యాత్రకేఁగి కమ్మర
మరలి
వెల్లవిరి ద్వారకకు విచ్చేసినట్లు
[9-144

తల్లియై పెంచేవాఁడు తండ్రియై
పుట్టించేవాఁడు
వెల్లవిరిఁ దాఁ గొలిచే విష్ణుమూరితి
[10-11

పల్లకీలు నందలాలు పడివాగెతేజీలు
వెల్లవిరి మహాలక్ష్మి విలాసములు
[10-94

వెల్లవిరి అగు
యెగ్గులెల్లా నేఁడెజారె యెదుటఁ బ్రియములూరె
వెగ్గళించె నాసలెల్ల విరులుగారాదా
[13-101

వెల్లవిరిచేయు
మును ‘నేమిచాత్తముద్రాం ధారయే’ త్తని
వెనువెంట శ్రుతియదె వెల్లవిరిసేసీని
[7-251

వెల్లవిరియగు
అదరమ్మ పాదరమ్మ అఁదరు మీరు
వేడుక సంతసములు వెల్లవిరియాయను
[8-112

గొల్లెతలు చల్లలు గొనకొని చిలుకఁగ
వెల్లవిరియాయ విష్ణుకథ
[9-66

వెల్లవిరిసేయు
అన్నిట లోకమువారు ఆడుకొందురింతే కాక
విన్న పీనుద్దులు నేను వెల్లవిరిసేసేనా
[17-241

వెల్లవోవు
సల్లలై చక్కనై సవరనై పెరిఁగి
వెల్లవోవనివండు వెదుకులుచూచి
[వ. యో. వి. 2-340

వెల్లిగొలుపు
యిల్లిదె శ్రీవెంకటేశ్వరు నామము
వెల్లిగొలిపె నీ విష్ణుకథ
[9-66

వెల్లిచింతపండు
వుల్లములోపలి హరికొసగని పూజలెల్లా
వెల్లిఁ జింతపంటివలె వృథావృథా
[10-59

వెల్లిఁబోవు
లోకమెల్ల వెల్లిబోఁగా లోనవే మరలఁగాచి
ఆకుమీఁదఁ దేలినయతవి కృప
[5-104

దట్టమై మేననొమ్ములు తగులుకొంటేం గవక
తొట్టి వెల్లిఁబోయినాన తొలఁగనీదు
[7-4

అల్లనాడు నిరాకారమనెడి మాటలచేత
వెల్లిఁబోయ లోకములో విజ్ఞానమెల్లా
[8-68

వెల్లివిరియు
వేడుకలు నీకెపుడు వెల్లివిరిసివున్నవి
[17-597

వెసగు
పసిబాల వయసున బండిదన్ని విరిచితి
వెసగె నీ మాయలెల్లా యివె విఠలేశ్వరా
[10-171

వెనురు
చెలువపు నీమోము చెక్కుటనేల మోపేవే
వలపు వెనురుదాఁకి వాఁడబారీని
[13-44

వెళ్ళఁదీయు
వట్టి దుష్టులతో సహవాసమైతే దాసులను
దిట్టయై వెళ్ళఁదీసి తా దిక్కైకాఘఁగాక
[8-195

వెళ్ళఁదోయు
కావరములేమాను కంతలి మేనుండఁగాను
తోవచేసుకొని వెళ్ళఁదోయుచుండుగాక
[10-61

వెళ్లఁబడు
సొరిది నిర్మోహమనుజోడు దొడిగినఁగాని
వెరవుదిగి మమతచే వెళ్ళఁబడరాదు
[5-206

వెళ్లవిడచు
ఆవుల వెళ్ళవిడిచెనని నేఁ దోలి తేఁబోతే
పేవల దూడలఁదెచ్చి యింటిలోఁగట్టె
[6-166

వెళ్లవేయు
వెలఁది నీ చెమటలె వెళ్ళవేయగా
తలఁగి నేఁ జెప్పకుంటే దాఁగఁబొయ్యీనా
[16-2-45

వెళ్లు
పడఁతి లోలోనిగ్గు వచ్చినవ్వే వెళ్లఁగాక
[14-173

# వే

వేండ్లు
వెలికిని లోనికి విడిసెటి ప్రాణము
చలువలు వేండ్లు చల్లెడిది
[10-294

వేఁకపునిరులు
తేఁకులైన హరిభక్తి తెరువుగానని వాని
వేఁకపునిరులు కొంప వెళ్లఁబో లోలోనె
[5-143

వేఁకము
వేఁకపు శ్రీవేంకటాద్రి విభుఁడిట్టె
నన్నుఁగూడె
మూఁకువలె నన్ను మేను మరపించనేలే
[17-308

వేగినంతా
చిన్నపాలప్పటి నీతో వేగినంతాఁ జేసినాను
నన్నుఁ నీ చిత్తమే సమ్మతించేది
[14-23

వేగి మిగిలిన చీఁకటి
వేగి మిగిలిన చీకటి వీఁడేల తడిపీమమ్ము
ఆగడము రాతిరెల్లా సతుల అడఁ
జేయుటచాలదా
[17-449

వేగుసేయు
రాఁగతనముదాన నారాని కెక్కి నాళ్లాయ
వేఁగుసేసి మోచిదించ వింతసేసేఁగాక
[14-225

వేఁగెములాడు
పెంఁడి వెన్నెలసోఁగ వేఁగెంబులాడ
దుళకించు బొమ్మంచు దుప్పటిఁగప్పి
[ప. యో. వి. 4-1079

వేచినవీనులు
వేచిన వీనుల నేమీ వినకుండవచ్చునా
కాచియవే హరికథగా వింటిగాక
[6-123

వేఁటము
వీఁటుకత్తె యెవ్వతైనా నీతోను
మాటాడితే
వేఁటమేకమౌఁగాక వేరె పానేనా
[14-178

వేఁటపుచ్చు
వోపినవారికి వయసోడ బేరమువంటిది
వోపనివారికి వేఁట పుచ్చు వంటిది
[13-204

వేఁడియెండ
యిరుమకట్టున వేఁడియెండలో మిగుల
జడియ పేఁపులమీఁదఁ జావరాలెత్తి
[ప. యో. వి. 4-1263

వేడివేఁడ్లు
కలయికలే చల్లన కలలో కలలోవల
వెలలేని రతులెల్లా వేఁడివేఁడ్లు
[14-133

వేఁడే
కన్నవారినెల్లా వేఁడే కష్టమే దక్కుటగాక
వన్ని దైవమియ్యవిది పరువిచ్చేరా
[5-214

వేఁదురు
మతిలో నీ వుండఁగాను మాయలఁ
బొరలనేలా
వెతకి తెలియని నా వేఁదురుగాక
[11-27

వేటులాడుకొను
విరుల చెండులఁగొని వేటులాడుకొంటాను
సిరితోడ విహరించీ శ్రీనరసింహుఁడు
[11-216

వేడుకకు వెలలేదు
వోడక శ్రీవెంకటేశు డురమున బెట్టెనిన్ను
వేడుకకు వెలలేదు వెరపేఁటనమ్మా
[17-10

వేద
నీ దాసులున్నచోట నిత్యవైకుంఠమిదె
వేదతో వేరొకచోట వెదకనేలా
[8-180

వేదదీరు
వేదదీర నిను శ్రీవెంకటేశ కూడితివి
ఆదరించి వింతది నీ వాడినట్లాడీనా
[17-215

ఆదరించి శ్రీవెంకటాధిప నన్నుఁగూడితివి
వేదదీర నే మొక్కితే పీడఁగ నాదేవా
[17-243

వేదపట్టు
వేదపట్టి యిఁకనేమి వెదకేరు చదివేరు
వేదాంతవేద్యుఁడైన విష్ణుని నెఱఁగరా
[9-246

వేదలు
విరత రతిసుఖము నిమిషములోనిదె
విరహపువేదలు వేవేలు
[9-40

వేదువిడువనికూడు
గాదెఁబోసిన కొలుచు కర్మసంసారంబు
వేదువిడువనికూడు వెడమాయబదుకు
[11-3-116

వేనామాల వేన్నుఁడు
వేనామాల వెన్నుఁడా వినుతించ
నెంతవాఁడు
కానిమ్మని నాకాపుణ్యము గట్టితి
వింతేయయ్యా
[7-104

వేసిళ్లు
నిత్తెము వేసిళ్ళఁ గడిగినాను
మత్తిలి వుబ్బు మానదేలయ్యా
[5-160

వేనూఱులుజెప్పు
శేషు నఘంబులెల్ల విఱఁదీర్థము
వచ్చినయంత సంవదల్
మీఱు సుఖంబు గూరు మతి మిక్కుటమై
శ్రుతి వీఁకఁదూఱువే
నూఱులఁ జెప్పనేల సుమనోవిభుచేఁ
దిరువేంకటేశుచేఁ
జూఱలుగా వరంబు లిలఁజొప్పడఁ
గొందము రండు మానవుల్
[ శ్రీ 7

వేయినోళ్లభోగి
వేయినోళ్ళ భోగి నీవు విన్నపము
నేయరాదా
వేయేసి మా విన్నపాలు విష్ణునికివి
[8-267

వేఁయివేలగు
వేయివేలై వేగుదాఁకా వెట్టినేసి యలసితి
వోయయ్య కొంతైనా వూరడించవలదా
[5-237

వేయివేలై వేగుదాఁక వెట్టినేసి యలసితి
వోయయ్య కొంతైన వూరడించవలదా
[10-207

వేరటాలు
ఏ మగఁడు బావంటానే వద్దఁ
గూరుచుండితేను
కామించి కౌఁగలించెను కానీవే తాను
నేమము వట్టితినంటా నేనే వేరటాలనంటా
ప్రేమమున మోవి తేనెపెద్దెఁగదే వీఁడు
[13-96

వేరిచు
దొంతులు వేరిచేనంటే తోదోపులు
వలపులు
కాంతుఁడు మన్నించిన కనుఁగొనేఁగాక
[14-71

వేరుపురువగు
వెలయఁ జిత్తంబునకు వేరుపురువై బుద్ధిఁ
గలఁగించె మోహవికారము
[11-3-109

వేరువిత్తులు
చివురు జోఁడులు తపశ్శీల వృత్తులకు
వివరింపఁగా వేరువిత్తులుగారె।
[వ. యో. వి. 2-242

వేరువెల్లంకి
వేదమంత్ర మింకనేల వేరువెల్లంకులునేల
పుడమిధరుఁడుమాకు భువనౌషధము
[5-286

వేఱువిత్తు
సీటుల మిత్తివన్నెల వేఱువిత్తు
పాటించిచూడ రూపము పాలుమాలి
[వ. యో. వి. 2-1039

వేలఁజూపు
పొంచి యేమిసేసినాను పుచ్చకాయ
లోర్చుఁగాక
యెంచి వేలఁజూపితేను యితరము
లోర్చునా
[14-131

వేలవేలు
పోలింప వివేకులకు పుణ్యమును
పాపమును
వేలవేలనే వున్నవి వెదకరో జనులు
[8-104

వేలుకాడు
కుచ్చిన కర్మములతో గుదియై వేలుకాడము
హెచ్చి మా బ్రదుఁకుదోవ యీశ్వరుఁడే
యెఱుఁగు
[10-34

వేలుకాడే సూదిరాయి
అరసి నే నంటుకొంటి అంగనల
పొందులను
చొరఁబారి వేలుకాడే సూదిరాతివలెను
[9-49

వేలెఁడుదీపము
వేలెఁడు దీపమునమ్మి వెడఁగుఁ
జీఁకటిబావి
పోలిమి నొక్క నరుఁడు పొదలఁగాను
[5-254

వేల్పుగమ్మరి
హరపార్వతీ వివాహము జూడగగోరి
సురలు మునీంద్రు లచ్చోటి కేతేర
నాధారమున నుత్తరాశావకాశ
భూభాగమెడల నొప్పున గ్రుంగనవ్వుడ
బొమ్మరవోయి వేల్పుల మూకవేల్పుఁ
గమ్మరిబిల్చి యక్కజము చూచితివే
[వ. – పు. 27

వేల్పు పెన్బోనపు ముద్ద
మానిని దిండ్లమొత్తు నెఱమంటల
పిల్లల కత్తివేల్పుపెన్
బోనపు ముద్ద నిద్దములపొల్పు
దొలంకెడు సంకుఁగల్గు
[[ 16

